శ్రీః.

# శ్రీకృష్ణావతారతత్త్వము

## రెండవ ప్రకరణము.



ఇయ్యది

...సస మ్యునిసిపల్ హైస్కూలునందు ప్రధానాంధ్రపండితులు
ఆంధ్రబ్రహ్మాండపురా ణాంధ్రశ్రీమద్రామాయణాది
గ్రంథకర్తలు నగు

కావ్యతీర్థ జనమంచి: శేషాద్రిశర్మగారిచే

రచియింపఁబడినది.







చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారిచే

ప్రకటితము.

[illegible] ]     1926.     [ మూల్యము రూ. 1-8-0

# పోషకులు.

కడప.

మ. రా. శ్రీ. కే. గుండూరావుగారు, బి. ఏ., బి.యల్.
,, నాగూరు పిచ్చయ్యగారు, బి. ఏ., ప్లీడరు.
,, సి. లక్ష్మీనారాయణశాస్త్రులుగారు, బి. ఏ., బి.యల్.
,, కానూరు శ్రీనివాసరావుగారు, బి.ఏ., బి. యల్.
,, యస్. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.
,, [illegible]. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.
,, బి. రాధాకృష్ణయ్యగారు, బి.ఏ., బి. యల్.
,, బి. [illegible]. దేవరాజులు నాయుడుగారు, బి. ఏ., బి. యల్.
,, సి. నారాయణరెడ్డిగారు, బి. ఏ. బి. యల్.
,, సి. [illegible]. రామచంద్రరావుగారు, బి. ఏ., బి. యల్.
,, కే. సూర్యనారాయణరావుగారు, ప్లీడరు.
,, భోగినాథము వెంకట సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, పత్తి రఘుపతులు శ్రేష్ఠిగారు.
,, కంచిరాజు లక్ష్మీనరసింహయ్యగారు.
,, సుంకేసుల సుబ్బయ్యగారు.
,, కామిసెట్టి లక్ష్మీనరసయ్యశ్రేష్ఠిగారు.
,, దేవర పిచ్చయ్యశ్రేష్ఠిగారు.
,, కామిసెట్టి వేంకటేశము శ్రేష్ఠిగారు.
,, మద్దెలకొండు రామలింగయ్యశ్రేష్ఠిగారు.
,, మాదేపాటి చిన్నరంగన్న శ్రేష్ఠిగారు.

## హిందూపురము తాలూకా.

మ. రా. శ్రీ. కరణము కృష్ణరావుగారు, చేపినపల్లి.
,, శ్రీరాము తిమ్మయ్యశ్రేష్ఠిగారు, చేపినపల్లి.
,, పెద్దనరసప్పగారి హనుమంతుగారు, ,,

## నెల్లూరు.

మ. రా. శ్రీ. వెలంపల్లి రామకృష్ణయ్యగారు, నవాబుపేట.
,, ములుమూడి లక్ష్మీనరసింహశాస్త్రిగారు,
,, ఇడమకంటి వేంకటరామిరెడ్డిగారు.

## బళ్లారి.

మ. రా. శ్రీ. విట్లా శేషప్పశ్రేష్ఠిగారు, ప్రజాసంఘము కార్యనిర్వాహకులు.
,, రావుసాహేబు జే. పాపయ్యశ్రేష్ఠిగారు.
,, కలిదిండి వేంకటరాజుగారు, రాజమహేంద్రవరము.
,, మద్దాల భోగాదిసెట్టిగారు, వేముల కొత్తపల్లి, కడపజిల్లా.
,, పుల్లగూర వేంకటశేషయ్య శ్రేష్ఠిగారు, సింహపల్లి.
,, పోలేపల్లి సుబ్బయ్యకుమారుడు, సుబ్బయ్యశ్రేష్ఠిగారు, సింహపల్లి.
,, గంగవరము వేంకటనారాయణరెడ్డిగారు, [illegible]
గారిపల్లి.
,, బచ్చు వేంకటసుబ్బయ్య శ్రేష్ఠిగారు, మామిళ్లపల్లి.
,, అయ్యగారి బుస్సెట్టిగారు, కదేకల్లు. బళ్లారిజిల్లా.
,, చల్లా చెంచుపాపిరెడ్డిగారు, [illegible]పల్లె, కడపజిల్లా.
,, మాకం జంగంసెట్టిగారు, చీమలపెంట.
,, కోట బాలయ్యకుమారుడు సుబ్బయ్యసెట్టిగారు. సెలక[illegible]
రావుపేట.

మ. రా. శ్రీ. శేవులూరు సిద్ధయ్యశ్రేష్ఠిగారు, కస్తూరిరాజుగారిపల్లె.

,, బొడ్డు మల్లికార్జునరావుగారు, బాపిరాజుగారు, ఆదివారపేట, ఏలూరు.

,, అక్కెనప్రగడ లక్ష్మీనారాయణరావుగారు. బి. ఏ. బి. ఇ డిస్ట్రిక్టుబోర్డు ఇంజనీరు, కర్నూలు.

,, వి. ఎస్. నరసింహాచార్యులుగారు. బి. ఏ. బి. ఎల్. మదరాసు.



తదీయస్తుతి నాలించి కర్తవ్య మిత్థమ్మని హెచ్చరించి బాలకృత్యమున మెలఁగుట యనునదియే యీప్రకరణమున శ్రీపరమేశ్వరు సర్వజ్ఞత్వ సర్వకారణత్వ సర్వనియంతృత్వముల వేయి నోళ్లఁ బొగడుచున్నది. అట్టి కథను వ్రాయునపుడు శక్తిలోపమున నొండె భక్తిభేదమున నొండె నేమి తెలుపఁబడినను దానిని తప్పుగా భావింపక సజ్జనులు "అణూనపిగుణాకృత్య" యను న్యాయము ననుసరించి మన్నింతు రని నెమ్మదిని నమ్మియున్న వాఁడను.

భక్తియోగమునందును మతత్రయ ప్రవిష్టులకు నైక్యము పొసఁగ లేదు. గమ్యస్థాన మొక్కటియైనను మార్గములు వేఱుగ నుండినట్లు దీనియందు నభిప్రాయములు భిన్నభిన్నములుగ నుండును. వానిని దెలుపునపుడు నావంటి యల్పమతి పొరపడక యుండునని యెవ్వరు నమ్ముకుందురు? ఐన క్షమించుట యెట్లనఁ గూడదు.

"కిం వా ప్రార్థనయా పరోపకృతిషు స్వాభావిక స్సద్గుణః."

అని మునుపనేయున్నది కదా యన్న నమ్మకము నాకున్నది.

ఈముద్రణమునందు యథాశక్తిగా నాకు మహోపకారము నొనరించిన యీగ్రంథోద్ధారణనిరతులు, ఆత్రేయగోత్రపవిత్రులు నగు మ-రా-శ్రీ, బాపిశెట్టి వెంకటేశ్వరశాస్త్రులుగారికి నా కృతజ్ఞతను దెలుపుకొనుచున్న వాఁడను. ఈగ్రంథప్రకటనవిషయమై నాకు గావించిన విలువలేనంత యుపకారము మొన

రించి నన్నుఁ బ్రేమముతో నాదరించిన దేశోద్ధారకులు భాషాపోషకులు నగు మ-రా-శ్రీ, కాశీనాథుని నాగేశ్వరరావుగారికి నాకృతజ్ఞతను వెల్లడించుకొనుచున్నాఁడను. గ్రంథవిషయమునఁ దెలుపఁదగిన విశేషాంశములు పాఠకులే గ్రంథపఠనమున నెఱుఁగుదురుగాన నిట వ్రాయఁబూనలేను. ఎందేని స్ఖాలిత్యము లున్న వానిని నాకుం దెలిపి నాచేతనే సవరింపఁ జేయుఁ డని పండితోత్తములులఁ బ్రార్థించుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు
విద్వద్భక్తజనపాదసేవకుఁడు.
జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీః.

# శ్రీ కృష్ణావతార తత్త్వము

# నియమములు.

ఇది మూడు నెలలకొకసారి ప్రకటింపఁబడును. రమారమి నాలుగువందల పుటలుండును. బైండుచేయించి పంపబడును. పోషకులు పంద్రెండురూపాయ లొక్కసారియొసంగినఁ బ్రతిపుస్తకమునందు వారిపేరులు ప్రకటింపఁ బడుచుండును. చందాదారులు ఒక్కరూపాయ ముందు పంపవలయును. ప్రతిసంపుటము 1-8-0 లకుఁ బుచ్చుకొనవలయు. కడపటిసంపుటమునందీరూపాయ జమకట్టుకొనఁబడును. తొమ్మిది సంపుటములుకావచ్చును. శ్రీకృష్ణావతారగాథ లన్నిపురాణములనుండి సంగ్రహించి యీపుస్తకముననుండును గాన భక్తులీ సత్కార్యమునకు నాకు సాయము చేయుదురుగాక యని ప్రార్థించుచున్నవాఁడను.

ఇట్లు విన్నవించు

విద్వద్భక్తజన పాదసేవకుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.



శ్రీః.

# శ్రీకృష్ణావతారతత్త్వము.

## ద్వితీయప్రకరణము.



శ్లో. కారుణ్యకర్బురకటాక్షనిరీక్షణేన
తారుణ్యసంవలితశైశవవైభవేన,
ఆపుష్ణతా భువనమద్భుతవిభ్రమేణ
శ్రీకృష్ణచంద్ర శిశిరీకురు లోచనం మే.

శ్రీ కృష్ణకర్ణామృతము. ౬౨ శ్లో.

శ్లో. మయి ప్రసాదం మధురైః కటాక్షైః
ర్వంశీనినాదానుచరై ర్విధేహి,
త్వయి ప్రసన్నే కి మిహాపరైర్న
స్త్వయ్యప్రసన్నే కి మిహాపరైర్నః.

శ్రీ కృష్ణకర్ణామృతము. ౬౫ శ్లో.

మహాశయులారా! ప్రథమప్రకరణమునం బురుషోత్తమక్షేత్రమహిమమును జదివితిరి కదా. ఇందు నాదివ్యక్షేత్రమున శ్రీవాసుదేవపరమాత్మప్రతిమను జనువం దగు. అందుం ...లుంబోలుత దృఢభక్తిగల మనుజునకు భగవదనుగ్రహ మేరీ

ఇట్లు తన్నే నమ్మి నియతేంద్రియుఁడై శయనించియున్న మహారాజునకు వాసుదేవుఁడు తనరూపమును గనఁబఱచెను. ఆరూపము శంఖచక్రగదాధరమై, పరమ తేజఃపుంజమో యన విరాజిల్లుచుండెను. ఇంద్రద్యుమ్నుఁడు స్వప్నమున నిట్లు సాక్షాత్కరించి శంఖచక్రగదానందకశార్ఙ్గాసనబాణముల భూషితములగు హస్తము లొప్పుచుండ జ్వలత్తేజుండై ప్రళయకాలాదిత్యతుల్యవర్ణుండై, గరుత్మంతునంసభాగమునఁ గూరుచుండి అష్టభుజంబు లలరార నిలువంబడఁగాఁ గన్నులారఁ గాంచెను. సంతోషాతిశయమున మాటరామి నూరకుండెను.

అంతట శ్రీవాసుదేవుఁడు రాజచంద్రమా! మహామతీ! నీవొనరించిన యీయశ్వమేధక్రతువర్యముచేతను, భక్తిచేతను, శ్రద్ధచేతను బరమానంద మందితి. నీకుం బ్రసన్నుఁడనైతిని. ఏల నిర్నిమిత్తముగా దుఃఖించెదవు! ఈసనాతనపుణ్యక్షేత్రమునందలి ప్రతిమ జగత్పూజ్యతం గాంచునది. సనాతనమైనది. అది యిపు డగపడకున్నది కదా. దాని నెట్లు పడయంగలవో యుపాయమును దెల్పెద. ఆలకింపుము. రేపుదయకాలమందు సూర్యబింబము పరిదృశ్యమానము కాఁగా సముద్రము కడకుం బొమ్ము. అందు నానావృక్షనిబిడమై యుండుచోటఁ బ్రవేశింపుము. అప్పు డందు జలము బహుళతమతరంగసంభృతమై కనుపట్టుచుండు. ఓరాజా! లవణోదధిభూరితరంగసముత్క్షిప్తమై యొప్పిన యొక మహావృక్షము నీటఁ గొంతభాగము స్థలమునఁ గొంతభా

గము వ్యాపించి కానంబడును. ఆవృక్షము తరంగములచేఁ గొట్ట
బడుచుండినను, ఇంచుకయుఁ జలింపకుండును.

ఆవృక్షముం గని పరశువుం గేలఁ బూన్చి తరంగముల [illegible]
భాగము నరకుంబొమ్ము. ఏకాకివై యచ్చటకుం బోయితేని ఆమహావృ
క్షము దృగ్గోచరంబగు. లేకున్నఁ గాదు. ఆవృక్ష [illegible]
మని యెఱింగి సంశయింపక ఛేదింపుము. ప్రాతఃకాలమందు నా
వృక్షము మిగుల దేజోవంతమై కనంబడును. తద్దర్శనముచే
తనే కృతార్థుండ వగుదువు. భూపాలా! ఆవృక్షభాగమును దెచ్చి నా
ప్రతిమను చేయింపుము. ఇంక నీమనశ్చింతను వదలుము. అని
పలికి భగవంతుఁ డదృశ్యుఁ డాయెను.

ఇంద్రద్యుమ్నుఁ డంత మేల్కాంచి యత్యద్భుతానందము [illegible]
నాస్వప్నమున కచ్చెరువంది పూర్వపుణ్యము ఫలించె నని స
తోషించుచు, ఆరాత్రి యట్లే గడపెను. తదేకధ్యానమున నా
రేయి సాగించుచు శ్రీవిష్ణుసూక్తములు జపించుచుండ [illegible]
బగుటయు లేచి కాల్యకృత్యములు దీర్చి స్నానమొనరించి [illegible]
ధ్యానాదికర్మంబులు యథావిధిగ [illegible] [illegible]
దక్షిణాపేక్షితముగా బ్రాహ్మణులకు దానము [illegible] [illegible]
యు లగువారలకు గ్రామంబులు [illegible] [illegible]
పూర్వాహ్ణకర్తవ్యముల నన్నింటిం దీర్చి [illegible] [illegible]
చుచు సాగరముచెంతకుం బోయెను. రథము గాని గజము
గాని పదాతిగాని వెంటరాకయుండ నొంటరిగాఁ బోయి సాగర

ప్రాంతభూమిం జొచ్చెను. అందుఁ దేజస్వంతమై మహత్తరరీతిం బొల్చు వృక్షరాజమును బొడఁగాంచెను.

ఆవృక్షము చూడఁజూడ భయంకరమై పవిత్రమైవిశాల భాగము నాక్రమించి మిగుల నెత్తుగ నొప్పి మహాకాయమై యుం డియు జలాంతికమున నుండుట సామాన్యరీతింగనందగియుం డెను. దానివర్ణము ఎఱుపుమించిన పసుపువన్నెగనుండెను. జాతి నామములుగలదిగనుండక క్రొత్తదిగానుండెను. దానింజూచినం తనే రాజునకు పరిమితానందముగలిగెను. భగవదాజ్ఞనుస్మరించి దానికి నమస్కరించి పరశువునుంకించి దానితీక్ష్ణధారచే ఛేదిం చెను. ఆవల దానిని రెండుగా చీల్చుటకుఁ బ్రయత్నించునం తలో అత్యద్భుతముగా శ్రీమహావిష్ణువు విశ్వకర్మయు విప్రవే షంబులం బాల్చియచటకుఁ జేరిరి. తుల్యబ్రాహ్మణ వేషమున రాజుదగ్గ రకు వచ్చి స్వతేజస్సుల వెలుంగుచు, దివ్యమాల్యాంబరధారు లయి, యంగరాగములం గనుపట్టుచు, మహారాజా! ఇట నేమి చేయఁదలంచుచున్నవాఁడవు? ఏకార్యము నుద్దేశించి యీవన స్పతిని ఛేదించితివి? ఈనిర్జనవనమున నసహాయుఁడవై యీ మహాసముద్రతీరమున నున్న యీవృక్షరాజము నేల ఛేదించి తివి? అని ప్రశ్నించిరి.

ఓమహామునులారా! ఇట్లు లాబ్రాహ్మణులు ప్రశ్నిం పఁగా మృదుమధుర వాక్కులలరఁ బరమప్రమోదమగ్నమానసుండై రాజు వారల కిట్లనియె. చంద్రసూర్యసమ తేజోవిరా

జితులరగు నోవిప్రోత్తములారా! నమస్కారములు పరిగ్రహిం పుఁడు. ఆద్యంతములు లేక జగత్పతియై యలరు శ్రీవాసుదేవు నారాధించుటకుఁ బ్రతిమను జేయవలయు నని నాయూహ. పరమేశ్వరుఁడగు శ్రీపురుషోత్తముఁడు రాత్రి స్వప్నమున నా జ్ఞాపించెను. ఆమాటనే మీతో నిటుఁ జెప్పితిని. ఆమాటలు రాజునోటనుండి వెడలఁగనే విష్ణుమూర్తి నవ్వి సంతోషముగ నిట్లు చెప్పెను.

రాజోత్తమా! నీవచనములు మేలుగూర్చునవి. చాల సంతోషించితిని. లేత యరఁటియాకువంటిదిగదా యీసంసా రము. చూడఁజూడ భయంకరము. నిస్సారము. అంతియగాక దుఃఖబహుళము. అందు భోగము లనుమొసళ్లు కలవు. అది ఇంద్రియము లనుసుళ్లచేఁ గలఁతనొందియుండును. దానిని దాఁటరాదు. చూచినంతనే గగుర్పాటొదవును. అందు నానా విధవ్యాధు లనునావర్తములు కలవు. ఇదినీటిబుగ్గవంటిదికాని స్థిర మైనది కూడఁ గాదు. అట్టి యీనిస్సారఘోరదుస్తరసంసార సముద్రమునఁ బడి యుండువారియుద్ధరణమునకై విష్ణుపూజ సేయఁగోరి ప్రతిమాస్థాపనమునకుం బూనితిని. ఇది చాలమం చికార్యము. రాజచంద్రమా! నీవు ధన్యుఁడవు. సుగుణాలం కారభూషితుఁడవు. నీవంటి ప్రభువును బడసియున్న యీభూ మి పర్వతవనములతోఁ బవిత్రురాలు. సకలగ్రామనగరములు పరమపవిత్రములు. ఏలయన నిట్టి యుత్తమకార్యకరణదీక్షు

డవగు నీవు ప్రభువవుగా నుండుటయే గొప్ప యదృష్టము. రాజేంద్రా! ఇటురమ్ము. మమ్ముంగూడి యిందుఁ గూరుచుండుము. ధర్మసంహితములగు కథల నాలకింపుము. నావెంట వచ్చిన యీతఁ డెవ్వఁడో యని సందియ మొందకుము. ఈతఁడే విశ్వకర్మసముఁడు. శిల్పివర్యుఁడు. సర్వకార్యనిపుణుఁడు. నాచే నిర్దేశింపఁబడిన ప్రతిమ నీశిల్పివరుఁడు చేయును. కావునఁ గుంత మాని దగ్గి రమ్ము. అని పలికెను.

ఇంద్రద్యుమ్నుఁ డామాట లాలించి ఆచోటు వాసి వారిచెంతకుఁ బోయి శీతలవృక్షచ్ఛాయ నుపవిష్టుం డయ్యె. ఆవల ద్విజరూపధరుండగు విష్ణువు శిల్పివర్యా! ఈవృక్షశాఖలం గొని మూఁడు ప్రతిమల నొనరింపుము. అం దొకటి శ్రీకృష్ణమూర్తిప్రతిమ. ఆప్రతిమయందు శాంతగుణము తేజరిల్లుచుండవలయు. నేత్రములు పద్మపత్రాయతములుగ నలరందగు. శ్రీవత్సకౌస్తుభము లురమున నమరియుండవలయు. శంఖచక్రగదలు కరములఁ గన్పట్టవలయు. కృష్ణవర్ణముగ దేహ మలరారవలయు. రెండవది యనంతునిరూపముగ నుండఁదగు. ఆతఁడే బలరాముఁ డనఁబడఁగలఁడు. ఆరూపము చంద్రునివలె, గోక్షీరములవలె దేహకాంతిగలిగి, స్వస్తికాంచితమై లాంగలాస్త్రముగలిగి, *మహాబలసమన్వితమై తనరారవలయు.

* కృష్ణరూపం మహాకాంతం పద్మపత్రాయతేక్షణం, శ్రీవత్సకౌస్తుభధరం శంఖచక్రగదాధరం. చంద్ర గోక్షీర వర్ణాభం ద్వితీయం స్వస్తికాం

దేవతలు దానవులు గంధర్వులు యక్షులు విద్యాధరు లురగులు లోనగువా రారూప మిట్టి దని కనుఁగొనఁజాలరు. కావుననే అనంతాఖ్యాయ మాపరమపురుషునికిం జెల్లును. ఇఁక మూఁడవప్రతిమను గూర్చి తెల్పెద. వినుము. శ్రీవాసుదేవునకు భగిని సుభద్రయను పేరఁ జరఁగుచుండు. మంగళాలయ. సర్వలక్షణలక్షిత. కావున నాయాకారము వెలయఁ జేయుము.

అని పలికి బ్రహ్మ మునులతో మరల నిట్లు పలికెను. ఇట్లు విశ్వకర్మతో భగవంతుఁ డాజ్ఞాపించెను. విశ్వకర్మయుఁ దద్వచన మాలించి శిరసావహించి తనశిల్పనైపుణ్య మనల్పముగాఁ దనరార సకలశుభలక్షణలక్షితములుగ మూఁడు ప్రతిమల నప్పుడే నిర్మించెను. అందు విచిత్రకుండలశోభిత కర్ణముల విలసిల్లుచు, చక్రలాంగలాయుధహస్తముల నొప్పు సమ్మతమగుచు, శుక్లవర్ణముగలిగి, శారదేందుసమప్రభంబై, ఆరక్తాక్షమై మహాకాయమై, ఫణావికటమస్తకమై బలరామ విగ్రహము విరాజిల్లెను. దానికి నీలాంబరము గలదు. బలమదోద్ధతముగ నది యొప్పు. రెండవరూపము శ్రీకృష్ణమూర్తిది. ఆరూపము కుండలాలంకృతమై, గదాముసలములఁ దాల్చి,

---

కితం, లాంగలాస్త్రధరం దేవ మనంతాఖ్యం మహాబలం. దేవదానవగంధర్వ యక్షవిద్యాధరోరగైః. ౪౫. నవిజ్ఞాతో హి తస్యాంత స్తేనానంత ఇతి స్మృతః, భగినీం వాసుదేవస్య రుక్మవర్ణాం సుశోభనాం. ౪౬. తృతీయాం వై సుభద్రాం చ సర్వలక్షణలక్షితాం.

బ్రహ్మ. ౪౭ అధ్యా.

పుండరీకాక్షములు ముద్దులుచూపుచు, నీలజీమూతసన్నిభంబై, అతసీపుష్పకాంతిఁ దేజరిల్లుచు, బంగరువస్త్రమును దాల్చి, శ్రీవత్సలక్షణలక్షితమై, చక్రాయుధము కరమున మించి వెలుంగ, సర్వపాపహరంబై, కన్నులపండువు చేయుచుండెను. మూఁడవది సుభద్రారూపము. అది బంగరురంగుగలిగి, కమలములంబోలు కన్నులలర, విచిత్రవసనముం గట్టి, హారకేయూరభూషితమై, చిత్రితరాభరణము వెలయ, రత్నహారములు తనర, పాలింపఁ జగజ్జీవనహేతువులై యొప్పఁ గన్నులపండువు సేయుచుండెను.

ఇట్లు బలరామశ్రీకృష్ణసుభద్రారూపములు విచిత్రరీతిం బరిఢవిల్ల మూఁడుప్రతిమలు కనఁబడఁగా ఇంద్రద్యుమ్నుఁడచ్చెరువంది క్షణమాత్రమున నిట్టి విచిత్రాకృతులు నిర్మింపఁబడుట యెంతటిదైనఁ గంటమే యని యబ్బురంపడుచు, ఇట్లు పలికెను. ఓస్వాములారా! బ్రాహ్మణరూపముల నన్నుద్ధరింప నరుదెంచిన మీర లెవ్వరు? దేవత లని భావించుచున్నవాఁడ. మీకర్మము లత్యద్భుతములు. ఇవి దేవతాకృత్యములు గాని మనుష్యులు చేయునవి కానే కావు. మహాత్ములారా! మీరు యక్షవిద్యాధరులవలెఁ గనుపట్టుచున్నారు. వారలే యగుదురా? స్వాములారా! మీరు బ్రహ్మహృషీకేశులా! లేక వసువులా, కాకున్న అశ్వీదేవతలా! మాయారూపమున వచ్చిన మీతత్త్వము నెఱుంగఁజాలక యున్నాఁడను. నే నిదె మీశరణము

చూచుచున్నాఁడను. మీస్వరూపములం గసంబజపుఁడను. అని సవినయముగాఁ బ్రార్థించెను.

### ఇంద్రద్యుమ్నరాజుతో నేను వాసుదేవుఁడ నని భగవంతుఁ డుపదేశించుట.

* ఇట్లింద్రద్యుమ్నమహారాజు ప్రార్థింపఁగా దయాసింధు యగు భగవంతుఁ డిట్లుబదులుచెప్పెను. రాజా! నీవడిగినట్లు నేను నిర్జరుఁడనుగాను. యక్షదానవులనుగాను. దేవరాట్టునుగాను. బ్రహ్మనుగాను. రుద్రుఁడనుగాను. ఇంకెవ్వరని యడుగుదువా పరమేశ్వరుఁడ నని నన్నెఱుంగుము. సర్వలోకాస్త్రహాయుండను. సమగ్రబలపౌరుషములు గలవాఁడను. ఆరాధనీయుఁడను. నాకన్యమనుమాటయే లేదు. ఈవిషయము సర్వశాస్త్రములయందు నిశ్చయించి వేదాంతములయందుఁ బఠింపఁబడుచుండును. యోగులే నన్ను 'జ్ఞానగమ్యా'యని, 'వాసుదేవా'యనిపిలుతురో, ఆ నేను వాసుదేవుఁడనే. ♦ నేనే బ్రహ్మను. విష్ణువు నేనే. శంకరుఁడను నేనే.

---

* ఇది బ్రహ్మపురాణము ౭౦ అధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

♦ అహమేవస్వయం బ్రహ్మ అహం విష్ణుశ్శివోఽప్యహమ్. ఇంద్రోహం దేవరాజశ్చ జగత్సంయమనో యమః, అని మూ. ౭ శ్లో. త్రిమూర్తులు సకల దిక్పాలకులు నేనేయని భగవంతుఁడు చెప్పుచుండ నిక త్రిమూర్తులలో విష్ణువే యధికుఁ డని కొందఱు, శివుఁడే యుత్కృష్టుఁడని కొందఱు మొండిపట్టుదలతో వాదించుట వెఱ్ఱితనముగాక మఱేమనవచ్చును? అట్టివారికి ఘట్టమునఁగన్నట్టు నీప్రమాణములు కల్పితము లందురో యింకొక యర్థమును జెప్పుదురో తెలిసికొనఁ జాలకున్నాఁడను.

ఇంద్రుఁడు, యముఁడు, అగ్ని, వరుణుఁడు, భూమి, స్థావర జంగమాత్మకప్రాణికోటియు అది యిది యననేల? చరాచర ప్రపంచమంతయు నేనే. నా స్వరూపము కాని దేదియు లేనే లేదు.

ఓరాజా! నేను నీవిషయమున సుప్రీతుఁడనైతిని. సుప్రతా! వరమడుగుము. నీమనసున నేకోర్కెవలయుననియున్నదో దాని నడుగుము. అనుగ్రహించెద. పాపాత్ములకు స్వప్నమునందుఁగూడ నాదర్శనము కాదు. నీవుదృఢభక్తిసంపన్నుఁడవు. కానఁ బ్రత్యక్షముగ నన్నుఁ జూడఁగల్గితివి. అని వాసుదేవుఁడానతీయఁగా రోమాంచితతనుండై భక్తిభావమున మనస్సు తత్తఱపడుచుండ నిల్చి నుతించెను.

* ఓలక్ష్మీనాయకా! పీతాంబరధారివయి శ్రీపతి యననొప్పు నీకు నమస్కారము. శ్రీప్రదాయకా! శ్రీనివాసా! శ్రీనికేతనా! నీ కిదె నావందనము. ఆద్యుఁడవై యీశానుఁ

---

* శ్రియఃకాంతనమస్తేఽస్తు శ్రీపతే పీతవాససే, శ్రీద శ్రీశ శ్రీనివాసనమస్తే శ్రీనికేతన. ౧. ఆద్యం పురుషమీశానం సర్వేశం సర్వతోముఖం, నిష్కలం పరమం దేవం ప్రణతోఽస్మి సనాతనం. ౨. శబ్దాతీతం గుణాతీతం భావాభావవివర్జితం, నిర్లేపం నిర్గుణం సూక్ష్మం సర్వజ్ఞం సర్వభావనమ్. ౩. ప్రాకృతేషు ప్రతీకాశం గోబ్రాహ్మణహితేరతం, సర్వేషామేవగోప్తారం వ్యాపినం సర్వభాసినం. ౪. శంఖచక్రధరం దేవం గదాముసలధారిణం, నమస్యే వరదం దేవం నీలోత్పలదళచ్ఛవిమ్. ౫. నాగపర్యంకశయనం క్షీరోదార్ణవవాసినం. నమస్యేఽహం హృషీకేశం సర్వపాపహరం హరిమ్. పునస్త్వాం దేవదే

డవై పరమపురుషుండవై సర్వతోముఖుండవై, నిష్కళుం డవు. పరమదైవమనంబడు నీవు నతి యించుచున్నాఁడను. శబ్దా తీతుండవు, గుణాతీతుండవు, భావాభావవర్జితుండవు, నిర్లేపుం డవు, నిర్గుణుండవు, సూక్ష్మరూపుండవు, సర్వజ్ఞుండవు, సర్వభావ నుండవు, ప్రావృట్కాలమేఘసమానరూపుండవు, గోబ్రాహ్మణ హితరతుండవు, సర్వభూతరక్షకుండవు, సర్వవ్యాపి, సర్వాను భవశాలివి, శంఖచక్రధరుండవు, గదాముద్గధారివి, పరము డవు, నీలోత్పలదళ కాంతియుతుండవు నగు నీకు ప్రణామము లర్పించెదను, నాగపర్యంకశాయివి, క్షీరోదార్ణవవాసివి, హృషీ కేశుండవు, సర్వపాపహారుండవు, శ్రీహరివి, అగు నీకు నిదె చే మోడ్పులు. మోక్షకారణునకు, అవ్యయునకు, సర్వలోకేశ్వ రునకు, దేవదేవేశునకు పరమునకు శ్రీమద్వాసుదేవునకు మరల మరలఁ బ్రణుతు లర్పించుచున్నాఁడను.

అని యీరీతి నుతించి మహాప్రభూ! నాకు నను గ్రహించితి వేనిపరము నడుగుచున్నాఁడను. దేవాసురగంధర్వయక్షరాక్షసు లు, మహోరగులు, సిద్ధవిద్యాధరసాధ్యకిన్నరగుహ్యకాదులు, నానాశాస్త్రపారగులు అగుమునులు యోగియుక్తులగు బ్రహ్మ ర్షులు, వేదతత్త్వార్థచింతకులు, మోక్షశాస్త్ర విశారదులు నగు

---

వేశం నమస్యే వరదం విభుం, సర్వలోకేశ్వరం విష్ణుం మోక్షకారణమవ్య యమ్. ౭. బ్రహ్మపురాణె ౪౮ అ. శ్లో. ౧౬ దలిసంఖ్య స్తోత్రసంఖ్య తెలు పునుగాని పురాణశ్లోకసంఖ్యను దెలుపదు.

మహాత్ములు ఏపరమపదమును ధ్యానింతురో, నిర్గుణమై, నిర్మలమై, శాంతమై, అతిరహస్యమై పరమపావనమైన యాపరమపదము నీయనుగ్రహమునఁ బొందఁ గోరుచున్నవాఁడను. అది భవత్ప్రసాదమునఁ దప్ప దుర్లభము గదా. అని ప్రార్థించెను.

భగవంతుఁడు వాసుదేవుఁడు రాజా! నీవు భక్తాగ్రేసరుఁడవు. నీవు వాంఛించిన దంతయు నిస్సంశయముగా సిద్ధించును. నీవు కోరినట్లే పరమపదము నొందఁగలవు. మఱియు నిది మొదలు పదివేలతొమ్మిదివందలసంవత్సరము లవిచ్ఛిన్నముగా రాజ్యము పాలింపుము. ఆవల సురాసురదుర్లభమగు దివ్యపదము నొందఁగలవు. అందుఁ బ్రవేశించువారలకు జరాశోకములుండవు. క్రియాకారణవర్జితమై యాపద మొప్పు. అది పరాత్పరము. నిర్మలము. నిశ్చలము. అట్టి యాపరమపదమును సమయమున దర్శనము చేయించెద. ఏస్థానమునొందిన మరల జన్మములేదో యట్టితావును నీకుఁ గనఁబఱచెదను. నీకీర్తియు ధరణియందు శాశ్వతముగ నిలువఁగలదు. ఎంతకాలము చంద్రార్కతారకంబగు నాకాశముండునో, ఎంతకాలము సప్తసముద్రములుండునో, ఎంతకాలము మేర్వాదిపర్వతములుండునో, ఎంతకాలము స్వర్గమున దేవత లుందురో, అంతకాలము నీయాగమునందుద్భవంబగు నీతీర్థము ఇంద్రద్యుమ్నసరస్సను నామముగ బరగ వర్ధిల్లఁగలదు. ఈతీర్థమున స్నానముచేసినవాఁడు సుల

భముగా నింద్రలోకమునకుం బోవఁగలరు. ఈసరోవరతీరమునఁ బిండదాన మొనరించువారు ఇరువదియొకతరముల వారిని బితరులను నుద్ధరించి స్వర్గలోకమునకుం బోవుదురు. అందు ఇంద్రులు పదునల్వు రుండునంతకాలము పీయూషానాహా ఘులై యప్సరోగణపరివేష్టితులై విహరింపఁగలరు.

ఈసరోవరదక్షిణదిక్కున నైఋతిభాగమున నానాద్రుమలతాపరికీర్ణమై న్యగ్రోధవృక్షమలరుచుండును. దాని చెంత మండపం బొప్పుగలదు. ఆషాఢశుక్లపంచమీతిథియందు మఘానక్షత్రమున నీప్రతిమల నందుఁ జేర్పఁగవలెను. అదిమొదల లేడుదినము లందుండవలయు. వేశ్యాగీతనృత్యములు చెలంగుచుండ సువర్ణదండసంశోభితములగుచ్ఛత్ర మిగిలిన యుపచారములు సాగుచుండ నీప్రతిమల నర్చించి పూజింపవలయు. బ్రహ్మచారులు, యతులు, స్నాతకులు, వానప్రస్థులు, గృహస్థులు, బ్రాహ్మణులు ఋగ్యజుస్సామనిస్స్వనములచేతను, నానావిధ స్తోత్రములచేతను, నానుకీర్తి వుల వినుతింపవలయును. ఇట్లు ధ్యానించి పూజించి స్తుతించువారు శ్రీమద్వాసుదేవపురమున వసింపఁగలరు. ఆలోకమున నాపుణ్యాత్ములు సకలభోగముల ననుభవించుచు వాసుదేవుని చెంత నుండఁగలరు. ఆపుణ్యము తగ్గఁగా మరల నీలోకమున బ్రాహ్మణజాతిం బుట్టువుంగాంచి ధనవంతులై వేదవేదాంగపారగులై యలరారఁగలరు.

మునులారా! ఇట్లు వాసుదేవుఁ డారాజు ననుగ్రహించి వరములొసంగి యదృశ్యుఁడయ్యెను. విశ్వకర్మయు భగవంతునిం గూడిపోయెను. అంతట రాజచంద్రుఁడు రోమాంచితతనూరుహుండై పరమహర్షము నొంది కృతకృత్యునిగాఁ దనను భావించుకొనుచుండెను. పదంపడి రామకృష్ణులను, సుభద్రాదేవిని విమానసంకాశస్యందనములయం దుంచి జయమంగళధ్వను లలరార మంత్రిప్రభృతులం గూడి నానావాదిత్రధ్వను లొప్పుచుండఁ గొనితెచ్చి శుభతిథివారనక్షత్రయోగకరణలగ్నమందు బ్రాహ్మణానుమతంబున స్థాపించెను. విధివిధానమునఁ బ్రతిష్ఠచేయ నాచార్యు లనుమతించిరి.

ఆమీఁద రాజేంద్రుఁ డాచార్యులకు విధివంతముగా దక్షిణలొసంగి ఋత్విజులకందఱకు ఇతరభూసురులకు దక్షిణల నిచ్చి సన్మానించెను. శాస్త్రోక్తమార్గమునఁ బ్రాసాదమునఁ బ్రతిష్ఠ నొనరించి కృత్యమును బూర్తిచేసెను. ఆ ప్రతిమలకు నానారత్నవిభూషణములు నగరములు బహుమతరములుగా నొసంగెను. అంతటితోఁ దృప్తినొందక రాజ్యము గొంత నిచ్చెను.

ఈరీతి నాదేవునకు యథోచితపూజల నొనరించి ధర్మమార్గమున రాజ్యమును బాలించుచు, బహువిధయజ్ఞములొనరించుచు ననేకదానము లొనరించుచు, శ్రీమహావిష్ణులోకమును బొందెను. మునులారా! ఇంద్రద్యుమ్నిచరిత్రంబు

వచించితి. పురుషోత్తమక్షేత్ర మాహాత్మ్యము వివరించితి. ఇంకేమి వినఁగోరెదరు ? అని యడుగ మును లిట్లనిరి. పంకజాసనా ! ఏకాలమునఁ బురుషోత్తమక్షేత్రమునకు యాత్రకై పోవుట మేలు? పంచతీర్థముల సేవించు టెట్లు? ఆవిధులన్నింటి వేఱు వేఱుగా వచింపుమా యని యడిగిరి. వారిప్రశ్నము నాలకించి బ్రహ్మ యిట్లనియె.

మునులార ! మీ ప్రశ్నమునకు సమాధానము వినుండు. కురుక్షేత్రమునందు జితేంద్రియుఁడు, జితక్రోధుఁడునై యేకపాదమున నిలిచి డెబ్బదివేలవత్సరములు తపస్సొనరించిన నేఫలము గలుగునో ఆఫలము ఈపురుషోత్తమక్షేత్రమున వేంచేసియున్న శ్రీ వాసుదేవమూర్తిని ద్వాదశియం దొకసారి దర్శించినమాత్రమునఁ గలుగును. ఉపవాస మేకాదశియందుండి ద్వాదశియందు భుజింపకముందే దర్శించిన నధికతరఫలము గలుగును. కావున జ్యేష్ఠమాసమున శుక్లపక్షద్వాదశియందుఁ బ్రయత్నపూర్వకముగాఁ బురుషోత్తముని దర్శించిన స్వర్గప్రాప్తి సులభతమముగ నుండును. పంచతీర్థముల యథావిధి స్నానమొనరించి వెనుకఁ బురుషోత్తముని దర్శింపవలయు. ఏపుణ్యపురుషులు అవ్యయుండగు పురుషోత్తముని ద్వాదశియందు దర్శింతురో వారు విష్ణులోకమునొంది మరల జన్మింపరు. కావున జ్యేష్ఠమాసమునఁ దప్పక పురుషోత్తమక్షేత్రమును దర్శింపఁ బోవలయును. దూరముననుండి యాత్రకై

పోఁజాలక ధ్యానించినను దినదినము పరిశుద్ధాంతరంగుఁడై ముక్తికిఁ జేరఁగలఁడు. ఎవఁడు పరిశుద్ధాత్ముఁడై శ్రీకృష్ణమూర్తి యాత్రకై వెడలునో, ఆభక్తుఁడు సకలపాపవినిర్ముక్తుఁడై పరమ పదమునకుఁ బోవఁగలఁడు. దూరమందుండియే ప్రాసాదోపరిభాగమందున్న చక్రమును దర్శించి శ్రద్ధాళువై నమస్కరించిన సకలపాపములు నశించును.

పాఠకమహాశయులారా! పురుషోత్తమక్షేత్రమాహాత్మ్యమును జదివితిరి. శ్రీకృష్ణావతారతత్త్వమున నీగూడవ ద్దేల యని ప్రశ్నింపవచ్చును. ఇంతకుముందే యీకథ వ్రాయుటకుం గల కారణములును వచింపఁబడినవి. ఇపుడు మఱికొన్ని మాటల వినుఁడు. శ్రద్ధాభక్తుల వదలకుఁడు. కుప్రశ్నములఁ గాలముఁ బుచ్చకుఁడు. అది మీకు మేలు గాదు. ఇందు ముఖ్యముగా గ్రహింపఁదగిన విషయము లనేకములు గలవు గాని నాకుఁ దోఁచినవి కొన్నింటి వ్రాసెదను.

వటవృక్షము ప్రీతికరమనునది యం దొకటి. సకలభూతప్రేతపిశాచాదిబాధలు గలవా రిప్పటికిం గూడ వృక్షమునకుఁ బ్రదక్షిణము చేయుదురు. భక్తికొలఁది ఫలము నిచ్చును. ఆవటపుష్పఫలములం దిలకింపుఁడు. చెట్టునకుఁ దగినంత ఫలములు గావు. అందలిబీజములం బరికింపుఁడు. పండునకుఁ దగినవి కావు. వటబీజ మత్యల్పమయినను దానియం దంతటి మహావృక్షమును వెలయింపఁజేయునంకుర మున్నది. దీనింజూచి

శ్రీవాసుదేవునియందుఁ బ్రళయకాలమున భూతకోటి యంతయు ప్రాయముగా నిమిడియున్నదని గ్రహింపవలయును. ఇన్ని భూతకోటు లాపరమేశ్వరునియం దెట్లుండఁగల వను ప్రశ్నము నీవటఫలాంతర్గతబీజము పరిహరించును. మహావృక్ష మగుటకు హేతు వేమి? భగవత్కళ వృక్షసామాన్యజాతియం దున్నట్లు గాక యిం దెక్కువగాఁ గలదు. ఎట్లు వటభూరుహము శాఖోపశాఖలచేతఁ జాలభూభాగము నాక్రమించునో యట్లు భగవంతుఁడు బహువిధభేదదేవతారూపములచేఁ బ్రపంచము నాక్రమించియున్నాఁడు. ప్రతిశాఖకును ఊడలు మూలములు లగుచుండును. ఆవల వ్యాపించి పెరుగుచున్న శాఖ కదియే మూలమగుట మనము చూచుచున్నాము. అట్లే దేవతలుకూడఁ గనఁబడుచున్నవారు. దేవతల కింద్రుఁడు మూలభూతుఁడు. అతఁడు లేకున్న, వారి కార్తి మెండు. పురాణముల నిర్ణయము. ఇట్లే వివిధశాఖలు గలవు. పొడవుగా వ్యాపించిన కొమ్మ కదె మూలమని దూరమందున్న మొదలును గనుఁగొనుటకు ప్రయాసపడ నక్కఱలేక సమీపమందున్న "ఊడ" యను మూలమును గనుఁగొన్నఁజాలును. అట్లే ప్రపంచమునకెల్ల నధిష్ఠానదేవత యెవ్వఁడని గొప్ప ప్రయత్నముచేయుట కష్టమని ప్రముఖుల నిర్ణయించెను. వారిని దెలియఁజాలనివారి కితరదేవతల నమ్మికనో యేర్పఱచెను. ఇన్నింటికి మూల మేదిరా యను ప్రశ్న వెలిగినపుడు ప్రధానమూల మిది యని కనుఁగొనఁ బ్రయత్నము

చేసినఁ గనఁబడును. అనఁగా దేవతల నిష్టరీతి నభీష్టదేవతగా నొకని నియమించుకొని తదుపాసన మొనరించుచుఁ దజ్జన్యజ్ఞానమునఁ గ్రమక్రమముగా సర్వదేవతామూలతత్త్వము నెఱుంగవచ్చునని దీని సారము.

ప్రతిమారాధనమును గూర్చి ముందే చెప్పఁబడినది కదా. శ్రీకృష్ణావతారముతర్వాతఁ బురుషోత్తమక్షేత్రమున శ్రీకృష్ణబలభద్రప్రతిమలు, సుభద్రాప్రతిమయుఁ బ్రతిష్ఠ చేయఁబడిన వనుభ్రాంతి తొలఁగించుటకే యీచరిత్రము వ్రాయఁబడినది. శ్రీకృష్ణనామము సనాతనము. వాసుదేవనామము సనాతనము. వీనికి వ్యుత్పత్తులు వేఱు. ఆయవి తన్నామములు సనాతనము లనుటను దేటపఱచును. ఇంతియకాక ద్వాపరయుగాంత్యభాగమున శ్రీకృష్ణనిర్యాణము కాఁగా కలియుగమున నీప్రతిమాస్థాపనము చేయఁబడిన దన్న నెట్టి వ్యాఖ్యానమును నమ్మవలదనుటకే యీప్రయత్నము.

దృఢభక్తి మెయిఁ జేయు ప్రయత్న మెంత దుర్లభమైనను ఫలించు నన్నసిద్ధాంతమున కీగాథ యుదాహరణము కాఁగలదు. ఈకథయే కల్పితమను చార్వాకుల ప్రశంస యిటఁ జేయ నవసరము లేదు. తరణోపాయాన్వేషణము చేయువారలకే యీభక్తిమార్గము కాని యితరులకుం గాదు. తాఁ బట్టిన కుందేటికి మూఁడేకాళ్లనువారిజోలికిఁ బోరాదు. వారియాక్షేపములం జెవియొగ్గి వినరాదు. సమాధానముచెప్పఁ బ్రయ

త్నింపరాదు. అది వృథాకాలక్షేపమువంటిది దగు. పూర్వజన్మకృతసుకృతపరిణామమున భక్తిబీజము కలుగవలయునే కాని పుక్కిటిపురాణములతోఁ గలుగఁబోదు. కావునఁ దొలుదొలుత శ్రద్ధాళువై భగవద్భక్తి యలరుచుండ గ్రంథమును జేనంది దీనిం బఠించిన మనము కడ తేరుమార్గము దొరకునన్న విశ్వాసముతోఁ జదివిన నా గ్రంథ మట్టిదే యగు. నిస్సార మిది యనుబుద్ధి మొదటనే కలుగఁ జదివిన నదియు నట్టిఫలమునే యొసంగును. కాఁబట్టి భక్తి ప్రధానముగా గ్రంథపఠన మొనరింపవలయును.

ఇట్టు లిప్పట్టున నీపురుషోత్తమక్షేత్రమహిమము తెలుపఁబడియెఁగదా. ఇఁక నత్యద్భుతప్రమదావహంబయి, ముక్తి నొసంగఁ జాలు నట్టి యష్టాక్షరదివ్యమంత్రమును, దన్మాహాత్మ్యమును విని యవ్వల శ్రీకృష్ణావతారప్రశంసకుం బోవుట యే సముచితము. ఆసత్కార్యమునకుం గడంగెదను.

ఆమంత్రమును వదలినచో వ్రాయఁదలఁచిన విషయమునకే లోపముగదా యని తలంచి భక్తజనకల్పద్రుమం బనం బరఁగు తన్మంత్రమును దాని నుపాసించువిధియు వివరించెద. కాన శ్రద్ధమై నాలకింపుఁడు.

## శ్రీమన్నారాయణాష్టాక్షరమంత్రమహిమము.

* ఇట్లు బ్రహ్మ వచియించిన,మును లాపురుషోత్తమక్షేత్రాదిమాహాత్మ్యము విని మహానందసాగరనిమగ్నులై పంకజాస

నుం గాంచి మహానుభావా! ఏతీరమున శ్రీభగవంతుఁడు ప్రత్య క్షమై భక్తుల నుద్ధరించెనో యాసాగరస్నానాదిమహిమముల వచింపుమా యని ప్రశ్నింప బ్రహ్మ మరల నిట్లు పల్కెను. మహానులారా! మార్జనవిధి నెఱింగించెద వినుఁడు. మార్కండేయహ్రదంబున స్నానము తొలుదొలుతఁ జేయఁదగినది. అదిచతుర్దశియందు మహాఫలము నొసంగును. అట్లే సముద్రస్నానము పురుషోత్తమక్షేత్రమున సర్వకాలము చేయఁదగినదియే. విశేషించి పూర్ణిమయందుఁ జేసిన నశ్వమేధఫలం బొడఁగూడు. మార్కండేయుని వటభూరుహమును, శ్రీకృష్ణుని, బలరాముని, సాగరమును, ఇంద్రద్యుమ్నసరస్సును దర్శించుట పంచతీర్థవిధి యందురు. జ్యేష్ఠశుక్లపూర్ణిమయందు జ్యేష్ఠానక్షత్రము రాఁగా నాఁడు యాత్ర మహాఫలప్రదము. మనోవాక్కాయపరిశుద్ధుఁడై యనన్యరతిమానసుండుగాక ద్వంద్వము లనఁబడు శీతోష్ణాదుల వదలి మత్సరము మాని కల్పవృక్షమును మించినవటమును దర్శించి స్నానమొనరించి శ్రీజనార్దను సేవించి త్రివారము ప్రదక్షిణ మొనరింపవలయు. దాన సప్తజన్మకృతపాపములు దొలంగును. ఆభగవంతుని నామముల వచింతు. అవి ప్రతియుగము నను ముఖ్యము లనంబడుచుండు. అందు వట,వటేశ్వర, పూర్వపురాణపురుషనామములు వటవృక్షమునకుం జెల్లు. కృతయుగమున యోజనమాత్రంబును, త్రేతాయుగంబునఁ బాదహీన

---

* ఇయ్యది బ్రహ్మపురాణము 3౫ సర్గమునుండి గ్రహింపఁబడినది.

యోజనమాత్రంబును, ద్వాపరంబున నర్ధయోజనమితంబును, కలియుగంబునఁ బాదయోజనమాత్ర పరిమితంబునుగా నావటవృక్షము వర్ణింపఁబడు. పూర్వోక్తనామమంత్రమున నావటతరువునకు నమస్కరించి దానికి దక్షిణదిక్కునం బోయి మూఁడువందలధనుస్సు లంతదూరమున స్వర్గద్వారభూతుఁడగు వాసుదేవుని దర్శింపవలయు. ఎందుఁ గాష్ఠద్వయ నులవడెనో, ఆచోటు వాసుదేవునినివాస మనంబడు. ఆపరమేశ్వరుంగాంచి నమస్కరించిన సర్వరోగములు పోవఁ బాపములు తొలంగఁ బరిశుద్ధుఁడగు. ఉగ్రసేను దర్శించి సాగరసమీపమునకుం బోయి యట నారాయణుని ధ్యానింపవలయు. నమశ్శబ్దముతోఁ జతుర్థ్యంతనారాయణశబ్దముం గలుపవలయు. ఆదియందుఁ బ్రణవమును జేర్పవలయు. అది యష్టాక్షరంబగు. ఆమంత్రరాజమునఁ గరహృదయముల స్పృశింపవలయు. తక్కినమంత్రములు కోటులేల? అవి మనోవిభ్రమజనకములు. ఈమంత్రరాజము సర్వార్థసాధకము. అప్పులు (=నీరు) నరసూనులనంబడుఁ గాన నారము లనంబడియె. అందు శ్రీవిష్ణువు నివసించును గాన నారాయణాహ్వయం బాపరమాత్మునకుం జెల్లె. లోకములు నారాయణపరములు. దేవతలు నారాయణపరులు. సత్యము నారాయణపరము. పృథ్వి నారాయణపరాయణురాలు. జలము నారాయణపరము. వహ్ని నారాయణపరము. వాయువు మనస్సు నారాయణపరములు. అహంకా

రబుద్ధులు నారాయణపరములు. భూతభవ్యభవిష్యజ్జీవసంజ్ఞికమంతయు నిది యది యన నేల సమస్తము నారాయణాత్మకము. శబ్దాదివిషయములు, శ్రోత్రాదీంద్రియములు, ప్రకృతిపురుషులు నారాయణవిలసితములు. జలస్థలపాతాళస్వర్గలోకాంబరముల నంతట నావరించి నారాయణుం డుండు. పెక్కుమాట లేల? చరాచరాత్మకప్రపంచ మంతయు బ్రహ్మాది స్తంబపర్యంతము సర్వము నారాయణాత్మకము. నారాయణునికంటె వేఱైనది యించుకయు నెందును జూడఁజాలము. కాన నీనారాయణస్వరూపమె దృశ్యాదృశ్యప్రపంచ మంతయు.

శ్రీమహావిష్ణువునకు అప్పులు(=నీరు)నివాసభూతములు. ఆయప్పులకుఁ బ్రభువు నారాయణుఁడే. కాఁబట్టి జలముల యందు నారాయణు ధ్యానింపవలయు. విశేషించి స్నానకాలమునఁ దలంపవలయు. నారాయణుని ధ్యానించి కాయమునందు, విశేషించి హస్తములయందును న్యాసముచేయవలయు. అందు నోంకారనకారములు హస్తాంగుళులందును, శేషాక్షరములు తర్జన్యాదులయందును న్యాసముచేయువలయు. ఓంకారము వామపాదమందును, నకారము దక్షిణపాదమందును, మోకారము వామపాదకటిప్రదేశమందును, నాకారము దక్షిణకటిప్రదేశమందును, రాకారము నాభితలమందును, యకారము వామబాహువునందును, ణాకారము దక్షిణబాహువునందును విన్యాసమొనరించి పిదప యకారము శిర

న్నున నారాయణమంత్రము నెల్లయవయవములయందు విన్యాసము చేయవలయు.

* ఇట్లు న్యాసవిధి పూర్తి నొందించి కవచము జపింపవలయు. పూర్వదిక్కున గోవిందుఁడును, దక్షిణదిక్కున మధుసూదనుఁడును, బశ్చిమదిక్కున శ్రీధరుఁడును, ఉత్తరదిక్కునఁ గేశవుండును, ఆగ్నేయదిక్కున విష్ణుమూర్తియు, నైర్‌ఋతిదిక్కున నవ్యయుండగు మాధవుండును, వాయవ్యవిదిక్కున హృషీకేశుండును, ఈశానవిదిక్కున వామనుండును గాపాడుదురుగాక. వారాహమూర్తి భూతలమందును, త్రివిక్రముఁ డూర్ధ్వమందును గాపాడుదురుగాక. అని యిట్లు కవచమున రక్షణముగావించుకొని యవ్వలఁ దన్నుఁ దాఁ జింతించుకొనవలయు. ♦ నేను శంఖచక్రగదాధరుండనగు నారాయణుండను అని తదభేదబుద్ధిని ధ్యానింపవలయు. ఆవల అద్వైవతములగు

---

* పూర్వే మాం పాతు గోవిందో దక్షిణే మధుసూదనః, పశ్చిమే శ్రీధరో దేవః కేశవస్తు తథోత్తరే. పాతు విష్ణుస్తథాఽఽగ్నేయే నైర్‌ఋతే మాధవోఽవ్యయః, వాయవ్యే తు హృషీకేశ స్తథేశానేచవామనః. భూతలే పాతు వారాహ స్తథోర్ధ్వం చ త్రివిక్రమః. ౪౧. కృత్వైవం కవచం పశ్చా దాత్మానం చింతయేత్తతః. ౪౨ శ్లో. బ్రహ్మ. ౫౭ అధ్యాయే.

♦ అహం నారాయణో దేవశ్శంఖచక్రగదాధరః. అని మూ. నేనే నారాయణుఁడనని భక్తుఁడు ధ్యానింపవలయు నని చెప్పఁబడియెఁ గదా. వైష్ణవాభాసులు కొందఱు 'శివోఽహమ్' అనుచో లేనిపోని శంకలఁ గల్పింతురే. ఇపుడు వారిగతి యేదియో తెలియరాకున్నది.

మంత్రములఁ బఠింపవలయు. అవ్వల స్నానమొనరింపవలయు. ఆస్నానకాలమున నంతర్జలంబుల సర్వపాపాపనోదనపటువు లగు నఘమర్షణసూక్తంబులఁ బఠించుట చాల మంచిది. యజ్ఞము లలో అశ్వమేధ మెట్లుత్తమతమమో, పాపాపనోదనమున నఘ మర్షణసూక్త మట్టిది వేఱొకటి గానరాదు. ఇట్లు స్నానకృత్యము పూర్తి కాఁగా నీటినుండి వెడలివచ్చి ధౌతవస్త్రములఁ దాల్చి నిర్మలవస్త్రముం గప్పుకొని ప్రాణాయామ మొనరించి యాచ మనముచేసి సంధ్యోపాసనముచేసి సూర్యు నారాధించి పుష్పాం జలుల భాస్కరున కిడి ఊర్ధ్వబాహుఁడై భాస్కరునిఁ బ్రార్థిం చి పరమపవిత్రగాయత్రీమంత్రమును జపించి సౌరమంత్రముల స్మరించుచు సూర్యునకుఁ బ్రదక్షిణ మొనరించి ప్రాఙ్ముఖుఁడై స్వాధ్యాయవిధి నెఱవేర్చి దేవర్షిపితృతర్పణములఁ జక్కఁగాఁ జేసి విధివిహితములగు నితరకృత్యముల నెఱవేర్పవలయు. మునులారా! సముద్రస్నానవిధియు నారాయణాష్టాక్షరమంత్ర రాజకవచములను దెలిపితిని. అని పంకజసూతి మునుల కుప దేశించెను.

భక్తవర్యులారా! శ్రీకృష్ణావతారతత్త్వమున నవాంతర ముగాఁ బురుషోత్తమక్షేత్రమహిమ మేల యను శంక గలుగున హ్గాశంకించుకొని ముందే కొన్ని మాటలువ్రాసితిని. శ్రీవాసుదేవ (బ్దనిర్వచనమునకై యదివ్రాయఁబడినదిగా నాయూహ యని తె )సికొంటిని. ఆమాట యిఁక వ్రాయఁబోవుకథవలన స్పష్టమగు.

ఆకథను బఠించిన మహానంద ముదయింపక మానదు. అంతియు గాక దానఁ బెక్కుసంశయములు ఉదయించు. వానిం దీర్చుకొన్న మనస్సు పరిశుద్ధమగు. కావున నీక సావధానమనస్కులరై తదాకర్ణనకుతూహలమున నుండుఁడు. దానిం జదివి శంకాకులితమనస్కులు గాక యింకలి తత్త్వమేదియై యుండునా యని యాకసమువంకకు దృష్టినిసి మరలించి యోజింపుఁడు. తత్త్వము దెలియఁబడఁగాఁ బరమానందము నొందుదుఁడు. ఇఁకఁ గథ వినుఁడు.

## * రావణాసురుఁడు వాసుదేవప్రతిమను స్వర్గమునుండి సంగ్రహించి లంకకుం బోవుట.

పురుషోత్తమక్షేత్రమును వినియు మహర్షులు తృప్తి నొందని మనస్సులతో బ్రహ్మను గాంచి మరల నిట్లు లనిరి. పద్మసంభవా! భగవత్కథల వింటిమి. ఇఁకఁ జాలు ననుతృప్తి కలుగదయ్యెను. కావునఁ బరమరహస్యము లనందగు శ్రీవాసుదేవుకథలం దెల్పుము. అనంతవాసుదేవునిమహిమము నీకను వినఁగోరుదుము. అని ఋషు లడుగ విరించి సుస్మితాననుండై మునుల కిట్లు లనియె.

పరమమునులారా! సారతమం బనఁదగు వాసుదేవుమహిమమును దెలుపు గాథను వచించెద. అది త్రిలోకదుర్లభము. దా

* ఈగాథ బ్రహ్మపురాణము ౬౭ అధ్యాయమునుండి పరిగృహీత మని యెఱుంగనది.

నిని వినిన మీకు సంతృప్తి కలుగును. పూర్వకల్పమున నేనవ్యక్త పరబ్రహ్మమునుండి పుట్టితిని. విశ్వకర్మను బిలిచి యిట్లు పల్కితిని. విశ్వకర్మా! నీవు శిల్పిప్రవరుఁడవు. సత్కార్యాచరణనిపుణుఁడవు. కావున శ్రీమద్వాసుదేవప్రతిమను శిలామయముగ నొనరింపుము. దానిని గాంచినంతనే యింద్రాదిదేవతలు మనుష్యులు దుష్టరాక్షసభయమును బాసి స్వర్గమును బొంది సుమేరుశిఖరమునఁ జిరకాలము భగవత్పూజ చేయుచు నుండవలయు. అట్టి మహాత్త్వముగల ప్రతిమ నొనరింపుమా. అను నా మాట లాలించి విశ్వకర్మ ఆక్షణమునందే పరిశుద్ధశిలం గైకొని శంఖచక్రగదలను ధరించి సర్వలక్షణలక్షితమై పుండరీకాయతలోచనము లలరార శ్రీవత్సచిహ్న మురమునఁ గనుపట్టఁగా శత్రుజనదుర్నిరీక్ష్యమై తేజోమయముగఁ దనరు ప్రతిమ నొనరించెను. ఆప్రతిమ మెడయందు శ్రీవనమాల వెలుఁగుచుండెను. మకుటాంగదంబులు కనుపట్టుచుండెను. పీతవస్త్రము తనరారుచుండెను. పృథుపీవరాంసములు, సురుచిరమణికుండలములు నేత్రపర్వముగ నగపడుచుండెను.

ఇట్లు లాప్రతిమ గుహ్యమంత్రముల దివ్యరీతి నాచే నిర్మింపఁబడియె. అత్తఱి దేవలోకాధిపతి యగు శతక్రతువు సర్వదివిజులం గూడి యచ్చోటికి నైరావతము నెక్కి వచ్చి యా దివ్యప్రతిమను స్నానదానాదులచేఁ బలుమాఱు తృప్తిపఱచి పదిలంబుగ దానిం గైకొని స్వర్గమునకుం బోయెను. నియతవా

క్షాయుస్వాంతుఁడై చిరకాల మాప్రతిమను బూజించుచుఁ దత్ప్రసాదంబున వృత్రాదులగు నసురుల మహాక్రూరకర్ములం జక్కాడి నముచి లోనగు దానవుల నట్లే పొలియఁజేసి నిష్కంటకం బగురాజ్యంబు చిరకాలంబు పాలించెను.

ద్వితీయత్రేతాయుగంబు రాఁగా సకలరాక్షసరాజై మహావీర్యసమగ్రుఁడై దశాననుండగు రావణుండు వెలసెను. ఆతఁడు నిరాహారుండై జితేంద్రియుఁడై పదివేలసంవత్సరములు మిగుల భయంకరమై యద్భుతావహంబగు తపంబొనరించెను. మునులారా! ఆతపంబు నా కత్యంతతృప్తి గల్గించెను. నే నచటికిం బోయి వర మడుగుమా యంటిని. దేవదైత్యోరగరాక్షసుల కవధ్యుఁడై భయంకరశాపప్రహారణంబుల యమకింకరులకుం గూడ నవధ్యుండై యుండఁదగున ట్లతఁడు వరము వేఁడెను. ఆతపోవిభూతి నా కచ్చెరువు గల్గించుట నట్టి వరమును గూడ నొసంగితిని.

నాచేత నిట్లు వరములం బడసి యాదశగ్రీవుఁడు యక్షరక్షోగణములను, ఇతరదేవతాదులను, కుబేరుని, దేవేంద్రుని జయింప నుద్యమించెను. చతురంగబలంబులం గూడి తొలుతొలుతఁ గుబేరుని జయించెను. ఆవల నమరావతిని ముట్టడించెను. అప్పటిదేవదానవసంగ్రామము వర్ణనాతీతము, ఘోరరూపమునై యుండెను. వరగర్వమున విఱ్ఱవీఁగు నాదానవరాజుబారికి దేవతలు నిలువఁజాలక గర్వ మేది యోడిరి.

ఆదశాననునికుమారుఁడు దేవేంద్రుని మార్కొని ఘోరాహవం బొనర్చి మాయాయుద్ధంబున నాతని జయించి యింద్రజిత్తనఁ బరఁగె. ఆతనిపేరు మేఘనాదుఁ డని. ఆపేరు దేవరాజవిజయంబునఁ బోయి యింద్రజిత్తను పేరే లోకవిస్తృతిం గాంచెను. ఇంద్రుఁ డిట్లు బలములతో నోడిపోఁగా రావణుఁడు స్వర్గము నవలీలం జొచ్చెను. దానివైభవమును గాంచుచు దేవరాజసౌధంబుఁ బొడఁగని యం దంజనసంకాశంబై నేత్రపర్వము చేయుచు సకలశుభలక్షణలక్షితంబై యలరారు శ్రీవాసుదేవప్రతిమను గాంచెను. అం దొప్పు శ్రీవత్సలక్ష్మమునకుఁ, బద్మపత్రాయతేక్షణములకు, వనమాలావృతోరస్స్థలమునకు, మకుటాంగదాద్యాభరణములకు, శంఖచక్రగదాహస్తములకుఁ, పీతబావన వస్త్రమునకు వింత నొందెను.

దానిం గాంచినంతనే యాతని కెంతో వేడుక గల్గెను. రత్నాభరణములకుం గాక ప్రతిమాగౌరవముచేతనే దానిని బుష్పకమునం దుంచుకొని లంకానగరమునకుం బోయెను. అత్తఱి నగరాధ్యక్షుండు మహాత్ముఁడగు విభీషణుఁడు. ఆతఁడు రావణున కనుజన్ముఁడు. శ్రీమన్నారాయణపరాయణుఁడు. కావున దేవేంద్రభవనచ్యుతిం గాంచిన యాదివ్యప్రతిమను జూచి రోమాంచితతనుండై విస్మయము నొందెను. తద్దర్శనమునఁ గృతార్థుండ నైతిఁగదా యనుభావ మాతనిమదిఁ గల్గెను. అంత నావిభీషణుఁడు తల యిలసోఁక నమస్కరించి దేవాదిదేవా! పర

మేశ్వరా! కృపాసింధూ! నేఁటికి నాజన్మము సఫలము. నాతపస్సు ఫలించినది. అని నుడువుచుఁ బలుమాఱు నమస్కరించి జ్యేష్ఠభ్రాత యగు రావణునికడకుఁ బోయి కృతాంజలియై యిట్లు ప్రార్థించెను.

రాజేంద్రా! ఈప్రతిమను నాకొసంగి నన్ననుగ్రహింపుఁడు. ఈప్రతిమ నారాధించి యీభవసాగరమును దరింతును. కావున నన్ను సఫలమనోరథుఁ గావింపుఁడని యూరకుండెను. అనుజుఁ డిట్లు దీనాననుండై ప్రార్థింపఁగా రావణుం డనుగ్రహము వెల్లివిరియ నిట్లు పలికెను. వీరాగ్రేసరా! అతివేగమ యీప్రతిమను గ్రహింపుము. సంతోషమున నిచ్చుచున్నవాఁడను. నేను స్వయంభువు నారాధించి త్రిలోకవిజయమును బడసితిని. ఆమహాదేవుఁడు సర్వభూతసృష్టికర్త. నీ వీ ప్రతిమను బడసి నీయిష్టార్థమును బడయుము. అని ప్రతిమ నొసంగెను.

అవ్వల మహాప్రతిభావంతుఁడగు నవ్విభీషణుఁడు సకలశుభముల నీఁ జాలు నాప్రతిమను బరిగ్రహించి నూటయెనిమిది సంవత్సరములు పూజించి యణిమాదిగుణసంయుతంబగు నజరామరణము నొందెను. తుదకు శ్రీవాసుదేవు కరుణచే లంకారాజ్యమును బొంది సకలభోగముల ననుభవించెను. అని బ్రహ్మ పలుక మును లిట్లు ప్రశ్నించిరి. పితామహా! ఈపరమాద్భుతకథను విన్నంతనే మా కత్యంతవిస్మయము గలిగెను. కావున నం

తవాసుదేవునిజన్మము దుర్లభము. దానిని జక్కఁగా విన(గో రెదము. ఆభగవన్మాహాత్మ్యమును వినుపింపుము. అని మును లడుగ బ్రహ్మ వారల కిట్లు బదులుచెప్పెను.

మునులారా! చక్కని ప్రశ్నముచేసితిరి. బదులు చెప్పుట కు నాకును బరమానంద ముదయించుచున్నయది. సావధా నచిత్తులరై వినుండు. ఆరావణుఁడు నాయొసఁగిన వరములచే గర్వించి కూరాత్ముండై దేవగంధర్వకిన్నరులను, దిక్పాలకులను, మనుష్యులను, మునిసిద్ధులను జయించి పతివ్రతలగు వనితల నెం దఱనో బలవంతముగాఁ గొని తెచ్చెను. లంకానగరంబున నుంచె ను. దానఁ దృప్తినొందక సీతను గొని తేరఁ బ్రయత్నించెను. ఆసీ తాపతియగు శ్రీరామచంద్రుని సువర్ణహరిణవ్యాజమున మోస పుచ్చి సీతను గొనిపోయెను. శ్రీరాముఁడు లక్ష్మణునింగూడి యా గ్రహంబున రావణునిం జంపఁ బూని మహాజవముగల వాలిని దునిమి కిష్కింధారాజ్యమున సుగ్రీవు నభిషిక్తుంజేసి వాలిపు త్రు నంగదుని యువరాజుగాఁ జేసి హనుమన్నలనీలజాంబవత్ప నసగవయగవాక్ష ప్రభృతులగు బలపరాక్రమసమగ్రుల వానరు లంగూడి పయనమై సాగరమును బర్వతములచే బంధించి దాని దాఁటి లంకానగరమును ముట్టడించి దానవులతో మహాఘో రసంగ్రామమును జేసెను. ప్రహస్తుని, నికుంభుని, కుంభుని, నరాం తక, మహాంతకులు లోనగువారల వధించి యింద్రజిత్తును దు నిమి, కుంభకర్ణుని యమసదనమునకుం బనిపి, రావణుని దేవత

లలరారఁ ద్రుంచెను. అగ్నిపరిశుద్ధురా లగు వైదేహిని గ్రహించి లంకారాజ్యమున విభీషణు నభిషిక్తుం జేసెను.

అంతఁ బుష్పకవిమానమున శ్రీవాసుదేవప్రతిమ నునిచి వైదేహిం గూడి తా నధిష్ఠించి యిక్ష్వాకువంశభవసంపరిపాలితం బగు నయోధ్యాపురంబుం జేరెను. భరతుని శత్రుఘ్నుని రాజ్యభారమును బూన నియోగించి తా నధిరాజువలె నుండెను. * ఆ ప్రతిమ పురాతనస్వమూర్తియే కాన నద్దానిం బూజించుచుఁ బదునొకండు వేలసంవత్సరములు చతుస్సముద్రముద్రిత భూవలయంబును బాలించి రాజ్యమును బుత్త్రులయం దుంచి స్వగతియనఁదగు వైష్ణవపదమును బ్రవేశింపఁబోవుచు, ఆశ్రీవాసుదేవప్రతిమను సముద్రున కొసంగి సాగరా ! నీవు పరమధన్యుఁడవు. నీనీట నీ ప్రతిమ నుంచెదను. కాపాడుచుండుము.

♦ ద్వాపరయుగమున నేసమయమున జగద్గురువగు భగవంతుఁడు వసుదేవకులమందు భూభారహరణార్థము అవతరించునో సంకర్షణసహాయుండై కంసాదుల వధింప నవతరించిన నాభగవంతునికై సర్వవాంఛాఫలముల నొసంగఁజాలి, శుభ

---

* పురాతనీం స్వమూర్తిం చ సమారాధ్య తతో హరిః, దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ. భుక్త్వా సాగరపర్యంతాం మేదినీం స తు రాఘవః. అని మూ. బ్రహ్మ. ౬౭ అధ్యా. ౬౦ శ్లో.

♦ ద్వాపరం యుగమాసాద్య యదా దేవో జగద్గురుః, ధరణ్యాశ్చానురోధేన భావశైథిల్యకారణాత్, అవతీర్ణస్స భగవాన్ వసుదేవకులే ప్రభుః. అని మూ. ౬౩. శ్లో.

లక్షణములఁ దనరారు నీప్రతిమను సర్వలోకహితార్థమై యొకానొక కారణాంతరమున భక్తజనకల్పతరు వనం జను శ్రీపురుషోత్తమక్షేత్రమునకు నీటినుండి వెడలించి యొసంగుము. అదిమొద లాక్షేత్రము ముక్తిప్రదం బగుచు నుండఁగలదు. అని పలికి శ్రీరామమూర్తి స్వపదమునకుం బోయెను.

మునులారా! సముద్రము ఆప్రతిమను ఆపురుషోత్తమక్షేత్రమున నుంచినదిమొద లాక్షేత్రమున నాప్రతిమ దేవశిలయాత్రిం బావుచు భక్తుల కెల్ల వాంఛల నొసంగుచు, నందే యుండును. ఆయనంతు నేభక్తు లాశ్రయింతురో వాఙ్మనఃకర్మములఁ బరిశుద్ధులై యేజను లారాధింతురో, వారు ముక్తి నొందుదురు. అనంతు నొకపర్యాయము దర్శించి పూజించి నమస్కరించినచో రాజసూయాశ్వమేధఫలమును దశగుణితము చేసిన నెంత యగునో యంతపుణ్యము నొందుదురు.

ఆప్రతిమారాధనమున విమానము నెక్కి యప్సరోగణములు కొలువ సిద్ధగంధర్వులు కీర్తింప విష్ణుపురము నొందనగు. చిరకాల మందుండి పుణ్యశేషమున వేదచతుష్టయధారి యగు ద్విజుఁడుగ నవతరించును. వైష్ణవయోగమున మరల ముక్తినొందును. మునులారా! ఈరీతి శ్రీవాసుదేవప్రతిమామహిమము మీకు నెఱింగించితి. తెలిసినంతవట్టు మీకుం దెల్పితి. తద్గుణముల నన్నింటిని వర్ణింప నేరికి శక్యమగును? అనుడు మహర్షులు పరమానందము నొందిరి.

పాఠకులారా ! శ్రీవాసుదేవప్రతిమామహిమమును వింటిరిగదా. శ్రీరామావతారమునకు ముందే వాసుదేవ శబ్దము భగవన్నామములఁ గల దనుట దీనిచే స్పష్టమాయె. *ఇంతవఱకు శ్రీకృష్ణవాసుదేవశబ్దములు ద్వాపరయుగమునుండి వచ్చినవి కావనియు నవి పురాతనభగవన్నామాంతర్భూతము లనియు సిద్ధాంతము చేయఁబడినది. పురుషోత్తమక్షేత్రమహిమము వర్ణించుట కిదియే ఫలము. దీనిచేఁ బ్రతిమారాధనము నిష్ఫలమనునది కువాదము గదా యని గ్రహింపవలయు. భగవంతుఁడు కూడ లోకులకు నుపదేశించుటకై తనను దానే పూజించుకొనుచుండును. మూర్త్యంతర మాపరమపురుషున కర్చింపఁదగినదియుండునా ? సర్వాంతర్యామి గదా పరమేశ్వరుఁడు. భగవంతుఁడు తెలివిమాలి తన్నుఁదాఁ బూజించుకొనునా యన్నమాట నీతిబాహ్యము. తాఁజేసిన నోరులు తన్మార్గము ననుసరింతురనియే భగవంతునిభావము. ఈభావమే భగవద్గీతలయందు

శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే.

అన్న శ్లోకమునఁ జెప్పఁబడినది. భగవంతుని సర్వాంతర్యామినిగఁ జూడఁజాలినమహాత్ములు కూడఁ దమకంటె జ్ఞానమున

---

* కృషిర్భూవాచక శ్శబ్దో న శ్చ నిర్వృతివాచకః, పూర్ణానందం పరం బ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే. అని భాగవతవ్యాఖ్య.

నల్పులుగా నుండువారలకు మార్గదర్శకముగా భగవంతుని ప్రతిమల నారాధింతురు. లోకుల సన్మార్గప్రవర్తకులనుగా నొన రించుటకంటెఁ జేయవలసినపని యింకొకటి యుండదు. శ్రీకృష్ణబలరాముల కభేద మనియు దీనఁ దేలినదికదా. అనంతుఁ డన నాదిశేషువు గాదు. ఇట్టి శ్రీమహావిష్ణువే యని తేలినది ఇట్టి మహత్తరవిషయములఁ దెలుపు నీకథాజాలము అనవస రముగా నేల వ్రాయఁబడినదని యేభక్తుఁడును దలంపఁ డని నాదృఢవిశ్వాసము. భక్తజను లందఱట్టి విశ్వాసముకలవా రనియే నమ్ముచున్నాఁడను.

క్షేత్రములు, తీర్థములు, పుణ్యనదులు, సాగరములు, పర్వతములు, పుణ్యవృక్షములు భక్తజనుల కుపకారము చేయుచు మనశ్శుద్ధిని గలిగించునని నమ్మవలయును. అందు భగ వత్కళ విశేషించి వెలయుచున్న దని యెంచవలయు. వాని యాధారముననే ప్రపంచ మున్నది. భగవదాధారము ప్రపం చము. తదాశ్రయమున భగవంతుఁడు ప్రపంచమున కుపకరించు చున్నాఁ డని యెఱుంగుటయే భక్తునికృత్యము. అదియే తరణోపాయము. మహాత్ములారా! శ్రీకృష్ణావతారమును వినఁగోరు మిమ్ము అవాంతరగాథలం జెప్పి విసిగించితిని గాఁబోలు. మీా రట్లు తలంపరుగాని నాయాత్మ యట్టియవకాశము నా కపుడపు డిచ్చుచుండును. ఏలాటి యపరాధము లున్నను సహించి కథను వినుఁడు.

ఇంతట నీవిషయ ముజ్జగించి ప్రస్తుత ప్రస్తావనకును వచ్చుచున్నాఁడను. ఇంతకుముందే భగవదవతారమునకు సహాయము చేయఁబూని యవతరించిన దేవతలఁ దెల్పి యుంటిని. ఇపుడు గర్దభాసురవృత్తాంతము తెలుపక తప్పదు. ఈసందడిలో ఉషాకన్య జన్మవృత్తాంతము తెలియఁబడును. ఈకథనుండి పెక్కు నీతులు బయలుపడును. కాన సావధానముగాఁ బాఠకులు దీనిం జదువవలయును. ఇది నారదనారాయణసంవాద రూపముగ నుండును.

{ బలిపుత్త్రుఁడు గర్ధభాసురుం డగుట, తిలోత్తమ ఉషాకన్యక యగుట. }

* మున్నొకపరి నారదముని నారాయణు సందర్శించి సంభాషించుచుండి భగవంతుం గాంచి మహానుభావా! కరుణాక్షీరసాగరా! భవదీయపాదపంకజరతచిత్తద్విరేఫుం డగు బలిచక్రవర్తి లోకవిఖ్యాతచరిత్త్రుండు గదా. ఆతనిపుత్త్రుం డగు సాహసికుం డేల గర్దభాసురుండుగఁ బుట్టెనో తెలుపుమా. దుర్వాసుఁ డేల యాదానవాధిపతిని శపించెను? మరల నేపుణ్యంబున నాసాహసికుండు శ్రీహరిపదమును, ఏకత్వ ముక్తిని గాంచెను? ఈవిషయమును విస్తరించి వచింపుము. శ్రీనారాయణా! కవిముఖమునందుఁ గావ్యము నూత్నత

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండమున నిరువదిమూఁడవయధ్యాయము నుండి సంగ్రహింపఁబడినది.

ము౦బై వెలయుఁగాదే. అన విని శ్రీమన్నారాయణుండు నారదమునిం గాంచి యిట్లు పలికెను.

మునీంద్రా! వత్సా! నీప్రశ్నమునకు హితమగు పురాతనేతిహాసమును వచింతు. అది గంధమాదనపర్వతమున ధర్మ ముఖముఃనుండి వినఁబడినదియే. అది పాద్మకల్పవృత్తాంత మగుట విచిత్రమును మనోహరము నై యుండును నారాయణ కథోపేతంబు గాన నుత్తమకర్ణ పీయూషము నగు.

నారదా! ఏకల్పమున నీవృత్తాంతము జరగెనో యప్పుడు నీ వుపబర్హణనామధారివై యుంటివి. ఆకల్పజీవివి. సకలైశ్వర్యసమృద్ధుఁడవు. సుందరాకారుఁడవు. స్థిరయౌవనవిరాజితుఁడవు. నీ కిరువదేఁబదిమంది భార్య లుండిరి. శృంగారతత్పరత్వము గలవాఁడవై యుంటివి. బ్రహ్మదత్తవర ప్రభావమున సంగీతపండితేశ్వరుఁడ వై సుకంఠబిరుదనామధేయంబుఁ దాల్చితివి. నీభార్య లేఁబదిమందియుఁ బ్రతిక్షణము నిన్నెడఁబాయక నీముఖపంకజము నాస్వాదించుచుండిరి. వారు కామబాణప్రపీడితలు గాక యొకక్షణమైన నిల్వఁజాలకుండిరి. బ్రహ్మ యాకాంతలకుఁ బ్రాణము నీవే యని నిర్మించెను. అన్యాఖ్యాతి లోకమున వెలసియుండెను. రేయింబవళ్లు నిన్నుంగూడియే చరించుచు, నీయెడఁబాటు గలిగిన జీవింప మను భావమున నాకాంత లుండిరి.

పుష్పోద్యానంబున రహస్యగోష్ఠ లయందును, మనోహరమగు ప్రతిష్ఠానమందును, గిరిగహ్వరములయందును బర్వత కందరములయందును నదులయందును, రమ్యకాననములందును, * జంతువర్జితశ్మశానములందును వారిష్టానుసారము నినుం గూడి విహరించుచుండిరి.

ఇట్లు కొంతకాలము జరుగఁగా విధివశమున విధిశాపమున దాసీపుత్రుఁడ వైతివి. అపుడు వైష్ణవోచ్ఛిష్టభోజనము నొనరించినకతన నిపుడు బ్రహ్మపుత్రుఁడ వైతివి. అసంఖ్యకల్పజీవివి, వైష్ణవప్రవరుండవు నైతివి. జ్ఞానదృష్టి నొందఁజాలితివి. ఈశ్వరప్రీతిపాత్రుఁడవు గూడ నైతివి. ఇఁక నాకల్పవృత్తాంతమును జెప్పెద నాలకింపుము. దైత్యవృత్తాంతమును విస్తరించి యమృతోపమానమగు కథను జెప్పెదను.

ఒకానొకప్పుడు బలిపుత్రుఁడు సాహసికుఁ డను పేరును దాల్చి స్వతేజమున దేవతల నోడించి గంధమాధనంబునకుం బోయెను. అందుఁ జందనచర్చావిభూషితగాత్రుఁడై రత్నభూషణముల ధరించి రత్నమయపీఠమునఁ గూరుచుండి బహుసైనికులు పరివేష్టింప, స్వేచ్ఛగా నుండెను. ఇంతలోఁ దిలోత్తమయను నచ్చరమిన్న యెట్టకో పోవుచుండెను. రూపమే యీమె యప్సరశ్రేష్ఠ యని తప్పక చెప్పుచుండెను. క్షణవిలక్షణ

* కాననేషు చ రమ్యేషు శ్మశానే జంతువర్జితే. అని మూ. ౧౦. శ్లో.

భూషణము లామెమేన నలరుచుండెను. దేహము చారుచంపకకుసుమవర్ణమున నమర, నానారత్నభూషణములు వెలయ నవయౌవనము విలసిల్లఁ, గామశరపీడితాత్మహృదయము గల్గుట బయల్పడ, సుస్మితము మోమునఁ జిందులాడ దివ్య వస్త్రమును దాల్చి వక్రభ్రూభంగము కనంబడ, గజరాజలీలాగమన మొప్పులకుప్ప యయి కనుపండువు సేయ నాతిలోత్తమ యొటకో చనుచుండెను.

తదీయకామజనకాంగదర్శనముచేఁ బ్రాయమున విఱ్ఱవీఁగు నాసాహసికుఁడు వాయువిధూతవసనయౌట మిగుల మోహమును గల్పించు నాసుదతిం గాంచి యట్టె మూర్ఛిల్లెను.

ఆతిలోత్తమయు నతిశయమనోహరాకారుఁడై తగు బలిపుత్రుని సాహసికునిం గాంచెను. ప్రఫుల్లమాలతీమాలా విభూషితుఁడై, నవయౌవనం బమరియుండ, శరత్పార్వణ శీతాంశువక్త్రము విస్మయంబు గల్పింప, సుస్మితంబు చెలువార నొప్పులరాశియై కనుపట్టునాధిట్టంజూచి విస్మితయై తనంతన కటాక్షవీక్షణము నాతనిపయి వెలయించెను. తిలోత్తమ యపుడు క్రీడార్థము చంద్రలోకమున కేగుచుండెను. చంద్రునిం గోరుచుండెను. శృంగారలాలసయగు నాబాలామణి యేవో వచింపరానిభావములచే నిలువంబడెను. సాహసికుని మోముం గుటిలదృష్టిం జూచిచూచి నవ్వెను. ఆయన్నులమిన్న మరల మరలఁ దన మోమును వస్త్రమున నాచ్ఛాదించుకొనెను. ఆమె

తనూలతిక యపుడు పులకాంచితయై ధర్మకర్మసమన్వితయై యుండుటంజేసి యామె మోహపరవశ యయ్యెను.

అట్టితఱి నాతిలోత్తమ శశాంకుని మఱచెను. బలిపుత్రుని పై మది నిలిపెను. ఓహో! భువనమున నెవ్వఁడైనఁ బుంశ్చలీ చిత్తవృత్తి నెఱుఁగఁ గలఁడనుట కల్ల. ఎవడైనఁ బుంశ్చలియందు విశ్వాసముంచెనా యాతఁడు విధిచే వంచింపఁబడినవాఁడే యగు. కీర్తి యతని బహిష్కరించును. ధర్మము వాని మోమును జూడ నోడును. స్వకులము వానిఁ దఱిమి వేయును. పుంశ్చలి నూతన వాంఛితమును మది నిలిపి పురాతన ప్రియుని మఱచును. ప్రాతకోటి తలంపదు. స్వకార్యధురంధరురాలగు నాకులట కొకఁడు ప్రియుఁడని, యొకఁడప్రియుఁడని భేదము లేదు. దైవపితృకర్మములందును, పుత్రునందును, బంధువునందును, తుదకు భర్తయందును బరవాంఛ గలిగినతఱిఁ గులటాచిత్తము దారుణమగు. దుశ్చరితయగు నావనిత రతిజ్ఞునిఁ బ్రాణాధికునిగా నమృతదృష్టిని వీక్షించును. రత్నపరీక్షావిదుఁడై రత్నముల నొసంగువాఁడైనను రతిజ్ఞుఁడు కాఁడేని వానిని విషదృష్టి నిరీక్షించును. అందఱకు విశ్వాసమండపములఁ జోటు గలదు గాని కులటావని తలకు మాత్రము చోటు లేదు. నరఘాతికులములయందుఁ గులటలజాతి దారుణమైనది. ఎల్లరకు సర్వభోగంబుల తుది నిష్కృతి గలదు. పుంశ్చలులకు సూర్యుఁడు చంద్రుఁడుండుదాఁక నిష్కృతి లేదని తెలియఁదగు. కులేతరవనితలు కీటమును జంపినంత

ప్రయత్నమునఁ గులటలు పురాతనప్రియుని వధింతురు. రతిలంప టుఁడగు నూతనప్రియునియందుఁ జేరి యుపమచేత విలాసమా త్రముగఁ బురాతనప్రియుఁడు కాంతుఁడైనను విషతుల్యునిగ భావించి హింసింతురు. భగతఖండమున నెన్ని పాపములు గలవో యవి యన్నియుఁ గులటలయందే యుండును. వారికంటె బాపి ష్ఠులు లోకమున లేనేలేరు. పుంశ్చలి వండిన యన్నము సర్వపా తకసారము గలది. కాన దానిని దేవపితృకృత్యములయం దుప యోగింపరాదు. జలంబును స్పృశింపరాదు. కులట వండినయ న్నము మేధ్యేతరము. అది స్పృశించినజలము మూత్రతుల్య ము. అట్టిదానిని బితృదేవతల కొసంగినను, దా భక్షించినను నరుఁడు నరకము నొందును. అట్లుగాక పై కార్యములయం దాయన్నము నుపయోగించువాఁడు శతవర్షంబులు కాలసూత్ర నరకంబునం బడి భయంకర బాధలం బొందు. ఘోరాంధకా రమున రేయింబవళ్లు వానిని బురువులు కఱచుచుండు. ఏనరుఁ డు దైవాదికృత్యములయందుఁ బుంశ్చల్యన్నమును భుజించునో యతఁడు సప్తజన్మకృతసుకృతరాశిని బోఁగొట్టుకొని నరాధ ముం డనంబడు. ఇది నిశ్చయము. అంతియకాక యప్పురుషుని యాయుశ్శ్రీయశస్సులు వినాశమునొందు. పరలోకమున నాతనికిఁ బవిత్రస్థానము లేదు. * కానఁ బ్రయత్నపూర్వకముగ

---

* తస్మాద్యత్నాద్రక్షణీయం పాకపాత్రం కళత్రకమ్. అని మూ. ౪౦ శ్లో.

పాకపాత్రమగుకళత్రమును జక్కఁగా రక్షించుకొనవలయును. పుంశ్చలీదర్శనము చేసినచోఁ బుణ్యక్షేత్రయాత్ర యొనరింపవలయు. దాన బుణ్యము లభించును. దాని స్పృశించినచో మహాపాపము గలుగును. అది తీర్థస్నానమున నశించు. స్నానదాన జప హోమ దేవతాపూజనములు కులటలకు నిష్ఫలములు. వారు లోకోత్తరమగు భారతభూతలంబునఁ బుట్టియు వ్యర్థమే. నారదా! కులటావృత్తాంతము దెలిసికొన నెట్టులును సాధ్యము కాదు. యథాగమముగా వివరించితిని. ఇఁకఁ దిలోత్తమాసాహసికులసంవాదం బెఱింగింతు. ఆలకింపుము.

అట్లు సాహసికుఁడు మూర్ఛిల్లి యెట్లో లబ్ధసంజ్ఞుఁడై మరల నాతిలోత్తమం గనుంగొని కామాతురుండై ప్రమత్తుఁడై దానిచెంతకుం బోయెను. కుటిలాపాంగియై పీవరశ్రోణీపయోధరయై లజ్జచే నంబరమున ముఖము నాచ్ఛాదించుకొని ప్రమదమునఁ జూచుచుఁ జూడనట్లుండిన యాకులటతో సాహసికుఁడు మెల్లగా నిట్లనియె. అబలా! నీ వెవ్వతవు? ఎవ్వనిపుత్రివి? ఎవ్వనిభార్యవు? స్వేచ్ఛగా నేపుణ్యవంతుని మనోహరునిం గోరి యెచ్చటి కేగుచున్నదానవు? కల్పాంతమునఁ దపఃఫలమును నిన్నుఁ గూడిగదా యనుభవింతురు. అట్టిపుణ్యవంతులలో నేధన్యుం గోరిపోవుచున్నదానవు? అట్టి నీవు నన్ను దాసునిగా నంగీకరింపుము. రతిలోలుపుఁడనగు నన్ను రతిపుణ్యముచేఁ గొనుము. నీవును శృంగారలోలుపురాలవు గదా. నన్ను విక్రయించుకొని దానికి మూల్యముగా శృంగార మొసఁగుము. విధి నీతోడి

యాశ్లేషసుఖ మనుభవింప నన్నుఁ బుట్టించెను. తదాజ్ఞ నివారింప నేరితరము? సుందరీ! అమృతతుల్యమగు సుస్మితోక్తిని బలుకుమా. ఈ నిర్జనస్థలమున నతివేగంబ భుజలతాపాశముల నామేను బంధింపుమా. కల్యాణీ! నీవినిర్మలోరుభాగంబునఁ గూర్చుండఁ దా విమ్ము. అది కనకసన్నిభముగదా. వక్షోజమండలకుంభమును గనఁ బఱపుమా. అది పాత్రభూతము గదా. తీవ్రాస్త్ర ప్రతిమ మగుకటాక్షంబున నామనసు జర్జరితముగ నొనరింపుమా. కామసర్పక్షతంబులను బాదస్పర్శనముననీరోగముగ నొనర్పుమా. క్షుధితుఁడ నగు నాకు నీమోవిసుధ నొసంగి దప్పి తీర్పుము. అది సుస్వాదువు గదా. పరిపక్వదాడిమీబీజసదృశదంతముల వెలువరించి మాటలాడుమా. అది సుందరము గదా. త్రివళియగు గంభీరనాభిని సందర్శింపఁ గోరుచున్నాఁడను. అని యిట్లెన్నియోచందబుల వేఁడెను.

తిలోత్తమయు మిగుల విన్నఁదనంబునఁ దన్ను వేఁడుచున్న యాసాహసికునిం గాంచి తానును స్మరాతుర గాన నిట్లు పలికెను. అంతలోనే యతని స్మరార్తునిగ నిశ్చయించుకొనెను. తదీయమానసక్షోభము గావింపఁ దలంపు గొనియె. నాథా! యని సంబోధించుచుఁ దదీయమనస్సు మహానందాంబుధి మునుంగ నిట్లు చెప్పఁబూనెను. కామినీగణమునకు నీవంటిమహీపతి కోరఁదగినవాఁడు కదా. నీవు బలిచక్రవర్తిపుత్రుఁడవు. ధర్మిష్ఠుఁడవు. రూపవంతుఁడవు. సుగుణశాలివి. ప్రాయమున

విఱ్ఱవీఁగువాఁడవు. ఇంతియగాక శృంగారనిపుణుండవు. మనోహరిదర్శనుఁడవు. ఇన్నింటికి మెఱుఁగుపెట్టఁజాలు కామశాస్త్రమునఁ గోవిదుండవు. కావున సదా కామినులకు మనోహరుండ వనుటకు శంకయే లేదు. స్వభావమున సువేషుఁడవు. సువేషుని, సుందరునిఁ, గాంతుని, దాంతుని, అరోగిని, శృంగారజ్ఞుని, గుణజ్ఞుని, తరుణుని, రసికుని, బలశుద్ధుని, స్త్రీమనోహరుని, దయాళువును, బలిష్ఠుని, ప్రభువును, సత్పురుషుని, దాతను, అనురక్తుని నిన్నుఁ గామిని యెవ్వతుకయైనను భర్తగాఁ గోరు ననుట కేశంకలు లేవు. పైఁ బేరుకొన్న గుణము లన్నియు నీయందుఁ గలవు. ఇది నిక్కము. మనోహరాకారా! ఇట్టి నిన్నుఁ గోరని కాంతలు అవిజ్ఞాతలు, విధిచే వంచితలు నగుదురు. ప్రియుఁడా, నేను జంద్రగృహమునుండి మరలి వచ్చి నీకు సంతోషమును గల్గింతును. ఈవేషము చంద్రునిసంతోష పరవశుం జేయుటకే ధరించి వెడలుచున్నదానను. అతని కిపుడు నేఁ గామినిని. ఇట్టి నే నిపు డన్యాశ్లేషసమాదృతిం గాంతునేని ధర్మలంఘనమొనరించినదాన నగుదును. ఏవనితలు ధర్మమునుండి తమ్ము రక్షించుకొనరో వారిజీవనము వృథా యనవలయు. చంద్రాశ్లేషసుఖము నపేక్షింపనికాంతలు మూఢచిత్త లనఁదగువారే. అట్టివారు మాతృగర్భమున నుండువారలే. ప్రాజ్ఞలుగారు. పౌరుషరసముల నెఱుంగరు. స్వర్వైద్యులు, మదనుఁడు, చంద్రుఁడు, శచీసతియు, నలకూబరుఁడు ననువీరి నాలింగన

ము చేసికొనని కాంతలు విధివంచితలే యగుదురు. రతికర్తృవం చితలును నగుదురు. దివానిశములు నాచిత్తము తదాయత్తము యియే యుండును. విశేషించి యిందుఁ గామదేవుఁడు రతికర్తృ పండితుఁడు. చంద్రశృంగారసమాశ్లేషములు అమృతోపమాన ములు. మఱియు నమృతముకన్న నధికము లనవలయును. నేఁడు శీతాంశురతిదినము. కాన నామది యాతని స్మరించుచున్న యది.

అని యిట్లు తిలోత్తమ పలుక విని బలినాదనుఁడు సాహసికుఁడు పక్కున నవ్వెను. సకాముఁడై పులకాంచితస ర్వాంగుఁడై రహస్థ్సలమునందు నిట్లు బదులు చెప్పెను. తిలో త్తిమా! కాంతామణీ! సృష్టికర్త నిన్నుఁ గౌతుకంబున నిర్మిం చెను. కాన నీవు అచ్చరలలో శ్రేష్ఠురాలవు. విదగ్ధరసికేశ్వ రివి. సుందోపసుందులను క్రూరరాక్షసుల నిర్మూలించుపొంటెఁ బ్రయత్నపూర్వకముగా విధి నిన్ను సృజించెను. కాఁబట్టి సర్వ రూపగుణాధారవు నీవే యగుదువు. సర్వజ్ఞురాలవు. నీవెఱుం గని విషయములు లేవు. విశేషించి రతక్రియయందు నిపుణు రాలవు. పరమానందంబున నిన్ను వేఁడుచున్నాఁడను. నీమన సునఁ గల వచనమును వెల్లడింపుము. నీకత్యంతప్రియుఁ డెవఁ డు? ఆతనిస్వభావ మెట్లుండఁదగు? అవశ్యము రహస్యమైనను దెలియంబలుకుము. గంధర్వులకు. దేవతలకు, రాజులకుఁ, బుణ్యాత్ములకు వారు వీరన నేల యెల్లరకు నీవు ప్రాణతుల్యవు.

ఎవరియందు నీ కిష్టము గలదు? అత్యంతప్రియుఁ డిం దెవ్వఁడు నీ కగు? అని ప్రార్థించెను.

తిలోత్తమయు నాయసురరాజతనయునివాక్కులను విని నవ్వి యతనివక్రదృష్టి వీక్షించి వస్త్రాంచలంబున ముఖము నాచ్ఛాదించుకొని సత్యమై సారభూతమై, యంతఃకరణమున వెలసి, గోప్యమునగు మానసంబును వెలువరించుపలుకుల నిట్లు లనెను. ఆవాక్కు విద్వాంసులకుంగూడఁ దెలియరానియంత గూఢార్థము గలదియే యగు. సాహసికా! దానవేంద్రతనయా! పుంశ్చలీమనోవాంఛితమును వచింపఁ దగినదియే. అది స్త్రీజాతి కెల్ల నుపహాసకరంబే యగు. వినుము. యోషిచ్చరిత మిట్టిదని యెవ్వ రెఱుఁగఁగలరు? అందును విశేషించి పుంశ్చలీచరితము దుర్జ్ఞేయంబే యనఁదగును. పండితుఁడు వేదవేదాంగములయు, శాస్త్రములయు నభిప్రాయం బెల్ల నెఱుంగఁగలఁడు. కాని యచ్చరమున్నలయాశయము నుంతయు నెఱుఁగఁజాలఁడు. మాజాతిభామలకు వృద్ధు విషమునకంటె నప్రియుఁడగు. రత్నముల కన్న విషమును భావమును గల్గింపఁజాలును. సర్వస్వహర్తయైనను, ప్రాయపుఁబురుషుఁడు ప్రాణములకంటెఁ బ్రియతముఁ డగు. కులట తరుణుఁడై, సుందరుఁడు నగుపురుషునిం గాంచిన నార్తురాలగు. ఇఁక విశేషించి సువేషభూషితుండైనచో హతచేతనయే యగు. అట్టి పురుషుఁడు కానఁబడిన నిమేషరహితలోచనయై తన్ముఖ

చంద్రామృతధారల గ్రోలుచుండును. అట్టితఱి నాయన్నులమి న్నకు గామజలము ద్రవించును. మనస్సు చలించును. ధైర్య ము విలోలంబగు. సర్వాంగములు వణఁకుచుండును. శరీరము జ డీభూతమ్మగు. అంతియగాక మదనానలంబునఁ దనువు దగ్ధంబ గు. అట్టి ప్రియుండు రహస్థలంబునఁ దారసిల్లెనేని సరసాలా పముల నాతనిం దేల్చును. సకటాక్షమ్మగు స్మేరవక్త్రము మ రలమరలఁ గనఁబఱచి పలుకరించును. అంతమాత్రమున నతఁ డు వశంగతుఁడు కాక జితేంద్రియుఁడైనట్లు తోఁచెనేని స్వ దేహము నగపఱచి మనోగతమును స్పష్టముగఁ దెలుపు. నాయ కుఁడు దుస్సాధ్యుఁ డయ్యెనేని వనితామణిదుఃఖ మింతింతనరా దు. అట్టివానికంటె నధికలావణ్యవిరాజితుఁ డగు నాయకుం డొదవె నేని, పుంశ్చలి మొదటివాని మఱచు. లోకమునఁ బుం శ్చలికిఁ బ్రియుఁ డని యప్రియుఁ డని యొక్కఁడును లేఁడు. ఎ వ్వఁ డతిశయశృంగారనిపుణుఁడో యతఁడే ప్రాణాధికుఁడుగఁ గు లటకుఁ దోఁచు. కామశాస్త్రవిశారదుం డగు నూతనప్రియుఁ డొదవునేని అంతకుఁ బూర్వ మాదృతింజూచువానిని, బతిపుత్ర భ్రాతలను దండ్రిని వదలివేయును. కులట దానమానసత్కారస్తవ ముల, నుపకారమునఁ బ్రీతురాలు గాదు. సుఖము గల్గించుట చేతనే ప్రీతురా లగును. శయనకాలమందు భోజనము సేయు తఱి, స్వప్నమునందు, జ్ఞానమునందు, రేయింబవళ్లు కులటలు పరపురుషాశ్లేషములనే స్మరింతురు. శృంగారనిపుణు లగుపురుషు

లకుఁ బుంశ్చలి చిరకాలధ్యానసాధ్యురాలగు. కులటాజాతి దారుణస్వరూప యగును. క్రొత్తక్రొత్తపురుషునిఁ గోరుచుండును. పురుషపుంగవా! పుంశ్చలిచరితంబు సర్వం బెఱింగించితి. వచింపఁదగనిది, గోపనీయము నగు నాహృదయగతవచనమును వచించెద నవధరింపుము. నాకుఁ బ్రియతరులగు పురుషులనేకులు త్రిదశులయందును, గంధర్వులయందును గలరు. వారెల్లఁ బ్రాయమున వెలసి, రతిశూరులై, కామశాస్త్రవిశారదులై యుందురు. విశేషించి నాచిత్తము తుహినాంశువునందు విలీనమైయుండు. ఆతనికంటెఁ గాముఁ డధికప్రేమాస్పదుఁడై యుండు. నేఁగోరువారలలో మన్మథునకు నీడగు పురుషుఁడు పుట్టినవారలలో లేఁడు. పుట్టఁబోవువారలలో నుండఁబోఁడు. నామానసము మన్మథునిస్మరించినమాత్రన సుస్నిగ్ధంబగు. సాహసికా! నాదు మనోభావము, పుంశ్చలీచరితంబును సర్వము వచించితిని. ఇఁక నాజ్ఞ దయచేయుము. చంద్రునంతికంబునకుం బోయెదను. శశాంకునికోరికఁ దీర్చి యటనుండి నీచెంత కరుదెంతు. ఇదిసత్యము. నీమనోవాంఛితము నెఱవేర్చెద. సంశయింపఁ బనిలేదు.

అని. తిలోత్తమ మనస్సుకరగునట్లు సుషమోక్తులఁ బలుక బలినందనుఁడు సాహసికుఁడు విని పక్కున నవ్వెను. కుటిలదృష్టి నాయన్నులమిన్నయు నాసాహసికునిం జూచి నవ్వి స్మరాతుర యయ్యెను. ఒకానొకచలమునఁ బాలిండ్లం గనఁబఱచెను. కఠినతరశ్రోణీసందర్శన మొనఁగూడఁ జేసెను. సకటాక్షమగు

స్మేరముఖమును, బులకాంచితంబగు కపోలభాగమును గనఁబఱచెను. ఆచోటు రహస్స్థలమగుటచేతను, మన్మథుఁడు మనసున నిలిచి బాధించుచుంటను బులకాంచితసర్వాంగియై, యాసాహసికుని మోముదమ్మిని లోచనంబులఁ దృప్తిమీఱఁ బానముచేసెను. ఆతనిరూపమును వేషమును బలుమాఱులు చూచి చూచి మనోభావం బుట్టిపడ సూక్ష్మవసనంబుచే మోముఁ గప్పుకొనియెను.

ఇట్లత్యంతకాముకురాలయి, తన్నుం దనివిమీఱఁ గాంచు నాచంచలాక్షిం గాంచి ప్రాజ్ఞతముఁడగు నాసాహసికుఁడు, తాఁ గాముకుం డౌటఁ గాముకులభావ మామెనుండి తెలిసికొనఁగోరి యిట్లు ప్రశ్నించెను. ఓపంకజలోచనా! నన్నేమి చేయఁగోరితివో సత్యము వచింపుము. చిరకాల మిట నుండఁజాలను. కార్యాంతరమునఁ బోవ నుద్దేశించినవాఁడఁ జుమీ. ధార్మికులగు పూరుషులకుఁ గామినుల నిర్బంధింపఁ జూచుట ధర్మవిరుద్ధము. విశేషించి ప్రాజ్ఞులును ధార్మికులు నగు మావంటివారికది చేయరానిపని యని యే నెఱుంగుదు. ఇది మాకులోచిత వ్యాపారము గాదు. నాకోరికను దీర్పుము. కాదేని నీయిచ్చఁ బొమ్ము. నీవు కోరినపురుషునివాంఛితమునే తీర్పుము. బహుపురుషగామిని యగు పుంశ్చలి నెవఁడు వశంగతురాలినిగఁ జేసికొనఁగలఁడు? అని యూరకుండెను.

దానవేశ్వర ప్రియనందనువాక్యంబులనాలకించి యాసుదతి శుష్కకంఠోష్ఠతాలుకయై తన్ను నిందించుకొనుచు, స్మరాస్త్ర సంతాపము నోర్వఁజాలక యిట్లు పలికెను. ఓకాంతుఁడా! నీవు నాకుఁ బ్రాణాధికుఁడవు. ఇట్టి నీ విట్లు మాటలాడఁ జనునే, ఏల కోపయుక్తుఁడవైతివి? నీకోరికఁ దీర్చుకొనుము. ఇట్టి నిన్ను విముఖునిగ నొనరించి చంద్రాంతికంబునకుం బోదు నేని నీశాపంబున నచ్చట నేదియే విఘ్నము ఘటిల్లకపోదు. ననుఁ గూడి విహరింపుము. శ్రీహరి స్వయముగా నీకు శుభము లొనఁగూర్పఁగలఁడు. ఎవఁడు నారీమానరక్షణము సేయునో యామహాత్మునకుఁ బ్రతిక్షణము సుఖసంపద లొడఁగూడును. ఏపురుషాధముఁడు నారీజనము నవమానించి పోవునో, యతనికి హిమాలయాత్మజ పతివ్రతాశిరోమణి మూలప్రకృతి ప్రతిక్షణముసందశుభములు గల్గఁజేయును అనియెను.

ఇట్లు తిలోత్తమ మానస మట్లె ద్రవింపఁ బలుకఁగా బలిసూనుఁడు నవ్వి కామశాస్త్రవిశారదుఁడు గానఁ దద్భావము నెఱింగెను. భావజ్ఞుఁ డౌట దానిమనోభావము నిదమిత్థమని తెలిసికొని తత్పాణిపంకజమును జేనందుకొని సమాశ్లేషసుఖ మనుభవించెను. ఆమెంగూడియే గంధమాదనమునకుం బోయెను. అందు జంతువివర్జితమ్మగు నొక సురుచిరస్థానమును గాంచెను. రత్నదీపముల విలసిల్లుచుఁ గస్తూరికాపరిమళముల ధూపము వేసిన ట్లొప్పుచు, రతిమోదము నొసఁగఁ జాలున ట్లున్నయందు

శయ్య నమర్చుకొని బహువిధశృంగారక్రీడలం దేలెను. తిలో
త్తమయు నాతని నిర్జరులకంటె నధికునిగా భావించెను. సాహ
సికా! నీవంటి నవరసికుని నెందుఁగాంచగల నని వినుతించెను.
రూప మప్రతిమానము. గుణము వన్నె కెక్కినది. కాన నీవు
శృంగారనిపుణుఁడవు. త్వత్సముఁ డెందుఁ గలఁ డని పొగ
డెను. బహువిధశృంగార చేష్టలచే నొడలు మఱచి యాతని నెద
నిడుకొనియుండెను. సాహసికుండును దదీయశృంగారచేష్టల
నధిక కాముకుఁడై యష్టవిధశృంగారములచేతను, నవవిధచుంబ
నములచేతను, మఱింత కాముకుఁ డయ్యెను. హవిస్సుచే నగ్ని
మఱింత ప్రజ్వరిల్లునట్లు రతిశాస్త్రప్రోక్తశృంగారచేష్టలచేఁ బ్రతి
క్షణవిలక్షణకాముకత్వ మలరార నాసాహసికుఁడు శృంగార
శేఖరుఁ డయ్యెను. విపరీతరతిలాలసతచేఁ గరకంకణకింకిణీజాల
నినాదము వృద్ధినొందెను.

ఆచెంత మహాముని దుర్వాసుఁడు నియతిమైఁ దపం
బొనరించుచుండెను. ఈనినాద మామహామునిధ్యానభంగ
మొనరింపఁజాలెను. ఆముని వల్మీకాచ్ఛాదితదేహుండై యుం
ట వారికిఁ గనఁబడకయుండెను. మహానియమంబున నమ్మౌని
గంధమాదనపర్వతగహ్వరంబున నివసించి నిరంతరము శ్రీకృష్ణ
పరమాత్మచరణకమలధ్యానపరతంత్రుఁడై యుండ వల్మీక
మొకఁ డాతనితనువు నాశ్రయించి పెరిగెను. కాఁబట్టి

వారికి సమీపమున నాదుర్వాసుఁ డుండినను వారిదృష్టి యా మునిపైఁ బ్రసరింప దయ్యెను. * కామమున మతిచెడి కామ పరవశాత్ములగువారికి జ్ఞానముండునా? ఎన్నటికి నుండదు.

అంత నామహర్షి ధ్యాననియతికి భంగము రాఁగా లౌకి కజ్ఞానము నొంది ప్రజ్వలద్బ్రహ్మచేతస్సుచే లోచనములు తెఱచి వారిం గాంచెను. రేయింబవళ్లు కామమోహితులై యొడ లెఱుంగక సంయోగసుఖపరతంత్రులై యుండుట గనుంగొని యెను. ఆముని రుద్రాంశజనితుఁడు. భగవత్తుల్యుఁడు. ప్రభువు. తేజస్వి. కావున నాస్థితి నున్నవారని తెలిసికొని యాగ్రహించి రక్తాంభోరుహతుల్యలోచనుఁడై విహారాంతము నెఱింగి యిట్లు పలికెను. ఆవాక్కులు ధ్యాననియతిచేఁ బ్రత్యక్షములుగా నున్న శ్రీకృష్ణపదారవిందముల విచ్ఛిత్తిచే నుద్విగ్నమానసుం బుగల వాఁడీముని యని తెలుపుచుండెను.

ఓరీ! గర్దభాకారా! లజ్జావిహీనుఁడా! పురుషాధమా! లెమ్ము లెమ్ము. మహాభక్తాగ్రేసరుఁడగు బలిపుత్రుఁడవు కదా! పశుసముఁడవైతివి. దేవతలు గాని, మానవులు గాని, దైత్యరాక్ష సగంధర్వులు కాని స్వజాతియందు లజ్జను బొందుదురు. పశువు లకు మాత్ర మది లేకయుండును. విశేషించి జ్ఞానలజ్జావిహీనమై నది ఖరజాతి యనఁదగు. కావున దానవశ్రేష్ఠుఁడా! యిపుడు నీ

* "కామార్తస్యనోర్నహి జ్ఞానం కామేన హతచేతసః" అని మూ. ౧౨౨ శ్లో.

నీవుపాపకార్యమును లజ్జావిహీనుఁడవై యొనరించితివి గాన ఖర యోనిం బుట్టుము.

తిలోత్తమా! ఇఁక లెమ్ము. నీవు కులటవు. లజ్జావిహీనవు. ఇట్టి నీకు నిపుడు దైత్యునియందుఁ బ్రీతి గలిగెను. కాన దైత్య యోనిం బుట్టుము. అని వారి నిర్వురను శపించి రోషమున మండుచున్న చందంబునఁ గానఁ బడుచు నూరకుండెను. అంత వా రిర్వురు లజ్జనొంది యామునివర్యుని బెక్కుభంగుల వినుతించిరి. అందు సాహసికుఁడు భక్తిభరితుఁడై కరయుగంబు ముకుళించి యిట్లు ప్రార్థించెను. మునీంద్రా! నీవే బ్రహ్మవు. నీవే విష్ణువవు. ప్రత్యక్షమహేశ్వరుఁడవు కూడ నీవే. హుతాశనుఁడవు నీవే. సూర్యుఁడవు కూడ నీవే. సృష్టిస్థిత్యంతములకు నీవే మూలకారణమవు. కరుణానిధివి. నాయీయజ్ఞానమును క్షమింపుము. కరుణించి నన్నుఁ గాపాడుము. మూఢు లొనగించు నపరాధముల క్షమించువాఁడే పరమేశ్వరుఁ డనంబడు. అని ప్రార్థించి మిక్కుటంబగు క్రూరశాపంబును దలంచుకొని మునిముందఱ బిట్టు రోదనము చేసెను. తృణమును దంతములఁ గఱచుకొని పాదారవిందములపైఁ బడెను.

అవ్వాలఁ దిలోత్తమయు మునీంద్రుం గాంచి యోనాథా! కరుణాసింధూ! దీనబంధూ! నాపై దయ నునుపుమా. బ్రహ్మసృష్టియం దెల్లెడలఁ బరికింప స్త్రీజాతి మూఢత్వము గలది. విశేషించి యందుఁ గుటల యతిమత్తురాలు. అది సదా

కామాతురరయై యుండును. విభూ! కాముకజాతియందు లజ్జా భీతిచేతనము లుండునే. అని పలుకుచు విలపించుచు మహాముని శరణుఁ జొచ్చెను.

* మునులారా! విపత్తులేనిసమయముల నెవ్వరికిని జ్ఞానము కలుగదు కదా. అట్లు వారు ప్రార్థింపఁగా మునితల్లజుండు వారివైకల్యమును దెలిసికొని కరుణానిరతుఁ డయ్యెను. దానఁ గోపము చల్లార నిట్లు పలికెను. దానవరాజనందనా! అతిశాపముగాని, ప్రసాదముగాని దైవమునఁ గలుగును. సత్కీర్తి గాని, యపకీర్తి గాని, ప్రాక్తనకర్మప్రభవత నొప్పుచుండు. నీతండ్రియగు బలిచక్రవర్తి విష్ణుభక్తుఁడు. కాన నీవు సద్వంశ ప్రభవుఁడను. జనకునినుండి నీవు విష్ణుభక్తుఁడవని చెప్పఁ దగుదువు. ఇది నే నెఱుంగుదును. జనకునిస్వభావమే తనయుని యం దుండును. శ్రీకృష్ణపాదాంకము కాలీయభుజంగవంశమున కెల్లఁ గలుగుచున్నది కదా. గర్దభయోనిం బుట్టువుం గాంచుము. వత్సా! నిర్వాణము నొందఁగలవు. పూర్వజన్మకృతశ్రీకృష్ణార్చనఫలము లోపముగానేరదు. బృందారణ్యమును, దాళవనమును జేరుము. వ్రేపల్లియంతికమున నిలువుము. శ్రీహరిచక్రధారచేఁ ద్రుంపఁబడి ప్రాణముల వదలి ముక్తిని బొందఁగలవు. ధ్రువము. అని కరుణించి పలికి తిలోత్తమం జూచి కృపతో ఱం గలింప నిట్లు వచించెను.

---

* "వినా విపత్తౌ కేషాంచిత్ జ్ఞానం భవతి భూతలే" అని మూ.

తిలోత్తమా! భారతవర్షమునకుఁ బోయి బాణాసురునకుఁ బుత్రివి కమ్ము. శ్రీకృష్ణపౌత్రుని ఆశ్లేషముల నలరింపుము. అంతఁ బవిత్రురాల వగుదువు. అని పలికి మౌనమూని దుర్వాసుఁ డుండెను. వా రిరువురు మునిపుంగవునకు నమస్కరించి యథాస్థానమునకుఁ బోయిరి. ఇది గర్దభాసుర వృత్తాంతము; ఉషాకన్యకి పూర్వచరిత్రము. అని భగవంతుఁడు నారాయణమూర్తి నారదునకుం బురాతనేతిహాసమును వచించి యూరకుండెను.

భక్తజనులారా! శ్రీకృష్ణావతారమున భగవంతుని నుండి ముక్తి నొందఁదగు సాహసికునివృత్తాంతమును వింటిరి. తిలోత్తమాచరిత్రమును వింటిరి. దీనినుండి వివిధవిషయములు గ్రహింపఁదగియుండును. ముఖ్యమైనది కులటాచరిత్రము. పుంశ్చలియనఁగా నిచ్ఛానుసారము ప్రవర్తించునది యని యర్థము. తిలోత్తమ దేవలోకాంత. అనఁగా నచ్చరమిన్న. ఎందఱనో కోరునది. ఆమెయే పుంశ్చలీచిత్తము నెఱుంగుట కష్టమని తెలిపెను. క్రొత్తవానిం జూచినవెంటనే ప్రాఁతప్రియుని మఱచుట కులటాధర్మ మని తేటతెల్లముగఁ దెలిపెను. కులటాదర్శనసంభాషణస్పర్శనములు పాపహేతువు లనియు వానికిఁ బ్రాయశ్చిత్తము లివి యనియు వెలిపుచ్చెను.

"తస్మాద్యత్నాద్రక్షణీయం పాకపాత్రం కళత్రకమ్"
అని తెలుపుట కన్న వేఱు హితోపదేశ మేమి చేయవలయును?

ఒకరిపై మమత నిలుకడఁగా లేని కులటాజాతిని నమ్మవచ్చునా యని తెలిపెను. కులటాచిత్తవృత్తి నెఱుంగుటకంటెఁ గష్ట కార్య మింకొకటి లేదని స్పష్టపఱచెను. ఇట్లు పుంశ్చలీజాతి నీచతమజాతి యని తెలిపినను సాహసికుఁడు మోహపరవశుఁ డయ్యెను. ఆతఁ డేమి సామాన్యుఁడా! బలిచక్రవర్తికుమారుఁ డు. బలిచక్రవర్తి మహాదాత. విష్ణుపాదార్చకులలో మేటి. ఆతనికిం బుత్త్రుఁడై సకలశాస్త్రపారంగతుఁడు విష్ణుభక్తుఁడు నైన సాహసికుఁడు తద్దర్శనమున విహ్వలుఁడయ్యెను. సర్వమును మ ఱచెను. కులటాసంగతి మంచిది గాదని హెచ్చరించినను గూడ మోహపరవశుఁ డయ్యెను. జారిణిప్రేమ జలబుద్బుదమువంటి దని లక్ష్యలక్షణపురస్సరముగఁ దెలిపినను దెలివిఁ దెచ్చుకొనఁ జాలకపోయెను. మరులు పురికొల్ప దానిం గూడి గంధమాదన గహ్వరంబున సుఖ మనుభవించెను. కాని తృప్తినొందని కామ మున నోడ లెఱుంగక పోయెను. దాన ఫల మేమి గలిగె? స్వనా శనరూపదుష్ఫలము చేకూరెను. గర్దభాకారను అసు రరాజపుత్త్రనకుం గల్గెను.

దుర్వాసుఁడు నియతిమై తప మొనరించుచుండుచోటే సాహసికునకు విహారస్థానముగ దైవవశమున నేర్పడియెను. కర్మ మనునది బలవత్తమమైనది. దానిం దప్పించుకొనఁ జాలు ప్రాణి లేనే లేదు. పరాత్పరుఁ డొక్కఁడే దాని మీఱఁజాలును. తదితరులు మీఱఁ జాలరు. మూఁటికి ముమ్మాటికి మీఱఁజాల

రు. ఆతపస్సు నిరంతరము సాగుచుండెను. నిత్యకృత్యములు చేయక తపస్సు చేయు టెట్లు? అన్న ప్రశ్నము రాకమానదు. దుర్వాసుఁడు రాత్రిందివములు శ్రీకృష్ణపాదారవిందముల డెందమ్మున నిడికొని తదేకనియతి నుండెను. సాయంప్రాతఃకాలస్నానాదికృత్యము లాముని చేయవలసినట్టివి కావు. అవి కేవలపరిశుద్ధజ్ఞానము లేనివారలకొఱ కేర్పడినవి. సర్వసంగపరిత్యాగుల నవి బాధింపఁజాలవు. వాని నొనరించినఁ గలుగుఫలము జ్ఞానమే. సర్వసంగవిముఖతారూపమైనది. అట్టిస్థితి నొందినవారే ముక్తసంగు లనఁబడుదురు. పామరుల కేర్పడినస్మృతులు లోనగునవి వారియొడఁ జెల్లవు. ముక్తసంగతఁ గలుగఁ జేయ నవి యేర్పడెను. ఆఫలము కలుగ నవి ప్రధానములు కాక యప్రధానము లగును. అట్టి మహాత్ము లేకాంతముగాఁ గూరుచుండి పరమేశ్వరు హృదయకమలమున నిడికొని యహర్నిశములు విరామము లేక ధ్యానించుచుందురు. అట్టిస్థితిలో దేహాభిమానము వారి కుండునా యని ప్రశ్నించుటయే వెఱ్ఱితనము. దేహాభిమానము వదలినతఱి లోకాచారము వారి కనుసరింపఁదగనిదియే యగును. అనఁగా స్నానసంధ్యోపాసనాదులు వారు చేయనక్కఱలేదు. అట్లని వా రూరకుండరు. వారిలోఁ గొందఱు వానిని లోకసంగ్రహార్థ మొనరింతురు. మనస్సు భగవత్పాదారవిందసంలగ్నమగుతఱి లోకమును మఱతురు. కాననే భర్తృహరి వైరాగ్యశతకమున—

"ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరం ధ్యాయతా మానందాశ్రుజలం పిబంతి శకునా నిశ్శంకమంకేశయాః" అని స్పష్టపఱచిరి.

నిరంతరధ్యానము చేయుటచే వారిదేహము యోగబలమున స్థాణు వగును. అది నిశ్చలమగుటఁ బక్షులు సర్పములు దాని నాశ్రయించి యిది యొక పాషాణమో వృక్షమో యని సంశయ మొందక యందు నివసించును. అట్టి స్థితి చేకూరుటయే యోగఫల మని నమ్ముఁడు. ఎట్టిమహాత్ముల కట్టి యదృష్టము లభించునో మన మెఱుఁగఁజాలము. కాన నెఱుఁగనివిషయము లసత్యము లని యాక్షేపింపరాదు.

దుర్వాసునిదేహము పాషాణమే యని భావించి వల్మీక మొకటి యేర్పడియె. అందు క్రూరభుజంగములు చేరును. అవి యేమి చేయఁగలవు? పాషాణము నేమిచేయునో ఆపనిని చేయఁగలవు. అట్టిక్రూరసర్పము లాశ్రయించినవే యని యా మునికిం దెలియదు. ఏల? తన్మానసము భగవత్పాదారవిందసమర్పితము. అది నిశ్చలము. చింతావిరహితము. ఆనందసాగరనిమగ్నము. తనివి దీఱునంతదాఁక నందే యుండును. అది యెంత కాల మని ప్రశ్నచేయఁజనదు. అది యింతకాల మని చెప్పఁగలుగు టెట్లు? కొలఁదికాలమే కావచ్చును. యుగసహస్రపర్యంతకాలము కావచ్చును. అది యిట్టి దని నిర్ణయించు నధికార మామహాత్ములకే యుండ దనఁగా మనకిఁక నెక్కడిది?

అయిన, కూ్రరసర్పఫూత్కారమే ప్రాణాపాయముఁ గల్పించును గదా. అట్లుండఁగా మునిదేహ మెట్లోర్చెను? అని ప్రశ్నింపవచ్చును. అట్టివారికి యోగమహిమము చక్కఁగాఁ దెలిసియుండ దని నానమ్మకము.

వర్షత్రయాభ్యాసవశాత్ ప్రతీతి మనాగతం వేత్త్యలినీలకేశః.
విషం న దేహే క్రమతే తదీయే దష్టే సుఘోరై రపి పన్నగేంద్రైః.

అని త్రిపురాసారసముచ్చయమునఁ జెప్పఁబడినది. ప్రాణాయామము యోగమునకుఁ బ్రథమసోపానము. దానియందిట్టి మహిమ మున్నదని చెప్పఁబడినది. అది కేవలము ఫలస్తుతిమాత్ర మనుట పాపము. అది యలవాటుచేయువారికే దానిమహిమ మెఱుఁగనగు. ఇతరులకుఁ దెలియదు. ఇట్లుండఁగా మహాయోగముల నభ్యసించి తత్ఫలము నందు కన్నులు మూసినంతన భగవద్దర్శనము చేయఁగల మహాత్ముల దేహములఁ గ్రూరభుజంగములు కావు ఆదిశేషుఁడైన నేమి చేయంగలఁడు?

కావున దుర్వాసుని దేహమున వల్మీక మేర్పడి అది కొంత కాలమునకుఁ బీఁగెలగుంపుచే నావృత మయ్యెను. అట్టి విషయము కాముకులగువారి కెట్లు తెలియఁదగియుండును. కాఁబట్టియే

కామాత్మనోర్నహి జ్ఞానం కామేన హతచేతసః"

అని చెప్పఁబడియె. ఒడలెఱుఁగనిపాటు పడుచుండఁగా నిఁక జ్ఞాన మెట్లు వారి కాస్థితియందుఁ గల్గును ?

భగవంతునియుద్దేశము ప్రాణికోటి యంతయుఁ దరింపవలయు ననియే. అది కర్మరూపము గలది కాననే "కర్మాయత్తులు జీవులు" అన్న పెద్దలవాక్యము సర్వజనాంగీకారమును బడసినది. కేవలమదాంధులను సన్మార్గమునకుఁ ద్రిప్పవలయు నని యీశ్వరోద్దేశ మేని, అట్టి వారలకుఁ దొలుత నొప్పి కల్పించును. తద్విముక్తియే జ్ఞానోపదేశము. ఈనియమమునకు భంగమే లేదని నాయాశయము. కావుననే యాతటిం దత్రీకృడాజనితకరకంకణనిక్వణనము మునివరుమనస్సును గలంపంజాలెను. లేకున్నచో వల్మీకములు పెట్టియుండఁగా నెఱుఁగకున్న యాతని కవుడేల యాకలనిస్వనము ధ్యానభంగమును గల్పింప సమర్థమయ్యెను? మిన్ను విఱిగి పైఁబడుచున్నఁ జలింపని యాదివ్యమునిచిత్తమవు డుద్విగ్నమయ్యెను. కారణ మేమి? తిలోత్తమాసాహసికులదుష్కర్మ మాముునిని బ్రేరేపించి కోపపరవశుం గావించి తద్ద్వారా వారికిఁ బ్రాయశ్చిత్తము గల్పించెను. ఇదియే సిద్ధాంతము. దీనిని మీఱునది వేఱొండు లేదు. ఉన్న దన్నను, అది నిలువఁజాలక పరుగిడును.

. ముని కోపగించి శపింప వారికవుడు జ్ఞానముదయించెను.

"వినా విపత్త్యా కేషాంచిత్ జ్ఞానం భవతి భూతలే"

అనునీమహావాక్యము మహావాక్యసారమే యనవలయు. ఎట్టివారికిం గాని కష్టము తోఁచినఁగాని తా రొనరించునది దుష్కార్య మని తోఁపదు. ఇతరు లుపదేశించుటచే నించుక తోఁచినది.

చాలసేపు మనసున నిలువదు. కష్టరాహిత్యమేకదా సుఖానంద మనుమాట యందలి కనుభవైకవేద్యమే కదా. కాఁబట్టి మునిశాపశ్రవణమాత్రముననే వారిమానసములు దుఃఖసాగరనిమగ్నములయ్యెను. ఇఁక మనగతియేమని యూహింపసాగెను. ఈభోగమేమి? మనకు రాఁగలజన్మమేమి? యన్నయూహాలు ప్రసరింపసాగెను. అంతఁ దమరు చేయుచున్న యప్పని తప్పని దృఢపడియెను. అపు డేడ్చినలాభ మేమని యూరకుండిరా? బహుభంగులఁ బ్రార్థించిరి. పాదములపైఁబడి మునీంద్రా! కావవే యని దీనత వేడిరి. చేసినపని దుష్కార్యమింకనిట్టి చెట్టపనులం జేయ మిప్పటికి మన్నింపుమా యని పలవించిరి. ఎట్టులీశాపము ననుభవింతుమయ్యా యని పాదములఁ బట్టుకొనిరి. కాని మునిమాత్రమేమి చేయఁగలఁడు? తా నాడినమాట యసత్యమాఁ గాకమునఁగలఁడా? అట్టియధికార మాయనకు మాత్రము గలదా? లేదు! లేదు, లేదు! ఆతఁడేభగవంతు నారాధించుచుండెనో ఆతని కరుణచే మీకు మేలు గలిగెడు నని వారి నూఱడించెను. వేఱు మార్గము లేదని వారును నిశ్చయించుకొని యింతమాత్ర మేనుపకారము గల్గెఁ గదా. బ్రతికితిమిరా స్వామీ యని తదనుమతి నొందిపోయిరి. ఇందు గ్రహింపఁదగిననీతు లివ్వియివ్వియని వేఱుగ వ్రాయవలయునా? కరతలామలకములు గదా.

మహాశయులారా! ఇం కొకవిచిత్రవార్త యిందుఁ గలదు. అది నారదమునివృత్తాంతము. నారదముని తొలిజన్మ

మున దాసీపుత్త్రుఁడఁట. దానికిం గారణము విధిశాపమఁట. విష్ణుభక్తులు భుజింపఁగా మిగిలినయన్నమును దినుటచే మఱుజన్మమున బ్రహ్మమానసపుత్త్రుఁడై పుట్టుకం గాంచి నారదనామధారియయ్యెనఁట. ఇవ్వార్త యుపహాస్యతాభాజనముగఁ దోచుఁ గదా. అటులని యుపహాస్యము చేయఁగూడదు. శ్రీవిష్ణుభక్తుల యుచ్ఛిష్టము దొరకినఁ జాలునని మహాత్ములు గూడ వేచియుందురు. వారికది దొరకుటయే తపఃఫలము. కారణ మేమి? విష్ణుభక్తులు మహాత్ములు. వారి కాహారమే యుండదు. ఎపుడో యించుక పరిగ్రహించినను దచ్ఛేషము దొరకదు. అట్టియమూల్యపదార్థము విష్ణుప్రసాదమే. అది సకలపురుషార్థముల నొసంగఁజాలు. కాని, కపటివైష్ణవోచ్ఛిష్ట మట్టిది కానేరదు. దాంభికులై శిష్యుల వంచించుపొంటె వేషధారులై ద్రవ్యార్జనము చేయువారు విష్ణుభక్తులు కానేరరు. ప్రహ్లాదాదులు విష్ణుభక్తులు. సర్వసంగపరిత్యాగులు వైష్ణవులు. సమస్తము నీశ్వరార్పణము చేసి, శ్రీమహావిష్ణుపాదారవిందైకభజనము చేయువారలే భక్తులు. అట్టివారికి భోజనాపేక్ష యుండదు. భగవత్పాదకమలమకరందమే వారి కతితృప్తిని గల్గించునాహారము. అది యితరులకు లభించెనా అనఁగా, అట్టి భక్తి తత్సహవాససల్లాపాదులచే లభించెనా ముక్తుఁడగు. ఇట ఉచ్ఛిష్ట మనఁగా వారు తినఁగా మిగిలిన యన్న మని కాదు. వా రుపాసించి భగవత్పాదామృతమును గ్రోలి శిష్యులకు నుపాసనము చేయుమార్గమును

దెలిపి వారిచే నభ్యసింపఁ జేయుదురు. అట్టిదియే వైష్ణవోచ్ఛిష్ట మనఁబడును. అది దొరకుట మహాపుణ్యము కాదా. సత్కర్మా నుష్ఠానఫలముకదా. దానికంటె మిక్కిలికోరఁదగినది వే ఱేది యుండును ? అనఁగాఁ బూర్వజన్మకర్మవశమున మహాజ్ఞాన ము పుట్టుకచేతనే కలుగును. అది లేక తనంతన తానే కలుగదు. కాఁబట్టి సత్కర్మానుష్ఠానము వదలక చేయుచుఁ దత్ఫలమును గోరక యుండవలయును. అట్లు చేసినఁ బరమేశ్వరుఁడు సంతృప్తుఁ డగును. ఇట్లు భక్తిరసము దినదినాభివృద్ధి నొందినఁ బరమపదము ప్రాపింప నలవియగును.

పాఠకులారా! కథను ముగించి తత్సారము లని నాకుఁ దోఁచినమాటలు నాలుగు వ్రాసితి. ఇవి కాక యెన్నియో నీతు లు మీరును దోఁపవచ్చు. వాని నెల్ల సమన్వయము చేసికొనుఁ డు. అపుడే భగవత్కథాపఠనము సార్థకమగును. కథను మాత్ర మే పఠించి తృప్తి నొందరాదు. తదుక్తనీతి ననుసరించుటయే భ క్తులవిధి. దాని నొనరించినభక్తుఁడే కృతకృత్యుఁ డనంబడును. ఇంక నీవిషయమును జాలించి కథాసంవిధానము వరికింతము.

—— నందయశోదారోహిణీపూర్వవృత్తాంతము. ——

* వసుదేవునియు దేవకీదేవియుఁ బూర్వజన్మవృత్తాంత ము ముందు వివరింపఁబడియెఁ గదా. ఇఁక శ్రీకృష్ణజన్మ

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము తొమ్మిదవయధ్యాయమునుండి గ్రహిం పఁబడినది.

మునకు ముందు నందుఁ డన నెవఁడో యశోద యెవతుకయో, రోహిణి యెవ్వతెయో తెలిసికొనఁదగియుండును. ఇక్కథ ముఖ్యతమముగదా. దీని నెఱింగినఁ గాని పైకథ సాగదు. ఇది నారదనారాయణసంవాదరూపమైనది. కానఁ జక్కఁగా నాలకింపుఁడు.

తొల్లి నారదముని నారాయణునితో నెన్నియో విషయములం గూర్చి ప్రశ్నించుచుండి పురుషోత్తమమహిమ నెఱుంగఁ గోరి యిట్లు ప్రశ్నించెను. శ్రీనారాయణా! మహానుభావా! నీవు జగన్నాయకుఁడవు. నీవెఱుంగనియద్భుతము లుండవు. వసుదేవుఁడు శ్రీకృష్ణుని నందపత్నియగు యశోదామందిరమున నునిచి స్వగృహమునకుఁ బోయె నని వింటిని. అంతట నందుఁ డేమిచేసెను? శ్రీహరి యానందమందిరమున నేగతి విహరించెను? ఎన్ని యేండ్లట నుండెను? శ్రీహరి బాలక్రీడల వినఁగోరెద. చక్కఁగా వర్ణింపుమా. శ్రీకృష్ణపరమాత్మ పూర్వము గోలోకమున రాధతోఁగూడి విహరించెను గదా. అపు డేమి ప్రతిజ్ఞ చేసెను? దాని నెట్లు పాలించెను? బృందావన మన నెట్టిది? దానిమండలరీతి యెట్టిది? రాసక్రీడా జలక్రీడలం గూడ వర్ణింపుము. నందుఁ డేమి తపస్సు చేసెను? యశోదారోహిణు లెట్టి పుణ్యవ్రతములు సలిపిరి? శ్రీహరికిఁ బూర్వమే హలాయుధునకు జనన మెందుఁ గలిగెను? పీయూషఖండసంకాశము కదా శ్రీహరిదివ్యచరిత్రము. విశేషించి యది నీవంటి కవిముఖమునుండి వెలువడునేని క్రొత్త

శ్రోత్రయానందమును బుట్టించును. నీరాసక్రీడావర్ణనము నీచేఁ జేయఁబడవలయును. పరోక్షవర్ణనమువలనఁ గావ్యము నూతన రూపమును దాల్చును. యోగీశ్వరగురువర్యుఁడ వగు నీవు సాక్షాచ్ఛ్రీకృష్ణపరమాత్మయంశజనితుఁడవు కదా. ఎవఁ డెవ్వరియంశ జనితుఁడో అతఁ డాతనిసుఖమువలననే సుఖించును. కావున నీ ముఖమునుండి యీవృత్తాంతము వినఁగోరెద నని ప్రశ్నించెను. నారాయణమూర్తి యాప్రశ్నమును విని యచ్చెరు వంది పరమానందభరితుఁడై యిట్లు బదులు చెప్పెను. నారదా! వినుము. * బ్రహ్మేశశేషవిఘ్నేశ్వరులు, కూర్మము, ధర్ముఁడు, నేను, నరుఁడు, కార్తికేయుఁడు అను తొమ్మండుగురము శ్రీకృష్ణాంశ జనితులము. ఓహోహో ! గోలోకనాయకుఁడగు శ్రీకృష్ణుని మహిమమును వర్ణింప నేరితరము? ఏమహాత్ముని మేము స్వయముగఁ దెలిసికొనఁజాలమో, వేదములు తెలిసికొనఁ జాలవో, అట్టివానిని బండితు లేమి తెలిసికొనఁగలరు ? ఆదివరాహము; వామనుఁడు. కల్కి బౌద్ధులు కపిలమీనములు. ఇవి శ్రీకృష్ణ కలాంశజనితములు. ఇంక నెందఱో యిట్టివారు గలరు. కూర్మము నృసింహమూర్తి, శ్రీరాముఁడు, శ్వేతద్వీపవాసివిరాడ్విభు సంభూతులు. శ్రీకృష్ణుఁడు పరిపూర్ణతముఁడు. గోలోకమున వైకుంఠమున నుండును. వైకుంఠమునఁ గమలాకాంతుఁ డనియు,

* బ్రహ్మేశ శేష విఘ్నేశాః కూర్మో ధర్మో ఽహమేవ చ, నరశ్చ కార్తికేయశ్చ శ్రీకృష్ణాంశా వయం నవ. అని మూ. ౧౦ శ్లో.

రూపభేదమునఁ జతుర్భుజుఁడై యతఁడే యలరుచుండును. గోలోకమున రాధాకాంతుఁడై ద్విభుజవిరాజితుఁడై యాప్రభువే యుండును. ఈశ్రీకృష్ణపరమాత్మ తేజస్సునే నిత్యము యోగులు మనోవీథియందు నిల్పియుందురు. భక్తులు తత్పాదారవిందములను, తత్తేజస్సును ధ్యానించి కీర్తించుచుందురు. తేజస్వియగు నామహామహుని విడిచిన ధ్యేయపదార్థ మెక్కడిది? విప్రోత్తమా, నారదమునీ, యశోదానందులతపస్సును వర్ణించెద. ఆలకింపుము. రోహిణీతపశ్చరణమును వివరించెద. ఏతత్శక్తిచే శ్రీపరమేశ్వరునిఁ గనంగలిగిరో యాతపస్సు వాస్తవముగా వర్ణింపఁ దగినదియే కదా.

నందుఁడు వసువులలో నొకఁడు. అందు నుత్తముఁడు. ద్రోణుఁ డని యతనిపేరు. తపోధనుఁడై యతఁ డుండును. ఆతని భార్య ధరాదేవి. ఆమె పతివ్రతాశిరోమణి. ఆమెయే యశోద యనంబరఁగెను. రోహిణి సర్పమాత యగు కద్రువు. ఆమెనుండియే సర్పములు ప్రభవిల్లెను. వీరిజన్మచరితము నిఁక వినుము.

ఒకానొకకాలమందు ధరాదేవియు, ద్రోణుఁడును గంధమాదనపర్వతమునందుఁ బరమపుణ్యప్రద మగుభారతవర్షమున గౌతమాశ్రమసన్నిధిని దప స్సొనరించుచుండిరి. ఆతపోనియతి యందు వారికిఁ బదివేలసంవత్సరములు గతించెను. శ్రీకృష్ణసందర్శనముఁ గోరి నిర్జనమగు సుప్రభానదీతీరమున వారు తపస్సు చేయుచుండిరి. ఎంతకాలము తపస్సు చేసినను ద్రోణుఁడు ధరా

దేవియు శ్రీకృష్ణుని దర్శింపఁజాలకపోయిరి. అంత వారికి విసుఁగు జనించెను. ఎంత కాలము శ్రద్ధాయోగమునఁ దప మొనరించి నను భగవద్దర్శనము కాలేదే! ఇఁక నేటి కీదేహ మని తలంచి వారు వైరాగ్యసంపదచే నగ్నికుండమునఁ బడఁబూనిరి. మరణ మును వాంఛించు తచ్చిత్తవృత్తి నెఱింగి యొకవాక్కు వియ ద్వీథినుండి వెలువడియెను. ఓధరాద్రోణులారా, మరణవాంఛ వదలుఁడు. శ్రీహరిని భూలోకమునఁ బుత్రరూపమునఁ జూడఁ గలరు. ఈజన్మమునఁ దద్దర్శనము గలుగదు.

జన్మాంతరమున యోగులకుం గూడ దర్శింపరానివిభుని శ్రీకృష్ణుని మీరు దర్శింపఁగలరు. ఆపరమాత్మ విద్వాంసులకుం గూడ ధ్యానాసాధ్యుఁడు. బ్రహ్మాదులకుం గూడ వంద్యుఁడు. కాన నట్టిమహామహునిదర్శనము జన్మాంతరమును గాంచిన మీకుఁ బుత్రరూపమునఁ గాఁగలదు.

ఈపలుకులు చెవులుసోఁకినంతనే ధరాద్రోణులు పర మానందకందళితహృదయము లలర నిల్లు చేరిరి. జన్మాంతరమున యశోదానందు లనం బరగి శ్రీకృష్ణుని దర్శించిరి. ఇది యశో దానందుల పూర్వచరిత్రము. ఇంక రోహిణీచరిత్రము వినుము. అది గుహ్య మనందగినది. దేవతలు గూడ దాని నెఱుంగఁ గోరుదురు.

ఒకానొకప్పుడు దేవమాతయగు సాధ్వీమణి పుష్పోత్సవ దినమునందుఁ దనవల్లభుఁడగుకశ్యపమునికి సేవకునిమూలమున నొకశుభవార్త నంపెను. ఆనాఁడు సుస్నాతమై యాసుందరి

రత్నాలంకారములఁ దాల్చి వివిధవిధముల నలంకృతయై ముకుర
మునెదుట నునుచుకొని తన మోమునందుఁ జూచెను. కస్తూరీతిల
కమ్మున నొప్పి సిందూరబిందుసంయుతిం దగి, రత్నకుండలమండ
లమున విలసిల్లి మకరికాపత్రాభరణశోభలఁ జెన్నుమీఱి, గజ
కుంభస్థమౌక్తికసంయోగమున భాసిల్లి, మనోహరనాసాగ్రము
నఁ దేజరిల్లి, శరత్పంకజనయనముల సొంపుఁగని, వక్రతరభ్రూ
భంగమునఁ జూడనై, విచిత్రకజ్జలోజ్జ్వలమై, పరిపక్వదాడిమీబీజ
సమదంతపంక్తులచే నుతింపఁజాలి, పక్వబింబాధరోష్ఠమునఁ దగి,
సుస్మితమునఁ దనరారి, సుందరమై, అతిమనోహరమై, మునీం
ద్రనిశ్చలచిత్తమోహనంబై మెఱయుచున్న తనశరత్పార్వణ
చంద్రముఖము దర్పణంబునఁ గానఁబడియె. ఇట్లద్భుతముగాఁ
గనఁబడు మోమును దృష్టి మీఱఁ జూచి తనగృహమునందే
యుండెను. ఆసుదతి కామబాణప్రపీడితయగుచుఁ, బతిరాక
కెదురు చూచుచు నుండఁగాఁ దా నంపినసేవకుఁడువచ్చి కశ్య
పబ్రహ్మ కద్రూగృహంబున నిష్టాలాపంబులు సేయుచున్నవాఁ
డను పిడుగువంటిమాటను జెప్పెను. ఆవేడినుడి రత్నసారవిభూ
షితంబగు తద్హృదయంబునఁ బడియె. ఆలలనామణి రతికాతర
యాట నవ్వార్త విన్నంతన హతాశయై క్రోధముఁ దాల్చెను.

ఆకోపమునకు ఫలముగా భర్తను శపింప వలసినదయ్యె
ను, వల్లభునియందలి ప్రేమమునఁ బ్రాణనాథుని శపింపదయ్యెను.
దీనికిం గారకురాలు సర్పమాత గదా యని తలంచెను. తలంచి

తనసాధ్వీత్వమునొడ్డి యిఁకమీఁద నాసపత్నియగు సర్పజనని దేవాలయయోగ్యురాలు కాకుండుఁగాక. ధర్మిష్ఠయుఁ గాకుండుఁగాక. ధర్మనాశిని యగుఁగాక. స్వర్లోకమునుండి దూరమున కేగుఁగాక. మానవయోనిం బుట్టువుంగాంచుఁ గాక అని శపించెను.

సేవకముఖమున నాకద్రువు తన కదితి యొసఁగిన శాపమును వినెను. నిష్కారణముగాఁ దనసవతి శాప మిచ్చెఁగదా యని యాగ్రహించి యిట్లు ప్రతిశాప మిచ్చెను. నావలెనే అదితియు మనుష్యయోనిం బుట్టుఁగాక. జరాయుతమగు మానుషయోని జననదూషనరక మనుభవించుఁ గాక అని శపించెను.

ఈయిరువురశాపముల నామునివరుఁ డాత్మ నెఱింగెను. కద్రువును సర్పమాతను జూచి హితవచనముల నూఱడిల్లఁజేయుచుఁ గాలాంతరమున మర్త్యలోకమునకుం బోదువుగాక, నన్నుంగూడియే యచటనుందువుగాక. భయంపడకుము. సుఖముగనుండుము. ఆజన్మమున శ్రీకృష్ణముఖమును దర్శింపఁగలవు. అని యూఱడిల్లఁ జేసి యదితిగృహంబునకుం బోయి యుందా సాధ్వీ మనోవాంఛను జక్కఁగా నెఱవేర్చెను. ఆఋతుకాలముననే మహేంద్రుఁడు దేవాధీశుఁడు జనించెను. అదితి యను దేవమాతయే దేవకీదేవిగా నవతరించెను. సర్పమాతయే రోహిణి యనఁ బుట్టెను. కశ్యపుఁడు వసుదేవుఁ డనుపేర నవతరించెను. శ్రీకృష్ణజనకుం డీమహాత్ముఁడే.

భక్తజనులారా! ఎంతశాంతముగలవారైనను స్త్రీలు చపలచిత్తలు. దూరదృష్టివిహీనలు అను నీనానుడులు సిద్ధాంతములే. అదితియంతటి సాధ్వీతిలకము సపత్నిని నిష్కారణముగా శపించెను. ఓర్పులేని దని నిందింపరాదు. కాని స్త్రీస్వభావమగు గుణముగలదియె యనవలయు. ఏలయనఁగా భర్తను డానెల్లు ప్రేమించునో తక్కినభార్యయు నట్లే ప్రేమించు నని యెఱుంగక త్వరపడి భర్తను శపింపవలసియుండ నాయనను వదలి శాపమున కనర్హురాలగు కద్రువను శపించుట న్యాయముకాదు గదా. ఎంతటిపరిజ్ఞానమున్నను స్త్రీలు త్వరపడుస్వభావము గలవా రనుట నిక్కమాయెను. ఇంతమాత్రమే కాదు. అట్టి సాధ్వీమణికిఁ గల్గిన క్రోధము లోకోపకార మొనరించును. సామాన్యస్త్రీలకుఁ గలుగు క్రోధము వారినే బాధించును. ఇదియే భేదము. అదితి ముందు భగవంతుని గను భాగ్యము కలది. కానఁ దదనుగుణముగా శాపమును బొందెను. కద్రువయును శాపమును బడసినను భర్త యనుకంపాతిశయమున నించుకయు నపరాధ మొనరింపని సాధ్విగాన భగవంతునిఁ గుమారునిగాఁ గను నదృష్టము గలది యాయెను. కావున నెవ్వారుగాని సంచితము, నాగామి యనఁబడు కర్మముల ఫలముల ననుభవింపక తప్పించుకొనఁజాలరు. పామరులకుఁ బండితులకు నీవిషయమున భేదము లేదు గాని సజ్జను లనుభవించు కర్మఫలము లోకోపకారమునకుఁ గారణ మగు. పామరు

లనుభవించునది యట్టిది కానేరదు. ఇదియే యిట గ్రహింపఁ దగిన నీతి.

భార్యాద్వయ ముండుట యెట్టివారికేఁ గష్టహేతు వను న్యాయము అనుభవముతోఁ గలిపి సమన్వయముచేసినచో నిశ్చయ మని తేలుచున్నది. కశ్యపునంతటివాఁడియువురను బ్రతి మాలవలసివచ్చె. వారిశాపముల విని పరితపింపవలసినవాఁ డాయెను. ఇఁక సామాన్యులమాట యిట నేటికి పెంచి వ్రాయ వలయును? అది యీలోకమున స్వానుభవమునఁ గొందఱకు, దర్శనమునఁ గొందఱకు మనస్సునకు స్పష్టమగుచునే యున్నది. ఉండఁగలదు. దీనికి శంకలు లేవు. మాటికి ముమ్మాటికి ధ్రువము. ఇఁకఁ గథకు మరలుదము.

శ్రీకృష్ణావతారపవిత్రగాథను అవకాశమును గల్పించు కొనక వ్రాయవలసియున్నది. కాని దానికి ముం దొక్కవిష యమును దెలుపక తప్పదు. దానిని వదలుటచే నొక తప్పుచే సినవాఁడ నగుదు. ఏదనఁగా, శ్రీవిష్ణుభాగవతమున రుక్మిణీవివా హాఘట్టమున రుక్మి శ్రీకృష్ణునితో

శ్లో. ఆహ చోర! క్షణం తిష్ఠ యదూనాం కులపాంసన,
కుత్ర యాసి స్వసారం మే ముషిత్వాధ్వాంక్షవద్ధవిః.
౧౦ స్కం. ౫౪ అ. ౨౫ శ్లో.

ఇట్లు సంభాషించినట్లు కనఁబడియెడిని. దశమస్కం ధారంభమునందు

శ్లో. యదోశ్చ ధర్మశీలస్య నితరాం మునిసత్తమ,
తత్రాంశేనావతీర్ణస్య విష్ణోర్వీర్యాణి శంస నః. -శ్లో.

అనియుఁ గన్పడియెడు. యదువంశమున నవతరించుట యేల యను ప్రశ్న మసంగతముగాఁ గన్పడియెడు. ఏల యనఁగా నుత్తమరాజకుటుంబము లెన్నియో యుండఁగా రాజ్యార్హత లేక శాపగ్రస్తమగు యదుకులమునఁ బుట్టుట కేమి హేతువు? అను శంక కలుగకమానదు. 'ధర్మశీలస్య' అనుచో శీలశబ్దమునకు శాప మర్థమని కొందఱు చెప్పుదురు. ఈయర్థము మది నుంచుకొనియే కాఁబోలు మహాకవి బమ్మెరపోతనామాత్యుఁడు భాగవతాంధ్రీకరణమున "శీలముగల యదుకులమున, నేలా పుట్టెను మహాత్ముఁ డీశుఁడు" అని చెప్పెను. దీనికి నర్థము వ్రాయుచు బ్రహ్మశ్రీ పాలపర్తి నాగేశ్వరశాస్త్రులుగారు "శీలము కులమునఁ గల యదు" అనియన్వయించిరి. పోతనమహాకవిభావమున నిట శీలమనఁగా శాపమే యనితోఁచెడిని. లేనిచో ఏలాపుట్టెననగా ఏలాగునఁ బుట్టెను అనికాదు:ఏలపుట్టెను? ఎందుకుపుట్టెను? అను పర్యాయపదముల యర్థమే కాని యేలాగు పుట్టె ననియర్థము చెప్పరాదు. ఏలాగున పుట్టె నని ప్రశ్నము రాఁగూడదు. అనఁగా శాపదగ్ధమైన యదువంశమున నేటికిజన్మించెను.? ఏయేవిధములఁ బ్రవర్తిల్లెను? అనుభావమే సమంజస మని తోఁచెను. కాని పైశ్లోకమునకు శ్రీధరాచార్యులవారు రీయర్థమును వ్రాయలేదు. అంతటి మహాత్ములు వ్రాయని యర్థమును శ్రీపోతనమహాకవి

యేల వ్రాసె ననియు నడుగవచ్చును. కేనుఁగున "శీలముగల యదుకులమునఁ = ఆచారవంతమగు యదువంశమునందు, ఏ లాపుట్టెను = ఏటికి జన్మించెను" అని యర్థము చెప్పిన బాగులేదు. ఏలా పుట్టెను = అనఁగా ఏలాగున జన్మించెను అని యర్థము చెప్పినను బాగులేదు. మూలమునుబట్టి "నితరాం ధర్మశీలస్య యదోః తత్రవంశే" అని యన్వయించవలసినదే కాని వేఱువిధముగా నన్వయింప వీలులేదు. మిగుల ధర్మస్వభావుఁడగు యదుపువంశమునం దనియే కదా దీని యర్థము. శ్రీపరవస్తు శ్రీనివాసాచార్యవిరచిత సర్వశబ్దసంబోధిని యను నిఘంటువునందు శీలశబ్దమునకు నాల్గవయర్థము 'కీలమ్' అని వ్రాయఁబడినది. కీల మనఁ గా జల మర్థము. కీలకీలాలశబ్దములు పర్యాయపదములు. కాన ఆయర్థ మిటఁ బనికిరాదు. కీల మనునది పుంలింగమందును గలదు. అపుడు శంకు వని యర్థము. శంకు వనఁగా మేకు. తాత్పర్యముగా యదుకులమున కొక శంకువు గల దనఁగా నొక యపకీర్తి కల దని చెప్పవచ్చును. అపకీర్తి యనఁగా రాజ్యాధికారము లేని కుటుంబ మనునదియే యొక యపకీర్తి. అ దెట్లు? శాపకారణముచేత నని పరంపరా సంబంధముగా నర్థము చెప్పుచు రాఁగా ఎట్లో శాపమను వర్థము గల దని యూహింపవచ్చును, కాని ద్రావిడప్రాణాయామమన్నట్లు ఇంత శ్రమపడి యీయర్థ మేల చెప్పవలయు నని ప్రశ్నింపఁగా నిట్లు చెప్పకున్న వీలు లేదండీ యని యే సమా

ధానము చెప్పవలయును. ఏల యింతప్రయాసమునకు హేతు వని మరల నెవరేఁ బ్రశ్నించినచో యదువును యయాతి శపి యించె ననియు, దానిని వెలిపుచ్చుటకుఁగా నింత ప్రయాస మని సమాధానము చెప్పవలయును. ఈప్రయాసము మా త్రము నిష్ఫలము కాదు. ఏలయనఁగా శ్రీమహాభారతమున స భాపర్వమున ముప్పదియేడవయధ్యాయమున

నాయమర్హతి వార్ష్ణేయ స్తిష్ఠ త్స్విహ మహాత్మసు.

అని శిశుపాలుఁడు శ్రీకృష్ణు నాక్షేపించెను! వార్ష్ణేయుఁ డనఁగా వృష్ణికులోద్భవుఁడని యర్థము. యదువృష్ణి భోజాంధకులు యా దవు లనియే సామాన్యముగఁ బిలువఁబడుచుందురు. కాన రా జనామములలోఁ జేర్పఁ దగని యీకృష్ణుడు పూజార్హుఁడు కాఁడని యిటఁ దాత్పర్యము. ఈ మాటను బట్టి కూడ యదు వంశమువారు రాజ్యార్హులు కారని తోఁచును. కారణ మిం దులకు యయాతిశాపమే యని చెప్పవలయును.

శీలశబ్దమునకు నిఘంటువులందు శాప మను నర్థము నాచూచినంతవఱకుఁ గనఁబడలేదు. శబ్దకల్పద్రుమమునఁగూడ వ్రాయఁబడలేదు. ఎందైన నుండు నేమో! ఏది ఎట్లున్నను బ్రకృ తము యదువంశముచరిత్ర మించుక వ్రాయక తప్ప దని తోఁ చెడు. దానిని వదల వీలులేదని ముందే వ్రాసితినిగదా. కాఁబట్టి యించుక దానిని వివరించి తద్వంశమున శ్రీకృష్ణపరమాత్మ మవతరించిన విషయమును వ్రాసెదను.

## * యదువంశము.

లోమహర్షణుఁడు మహర్షులతో నన్నియో వంశచరిత్రములఁ దెల్పుచు నిట్లు పలికెను. మునులారా! పితృపుత్రికయగు విరజను నహుషుఁడు వివాహమాడెను. ఆమె యింద్రోపేంద్రతుల్యులగు కొడుకులం గాంచెను. యతి, యయాతి, శర్యాతి, రాయాతి, యాతి, సుయాతి నామములు గల యాపుత్రులాఱుగురని విశ్రుతంబు. అందు రెండవకొడుకగు యయాతి బహువిక్రమంబుల నసమానుఁ డగుట రాజయ్యెను. అందు యతి జ్యేష్ఠుఁడు యయాతి తదనుజాతుఁడు. ఆయయాతి కకుత్థ్సకన్యక యగు గోదేవిని వివాహమాడెను. జ్యేష్ఠపుత్రుఁడగు యతి ముక్తికాముఁడై బ్రహ్మభూతుఁడై మునివర్యుఁడయ్యెను. మిగిలిన నైదుమందిలో యయాతి జ్యేష్ఠుఁడు గాన భుజవీర్యమే సాయముగా భూమిపతుల నిర్జించి రాజేంద్రుఁడై భూమి నేలుచుండెను.

కొంతకాలమున కారాజచంద్రుఁడు శుక్రపుత్రికయగు దేవయానిని పెండ్లియాడెను. వృషపర్వుఁ డను రాక్షసరాజు శుక్రశిష్యుఁ డుండెను. ఆతనికి శర్మిష్ఠయను పుత్రిక గలదు. ఆమెయు యయాతికి రెండవభార్య యాయెను. అందుఁ దొలి భార్యయగు దేవయాని యదు తుర్వసునామకుల నిర్వురఁ గన

---

* ఈ కథ బ్రహ్మపురాణము పదవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

యులఁ బడసెను. ద్రుహ్యుఁడు, అనువు, పూరువు అనుముగ్గురు కొడుకులు శర్మిష్ఠకుం గల్గిరి. యయాతి దేవయానిని శర్మిష్ఠను ప్రేమముతో గారవించుచు సుఖముగా రాజ్యమును బరిపాలించుచుండెను. ఆతని ప్రజాపాలనమును గాంచి మెచ్చి పురందరుఁడు పరమభాస్వరం బగురథంబు నొసంగెను. అది సాంగమై బంగరుచే నిర్మితమై దివ్యములగు పరమాశ్వములచే నలరారుచుఁ బవిత్రమై యుండెను. ఏదిక్కునకుఁ బోవఁదలఁచినను మనోవేగమున నాగుఱ్ఱములు పోవుచు విజయము రాజున కొసంగుచుండెను. ఆదివ్యస్యందనము నధిష్ఠించి యాఱుదినములలో భూమండలం బంతయుఁ దిరిగి యెల్లరాజుల జయించెను. యయాతి యుద్ధరంగమున నితరులకు జయింపనలవిగానివాఁడు. మనుష్యులను మాత్రమేగాక దేవదానవులను గూడ జయించెను. *ఆరథమే కౌరవులకందఱకుఁ బరీక్షితుని దనుక నుండెను. అట్టిదివ్యరథము తుదకు గర్గముని శాపమున నాశమొందెను. పరీక్షితునిపుత్త్రుఁడగు జనమేజయుఁడు రాజ్యగర్వమున నొకనాఁడు గర్గమునితనయుని బాలుని వాక్క్రూరుఁడనువానిని హింసించి బ్రహ్మహత్యనొందెను. దానిచే లోహగంధముగలవాఁడై యూ

* ఈపరీక్షిత్తు, ఈతనిపుత్త్రుఁడు జనమేజయుఁడు పాండవుల తరువాతివారు కారని కురుపుత్త్రుఁడు పరీక్షితుఁడని తత్పుత్త్రుఁడు జనమేజయుఁడని యెఱుఁగవలయు. 'శ్లో. కురోః పుత్త్రస్య రాజేంద్ర రాజ్ఞః పరీక్షితస్య చ' అని మూ. కురుపుత్త్రుఁడు పరీక్షితుఁడు కాని పరీక్షిత్తు కాఁడు. అభిమన్యుపుత్త్రుఁడు పరీక్షిత్తు గాని పరీక్షితుఁడు కాఁడు.

రాజర్షి యిటునటు తిరుగుచుఁ బౌరులు జానపదులు తననుం బాపాత్ముఁ డీతఁడని పరిత్యజింప సుఖమునొందకయుండెను.

పిమ్మట నారాజు దుఃఖసంతప్తుఁడై జ్ఞానమునశింప శౌనకుఁ డనువిప్రేంద్రునికడకుం బోయి శరణుచొచ్చెను. ఆముని యు జనమేజయునిపరితాప మెఱింగి యతనిచే హయమేధమహాక్రతువును జేయించి యతని బ్రహ్మహత్య పోఁగొట్టి పరిశుద్ధునిగఁ జేసెను. ఆయజ్ఞము సమాప్తము కాఁగా నవభృథస్నానసమయమున నాతనిదేహము నాశ్రయించిన పాపసూచకలోహగంధము నశించెను.

జనమేజయుఁడు బ్రహ్మహత్యాపరిభూతుఁ డగుతఱి నాయింద్రదత్తస్యందనము చేదిపతివశ మయ్యెను. అప్పటిచేదిపతి శతమఖు నారాధించి తత్కరుణచే దానిం బడసి బృహద్రథుం డను పేరం బిలువఁబడుచు బలశాలియునయ్యెను. బృహద్రథుని పుత్త్రుఁడగు బార్హద్రథున కారథము స్వాధీనమయ్యెను. కొంతకాలమునకు భీముఁడు జరాసంధు ననిమొన వధియించి యాయుత్తమరథమును గైకొని వాసుదేవునకు సమర్పించెను.

ఇంద్రునివలన దివ్యరథము నీవిధమునఁ బొంది యెల్లరాజుల జయించి సప్తద్వీపవతియగు వసుంధరను యయాతి పాలించెను. నాహుషుం డగుయయాతిరాజ్యభారమును బూనుతఱి స్వపుత్త్రుల కందఱకు రాజ్యమును బంచి యిచ్చెను. అందు యదువునకుఁ బూర్వదిగ్రాజ్యము నొసంగెను. పూరువును

మధ్యరాజ్యపాలకుం గావించెను. తుర్వసు నాగ్నేయదిగ్రాజ్యమున నునిచెను. వీరిచే నీపృథ్వి యెల్లఁ బాలింపఁ బడవలయు నని యయాతి యుట్లొసరించెను.

మునులారా! యయాతి యిట్లు విజయపరంపరలఁ బొందియు జరాభిభూతుఁడయ్యు ధనుశ్శరములం బూని పుత్రులంగూడి యపరాజితుఁడై భూమి నెల్లఁ జరించి రాజ్యమును విభజించి కొడుకుల కొసంగెను. జరాభారపీడితుండై యొక నాఁడు యదువుంగాంచి యిట్లు పలికెను. వత్సా! ఈ నా జరాభారమును గ్రహింపుము. కార్యాంతరమున నేను నీతరుణరూపంబు గొని చరించెదను. సురుచిరతరుణరూపంబున ధరణిం దిరుగువేడుక నాకింకను గలదు. నాజరాభారమును నీయందునిచెద. అనుడు యదు విట్లనియె. తండ్రీ! ఈదానము నాకు సమ్మతము గాదు. బ్రాహ్మణునకు దాన మొసంగవలయు ననియే నాయాశయము. ఇతరులకుంగాదు. రాజులకుఁ బ్రతిగ్రహము శాస్త్రోక్తము కాదు. కాన ఆశాస్త్రమును దిరస్కరించి నీ జరాభారమును నే గ్రహింపను. ముదుసలితనమునందు బహు దోషములు గలవు. పానభోజనాదులయందు నవి యుండును. కాన నిట్టిదోషభూయిష్ఠ మగునీజరాభారమును బరిగ్రహింప నాకుత్సాహము గలుగకున్నయది. రాజేంద్రా! నాకంటెఁ బ్రియతరులగు పుత్రులనేకులు నీకుంగలరు. వారిలో నెవరినేని నీజరాభారమును బ్రతిగ్రహింపఁ గోరుము.

అని మోమోటమి లేక పలికిన జ్యేష్ఠకుమారునిం గాంచి దుర్వారక్రోధపరీతాంతఃకరణుఁడై వాగ్విదులలో మేటియగు యయాతి కుమారునిఁ దిరస్కరించుచు నిట్లు పలికెను. నీచాత్మా! పితృసేవ యనుధర్మము వదలి యితరాశ్రమ మేది చెప్పఁబడినది? ఏధర్మము విధింపఁబడియె? దుర్బుద్ధీ! నేనీకుదేశికుఁడనుగదా. ఇట్టినాయాజ్ఞ నుల్లంఘించుటయేగాక ధర్మము లుపదేశింపఁ జూచితివి. అని యంతకంత కంతరంగమున నుప్పొంగుకోపం బాపఁజాలమి నిట్లు శపించెను. క్రూరా! నీ ప్రజలు రాజులేనివా రగుదురుగాక. ఇందులకు సందియము లేదు.

అనిశపించి ద్రుహ్యుని, తుర్వసుని, అను వనువానిని, వేఱువేఱ పైరీతినే యాచించి వారును యదువు చెప్పినట్లే సమాధానముచెప్పి తనప్రార్థనను జెల్లింపకపోఁగా వారినందఱ నట్లేశపించెను. ఈశాపమువలన యదు, ద్రుహ్యు, తుర్వ, ఘ్వను నామకులు రాజ్యవిరహితులైరి. అంత యయాతి పూరు వను తనయునికంటెఁ బెద్దవారగు నల్వుర నీరీతి దారుణశాపానలదందహ్యమానమానసులఁగా నొనరించి కొండికయగు పూరునిం బిలిచి పైవారి నడిగినట్లే ప్రశ్నించెను. వత్సా! నీవయసుం గొని భూమినెల్లఁ దిరుగఁదలంచితి. నాముదిమి నీవు గ్రహించి నీవయస్సు నా కీవలయు. ఇందులకు నీ విష్టపడియెదవా. అని యాచించెను.

యయాతి యిట్లు తన్నడుగఁ బూరువు మాఱుమాటాడక యట్లే చేయుఁ డని వినయమునఁ బలికి తండ్రిముదిమిని దాఁదాల్చి తనయౌవనమును దండ్రికొసంగెను. యయాతియుఁ బరమానందభరితుఁడై నవయౌవనస్ఫురితుఁడై భూమి నెల్లఁ దిరుగుచుఁ జిరకాలము సుఖముల ననుభవించి కామముల కంత ముగలదా యని పరికించి పరికించి విశ్వాచియను సురతరుణిం గూడి చైత్రరథమను నుద్యానమునఁ జిరకాలము విహరించెను. ఎన్నటికిని గామముల కంతముగాని, తృప్తిగాని కనఁబడనందున యయాతి మరలి పురంబున కరుదెంచి పూరుని యౌవనం బతని కొసంగి తనముదిమిని దా గ్రహించెను. ఇప్పట్టున యయాతి కొన్ని గాథలు పాడెను. అవి లోకులహితము పొంటెఁ బాడఁబడినవియే.

ఏమనుష్యుఁడుగాని కూర్మము తనయవయవముల లోనిముడుచుకొన్నయట్లు కామముల లోఁ బఱచుకొనవలయును. లేనిచో వాఁడు దానినుండి తృప్తి నొందఁజాలఁడు. కామము లుపభోగమున నేనాఁటికిని దృప్తినొసంగవు, ఎంత హవిస్సుచేతను హుతవహుఁడు తృప్తినొందఁడుగదా. మీఁదుమిక్కిలి విశేషజ్వాలలచేఁ బ్రజ్వరిల్లును. అట్లే కామముల ననుభవించుకొలఁదిని గామాభివృద్ధియగుటయేగాని తృప్తిగలుగదు. భూమియందు వ్రీహియవహిరణ్యపశువులు స్త్రీలు ఒక్కరికిని దృప్తి నీఁజాలవు. అని తలంచి జ్ఞాని వీనిం గాంచి మోసమునొందఁడు. సర్వ

భూతములం జూచినపు డెవఁడు పాపభావమును మనోవాక్కర్మములచే నొందఁడో వాఁడే అప్పుడే బ్రహ్మపదము నొందును. ఎవఁడు ఎపుడితరులవలన భయపడఁడో, తననుండి యితరులకు భీతిని గల్పింపఁడో, దేనిని గోరఁడో, ద్వేషింపఁడో, అపుడే ఆతఁడు బ్రహ్మపదము నొందును.ఏది శ్రమించినను వదల శక్యముగాదో,ఏది తాను క్షీణించినను క్షీణింపదో, ఏది ప్రాణాంతికరోగమో, అట్టి తృష్ణను వదలినవాఁడే సుఖవంతుఁడు. తాను జీర్ణించినఁ గేశములు జీర్ణించును. దంతములు జీర్ణించును. ధనాశా జీవితాశలు తాను జీర్ణించినను జీర్ణింపవు. లోకమునఁ గామసుఖము, దివ్యమగు నితరసుఖము ఈ రెండును తృష్ణాక్షయసుఖమునఁ బదియాఱవపాలునకు సమానములు గావు.

అని యిట్లు రాజర్షియగు యయాతి సదారుఁడై వనమునకుం బోయెను. అందుఁ జాలకాలము దుష్కరతపం బొనరించెను. అందుండి భృగుతుంగమునకుం బోయి ఘోరతపం బొనరించి యది సమాప్తము కాఁగా నామహాయశుఁడు భుక్తిని వదలి సదారుఁడై తనువు వదలి స్వర్గమును బొందెను.

పాఠకోత్తములారా! యయాతిచరిత్రమును వింటిరి. ఇందుఁ గథాంశము ప్రధానము కాదు. దానిం జదివి యభ్యసింపఁదగిన విషయముల గ్రహించుటయే ప్రధానము. జనమేజయుఁడు బ్రహ్మహత్య నొనరించి మహాపాతకమును సంపాదించెను.

పంచమహాపాతకము లనంబడువానిలో నిది యొకటి. అట్టిదాని నెట్లో చేసెను. పశ్చాత్తాపము నొంది దానిం బోఁగొట్టుకొను వెరవెఱుంగక పరితపించెను. ఎన్నియో దేశములు తిరిగెను. కాని ఫలముగానఁడయ్యెను. తుదకు మహర్షి నాశ్రయించెను. ఆమహా నీయుఁడు హయమేధక్రతువును జేయించెను. క్షత్రియోచితమగు క్రతువునే చేయించెను. దాన బ్రహ్మహత్య యడంగెను. అనఁగా బుద్ధిలోపమునఁ జేసినపాపములు జ్ఞానాంకురము కాఁగా నావిర్భవించుపశ్చాత్తాపమునఁ జాలభాగము నశించు. అంతఁ బట్టుదలచేఁ దదనుగుణ మగునియమములం బూనిన నంతయు నశించు. దీనికిం గారణ మేమి? తాఁ జేసినది తప్పనియెఱుంగుట, ఇఁకమీఁద నిట్టితప్పులను జేయకుండ శపథము చేయుట. అట్టి పాపకృత్యములఁ జేయుబుద్ధిని వదలుటకై మనోనిగ్రహము నభ్యసించుట యనునవియే ప్రాయశ్చిత్తములు. కాని ప్రాయశ్చిత్తమని కొంత ధనవ్యయము చేసి మరల నట్టిపాపమునే యొనరించినచోఁ బూర్వపాపముతోఁ గలిసి యిది రెండవపాతకమగును. ఎంత ధనము వ్యయించినను బ్రాయశ్చిత్తమని యది యనిపించుకొనదు. దానఁ బాపము నశింపదు. అజ్ఞానకృతపాపమునకుఁ బ్రాయశ్చిత్తము పశ్చాత్తాపము. పెద్దలాదేశించినవ్రతము ఇదియే. దీనికిఁదోడు మరల నిట్టివి చేయ ననుశపథము. పాపకార్యస్వరూప మిట్టిదని సదా మననముచేయుట. అనునివి యన్నియుఁ జేసిన పాపములను బోఁగొట్టును. కాని లోకమును వచింపఁ

జేయునియమములు దానములు లోనగునవి పాపమును బోఁగొట్టఁ జాల వని నిరాఘాటముగఁ జెప్పవచ్చును.

ఇఁక యయాతి యొనరించిన కృత్యములు, పిదప నతనికిం గల్గినజ్ఞానము, అట్టితఁడ బోధించినవాక్యములు అనువీని నించుక పరికింపుఁడు. ఆతఁడు చిరకాలము రాజ్యమేలి సకలసుఖముల ననుభవించినను దృప్తిఁ జెందఁ డయ్యెను. పుత్రులు రాజ్యపాలనాధికారమునుబూనువయస్సుకలవారుకాఁగా రాజ్యములఁ బంచియిచ్చెను. అట్టితఁడు గామమునకు లోఁబడి తనముదిమికి రోసెను. పుత్రుల నిర్భరవయస్సు తనకుండిన మేలను నవివేకమునకులోఁబడియెను. అంతఁ గొడుకులను సిగ్గు వదలి వయస్సు నిం డని యాచించెను. వా రంగీకరింపకపోఁగా, క్రోధావేశమునఁ గొడుకులనియు భావింపక ఘోరశాపమున వారిని హీనులం జేసెను. కడపటి కొమరుడు వివేకిఁ గాన బెద్దలసాంగత్యము గలవాఁడు కావునను దుచ్చమిదిపోయిన నేమి లోప మని తలంచి యందుల కంగీకరించెను. ఆవయస్సాని చిరకాలము చరించెను. అచ్చరమిన్నం గూడి యెం దెందో తిరిగెను. వివిధవిధరతికేళులం దేలెను. ఎంతకాల మనుభవించిన నది యంతము గలది యని తోఁచెనా? తుదకుఁబూర్వతపఃఫలమున నీకామము అనుభవవిశేషములఁ జెడదనుజ్ఞాన మంకురించెను. వెంటనే యచ్చరమిన్నను వదలి పురికిం జేరి తన ముదిమిని గ్రహించి నీతివాక్యముల నుపదేశించెను. అవియే యీకథాసారములు. కామము లనుభవమున నశించునవి కానే

కావు. కాకపోవుటయేగాక వృద్ధియగుచుండును. వానినుపేక్షిం చుటయే సమంచితమార్గము. తత్సుఖము నిస్సారమని నిరంతర ము స్మరించుచుంటయే తన్నివృత్త్యుపాయము.

"ఏతన్మాంసవసాదివికారం
మనసి విచింతయ వారం వారమ్"

అని శ్రీశంకరభగవత్పాదులవా రుపదేశించిరి కదా. అనఁగా దాని నిరంతరము స్మరించుచు నిస్సారమనుకొను చుంటయే తన్నివృత్త్యుపాయము. అందుఁ దృష్ణాత్యాగము పరమసుఖ మనునది ప్రధానవాక్యము. దానిని మించిన యుత్త మకార్యము వేఱొండు గలదా. సర్వకష్టములనుదెచ్చిపెట్టునది యదియే. కానఁ దృష్ణాత్యాగముఁ జేసినవాఁడే ధీరుఁడు. వాఁడే తపస్వి. ఆతఁడే యోగి. ఆతఁడే ముక్తుఁడు. దానిని జయించు టయే సకలలోకజయము దానిని మించిన విజయము వేఱొక టి యుండదు.

ఈనీతులు యయాతి బోధించెను. యయాతి బోధింప కున్న నవియెవ్వరికిని దెలియవా యన్నప్రశ్నము న్యాయ్యమైనది కాదు. ఏలనఁగా యయాతి విషయసుఖముల మునింగి తేలిన వాఁడు. అనుభవమున నెఱింగినవానిపల్కులే పరిగ్రాహ్య ములు. అవియే విశ్వాసపాత్రములు. అనుభవమున నెఱింగిన విషయమునశింపదు. శాస్త్రపఠనజన్యజ్ఞానమనుభవసిద్ధముకా నిచో నది హేయమే యనవలసివచ్చును. వేదాంతరహస్యము

ల నుపన్యసించువా రెందఱో కలరుగాని స్వానుభవమున నెఱిం గినవా రందు లక్షకొక్కఁడే. అట్టివారు వీరివలెఁ జెప్ప సాహ సింపరు. ఏలయన నందలి కష్టములు వారనుభవించిరి. కానెం తకష్టము గలదో వారెఱింగినవారౌట నందఱిట్టికష్టముల భరిం పఁజాలరని వారెఱుంగుదురు. కావుననే పరిపక్వజీవుని గాంచిన పుడే వా రుపదేశింతురు. అట్టివారికిఁ గీర్తి యక్కఱలేదు. పది మంది మెప్పక్కఱ లేదు. నలుగురిలో గౌరవింపఁబడవలయున న్నయుద్దేశము వారికిలేదు. కాఁబట్టియే స్వానుభవమునఁజెప్పువా రిమాటలు ప్రమాణములని నమ్మకతప్పదు. యయాతి యిట్లు స్వానుభవమునఁ గామములను పేక్షింపలయుననియు లేకున్నచో నవి వృద్ధినొందునేగాని క్షీణింపవనియు బోధించెను.

వయస్సునుగ్రహించుట ముదిమి నిచ్చుట అనునీ రెండు కార్యములు శక్యములా యనుప్రశ్నము చేయకమాన నయితి గాదుకదా. వయస్సు నొకరికిచ్చుట యన్నంతనే నవ్వువచ్చును. ఇది కేవల మసంగత విషయముగాఁదోఁచునని యనువారుండక పోరు. కాని వారి కిట్లు సమాధానము చెప్పవలయును. సామా న్యదృష్టికి దుస్సాధ్యములని తోఁచినవన్నియు దుస్సాధ్యములు కావు. దేవతారాధకులకవి సుసాధ్యములే. విషముమ్రింగి జీర్ణించుకొనుట నిరాలంబమార్గమునఁ బ్రయాణముచేయుట, స్థలాంతరమున జరుగుచున్నవిషయములందెలిసికొనుట యను మొదలగునవి సామాన్యదృష్టి కశక్యకార్యములుగఁ దోఁచి

నను యోగులకవిసుసాధ్యములే యగుచుండును. అట్టివిషయ ములఁ సాధించుమార్గములు స్థూలదృష్టికిగోచరింపవు. కాని యి దియిట్లు సాధింపవలయునని సామాన్యు లూహింపక యూర కుందురు. చిత్తసమాధియే ప్రధానతపస్సుగా భావించినయెడల నీపైకార్యములే కాక యింతకంటెఁ బెద్దపెద్దకార్యములు గూడ మనము చేయఁగల మని తెలియఁగలదు. ఇట్టిశక్తి కలుగుటకుఁ బ్రధానహేతువు యోగము నభ్యసించుటయే. అది లేనిచో నేకార్యమును సాధింపఁజాలము. యోగశక్తిచేఁ గొండలు పిండి చేయవచ్చు. సముద్రముల శోషింపఁ జేయవచ్చు. ఆశక్తి లేనిచోఁ గోఱలు లేనిభుజంగమువలె బుసకొట్టవలయునేకాని యేకార్యమును సాధించుశక్తియుఁ గలుగదు. అట్టియశక్తుల కన్నికార్యములు సాధ్యములే కావని తోఁచు. అవిసాధ్యములే యని వారి నమ్మునట్లు చేయుట చాలఁ గష్టతరమగు కార్యమే. అయినను వారు యోజించి యోగమహిమము నెఱుఁగవలయు నని తెల్పుటకన్న నెక్కువగా వ్రాయఁజాలను. ఋయుక్తులు పన్ని ముఖపిధానము చేయుమాటలు చెప్పఁబూనను. ఎట్టియు త్కృష్టకార్యమైనను యోగి చేయఁగలఁడు. ఎట్టియశక్యకార్య మైనను యోగికి శక్యమే యగును. కావున యోగము నభ్యసిం చుట ప్రధానకార్యము.

ఇంక నీగొడవలో విశేషపరిశ్రమము చేయక ప్రకృత కథాభాగమునకు వచ్చెదను.

ఇఁక యయాతివంశచరిత్రము వినుఁడు. యదువునకుఁ శాపము గలిగెను గదా. రాజ్యాధికారము నశించెనుగదా. ఈవిషయమే శ్రీకృష్ణావతారతత్త్వమునఁ బ్రధానము.

"యదోశ్చ ధర్మశీలస్య నితరాం మునిసత్తమ"

అనుదానిపై నీకథ వ్రాయవలసివచ్చెఁగదా. ఆయయాతివంశమున నైదుగురు రాజపుత్రులు విఖ్యాతి నొందిరి. సూర్యుఁడు కిరణములచేఁ బృథ్వి నాక్రమించినట్లు వీరిచే నీభూమి యావరింపఁబడియె.

## —యదుసంతతి.—

అందు యదువంశ మిట్లు వృద్ధి నొందెను. అందేకదా శ్రీమన్నారాయణమూర్తి పుట్టెను. అట్టిది పరమపవిత్రవంశ మనక తప్పదుగదా. ఎన్ని శాపము లున్నను, ఎన్నికళంకము లున్నను భగవజ్జననముచే నవి నశించిపోవుటయేగాక సకలయశోవృద్ధులు గలుగును. ఈవంశవిస్తృతి వినినచో సంతానము కీర్తియుఁ గల్గును. యయాతిచరిత్రము పరమపావనమైనది. అని రోమహర్షణుఁడు చెప్పఁగా విని మహర్షు లిట్లనిరి.

*మునీంద్రా! పూరువంశమును వినఁగోరెదము. ద్రుహ్యానుయదుతుర్వసువంశములను వినఁగుతూహలము మాకుం గలదు. కాన వదలక వచింపుమా యన విని సూతుం డిట్లనియె. ముని

---

*ఇది బ్రహ్మపురాణము పదునొకండవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

లారా! పూరువంశమును వినుండు. అది పరమపావనము. కాన నానుపూర్విగావచించెదను. పురుపుత్త్రుఁడు సువీరుఁడు. వాని కొడుకు మనస్యునామకుఁడు. వానియాత్మజుఁ డభయదుఁడు. తత్తనయుఁడుసుధన్వుఁడు. వానియారసుఁడు సుబాహువు.వాని బుడుతఁడు రౌద్రుఁడు. ఆతనియంగభవులు దశార్ణేయువు, కృకణేయువు, కక్షేయువు, స్థండిలేయువు, సన్నతేయువు, ఋచేయువు, జలేయువు, స్థలేయువు, ధనేయువు, వనేయువు ననుపది మంది వెలసిరి. భద్రయు, శూద్రయు, మద్రయు, శలదయు, మలదయు, ఖలదయు, నలదయు, సురసయు, గోచపలయు, స్త్రీరత్నకూటయు ననుపదిమందిపుత్త్రికలు గల్గిరి.

అత్రివంశమున జనించి మహర్షియగు ప్రభాకరుఁడు భద్రనుబెండ్లియాడెను. సోముఁడను కుమారుఁడుగల్గెను. స్వర్భానుహతుఁడగు సూర్యుఁడు వియత్పథమునుండి క్రిందఁబడుచుండఁగా లోకముతమస్సంవృతముకాఁగా అంధకారనిరాసార్థమా ప్రభాకరమునిచేతనే ప్రభ కల్పింపఁబడియెఁగదా. దివాకరా! నీకుశుభములుగలుగుఁగాక యనియామహాత్ముఁడే యాశీర్వదింపఁ దద్వచనంబున సూర్యుఁడు క్రిందఁబడక స్వస్థానంబుననే నిల్చెఁజాలెను. ఆప్రభాకరమహర్షియే భద్రను వివాహమాడినవాఁడని యెఱుంగునది. ఆమునియే అత్రిగోత్రముల శ్రేష్ఠములుగా ధరణివెలయించినవాఁడు. యజ్ఞముఁలయందు దేవత లత్రిబలమును నెలకొల్పిరి. మఱియు నాప్రభాకరముని

మిగిలినతొమ్మండ్రుగురను వివాహమాడి మహాసత్వులై దారుణతపోనిరతులగు పుత్త్రులంగాంచెను. ఆపుత్త్రులు గోత్రకర్తలై వేదపారగులై మునివరులై వెలసిరి. వారందఱు స్వస్త్యాత్రేయులన విఖ్యాతులైరి.

కక్షేయువునకు ముగ్గురు కొడుకులుగల్గిరి. వారు మహారథులు. సభానరుఁడు, చాక్షుషుఁడు, పరమన్యువు అని వారిపేరులు. అందు సభానరునకు విద్వాంసుఁడగు కాలానలుఁడను రాజుగలిగెను. వానికి ధర్మజ్ఞుఁడగు సృంజయుఁడు పుట్టెను. ఆతనికి మహావీరుఁడగు పురంజయుఁడు జన్మించెను. ఆరాజునకు జనమేజయుఁడు కొమరుఁడు. వానికి మహాశాలుఁడుపుట్టె. ఆతఁడు దేవలోకమునం గూడఁ బ్రఖ్యాతిగాంచి భూతలంబు నలరించెను. ఆమహాశాలునకు ధార్మికుఁడై వెలయు మహామనోనామకుఁడు కొడుకుడయించెను. ఆతండు సురగణపూజితుఁడయ్యెను. ఆమహామనసునకు నిద్దఱుకొడుకులుగల్గిరి. అందుసీనరుఁడు జ్యేష్ఠుఁడు. బలశాలియగు తితిక్షువు కనిష్ఠుఁడు. ఉయుసీనరుఁడు రాజవంశమునఁ బుట్టిన కన్యకలనేవురం బెండ్లియాడెను. నృగయు, నవయుఁ, గృమియు, దర్వయు, దృషద్వతియునని వారిపేరులు. వారుపంచపుత్త్రులంగాంచిరి. వారెల్ల వంశకర్తలైరి. అందు నృగకొమరుఁడు నృగుఁడు. కృమిపుత్త్రుఁడు కృమియనువాఁడు. నవ యను నామె తనయుఁడు నవుఁడు. దర్వ

యనునా తిమిన్నతనూజాతుఁడు సువ్రతుఁడు. దృషద్వతికి శిబి యారసుఁడయ్యె.

అందు శిబికి శిబులు కొడుకులైరి. నృగునకు యౌధేయులు కొమరులు. నవుఁ డనువానికి నవరాష్ట్రుఁడు బుడుతఁడు. కృమికి కృమిల యనునది కొమరిత. సువ్రతుఁడు అంబష్ఠులనఁ బడువారిం గాంచె. శిబికి లోకవిశ్రుతు లగునల్వురు శిబులనువారు గల్గిరి. వారిపేరులు వృషదర్భుఁడు, సువీరుఁడు, కైకేయుఁడు, మద్రకుఁడు అని. వారియేలుబడియం దున్నరాజ్యములు కైకేయము లనియు. మద్రకము లనియు, వృషదర్భము లనియుఁ బ్రఖ్యాతినొందెను.

ఉసీనరునిసోదరుఁడు తితిక్షువని మున్నె చెప్పఁబడెఁ గదా. అతనిసంతానంబు వినుఁడు. మునులారా! తితిక్షువు. పూర్వదిగ్భాగము నేలుచు రాజేంద్రుఁడనఁ బ్రఖ్యాతి నొందెను. అతనికి ఫేనుఁడు కలిగె. అతఁడు సుతపసుం గాంచెను. వాఁడు బలి యనువానిం బడసెను. కాంచనమయతూణీరములు గల యారాజుమానుషయోనిం బుట్టియు మహాయోగియైరాజుగూడ నయ్యెను. ఆరాజయోగి వంశకర్తలగు నైదుగురఁ బుత్రులం గనెను. అందు నంగుఁడు జ్యేష్ఠుఁడు. వంగ, సుహ్మ, పుండ్ర, కలింగ నామకులు అంగునకనుజులు. ఆవంశము బాలేయ మనం బ్రఖ్యాతం బయ్యె. వా రందఱు బ్రాహ్మణులు వంశోద్ధారకులు నైరి.

మునిపుంగవులారా! పూర్వము బ్రహ్మ బలికి వర మిచ్చెను. ఏమనఁ గల్పాంతము నీవు జీవించియుందువుగాక అనునదియే. ఆబలి ధర్మతత్వార్థవేత్తలలో మొదటివాఁడు. యుద్ధమందజేయుఁడు, ధర్మప్రధానుఁడు నయ్యెను. త్రైలోక్యదర్శన మావర ప్రభావమున నాతనికిం గల్గెను. బ్రహ్మయు నతిప్రీతుఁడై వరప్రదానకాలమందు నీవు భూతలంబున నాల్గువర్ణముల స్థాపించువాఁడవు కమ్మని యాజ్ఞ యిచ్చెను. ఆవరములఁ బొంది యాబలి మహాశాంతమూర్తి యయ్యెను. ఆబలి చిరకాలము రాజ్య మేలి స్వర్గమున కేగెను. తత్పుత్రుల రాజ్యములైదును అంగ, వంగ, సుహ్మక, కలింగ, పుండ్రకము లనం బ్రఖ్యాతంబులయ్యెను.

ఇఁక బలిపుత్రులలో జ్యేష్ఠుఁడగు నంగుని సంతానము వినిపించెద. అంగపుత్రుఁడు దధివాహనుఁడనఁ గీర్తివహించి రాజేంద్రుఁ డయ్యెను. దధివాహనసూనుఁడు దివిరథుఁడు. వాని పుత్రుఁడు శక్రతుల్యపరాక్రముఁడగు స్వర్గరథుఁడు. వానికుమారుఁడు చిత్రరథుఁడు. స్వర్గరథుఁడు రాజ్యము సేయుచుఁ గాలంజరపర్వతంబున యజ్ఞము చేయుచుండ శతమఖుఁడు సాక్షాత్కరించి సోమపానమొనరించెను. ఆతని కొమరుఁడగు చిత్రరథునకు దశరథుఁడు తనయుఁడయ్యెను. ఆతఁడే లోమపాదుఁడనం బ్రసిద్ధుఁడై రాజ్యమేలెను. ఆయనకొమరితయే శాంతాదేవి. ఆదశరథునకు మహాయశంబుగల చతురంగుఁడు కొమరుండయ్యెను. ఋశ్యశృంగప్రసాదంబున నతఁడు కులవర్ధనుఁ

డయ్యెను. చతురంగపుత్త్రుఁడు పృథులాక్షుఁడు. వానికిఁబుత్త్రుఁడు. చంపనామకుఁడు. ఆచంపునినగరము చంపాపురియనం బ్రఖ్యాతింగాంచెను. దానిపూర్వనామము మాలినీపురియనియుండెను. ఆతనికిఁ బూర్ణభద్రముని ప్రసాదంబున హర్యంగుఁడనుకొడుకు కలిగెను. వానికొడుకు వైభాండకి. అతని యేనుఁగైరావతము. ఆతఁడుమంత్రబలంబున స్వర్గమునుండియైరావతము దిగివచ్చునట్లు చేసెను. అహర్యాంగునకు భద్రరథుఁడు. తనయుఁడువానికి బృహత్కర్మ యను వాఁడు కలిగె. ఆతనికుమారుఁడు బృహద్దర్భుఁడు. వానికి బృహన్మనసుండు కొడుకయ్యెను. వాఁడేజయద్రథుండను తనయునిం గాంచెను. దృఢరథుఁడు తత్తనూజాతుఁడు. తత్పుత్త్రకుఁడు జనమేజయుండు వైకర్ణుండు వానికొడుకు. వికర్ణుఁడు వానితనయుండయ్యె. ఆవికర్ణునకు నూర్వురు కొడుకులు గలిగియంగవంశకర్తలైరి. మహర్షులారా! అంగవంశప్రభువులగు రాజులవర్ణించితిని. వీరెల్ల సత్యవ్రతులు, మహాత్ములు, ప్రజావంతులు మహారథులు నగుదురు.

## ఋచేయునివంశము.

రౌద్రాశ్వతనయుఁడగు ఋచేయునివంశము వివరించెద. సావధానముగావినుఁడు. ఋచేయునికి మతినారుఁడు నాఁ దనయుండు గలిగె.

వానికి వసుగోధనుఁడు, ప్రతిరథుఁడు, సుబాహువునను ముగ్గురు తనూజులుగలిగిరి. వీరెల్ల వేదవేత్తలు. జ్ఞానులు. సత్య

వాదులు నగుదురు.-ఈముప్పురితరువాత ఇల యను పుత్రికయుఁ గలిగెను. ఆమె బ్రహ్మవాదిని. తంతు వనువాఁ డామెను బెండ్లి యాడెను. ఆదంపతులకు ధర్మనేత్రుఁడుగలిగె. బ్రహ్మవాదియుఁ బ్రతాపశాలియు నగు నాధర్మనేత్రునకు పదానవియనునది ప త్ని యయ్యెను. ఆమెకు నల్వురు కొడుకులు గల్గిరి. దుష్యంతుఁ డు, మతిమంతుఁడు ప్రవీరుఁడు, అనఘుఁడు అనుపేరులు వారి కిం జెల్లెను.

దుష్యంతునకు భరతుఁడు కొడుకు. ఆతఁడు సర్వదమ నుఁ డనుపేరఁ బరఁగుచు నాగాయుతబలుఁడై చక్రవర్తియయ్యె ను. ఆతనితల్లియే శకుంతల. శకుంతలాదుష్యంతులకుఁ గలిగిన యీభరతునిపేరనే యీభారతవర్షము ప్రఖ్యాతింగాంచెను. ఆభ రతునకుఁ బెక్కుమందితనయులుగలిగిరిగాని తల్లులకోపంబున వా రెల్లనశించిరి. ఆంగిరసుఁ డగుబృహస్పతికి భరద్వాజుఁడు పుత్రుఁడ య్యెను. ఆభరద్వాజుఁడు భరతునిచే యజ్ఞము చేయించుచుండఁ గొడుకు కలుగుటచే నాకొడుకు వితథుఁడయ్యెను. అంతట భర తుఁడు స్వర్గమున కేగెను. వితథునకు రాజ్యమొసంగి యభిషేక మహోత్సవ మొనరించి భరద్వాజుఁడు వనమున కేగెను. ఆవి తథున కైదుమందికొడుకులు. సుహోత్రుఁడు, సుహోత, గయుఁడు, గర్గుడు, కపిలుఁడు ననుపేరులు వారికిం జెల్లె. సు హోత్రున కిద్దఱుకొడుకులుగలిగిరి. అందుఁగాశికుఁడు పెద్దవాఁ

డు. గృత్సమతి రెండవవాఁడు. వారిలో గృత్సమతికి బ్రాహ్మణులు, క్షత్రియులు వైశ్యులు తనయులు గలరు. కాశికునకు దీర్ఘతపుండనుకొడుకు కలిగె. ఆతనికి ధన్వంతరి తనయుండు. కేతుమంతుఁ డాతనికొమరుఁడు. భీమరథుఁడు వానిపుత్త్రుఁడు. దివోదాసుఁడు వానిని దండ్రి యని పిల్వఁ దగువాఁడు. ఆతఁడే కాశీనగరాధిపతి యయ్యెను. అతఁడు సర్వక్షత్రియగర్వనిర్వాపణక్షముఁడు.

దివోదాసునకుఁ బ్రతర్దనుఁడు కొమరుఁడు. వానికి వత్సభార్గవు లిర్వురు కొడుకులు. అలర్కుఁ డనురాజపుత్త్రుఁడు హేహయవంశమందుఁ బుట్టి దివోదాసుఁడు యుద్ధమున హరించినపిత్రుభాగ్యమును మరల నాక్రమంచెను. భీమరథునకు అష్టారథుఁడు కొడుకయ్యెను. అలర్కుఁ డాతరుణమున కాశీరాజ్యము నాక్రమించి యఱువదియాఱువేలయేండ్లు పాలించెను. ఇంతటి యాయుస్సారాజునకు లోపాముద్రా ప్రసాదమునఁ గలిగెను. ముదుసలితనమున నాతఁడు క్షేమకాసురుం జంపి వారాణసీపురిని నిర్మించెను. అలర్కునికుమారుఁడు క్షేమకుఁడు. వర్షకేతువాతనికొడుకు. విభు వనువాఁడు తత్సుతుఁడు. విభువున కానర్తుండు తనూజుఁడు. సుకుమారుఁడు వానికిం బుట్టె. సుకుమారాత్మజుఁడు సత్యకేతువు. మహాతేజుఁడు వానికిం దనయుఁడయ్యెను. వీ రెల్ల భార్గవసంతతికిఁ జేరినవారు. అంగిరఃపుత్త్రులు. వీరిలో బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రు లనునాల్గుజాతులు గలరు.

## అజమీఢునివంశము.

సుహోత్రునకు బృహన్నామకుఁడు కొడుకయ్యె. వానికి అజమీఢుఁడు ద్విమీఢుఁడు పురుమీఢుఁడను మువ్వురు కొడుకులు పుట్టిరి. అజమీఢునకు మువ్వురు భార్యలు. నీలియుఁ, గేశినియు, ధూమినియు నని వారిపేరులు. అందుఁ గేశిని జహ్నువును బ్రతాపశాలిని గనియె. సర్వమేధ మనుమహాసత్రము నాతఁడే యొనరించెను. గంగాదేవి పతిలోభమున నాతనినే యనుసరించెఁ గదా. ఆతఁ డుపేక్షించుటచే నాతనిసదస్సును ముంచివైచెను. యజ్ఞవాటము నీలాగునముంచుటఁజూచి యాజహ్నుముని క్రుద్ధుఁడై గంగాదేవీ! చూడుము త్రిలోకవ్యాపిని వగునిన్ను నిముసమాత్రమునఁ ద్రాగెదను. ఈగర్వమునకుఁ బ్రతిఫల మిపుడే యనుభవింతువు. అని తనతపశ్శక్తిపేర్మి దానిం ద్రావెను. మహర్షు లావిధ మెఱింగి నీ కిది పుత్రికయగు. క్షమింపుమా యని వేడి గంగనుసాగనంపిరి.

ఆజహ్నుమునిరాజు యువనాశ్వునిపుత్రికయగు కావేరిని బెండ్లియాడెను. ఆమెపై గంగాదేవి కోపించి శపించెను. దానన నామె కొంతకాలమునకు నది యయ్యెను. ఆజహ్నువునకజకుఁడు జనించెను. అతనితనయుఁడు వలాకాశ్వుఁడు. నిరంతరమృగయాశీలుఁ డగుకుశికుఁడు వానికుమారుఁ డయ్యె. ఆరాజు వనచరులగు పహ్లవులతో సహవాసము చేసి వృద్ధినొందెను. ఆకుశికుఁడు శతమఖసమునిఁ బుత్త్రునిం బడయుకోరికఁదప మొనరిం

చెను. ఇంద్రుఁడు నేనే నీకొడుకున య్యెదనని వరమిచ్చెను. ఆయన
కు గాధియనురాజు పుట్టెను. ఆరాజుసాక్షాచ్ఛతమఖుఁడే. ఆగా
ధికి విశ్వామిత్రుఁడు కొడుకు. * విశ్వామిత్రున కష్టకుఁడు కొడు
కు. వానికి లౌహి తనయుఁడు. ఇది జహ్నుమునివంశపరంపర
యని యెఱుంగుఁడు. ఇంకొకభాగ మీజమీఢవంశ మనఁబరఁ
గె. దానిం దెలిపెద. ఆలకింపుఁడు.

అజమీఢుని భార్య నీలి యనునంగన. ఆమెకు సుశాం
తి యనుకొడుకు గలిగె. సుశాంతికిఁ బురుజాతి యనుకొమరుఁ
డుదయించెను. పురుజాతికి వాహ్యాశ్వుఁడు కొడుకు. వాని కైదు
గురు కొడుకులు. ముద్గల, సృంజయ, బృహదిషు, యవీనర,
కృమిలాశ్వులని వారిపేరులు. వారైదుగురే లోకమునంతయుఁ
బాలింపఁ గలవారని విఖ్యాతి గలదు. ఆపంచపుత్రులదేశము
లే పాంచాలములనం బరఁగె. ఆదేశములవారు బహునీతియుక్తం
బుగఁ బాలించిరి. అందు ముద్గలునిపుత్రుఁడు మౌద్గల్యుఁడు.
ఇంద్రసేన యనుకన్యక యామహాత్మునిం బెండ్లియాడి వంధ్య
శ్వుం గనియె.

సృంజయునికొడుకు పంచజనుఁ డనం బ్రఖ్యాతి వహిం
చె. వానికి సోమదత్తుఁడు తనూజాతుఁడు. సహదేవుఁడు వాని
యాత్మజుఁడు. సోమకుఁడు తద్భవుఁడు. గృత్సమతి వానికొ
డుకు. వానికజమీఢుఁ డనువాఁడు పుట్టెం. వానివంశము సంతతి

* ఇందు కొన్ని యధిక పాఠశ్లోకములు గలవు. ప్రక్షిప్తము లౌట వదలితి.

విహీనమగు నన్నతటి నావంశమున సోమకుఁ డుదయించెను. వానికి జంతువు తనయుఁడు. వానికి నూర్వురు కొమరులు గలిగిరి. వారిలోఁ గడపటికొడుకు పృషతుఁడు. ఆతఁడే ద్రుపద మహారాజుతండ్రి యని తెలియుఁడు. వీరెల్ల అజమీఢవంశ సంభూతులు. సోమకు లనం బ్రసిద్ధిఁ గాంచిరి.

అజమీఢునిభార్య ధృమిని యనునది పుత్త్రుం గోరునది. పతివ్రత. అదృష్టవంతురాలు తనయుం బ్రసిద్ధుంబడయుం గోరి వ్రతచర్యాపరాయణురాలై పదివేలసంవత్సరములు ఘోరతపం బొనరించెను. మితభోజనము చేయుచు హుతవహునందు వేల్చుచు అగ్నిహోత్రు నారాధించినకుశలయందే శయనించుచు నుండఁగా నాభార్యయం దజమీఢుఁడు ఋక్షుఁ డనుకొడుకుం బడసెను. వాఁడు ధూమ్రవర్ణుఁడు సుదర్శనుఁడు నయ్యెను. ఆతనికి సంవరణుఁడు కొడుకు. కురువు తత్పుత్త్రుఁడు. ఆతఁడే ప్రయాగక్షేత్రమును మించినకురుక్షేత్రమును నిర్మించెను. ఆక్షేత్రమే పుణ్యతమమై, నివాసార్హమై రమణీయమై యొప్పెను. ఆకురువువంశమును ప్రసిద్ధమయ్యెను. అం దుదయించినవారెల్లఁ గౌరవు లనంబరఁగిరి.

కురురాజునకు నల్వురు కొడుకులు. సుధన్వుఁడు, సుధనువు, పరీక్షిత్తు, అరిమేజయుఁడు అని వారినామములు. పరీక్షిత్తునకు జనమేయుఁడు కొడుకు. మహాధార్మికుఁ డనుఖ్యాతి వహించెను. ఆతనికి శ్రుతసేనోగ్రసేన, భీమసేనులను ముప్వురు

తమ్ములుగలరు. వారెల్ల మహాపరాక్రమశాలు రనఁబరఁగిరి. ఆ జనమేజయునకు సురథుఁడను మహామతి తనయుఁడు. వానికి విక్రాంతుఁడు కలిగె. ఆతఁడే విదూరథుఁ డనుపేరు వహించెను. ఆ విదూరథునకు ఋక్షనామకుఁడు కలిగెను. భరద్వాజముని కరుణ రెండవకొడుకు గలిగెను. వానికి నాపేరే పెట్టఁబడియె. సోమవంశమున ఋక్షనామకు లిద్దఱు. పరీక్షిత్తు లిద్దఱు. భీమసేనులు మువ్వురు. జనమేజయు లిర్వురు గలరు.

రెండవ ఋక్షునకు భీమసేనుఁడు కొడుకు. వానికిం బ్రతీపుఁడు తనయుఁడు. వానికి శంతనుఁడు కలిగె. దేవాపియు, బాహ్లికుఁడు ననువారు శంతనుసోదరులు. శంతనుఁడు ప్రభువయ్యెను.

ఇఁక బాహ్లికవంశమును వినుఁడు. బాహ్లికుఁడు రాజర్షియనంబడియె. వానికి సోమదత్తుఁడు మహాకీర్తిశాలియై జన్మించెను. వానికి భూరి, భూరిశ్రవ, శ్శలు లనువారు మూఁగురు పుత్త్రికులు గల్గిరి. బాహ్లికు నన్నయగు దేవాపి దేవతల కుపాధ్యాయుఁ డయ్యెను. ఆదేవాపికిఁ జ్యవనపుత్త్రుఁడగు కృతకముని మిత్త్రుఁ డయ్యెను.

### శంతనువంశము.

రాజుగు శంతనుసంతతి వినఁదగినది. ఇదియే త్రిలోకవిశ్రుతము. శంతనుఁడు గంగాదేవినుండి దేవవ్రతుం డను కొడుకుం బడసె. వాఁడు భీష్ముఁ డనుప్రఖ్యాతనామమును ధరించి

పాండవపితామహుం డయ్యెను. కాళి యనునది విచిత్రవీర్యుని గనియె. శంతునునకు రెండవభార్య యీకాళియే. విచిత్రవీర్యుఁ డకల్మషుఁడు.

కృష్ణద్వైపాయనముని విచిత్రవీర్యక్షేత్రమున (= భార్యయందు) ధృతరాష్ట్రుని, పాండువును, విదురునిఁ బడసెను. ధృతరాష్ట్రుఁడు గాంధారిం బెండ్లియాడి నూఱుగురు పుత్త్రులం గనియెను. వారిలో దుర్యోధనుఁడు జ్యేష్ఠుఁడు. ప్రభువు కూడ నయ్యెను. పాండురాజునకు ధనంజయుఁడు కొడుకు. సౌభద్రుఁడు ధనంజయునకుఁ గొడు కయ్యెను. అతఁ డభిమన్యు వనంబరఁగె. వానికిఁ బరీక్షిత్తు గలిగె. ఆతనికి జనమేజయుఁడు పారీక్షితుఁ డనఁగలిగె. ఆతనికిఁ గాశీనగరంబున నిర్వురు కొడుకులు గలిగిరి. చంద్రాపీడ సూర్యాపీడు లని వారినామములు. చంద్రాపీడునకు శతపుత్త్రులు గలిగిరి. ఆవంశము జానమేజయ మను ఖ్యాతిం గాంచెను.

ఆవంశమున జ్యేష్ఠుఁడు వారణనగరంబున సత్యకర్ణుఁడు మహాబలుఁడై భూరిదక్షిణలు గలయజ్ఞముల నొనరించుచు నుండెను. ఆతనికొడుకు శ్వేతకర్ణుఁడు. ఆతఁడు సంతానహీనుఁడై తపోవనమునకుం బోయెను. యాదవి యనునాతనిపత్ని ఆవనమునందే గర్భవతి యయ్యెను. ఆమె యదువంశభవ యగుట యాదవియనియు సుబాహుదుహితయై మాలిని, గ్రాహమాలిని యనియుఁ బిల్వఁబడు చుండును. ఇట్లు తనపత్నిగర్భ

వతి కాఁగా శ్వేతకర్ణుఁడు తనసంకల్పము మానక మహాప్రస్థానము చేయ నుపక్రమించెను. మాలినియుఁదోడన బయలు వెడలెను. ఇట్లు సుబాహుపుత్రిక భర్తవెంటఁ బోవుచు మార్గమున నొకకొడుకును గాంచెను. కాని ఆబాలుని సుకుమారు నందే విడిచి భర్తవెంట నాసాధ్వి బయలు వెడలెను. ద్రౌపదివలెనే యీకెయు మహాపతివ్రత. తల్లి లేని యాకుమారుఁడు గిరికుంజమున నేడ్వసాగెను. మేఘములు దయగల్గి సూర్యాతపము శిశువుపై సోకకుండఁ గ్రమ్ముకొని యుండెను.

శ్రవిష్ఠాపుత్రు లిర్వురు పైప్పలాదికౌశికు లనువారు శిశువు నాతనిం గైకొని స్నానముచేయించి నెత్తురు కందువు పీరును నెత్తుటం దోఁగి శిలాతలంబునఁ బరుండఁబెట్టి కుమారుని ప్రక్కనఁ గూరుచుండియుండిరి. వారినీడచే నాశిశువు నేదదేరుటచే వారాతని కజశ్యాముఁ డనిపేరిడి రోమకశాలయం దుంచిరి. అట నాశిశువు వృద్ధి నొందెను. రోమకునిభార్య సంతానహీన యాట నాశిశువును బెంచెను. కాన నాతఁడు రోమకపుత్త్రుఁ డనఁ బడెను. ఆయిరువురు బ్రాహ్మణు లాతనికి నెచ్చెలులై యుండిరి. ఆముప్వురిపుత్రపౌత్త్రు లసంఖ్యాకులుగ వెలసిరి. ఇది పౌరవవంశము.

యయాతిచే వచింపఁబడిన శ్లోక మొక్కండు గలదు. యయాతి జరాభారపీడితుఁడై యీశ్లోకమును జెప్పెను. అది యిదియే.

"శ్లో. అచంద్రార్కగ్రహా భూమి ర్భవేదియమసంశయమ్,
అపౌరవా మహీ నైవ భవిష్యతి కదాచన."

ఈభూమి సూర్యచంద్రగ్రహము లుండునంతవఱ కుండును. నిస్సందేహము. ఎప్పుడుగాని పౌరవవంశజరాజవిహీనయై యుండకుండుఁగాక.

మునులారా! విఖ్యాతమగు నీపౌరవవంశము చక్కగా మీకుం జెప్పితిని. ఇఁక దుర్వసునియు, ద్రుహ్యానువులయు వంశమును వర్ణించెద. వినుం డని యిట్లు చెప్పఁదొడంగె.

## తుర్వసువంశము.

తుర్వసునకు వహ్ని కుమారుఁడు. వానికి గోభానువు, వానికిఁ ద్రైశానువు, అతనికిఁ గరంధముఁడు, అవ్వానికి మరుత్తుఁడు, అతనికి నవిక్షితుఁడు గలిగిరి. అనపత్యుఁడైన యాయవిక్షితుఁడు బహుయజ్ఞము లొనరించెను. అతనికి సంయాతయనుపుత్రిక కల్గెను. ఆకన్యను యజ్ఞములు చేయించినసంవర్త మునికారా జొసంగెను. ఆమెకుఁ బౌరవుం డగుదుష్యంతుఁడు కలిగెను. ఇట్లు యయాతిశాపంబునఁ దుర్వసువంశము పౌరవవంశమునఁ గలిసిపోయెను. దుష్యంతునికుమారుఁడు కరూరోముఁడు. వానికి ఆహ్రీదుఁడు కలిగెను. వానికి నల్వురు కుమారులు గలిగిరి. పాండ్య, కేరళ, కోల చోళు లని వారిపేరులు. వారిరాజ్యములు పాండ్య చోళ కేరళము లని ప్రఖ్యాతంబు లయ్యెను.

ద్రుహ్యునకు బభ్రుసేనుఁడు కుమారుఁడు పుట్టెను. అంగారసేనుఁడు వానితనయుఁడు. అతఁడే మరుత్పతి యనఁ బరఁగెను. వాఁడు యావనాశ్వునితో ఘోరాహవము పదిమాసము లొనరించి హతుఁ డయ్యెను. వానికొడుకు గాంధారుఁడు. ఆతని పేరనే గాంధారదేశ మని రాజ్యము పిల్వఁబడియె. గాంధారదేశాశ్వము లుత్తమాశ్వములన్న పేరు వహించినవి.

అను వనువానికి ధర్ముఁ డనుకుమారుఁడు కలిగెను. ధృతుఁడు తత్సుతుఁడు. శతద్రుహుఁడు వానియాత్మజుఁడు. ప్రచేతసుఁడు వానికొడుకు. సుచేతసుఁడు వానికొడుకు. యదుపుత్రులైదుగురు దేవసుతసమానులు. సహస్రద, పయోద, క్రోష్ట్ర, నీలాంజికులనుపేరులు వారికిం జెల్లె. సహస్రదునకుఁ బరమధార్మికు లగు పుత్రులు ముప్వురు గలిగిరి. హైహయ, హయ, వేణుహయు లన వారు భూమి వెలసిరి. అందు హైహయునకు ధర్మనేత్రుఁ డనుకొడుకుపుట్టెను. వానికిఁ గార్తుం డనుకొడుకు గలిగెను. కార్తునకు సాహంజుఁడు కుమారుఁడు. సాహంజానీపురి ఆరాజుచేతనే కట్టింపఁబడియె. మహిష్మంతుఁ డనువానికి భద్రశ్రేణ్యుఁడు కలిగెను. వానికి దుర్దముఁడు తనయుఁడు. కనకుఁడు తత్తనూజుఁడు. కనకపుత్రులు నల్వురు లోకవిశ్రుతులు. కృతవీర్య, కృతౌజసు లని, కృతకర్మ, కృతాగ్ను లని వారి పేరులు. కృతవీర్యున కర్జునుఁడు కుమారుఁడు. ఈతఁడే కార్తవీర్యార్జునుఁ డనఁ బరఁగెను. సహస్రబాహువులచే సప్తద్వీప

ముల సంచరించి పౌరుషము నెఱపినమహానుభావుఁ డీతఁడే. ఒక్కఁడే రథ మెక్కి భూమీశుల నెల్ల జయించెను. ఆరాజు పదివేలవత్సరములు దారుణతపం బొనరించెను. దత్తాత్రేయమహర్షి నారాధించెను. ఆముని యత్రిమహర్షికుమారుఁడు. ఆముని ప్రీతుఁడై నాలుగు వరము లొసంగెను. మొదటి వరము సహస్రబాహువులుండవలయునని, రెండవది తానధర్మమునఁ బ్రవేశించినను బెద్దలు వలదన్న మానుకొనునట్టి బుద్ధి యుండవలయు నని, మూఁడవది భయంకరపౌరుషమున భూమి నెల్ల జయించి ప్రజానురంజనముగాఁ బాలించుశక్తి కలుగవలయు నని, నాల్గవది యుద్ధరంగముల శత్రువుల,నెన్నియో సారులు జయించి మహాహవమునసే న్మృతినొందవలయునని. ఇవియే యారాజుకోరినవరములు. యుద్ధముసేయఁగోరినపు డామహీజానికి సహస్రబాహువులు మొలుచును. ఆకార్తవీర్యార్జునుఁడే సకలసముద్ర నగర పర్వతనదీనదయుక్తభూమండలమును జయించి రాజ్యమేలెను. ఒక్కొక్కద్వీపమునందు ఏడువేల యజ్ఞము లొనగించెను. అన్నియజ్ఞములు విశేషదక్షిణలొసంగియొనరింపఁ బడినవే. కాంచనయూపము, కాంచనవేదికలు గలిగి సకలదేవతాలంకృతములై, గంధర్వాప్సరోగీతనృత్యవిభూషితములై యుండినవి. ఆయజ్ఞమును గాంచి శాస్త్రపండితుఁడగు నారదుఁడు విస్మయ మంది యీక్రిందిశ్లోకమును గానము చేసెను.

శ్లో. న నూనం కార్తవీర్యస్య గతిం యాస్యంతి పార్థివాః,
యజ్ఞైర్దానై స్తపోభిర్వా విక్రమేణ శ్రుతేన చ.

యజ్ఞదానతపోవిక్రమపాండిత్యములచే రాజులందఱు ను గార్తవీర్యునకు సరిపోలరు. ఇది నిశ్చయము. అని తాత్పర్యము.

ఆకార్తవీర్యుఁడు కవచఖడ్గకోదండములం దాల్చి రథము నెక్కి సప్తద్వీపములయందు సంచరించుచుఁ బ్రజలకుఁ గనఁబడుచుండును. ఆతనిరాజ్యకాలమున ద్రవ్యనష్టము గాని, శోకము గాని, భ్రాంతి గాని ప్రజలకు లేకుండెను. ధర్మమున నారాజచంద్రుఁడు పాలించుటయే యిందులకుఁ గారణ మని యెఱుంగవలయు. ఆరాజేంద్రుఁడు సర్వరత్నాఢ్యుఁడై * చక్రవర్తియు నయ్యెను. పశుపాలకుఁడు, క్షేత్రపాలకుఁడు, పర్జన్యుఁడు, మహాయోగియు రాజే యయ్యెను. జ్యాఘాతకఠినత్వక్కుగల బాహుసహస్రంబుచే రశ్మిసహస్రయుతుం డగుసూర్యునిరీతిఁ బ్రకాశించెను. ఆకార్తవీర్యుఁడు మాహిష్మతీనగరమున నున్న కర్కోటకపుత్రులగు నాగులనోడించి యాపురమునాక్రమించెను. ఆతఁడు సముద్రవేగమును వర్షాకాలమునందు బాహుసహస్ర

---

* చక్రవర్తియనఁగా నిచ్చోట విష్ణుచక్రమే దుష్టశిక్షణము చేయుచుండఁగా నశ్రమంబుగా రాజ్యము చేయుచుండువాఁడు చక్రవర్తి యని యర్థము చెప్పవలయు. హరిశ్చంద్ర నల పురుకుత్స పురూరవ స్సగర కార్తవీర్య లారుగురు చక్రవర్తులనుచో నిదే యర్థము గ్రహింపవలయును.

ముచే నాపి విహరించుచుండును. ప్రవాహముల నిలిపి యెదు రెక్కి పాఱునట్లు చేయుచుండును.

మాహిష్మతీపురీపరిసరమున నర్మదతరంగమాలాభి రామయై ప్రవహించుచుండి దానిచంచలతరంగ సంఘముల బాహుసహస్రముల నాపియెదురెక్కి ప్రవహింపఁ జేయుచు విహరించుచుండు. ఒక్కొక్కతఱి బాహువులు వేయింటనునము ద్రపునీటి నెగఁజల్లుచు నారాజు క్రీడించుచుండ, మహాసురులు భీతులై పాతాళమున నొదిగియుందురు. మఱొక్కకాలంబున నారాజు వేయిహస్తముల నరికట్టఁగా సముద్రము తరంగములు లేక తిమితిమింగిలాదిజలజంతువులు తల్లడిల్ల, నురుగు తెప్పలు చెదరి నీటఁగలిసి యడుగంటు, సుడులుపలుతావులఁ గనఁబడఁగా డీనత నొందుచుండును. ఆరీతిని గాంచినప్పుడు మందర పర్వతమును గవ్వముగాఁదఱచునపుడు పాలకడలి స్మృతికివచ్చుచుండును. ఆక్షోభమునఁ జకితులై గరుడులు వియద్గమనమును మానియుందురు. మహోరగములు తటాలున లేచి కార్తవీర్యునిమాటస్మృతికి రాఁగా భీతిల్లి యంతలో నాకస్మికముగా నటుపోవునారాజుం గాంచి పడగలఁ గదల్పక తలలు వాంచి యుండును. అపుడు చూచువారలు సాయంకాలమున వాయుకంపితము లగుకదళీకాండములా యని యూహింతురు.

ఒకానొకప్పు డారాజు లంకేశుఁడగు రావణుని మాఱొని జ్యాలతను ధనున్సనంగూర్చి యైదుబాణములచేత నే

మోహితునిగ నొనరించి తనకు లోబడునట్లుచేసి కట్టివైచి మాహిష్మతీనగరమునఁ గారాగారమున నుంచెను. ఆవార్త విని పులస్త్యముని కార్తవీర్యునికడకుం బోయి, కనఁబడఁగా భక్తిభరితుఁడై రావణుని వదలి పులస్త్యమునియాచనను సార్థకముగ నొనరించెను. ఆతఁడు విలాస మూని యల్లెత్రాటిని మీటఁగా నాధ్వని ప్రళయకాలమేఘధ్వనిని మఱపించును. ఓహో. ఆరాజు ప్రతాపమున భార్గవుని హైమతాళవనమును భేదించెను. ఒకప్పుడు సూర్యుఁ డీరాజు నాశ్రయింపఁగా సప్తద్వీపముల నొసంగెను. అంతఁ జిత్రభానుని తాపంబున నగరాదులు దహింపఁబడఁగా సర్వము శూన్యమయ్యెను. ఇట్లు కార్తవీర్యసహితుఁడై భాస్కరుఁడు లోకమును దహింపఁగా వరుణపుత్త్రుఁడై భాస్వంతుఁడై వసిష్ఠనామకుఁడగు నాముని ఆపవుఁడను ప్రఖ్యాతింగాంచి లోకాపకారహేతువగు నాకార్తవీర్యుని శపించెను. ఏమన. ఓకార్తవీర్యుఁడా నాతాళవనమును దహించి దుష్కర్మము నొనరించితివి. కాన నిన్నొకఁడు చంపఁగలఁడు. జమదగ్నిపుత్త్రుఁడై ప్రతాపవంతుఁడగు రాముఁడే నిన్ను వధింపఁగలఁడు. ఆమహాత్ముఁడు నీబాహుసహస్రమును ఖండించి వధించుఁజుమీ. ఆతఁడు బ్రాహ్మణుఁ డనుమాట మాత్రము మఱువకుము. మునులారా! ఆబ్రహ్మర్షిశాపమున నట్టిరాజున కట్లే యుద్ధమునఁ బరశురామునిచే మరణము గల్గెను. దత్తాత్రేయుని వరమడుగునపు డారాజు యుద్ధమృతిని యాచించియుండెను.

ఆకార్తవీర్యునకు నూర్వురు తనయులు గలరు. అందైదు మందియే శేషించిరి. వారు శస్త్రాస్త్రవిద్యానిపుణులు. మహాత్ములు. శూరసేన, శూర, బృషణ, మధుపధ్వజ, జయధ్వజులని వారిపేరులు. జయధ్వజుఁ డవంతీరాజ్యపాలకుఁ డయ్యెను. వాని తనయుఁడు తాలజంఘుఁడు. వాఁడు బలశాలి. వానికిం గొడుకులు నూఱుగురుగల్గిరి. వా రెల్లఁ దాలజంఘులనం బ్రఖ్యాతి వహించిరి. హైహయులవంశమునఁ బుట్టినరాజులు వీతిహోత్రు లనియు, సువ్రతు లనియు, భోజు లనియు, నావంతు లనియుఁ, దౌండికేరు లనియుఁ, దాలజంఘు లనియు, భరతు లనియు, సుజాతు లనియుఁ బ్రఖ్యాతులై యెల్లయెడల వ్యాపించిరి. వృష ప్రభృతు లగు యాదవులు పుణ్యకర్మరతులై చెలువారిరి. అందు వృషుఁడనువాఁడు వంశకర్తయయ్యెను. వానిపుత్త్రుఁడు మధుఁడు. వానికిఁ బుత్త్రశతంబుగలిగె. అందు బృషణుఁడు వంశకర్త. వానినుండియే వృష్ణికులము విస్తరిల్లె. మధువంశమునఁ బుట్టిన వారు మాధవు లయిరి. హైహయులే యదునామమున యాదవులనం బరఁగిరి.

కార్తవీర్యునిజన్మచరిత్రమును విన్నవారికి విత్తనాశము కలుగదు. వ్యవహారమునందు నష్టము కలుగదు. ఇదియే యయాతివంశచరితము. యయాతిపుత్త్రవంశ మైదువిధములుగా విఖ్యాతి నొందెను. లోకైకవీరు లగువీరిచరిత్రము పరమపవిత్రము. సాధువులు పఠించి మనముల ధరింతురు. ఈవంశపంచక

మును బఠించిన నియతుఁడు పంచసత్పుత్రులం గాంచును. ఆయుః కీర్తిప్రముఖసకలలాభములు కలుగును.*

పాఠకులారా! శ్రీకృష్ణపరమాత్మ యవతరించుటకుఁగల కారణములఁ గొన్ని వ్రాయఁబడియె. భగవదవతారమునకు ముందే వారికి సాయమొనరింప నవతరించిన వారెందఱో కలరు. వారిచరిత్రములను ముందే వ్రాయఁబడుట మంచిదని నాభావము. ఐనను భక్తులరగుమాకు భగవదవతారమును వినఁగా తూహలము మెండుగనుండును. సమయానుగుణ్యముగ నాయావీరసాధుపురుషులచరిత్రమును జదువుటకును మీ కుత్సాహముండును కాన నించుక త్వరపడి శ్రీకృష్ణపరమాత్మగోలోకమునుండి యవతరించుపరమపావన దివ్యకథను వ్రాయఁబూనెద. స్వోక్తివ్యాఘాత మనక ప్రక్రమభంగ మనక నాయీచాపలమును సహింతు రని మిమ్ముఁ జేతు లొగ్గి వేఁడుచున్నాఁడను. ఇఁక వృత్తాంతమును వినుఁడు.

♦ శ్రీకృష్ణుఁ డవతరించుటకు ఇంచుక ముందు భూలోకమెట్లున్నది? అనునది యే ప్రశ్నము. ఈవిషయము ప్రథమసంపుటమునందే వ్రాయఁబడినదే యనఁబోకుఁడు. దానినంతయు వ్రా

---

* ఇందుఁ గ్రోష్టువంశము అధ్యాయాంతమం దున్నది. కాన దానిని వదలితిని.

♦ ఈభాగముమాత్రము సకలపురాణములనుండి తేలిన సారాంశముగా వ్రాయఁబడు ననియుఁ దెలియఁదగు.

యక కంసచరిత్రమును వ్రాయుచుం దదనుగుణముగనించుక వ్రాసి భూదేవిమొఱ్ఱను దెలిపి యంతట శ్రీకృష్ణజననదివ్యగాథను వివరింతు. మహాత్ములారా! ఈమాత్రము నాయపరాధరూపచాంచల్యమును సహింపఁగూడదా. సహింతు రన్ననమ్మికచే వ్రాయుచున్నాఁడను.

జయవిజయులు శ్రీపతిద్వారపాలకు లనియు, సనకసనందనాదులశాపకారణమున మూఁడు జన్మముల దైత్యులుగానవతరించి భగవంతునితో ద్వేషించి మడిసి మరల శ్రీనాథుముక్తిగేహమున ద్వారమును గాచి భగవత్సేవారూపదివ్యతపస్సునొనరింపఁబూనుటయు మీరెఱుంగుదురుగదా. ఆజయవిజయులు తొలిజన్మమున హిరణ్యకశిపుహిరణ్యాక్షులనం బరఁగి లోకములను బాధించి సాధువుల హింసించి యమర్త్యులం జించి చెండాడి యడవుల నిడుమలఁ బడఁ జేసి యంతట భూదేవి దీనాలాపముల నాలించి భగవంతుఁడు శ్రీహరి నృసింహరూపమున నవతరించి హిరణ్యకశిపుని, ఆదివరాహరూపమున నుందే యతనిసోదరుఁడగు హిరణ్యాక్షుని వధించెను. అంత నాయవతారఫలము ముగియ శ్రీహరి యథాస్థితి వైకుంఠమునకరిగెను.

మరల జయవిజయులులు రెండవపర్యాయము రావణకుంభకర్ణులనం బుట్టిరి. వారు లోకమును బాధించుట హిరణ్యాక్షహిరణ్యకశిపులు బాధించుటవంటిది కాదు. వీనిపద్ధతియే వేఱు. తొలి జన్మము బహుభయంకరము. తమఃప్రధానము.

రెండవజన్మము రజస్తమోవికృతి. కావునఁ గుంభకర్ణుఁడు కేవలతమస్స్వభావుఁడుగను రావణుఁడు రజస్స్వభావుఁడుగను బుట్టిరని చెప్పుట యొకగొప్పసాహసము కాదు. వారి కాలమున దేవతలకును, ఆదేవతలకు యజ్ఞాదిలోపమున బలవృద్ధిఁ గల్గించుసాధుమునులకును, బాధ గల్గుటయేగాక పరమపవిత్ర చరిత్రలగు కులకాంతల కెంతటికో మహాబాధ గల్గెను. ఏకాలమున స్త్రీలప్రవర్తనము సద్రూపముగాక యసద్రూపమున వెలయునో ఆకాలము సధర్మము లోకమున నామమాత్రవ్యవహృతమని యెఱుంగవలయు.

వృక్షమునకు ముఖ్యాధారములు వేరులు. అవి చెడుచో వృక్షము నిలువు నశించును. అట్లే ధర్మవృక్షమునకు స్త్రీలు వేరులు. స్త్రీలకడ నున్న యమూల్యసదాచారస్వరూపప్రవర్తనము నశించెనా, అంతటి ప్రవర్తనమునశించినదే యని యెఱుంగుట సరసము. వనితలనఁగాఁ బ్రపంచవృక్షమునకు మూలాధారభూతలు. మూలము చెడ వృక్షము నశించుట కన్నులారఁ గను చున్నారము కదా. అట్లేస్త్రీలకడ సత్ప్రవర్తనమునశించెనా, తత్సంతానమున కాయలవాటు లలవడును. ఎవరికర్మము వారిదే కదా యన్నసిద్ధాంతమునకు నించుక బాధ గలదు. సహవాస మనునదియు నొకకర్మమే. అదియు ఫలప్రదమే.

బాల్యమునఁ దల్లియే పిల్లలను సదాచారవంతులుగనో దురాచారవంతులుగనో తీర్చును. తండ్రి బుద్ధివచ్చినపిదప వారికి

విద్య చెప్పఁగలవాఁడు. ఏగుణముగాని చిన్నతనమున నలవడిన నది సామాన్యముగా నశింపదు. అట్లు మాఱుటయుఁ బ్రత్యక్షమునఁ జూచుచున్నారము కాదా యని మాత్రము ప్రశ్నింపకుఁడు. సామాన్యమనుశబ్దమును బరికింపుఁడు. అదియే మీ ప్రశ్నమునకు సమాధాన మిచ్చును. కాఁబట్టి యెంతకాలము స్త్రీలకడ సత్ప్రవర్తనరూపధర్మనిధి యుండునో అంతవఱకే లోకము వృద్ధినొందుట. తద్విపరీతమున లోకము క్షీణించుటయే. అసఁగా రోగులు, మూర్ఖులు, అల్పాయువుగలవారు, స్వేచ్ఛాప్రవర్తకులు, ఆశాపరవశులు జన్మించుటయే. అట్టివారిచే లోకమునకు మేలు చేకూరుట కల్ల. ఇది సిద్ధాంతము. మూఁటికి ముమ్మాటికి నిది సత్యము. సత్యము. సత్యము.

శ్లో. అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః.
సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ,
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః.
దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః.
ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమః.

భగవద్గీత. ౧ అ. ౪౩ శ్లో.

శ్లో. ప్రజనార్థం మహాభాగాః పూజార్హా గృహదీప్తయః,
స్త్రియశ్శ్రియశ్చ గేహేషు న విశేషో ఽస్తి కశ్చన.
పతిం యానాభిచరతి మనోవాగ్దేహసంయుతా,
సా భర్తృలోకానాప్నోతి సద్భిస్సాధ్వీతిచోచ్యతే.
వ్యభిచారాత్తు లోకే స్త్రీ లోకే ప్రాప్నోతి నింద్యతామ్,
సృగాలయోనిం ప్రాప్నోతి పాపరోగైశ్చ పీడ్యతే.
మనుస్మృతి ౯ అధ్యా. 30 శ్లో.

భగవద్గీతాభిప్రాయము స్మృతిభావము పైసిద్ధాంతమును దృఢపఱుచుచున్నవి. కాఁబట్టి పైనీతి కేవలబుద్ధికల్పితము కాదని విశ్వసింపవలయు.

శ్లో. కువివాహైః క్రియాలోపై ర్వేదానధ్యయనేన చ,
కులాన్యకులతాం యాంతి బ్రాహ్మణాతిక్రమేణ చ.
మనుస్మృతి. 3 అ. ౬3 శ్లో.

వ్యా. ఆరాదివివాహైః యథావర్ణ నిషిద్ధై ర్జాతకర్మాది క్రియాలోపై ర్వేదాపాఠేన బ్రాహ్మణాపూజనేన ప్రఖ్యాత కులాన్యపకర్షం గచ్ఛంతి. అని కుల్లూకభట్టు.

జాతిగౌరవముపోవుటకు నెన్ని కారణములో ఈమనుస్మృతి వాక్యముం బరికించినఁ దెల్లమగును. జాతిప్రశంసయే వలదనువాదము కేవలహఠవాదము. ఆవాదము ఖండాంతరములయందే చెల్లు. భరతఖండమునఁ జెల్లదు. ఏలన ఈభరతఖండ

షమున నైహికమునకన్న ఆముష్మికమే ప్రధాన మనుసిద్ధాంత ము గలదు.

శ్లో. విహితస్యాననుష్ఠానా న్నిందితస్య చ సేవనాత్,
అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతన మృచ్ఛతి.
యాజ్ఞవల్క్యస్మృతి, ప్రాయశ్చిత్తకాండము. ౨౧౯ శ్లో.

విహితకర్మములు వేదోక్తములు భరతఖండముననే కలుగుటచే ఖండాంతరాభ్యాసములతో నిచ్చటి యభ్యాసములఁ బోల్పరాదు. నిషిద్ధకర్మములు విహితకర్మములు శ్రుతిస్మృతిప్రతిపాదితములే కాని యెవరికిఁ దోఁచినట్లు వారు సమయానుసారముగాఁ గల్పించిన కృత్యములవంటివి గావు. అట్లు శ్రుతిస్మృత్యుక్త కర్మాభావమున నాముష్మిక మనునది యసిద్ధాంతభూతమై నామమాత్రమై యుండు. కాఁబట్టి యం దైహికసుఖము ప్రధాన మనవలయును. ఈభరతఖండమున నైహికసుఖములు క్షణభంగురములు తుచ్ఛతరములని 'తుడుము మొదలు దేవతార్చనము వఱ' కన్న యట్లు పాటలు మొదలు వేదాంతమువఱకు ననువదింపఁబడియుండును. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' యనువాక్య మితర ఖండములకుఁ జెల్లునని చెప్పుట సాహసము. కారణము శ్రుత్యభావమే. ఇపు డిపుడు భాషాంతరీకరణమూలమున వ్యాపించిన వన్నచోఁ దత్పఠనఫలము శూన్యమేగాని యత్యల్పసంఖ్యాకులించుక చదువుదురు. చదివినవారిలోఁ గొందఱు నవ్వుదురు. ఒక్కొక్కరు విచారించి బాగుగనే యున్న దందురు. ఆగ్రం

థములఁ బఠించిన శ్రుతిని బఠించినట్టిదిగాదు. పారాయణఫల మంగు సర్వత్ర శూన్యము. విషయ గ్రహణము చాలదాయన్నఁ జాలదు. శ్రుతివిరహితముల కామాటఁ జెల్లవచ్చును. స్వరహీన ముగ నుచ్చరించిన నది సత్ఫలదము కాకపోవుట చాలక దుష్ఫలము నొసంగును. కావుననే వేదము సుస్వరభూషితము కావల యు నని పెద్దలు చెప్పిరి.

పైఁ బేర్కొనంబడిన శ్రుతిస్మృతులం బట్టి చూడఁగా సదాచార మనునది స్త్రీలయాధారమున నున్న దని వలయు. అట్టి సదాచారములఁ గాపాడుటయే ప్రధానకృత్యముగఁ బూర్వులు భావించిరి. చిరకాలము రక్షించిరి. దాన వన్నెఁగాంచిరి. ఋషివాక్యమున కన్న సాధ్వీవచనము పరమపవిత్ర మను సిద్ధాంతమును లక్ష్యలక్షణపురస్సరముగఁ దెల్పిరి. ఏల? సదాచార ప్రధానాలవాలములు స్త్రీజనములు కావుననే వారిని బెక్కు భంగుల రక్షింప వలయుననిరి. కొందఱు భరతఖండమున స్త్రీలకు గౌరవమే లేదనియు బానిసలవలె నెన్నఁబడు చుందురనియు నుద్ఘోషింతురు. ఎంతటియసందర్భమో చూడుఁడు.

మనుస్మృతి, 3–వ అధ్యాయమున:—

శ్లో. యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః,
యత్రైతాస్తు న పూజ్యంతే సర్వా స్తత్రాఫలాః క్రియాః,
పితృ భిర్భ్రాతృభి శ్చైతాః పతిభి ర్దేవరై స్తథా.
పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణ మీప్సుభిః.

శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులమ్,
న శోచంతి తు యత్రైతా వర్ధంతే తద్ధి సర్వదా. ౫౭
జామయో యాని గేహాని శపంత్యప్రతిపూజితాః,
తాని కృత్యాహతానీవ వినశ్యంతి సమంతతః. ౫౮
తస్మా దేతా స్సదా పూజ్యా భూషణాచ్ఛాదనాశనైః,
భూతికామై ర్నరై ర్నిత్యం సత్కారే షూత్సవేషు చ.
స్త్రియాంతురోచమానాయాంసర్వంతద్రోచతేకులమ్,
తస్యాం త్వరోచమానాయాం సర్వమేవ నరోచతే. ౬౨

స్త్రీలు సంతోషించిన దేవత లానందింతురు. లేకున్న నాయింట నొనరించినసధర్మకార్యములు నిష్ఫలములు. స్త్రీలు తండ్రులచేతను, సోదరులచేతను, భర్తలచేతను, భర్తృసోదరులచేతను గౌరవింపఁ దగుదురు. భూషింపఁ దగుదురు. ఇట్లు శుభపరంపరలఁ గోరినవారు చేయందగు. ఏగృహమునఁ దోఁబుట్టువులు దుఃఖింతురో (అనఁగా తిరస్కరింపఁ బడివగతురో) ఆయిల్లు నశించు. ఎందు సంతోషింతురో ఆగృహము వృద్ధినొందు. కాఁబట్టి భూషణములచే వస్త్రములచే భోజనార్హపదార్థములచే స్త్రీలు సదా గౌరవింపఁ దగినవా రని నొక్కి పలుకుటయే గాక ఏయింట సాధ్వి యానందించునో, ఆకుల మానందము నొందును. ఏయింటఁ బతివ్రత దుఃఖించునో ఆయింట సంతోషమునకుఁ దావు లే దని సిద్ధాంతీకరించిరి. ఇంతియ కాదు.

సువాసినీః కుమారీశ్చ రోగిణో గర్భిణీః స్త్రియః,
అతిథిభ్యో ఽగ్ర ఏవై తాన్ భోజయే దవిచారయన్.
మను. 3 అ. ౧౧౪ శ్లో.

ఇట సువాసిని యనఁగాఁ గ్రొత్తఁగా బెండ్లియయిన స్త్రీ లని యర్థము. స్త్రియః= అనఁగా కోడండ్రు దుహితలును. అని యర్థము. అవిచారయన్= అతిథులుండఁగా ముందు వీరి నెట్లుభుజింపఁజేయవలయునని విచారము చేయక యనియర్థము. చూచితిరా! మనపూర్వపు టాచారములు స్త్రీలవిషయమున నెంత పవిత్రములుగ నున్నవో. ఇట్టి మనము స్త్రీలను నీచముగా భావించుచున్నార మనుటకంటె నవివేక మే మున్నది.?

శ్లో. అదత్వా తు య ఏతేభ్యః పూర్వం భుంక్తే విచక్షణః,
స భుంజానో న జానాతి శ్వగృధ్రై ర్జగ్ధిమాత్మనః.
౧౧౫ శ్లో.

అనియు శాసించిరి. ఇట్లు స్మృతులు స్త్రీలగౌరవించుటలో ననుమతి యిచ్చుచుండఁగా నగౌరవముగఁ జూచుననాచారము మీలోఁగలదని భారతపుత్రుల నెత్తి పొడుచుట కేవల సాహస మనక తప్పదు. కాని మనవారు స్త్రీలను గొన్ని సందర్భముల నిరోధించుట మాత్రము గలదు. ఎప్పుడు వనిత తిరస్కృతపతియై స్వేచ్ఛగా బ్రవర్తింపఁ బూనునో, అపుడు కొన్ని నియమములు చెప్పఁబడినవి. అట్టి సమయములందుఁ గూడ

స్వేచ్ఛ బ్రసాదించుట మాత్రము మనపూర్వాచారము కాదని వెనుకంజె వేయక చెప్పవచ్చును.

ఇట్లు ప్రమాణములం: జూపుటచేతఁ దేలిన ఫలమే మనఁగా ద్వాపరయుగాంతమున సాధ్వీమణులకు దుస్సహ బాధ కల్గెను. సదాచార మడుగంటె నని యిదియే చెప్పక చెప్పను. అట్టిబాధ సాధ్వీమణుల కెప్పుడు గలిగెనో దాని వారింప నెపుడు భర్తలు సమర్థులు గాకుండ నుండిరో, అట్టి తఱిఁ బ్రభువులుగాని ప్రజలుగాని ధర్మాచరణపరాయణులుగ నుండిరని చెప్ప వీలున్నదా యా? లేదు కదా.

ఇట్లు ద్వాపరాంతమున దుష్టజనులు దుష్టరాజులు తదనుచరులును యథామతిఁ బ్రవర్తింపఁ బూనిరి. వారి నడ్డగించి కండకావర మడంచువారు లేరైరి. సజ్జనులు, మునులును భగవంతు నారాధించుట తప్ప వేఱుగతి యే లేదని భావించిరి. ధర్మము నశించుతఱి భగవంతుఁ డవతరించు నన్న విశ్వాసము వారు వదలక బహుభంగుల శ్రీమత్పరమేశ్వరుఁ బ్రార్థింపఁ జొచ్చిరి. వీరికిఁ దోడు దేవతలును ధర్మనాశనమయ్యె నే యని శ్రీహరికిం జెప్పిరి. వారు వీ రన నేల? సాధువు లందఱు శ్రీహరీ! యీ యాపత్తును దొలగించి ధర్మమును గాపాడి మ ముద్ధరింపుమా యని మొఱ్ఱపెట్టుకొనిరి. ఇందఱి దీనాలాపము లాలకించుచున్న కరుణాశరధి భగవంతుఁడు తా భూమి నవతరింపక యూరకుండఁగలఁడా. సంసిద్ధుఁ డయ్యెను.

హిరణ్యాక్ష హిరణ్యకశిపులను రావణకుంభకర్ణులను వైకుంఠవాసియగు శ్రీమన్నారాయణమూర్తి నరసింహావతారమెత్తియు రామావతారమెత్తియు సంహరించెను గదా. వారికంటె నెన్నియో మడుంగులు దుర్బలుఁడగు శిశుపాలునిఁ జంపుటకు గోలోకమునుండి శ్రీకృష్ణుఁ డేల యవతరింపవలయు నన్న ప్రశ్నము తోఁపక మానదు. దానికి సమాధానము వ్రాయుటయు ముఖ్యతమకృత్య మనియు స్ఫురించును.

పాఠకమహాశయులారా! ఇంచుక యోపికవైనాలకింపుఁడు. శంకలకు మనస్సున స్థల మునుపకుఁడు. తత్త్వము నెఱుంగుటయే మనకృత్య మని త్రికరణశుద్ధిగా నమ్ముఁడు. తొలుతటి సంపుటమునందే వైకుంఠవాసి విష్ణువనియు, శ్వేతద్వీపవాసి నారాయణుఁ డనియు, గోలోకవాసి శ్రీకృష్ణుఁడనియు వ్యవహరింపఁబడుదు రనియు నీముగ్వు రొక్కటే తత్త్వమే యనియు వివరింపఁబడియె. దానిం దగురీతిఁ బఠించియే యుందురు. మరల నీచర్చ యేల యనఁగూడదు. ఇది చాల ముఖ్యమగుపని.

గోలోకవాసియగు శ్రీకృష్ణపరమాత్మను జూడ విష్ణునారాయణులు పోయి యం దైక్యమయినట్లు చదివి యుంటిరి. అప్పుడు శ్రీకృష్ణపరమాత్మయే నాయంశమే వైకుంఠమునఁ జతుర్భుజముల విరాజిల్లు విష్ణువుగను శ్వేతద్వీపమున నారాయణమూర్తిగను వెలయుచుండు నని చెప్పెను గదా. దీని తాత్పర్య

సారమేమి? ఏయేభక్తులు ఏయే పుణ్యములొనరింతురో ఆపుణ్యములకుఁ దగినసుఖఫలముల ననుభవింపఁ దగుస్థలము లేవో భగవంతుఁడే నిర్ణయించి యుండుటచేతనే యిన్నిలోకముల, ఇన్నిరూపములఁ దా నెలకొనవలసి వచ్చెను. ఒక్కలోకమున సర్వవిధములగు పుణ్యముల కనువగు సుఖముల ననుభవింప వీలుండదు. కాఁబట్టి యాయాపుణ్యకర్మములకు నుచితపుఫలము నొందఁదగు తావులు పెక్కు లుండవలసివచ్చినవి. పుణ్యకర్మములును సత్వరజస్తమస్స్వభావముల ముత్తెఱంగులుగనుండును. అం దొక్కొక్కటి పరిశుద్ధ శుద్ధ మిశ్రభేదంబుల మరల ముత్తెఱంగు లగు. ఇంకను నవాంతరభేదములు గల వని కొంద ఱుద్ఘోషింతురుగాని యదియంతగాఁ బాటింపఁదగినట్లు తోఁపదు. ఆ పక్షమవలంబించితి మేని అనవస్థా దోషము సంభవించును. విషయ మిది యని చెప్పఁబూని దానిం దెల్పఁజాలక మిగులం జిక్కులలోఁ బడుటయుఁ దెలివితక్కువ యనిపించుకొనుటయు దానికి ఫలంబులు.

సత్వరజస్తమః ప్రధానకర్మఫలముల వైకుంఠ సత్యకైలాసములయందనుభవింపఁదగు నని కొంద ఱున్మత్తులు పలుకుచుఁ జేతులు త్రిప్పుదురుగాని యందు సత్య మించుకంతయుఁ గానరాదు. అది శివు దూషించుటయే పరమార్థమని భావించు దేవానాంప్రియులకు మాత్రమే పనికివచ్చును. ప్రకృత మనుసరించెద. ఈవిషయమును జర్చింపఁ జాలక విడిచె నని మాత్ర

మూహింపకుఁడు. ఆచర్చ ప్రకృతివిషయమున నాలోచింప శాఖాచంక్రమణమగును.

శ్వేతద్వీపము సత్త్వకర్మఫలముల ననుభవించు జీవులకుఁ బోఁదగినతావు. మిశ్రకర్మఫలంబుల ననుభవించు జీవులు వైకుంఠమున కరుగఁ దగువారు. పరిశుద్ధసత్త్వకర్మఫలముల ననుభవించు జీవులు గోలోకమున కరుగఁజాలువారు. పురాణములను నిష్పక్షపాతమతిఁ బరిశీలించు వారలకిది బోధపడక మానదు. వైకుంఠమున నలరారు భక్తులచరిత్రములు పురాణములఁ జూడుఁడు. శ్వేతద్వీపవాసుల చరిత్రఘట్టములఁ బరికింపుఁడు. గోలోకవాసు లనఁబడు భక్తులదివ్యచారిత్రములఁ బరిశీలింపుఁడు. పరిశుద్ధసత్త్వమన నెట్టిదో తెలియఁగలదు.

గోలోకమానందమయము. అందలివారలకు నిరంతరానందము తప్ప నితరచింతలు లేవని తెలియఁబడు. ఇంతియగాక యనారతం బందలి భక్తులు నానావిధక్రీడల భగవంతునింగూడి పరమానందపరవశులై యుందు రని తెలియవచ్చెడిని. పురుషులవలె స్త్రీలును భగవంతునిం గూడి బహువిధవిహారముల నానందింతురు. ఈఘట్టములం జదించి నెట్టన పరిశీలించిన గోలోక మానందమయమే యని పొడకట్టు. అందు శ్రీపరమేశ్వరుండు శ్రీకృష్ణనామంబున రాధాదేవి యనఁబడు ప్రకృతిం గూడి తదాజ్ఞ నిర్వహించుచుండు. అం దేది గాని యానందమయముగానిది లేదని బోధపడును.

ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్.

అని శ్రుతి చాటుచున్నయది. ఉపనిషత్తు లిట్లు నెత్తిన నోరు పెట్టుకొని తెల్పుచుండఁ దదర్థమును బురాణములు కథారూపమున ననుగ్రహించుచుండ నింకను బుద్ధిప్రతిభ నరికట్టి మొండిపట్టుదలం బూను టేటిసరసము? అవయవవిశిష్టవస్తు వేది యున్నను, అది ప్రకృత్యతీత మన వీలు లేనే లేదు. ఆస్థితియందు విరాటువు ప్రకృతివశంవదుఁడే. తదిచ్ఛాధీనగదా ప్రకృతి యన్ననౌ ననవలయుఁగాని తదధీనుఁడైనఁ గాని సృష్టిసంసారము సాగదు. జగత్కుటుంబపరిపాటి పరాత్పరునకే తెలియును. ఇతరుల కా విషయమునఁ ననుభవమే లేదు. మనకుటుంబములతో జగత్కుటుంబమును బోల్చుట "ఘటానాం నిర్మాతుస్త్రిభువనవిధాతుశ్చ కలహః" అన్న వాక్యమువంటిది. కాన గోలోకమున నానందమయుఁ డగు శ్రీకృష్ణుఁడు ఇచ్ఛాశక్తిరూపిణియగు రాధాదేవి నాశ్రయించి మహానంద మనుభవించువానివలె నటించుచుండు. అందుండు భక్తులు మర్త్యలోకంబుల నేయేరూపంబుల నే యే యపారపుణ్యకర్మముల నొనరించి పరిశుద్ధసత్త్వప్రధానులయి యుండిరో యంతమున వా రాయారూపంబుల నాగోలోకమున శ్రీకృష్ణపరమాత్మం గూడి యానందరసాంబుధి నోలలాడుచుందురు. ఈ కథాంశమున నింకొక సిద్ధాంతము తేలుచున్నది.

స్త్రీజన్మము పాపభూయిష్ఠమనియు, సత్కర్మములచేఁ బురుషజన్మము నొంది పిదప మోక్షము నొందుదురనియుఁ గొం

దఱు సిద్ధాంతము చేయుచుందురు. అయ్యది మిగులఁ బొరపాటు. మర్త్యలోకమున ధరించిన తనువు ప్రధానము కాదు. ఏ వ్యక్తిని సత్కర్మములు ఫలాపేక్ష వీడి యాచరించినఁ దత్ఫలముల నావ్యక్తినే యూర్ధ్వలోకమున ధరించి యనుభవింప వచ్చు. లేకున్నఁ బతివ్రతలశక్తి మహర్షిశక్తి మించినదన్న సూక్తికి గతియే లేదు. కాఁబట్టి పరిశుద్ధ సత్త్వగుణ మూని సత్కర్మముల నాచరించి ఫలములం గోరక వానిని శ్రీకృష్ణపరమాత్మ కర్పించి శరీరత్యాగము చేసిన పుణ్యపురుషులు పుణ్యస్త్రీలును గోలోకమున కేగి యందు బరిశుద్ధసత్త్వరూపంబున భక్తరక్షణకుతూహలంబున సలరారు శ్రీపరమాత్మను గాంచుచుఁ దత్తదుచితరూపంబుల భూషణంబులం బొందుచు వాంఛానురూపముగ భగవంతుఁడు కనంబడం గూడి వినోదించుచుందురు. వారికిఁ బునరావృత్తి లేదు కాని శ్రీహరి భూలోకమున నవతరించుచోఁ దత్సహాయభూతులై వారును జన్మించి విహరించి మరల భగవంతునిం గూడి మరల గోలోకమునకే పోవుదురు.

అట్టితఱి వారొనరించిన కర్మములు తదుచితఫలముల నీఁజాలవు. ఏలన వారు భూభారహరణార్థ మవతరించిన పరమాత్మకు సాయ మొనరింపవచ్చినవారే కాని స్వకృతముల నిర్వహింప వచ్చినవారు గారు. కావున భగవత్సహాయోచిత కృత్యములనే వారు నిర్వహింతురు. ఆపని పూర్తి

కాఁగా నాశరీరముల మాని యథాపూర్వముగ గోలోకమున నుందురు.

శ్లో. తస్మాదసక్త స్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః. ౧౯
సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాంస్తథా సక్తశ్చికీర్షు ర్లోకసంగ్రహమ్.
భగవద్గీత, కర్మయోగము.

పై ప్రమాణములు పూర్వోదాహృతకర్మసిద్ధాంతమును బలపఱచుచున్నయవి. వీనింబట్టియే సాధుజనులు అసక్తులయియు, లోకసంగ్రహముకొఱకు సకలశుభకర్మముల నాచరించుచుందురు. తత్ఫలము భగవదర్పణము చేయుటయే వారిపని. కావుననే తత్కర్మములు వారికి ముక్తిఫలము నొసంగుచున్నవి. ‘ఫలమును గోరు కర్మము లెంత గొప్పవియైనను మిగుల స్వల్పఫలముల నీఁజాలుచున్నవి.

బుద్ధిమంతులు చక్కఁగా నాలోచింప గోలోకము ఆనందమయ మని తెలియవచ్చును. అందుండుజీవులు పరిశుద్ధసత్వకర్మముల నాచరించినవారు. కర్మఫలములను వారు

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్.

అనుభగవదుక్తి ననుసరించి శ్రీకృష్ణపరమాత్మపాదారవిందముల కర్పించినవారు. దాన నిరతిశయానందాంబుధియందు

నిరంతరము నోలలాడుచుండువారు. కావున నీ గోలోకము నిరుపమానమై యానందరూపమై యొప్పుచుండు.

ప్రకృతము గోలోకవాసియగు శ్రీకృష్ణభగవానుఁడు శిశుపాలాదులకు ముక్తి నీయఁగోరి దేవతల మొఱ్ఱల నాలకించి మహార్షుల దీనాలాపముల నాలించి యనాథలవలె విలపించు పతివ్రతలయులజడులం గాంచి యిఁక నూరకుండుట న్యాయము గాదని యూహించి ముందే రాధాదుల నవతరింప నాజ్ఞాపించి తాను నవతరించి చేయఁదగు పనుల సాగించి ముక్తికాములకు ముక్తి నొసంగి యవతారమును జాలింప మది నెంచెను. కావున జయవిజయుల కిది కడపటిజన్మము. ఇంక వారు శాపమున కనువగు ఫలము ననుభవింపవలసినవారు కారు. భగవద్వ్యాఖ్యానుసారము రెండుజన్మము లెత్తి విష్ణువుతోఁ బోరాడి మడిసిరి. మూఁడవపర్యాయము విముక్తికై యంతభీకరము గాని మానవజన్మమెత్తిరి. కృత్యము రాక్షసకులయోగ్యమైనను రూప మట్టిది గాదు. దీనిచేతనే ముక్తిని గోరువారు భరతఖండముననే పుట్టవలయు నని కనఁబడును. కర్మముల నాచరింప ననువగు దేశ మిదియే. కావున జయవిజయులు మర్త్యలోకమునఁ బుట్టిరి. కాని మనుజులకు సహజములగు కృత్యముల మాత్ర మాచరింపరైరి. వారికి సాయమొనరింప నెందఱో రాక్షసు లుదయించిరి. వారెల్లఘోరకృత్యములు గావించుచుఁ బరరాజుల జయించి యంతతో విరమిం

షక తత్కళత్రములఁ జెఱఁబట్టుచు నిచ్ఛానుసారముగాఁ బ్రవర్తించు చుండిరి.

శ్లో. యత్కించి త్కురుతే రాజా శుభం వా యది వాశుభమ్;
భృత్యా స్తదనుకుర్వంతి సర్తక్యో నర్తనం యథా.

అను యమస్మృతి ననుసరించి రాజు లాచరించు నధర్మ కార్యములం గాంచి తత్ప్రకృతులు చెలరేఁగి యెందునుం జూచి నం దారెయై స్వేచ్ఛగాఁ బ్రవర్తింప సాగిరి. వేదశాస్త్రోక్తాచారములకుఁ దదవలంబకులకుఁ జోటు దొరకక పోయెను. పామరు లెల్ల నెవరియిష్టముచొప్పున వారు ప్రవర్తింప సాగిరి. ఇట్లు రాజులు, తత్సేవకులు, వారింగాంచి జానపదలు ప్రవర్తింపసాగఁగా ధర్మము నామమాత్రశిష్టమై దిక్కేది యుండెను. సజ్జను లీమెడరు తొలఁగు టెట్లని పరాత్పరు నారాధింపసాగిరి. ఇవన్నియు నేకరూపముగా భగవదాగమనమునకు హేతువు లయ్యెను.

ఇంతవఱకు గోలోకమునుండి శ్రీకృష్ణమూర్తి యేల యువతరింపవలయునో కారణములు చెప్పఁబడియె. అందుముఖ్యముగా గోలోకము పరమాత్మకు ముఖ్యస్థానమనియు, పరిశుద్ధసత్వప్రధానమనియు. నందు నివసించువారు పరమసత్వకర్మముల నాచరించి పునరావృత్తిరహితసుఖభోగము శ్రీకృష్ణపరమాత్మంగూడి యనుభవించువారనియు గ్రహింపఁదగు. ఆలోకము సదా గానమయ మని తెలియఁ దగు. అందున్న స్థానము

లు నిరంతరవిహారయోగ్యములు. విరజానది నిర్మలజలపూరితముగా నలరారు చుండును. తత్తీరములు సాంద్రచ్ఛాయాతరువరములఁ జూడఁదగియుండును. దుఃఖమే యెఱుంగని జీవులందుందురు. ఎవరికేనించుక కష్టము గల్గుచో భగవదిచ్ఛానుసారమది కల్గునేగాని యూరక కలుగదు. భగవంతుఁడెప్పుడేనవతారమొందవలసివచ్చుచో నపుడు తత్సహాయము సేయఁబుట్టఁదగువారికేవో దుఃఖములు గలుగును. అవి సహేతుకములే. శ్రీరామాదులచరిత్రములం జూచిన నీవిషయము సిద్ధాంతము కాకపోదు. అతి సర్వత్ర వర్జయేత్తని యున్నది గాన నిఁకనీ చర్చను మాని కథాభాగము విన్నవించెదను. ఇఁక ముందు శ్రీకృష్ణార్జునులు నారాయణుఁడు, నరుఁడనువారిరువు రని చెప్పఁబడునుగాన, ఆసందియము తీర్పవలసి యించుక ఆకథను వ్రాయుచున్నాఁడను.

* పాఠకమహాశయులారా! భూభారహరణార్థము నరనారాయణు లనువా రిరువు రవతరించుచుందురని వినియే యుందురు. వారెవరు? అనునదియే యిట విమర్శింపంబడును. సాధారణముగా లోకమున నధర్మనాశన మొనరింప భగవంతుఁడవతరించు ననుట క్రొత్తవిషయము గాదు. స్వల్పకార్యములకుఁ దదంశసంభూతులగు నరనారాయణులను నాదిమమును లవతరింతురు.

---

* ఈకథ దేవీభాగవతచతుర్థస్కంధపంచమాధ్యాయమునుండి గ్రహింపఁబడినదని యెఱుంగ వలయు.

వారెవ్వరో క్రొత్తవారుగారు. శ్రీకృష్ణుఁడే హరియనంబడు. నారాయణుఁడే నరుఁడనంబడు. గోలోకవాసియగు శ్రీకృష్ణభగవానుఁడే వైకుంఠమున శ్రీహరి యని, శ్వేతద్వీపమున నారాయణుఁడని పిల్వంబడు నవతారముల నిల్చెను. తదంశసంభూతులే నరనారాయణులు. వారికి భేదమే లేదు. వారు నిరంతరతపస్సమాధి నలరుచు సమయ మొదవినచో నవతరింతురు. ఇన్ని యవతారములకు మూలకారణము శ్రీకృష్ణమూర్తియే. తద్భిన్నమేదియు లేదు.

## నరనారాయణులు తపస్సు చేయుట.

ఆనరనారాయణులు కలిసి హిమాచలమున నత్యుత్తమమని ప్రఖ్యాతినొందిన బదరికావనమునఁ దపస్సు చేయుచుండిరి. వారికిఁ బురాణమును లని ప్రఖ్యాతి గలదు. గంగాస్నానమొనరించుచు నియతిమై వేయివత్సరములు తపస్సు చేయుచుండిరి. ఆతపస్సు జగద్భయంకర మయ్యెను. దాన లోకములు తపించునట్లు కనఁబడెను. క్రమముగా నింద్రునకుం గూడ భయము గల్గెను. చింతావిష్టుఁడై యూశతమఖుఁడు వీరిరువురు ఘోరముగా నిట్లు తపస్సు చేయుట నాయీసింహాసనమును లాగుకొనుటకే కావచ్చును. వేఱుకోరికలు వీరికున్నయట్లు తోఁచకున్నది. ఈతపస్సున కెట్టులేని విఘ్నమాచరింపక తప్పదున్నది. వీరికిఁ గామక్రోధములను బహుదారుణంబగు లోభమును గల్పించిన నీ తపోనియతి యణఁగు. అని యూహించి యైరా

వతముఁనధిష్ఠించి గంధమాదనపర్వతమునకుం బోయెను. దానిచే రువ నున్న హిమాలయభాగమునఁ దపమొనరించుచు నుద యించు భాస్కరద్వయమా యన విరాజిల్లుచు, బ్రహ్మావిష్ణు వులా, అగ్నిహోత్రద్వయమా, లేక ధర్మపుత్రులగుదురా, ఏలయిట్లు తపమొనరించుచున్నారు! అనియూహించి చెంత కేగి మహాత్ములారా! మీరు ధర్మపుత్రులుగఁ గనఁబడుచున్న వారు. ఏవాంఛితమును బడయఁగోరి యీతప మొనరించుచున్నవారు? వరము కోరుఁడొసఁగెద. అవర మీఁ గూడనిదైన నొసం గెద. మీతపంబునకు మెచ్చితిని. అని మరల మరల వచింపఁగా వారు మౌనమును మానిరి. అంతలో నింద్రుఁడు మాయారూ పధారిణి యగు మోహినిని బుట్టించెను. అంతతోఁ దృప్తినొం దక వృకములను సింహవ్యాఘ్రములను బుట్టించి భయపెట్టెను. అతివృష్టిని, ప్రళయవాయువును, దావాగ్నిని గల్పించి భీతిని గల్పించెను. ధర్మసుతులగు నామునులించుకంతయు భీతినొందఁ రైరి. వరమును గోరరైరి. వారిం జూచి చూచి యింద్రుం డిఁకఁ గార్యము లేదని స్వర్గమున కేగెను.

తనసౌధమునఁ గూరుచుండి యింద్రుఁ డిట్లు చింతించెను. భయలోభములు వీరిని బాధింపలేక పోయెను. వీరు మూలప్ర కృతి నుపాసించుచున్నవారు. అట్టివారిని మోహింపఁ జేయఁ జాలు పదార్థమేది? ఎవరిచిత్తమున వాక్కామమాయాబీజ ము లుండునో వారిని బాధింపఁ జాలువా రెవ్వరు? అని యూ

మాత్రమున నాపర్వతమెల్ల నొక క్రొత్తవింత చెలువు దాల్చెను. వృక్షములు పుష్పించెను. పుష్పములయందు ద్విరేఫము లలరారఁ జొచ్చెను. అందామ్రాదిపాదపములు మనోహరముగఁ గానఁ బడఁ జొచ్చెను. వృక్షశాఖాగ్రములఁ గూరుచుండి పరభృత ములు కుహూనాదములు చేయఁజొచ్చెను. లలితవల్లులుపుష్ప వతులయి పాదపంబుల నాశ్రయించి యాలింగన మొనరించి కృతకృత్యతం గాంచెను. అందుఁ గల ప్రాణికోటి స్మరాతురమై ప్రేమయుక్తమయ్యెను. అంతతో నాఁగక క్రీడాపరాయణమ య్యెను. దక్షిణవాయువులు పరిమళమిళితములై సుస్పర్శములై వీవసాగెను. మునులకుం గూడ నింద్రియములు లోఁబడక విచ్చ లవిడిఁ బరుగిడఁ జొచ్చెను. రతీదేవింగూడి మన్మథుఁడు పంచ బాణములఁ బ్రయోగింపసాగెను. త్వరపడి యందు నివాసము గల్పించుకొనియెను.

రంభాతిలోత్తమలు బదరికాశ్రమమును జొచ్చి స్వర తానసమన్వితముగ గానముచేయ మొదలిడిరి. వారిమధురగీత ము, కోకిలకూజితము, షట్పదఝుంకారము మునులనియమ ము నించుక కదలింపఁజాలెను. నరనారాయణులు నియమము నుండి వెలుపలంబడిరి. అకాలమున ఋతుప్రవేశముం దెలిసికొ నిరి. పుష్పితకాననముం దిలకించిరి. ఇదేమని చింతింప సాగిరి. శిశిరర్తువేల కడచనియె? వసంతమేల యిట్లకాలమున వ్యాపిం చెను? ప్రాణివితతి యంతయు స్మరాతురమై యిట్లు చంచలించు

చున్న దేల? ఇంతలో నిట్లు కాలధర్మవిపర్యాసము కల్గెఁ గదా ఏటికో? అని యూహింప సాగిరి.

అంత విస్మయోత్ఫుల్లలోచనయుగళుండై నారాయణుండు నరున కిట్లనియె. భ్రాతృమహర్షీ! పాదపము లివి యకాలమున నెట్లుపుష్పించినవో చూడుము. కోకిలాలాపము లెట్లు వినఁబడుచున్నవో, మధుపఝుంకారములెట్లు విజృంభించుచున్నవో వినుము. శిశిరర్తువనగజమును వసంతర్తుపంచాస్యము పలాశకుసుమరూపస్వకీయోగ్రనఖరముఖముల విదారించి ప్రవేశించెను. రక్తాశోకహస్తముల రాజిల్లుచుఁ గింశుకాంఘ్రిద్వయశోభితయై నీలాశోకకచయుక్తయై, వికసితకమలానన భాసమానయై, నీలేందీవరనయనయుగస్ఫీతయై, బిల్వవృక్షఫలవక్షోజయై, ప్రోత్ఫుల్లకుందకుసుమరదనయై, మంజరీవర్ణశోభితయై, బంధుజీవాధరయై, సిందువారనఖరయుతయై, పుంస్కోకిలస్వరయై, పవిత్రకదంబవసనయై, బర్హిబృందకలాపయై, సారసస్వన నూపురయై, వాసంతీబద్ధరశనయై, మత్తహంసగతియై, పుత్రజీవాంశుకన్యస్త రోమరాజివిరాజితయై వసంతలక్ష్మి బదరికాశ్రమమును దీనిం బ్రవేశించెను. అకాలమున నీవింత యేలకలిగె నని నామదిసంశయమందుచున్నది. ఇది మనతపోవిఘ్నమొనరించుటకుఁ జేసిన దేవప్రయత్న మని నాకుం దోఁచెడు. నీవు నాలోచింపుము. ధ్యానవినాశమునకు సాయముగానున్న దేవకాంతాగానము వినఁబడియెడు. మనతపస్సునకు భంగమునుగల్గింప నింద్రుఁడు చేసిన

కృత్రిమోపాయమైయుండు. లేకున్న నకాలమున వసంతవిజృంభణ మెట్లు పొసఁగు? ఇంద్రుఁడు భీతుఁడై తపస్సును జెఱుపఁ జేసిన ప్రయత్నమే యిది యని నాయూహ. వాయువును పరిమళమిళితములై వీచుచున్నయది. శతక్రతుకృతితప్ప వేఱు కారణములు లేవు.

అని యిట్లు నారాయణముని పలుకుచుండునంతలో వసంతాదులామహామునిలోచనగోచరులైరి. నరనారాయణు లిరువురు వారి నెల్లం గాంచిరి. ఇరువురును బరమవిస్మయమును బొందిరి. మన్మథుఁడు, రంభయు, మేనకయుఁ, దిలోత్తమయుఁ, బుష్పగంధయు, సుకేశియు, మహాశ్వేతయుఁ, బ్రమద్వరయు, ఘృతాచియు, గీతజ్ఞయగు చారుహాసినియు, జంద్రప్రభయు, సోమయు, విద్యున్మాలయుఁ, గాంచనమాలినియు, నంబుజాక్షియు, నింకనుఁ గొంద ఱచ్చరలును వారి కంటఁ బడిరి. ఇట్టు లెనిమిదివేలయేఁబదిమంది దేవకాంతలు వారియెదుట నుండఁగా మదనుసైన్య మిది గదా యని యచ్చెరువందిరి. దేవవారాంగన లామహర్షులకు వందనము లాచరించిరి. దివ్యాభరణభూషితలై దివ్యమాల్యానులేపనశోభితలు నగువారెల్ల వారియెదుట నిలువంబడి వినయ ముట్టిపడఁ గపటంబునఁగై మోడ్పులలర నుండిరి. పాడిరి. ఆడిరి. ఆవిధమంతయు గాంచి పరమమునులగు నరనారాయణులు విస్మయమందుచుండ నందు నారాయణముని వారి కిట్లనియె.

దేవభామినులారా మీకు ప్రీతియలరునే నిందుండ వచ్చును. అద్భుతమగు నాతిథ్య మొసంగెదము. మీ రెల్ల నిచటి కతిథిధర్మమున స్వర్గమునుండి వచ్చితిరి. అని పలికి యింద్రుని కపటచర్యం దలంచి యవ్వారికన్న సుందరులను గొందఱం దపోబలంబునం బుట్టింపం దలంచెను. అంత నామునివరుండు కర తలమున నూరు తాడన మొనరించెను. అంతలో నొక నారీమణి లోకోత్తర రూపశోభిత యుదయించెను. నారాయణోరుసం భూత గావున నూర్వశి యనం బరంగె. వా రెల్ల నాసుందరాంగిం గాంచి విస్మయంపడిరి. ఇంకను గొందఱు కాంత లాదేవభామి నులకుం బరిచర్యచేయుపొంటెం బుట్టింపంబడిరి. వా రెల్లం బాడుచు నాడుచుం గిలకిలనవ్వుచు నానావిధోపాయనములం గరంబులం దాల్చి యమ్మునులకు నమస్కరించి చేతులు జోడించి నిలువంబడిరి.

అంత నూర్వశిం గాంచి దేవకాంత లెల్ల నచ్చెరువంది తపోమహత్త్వ మిట్టి దగునే యని వినుతించి తమయవివేకము నకు లజ్జించుచు "మహామునులారా! మీమహత్త్వ మపారము. మేము మీ సేవచేయుచు శతమఖునాజ్ఞను నిర్వర్తింతుము. మా పూర్వజన్మ కృతపుణ్యమువలన మీదర్శనం బొదవె. ఇట్లు మీ పాదసేవ చేయు మాయందు క్షమించునూహ యునుచుట మీకు ధర్మంబు. మీమహత్త్వ మెఱుంగక తుచ్ఛులగు దేవత లీవిఘ్నకా ర్యము చేయ నెంచిరి. మీరు క్షమించుట యే వారికి శాపమగును."

అనిపలుకు రంభాదినిలింపపంకజాక్షులమాటల కలసి యామహర్షులు వనితలారా! మీవాంఛితములఁ గోరుఁడు. పరమప్రీతుల మగుట వాని నొసంగెదము. ఈయూర్వశిం దోడ్కొని స్వర్గమునకుం బోవచ్చును. మాయూరుసంభూత యగునీసుందరిం గాంచిశతక్రతుండు సంతృప్తి నొందుఁగాక. మీకెల్లశుభములు గలుగుఁగాక. యథేష్టముగనరుగుఁడు” అనుటయు నాదేవభామిను లిట్లు పల్కిరి. మహాత్మా! మీపాదపంకజసేవ మాని యెందుఁ బోదుము. మీరు భగవంతులరు. మావాంఛితంబు లొసఁగుదు మంటిరి కదా. వరము లిండు. శ్రీమన్నారాయణా!కమలపత్రాక్షా! తుష్టుఁడవైతివేని మాకాంక్షితంబులం దెల్పుదుము. మాకెల్ల నీవ పతివి గావలయు. ఈవర మనుగ్రహింపుము. మేమెల్ల నత్యంతప్రీతియుక్తలమై నాథుఁడవగు నిన్ను సేవించుచుందుము. మీచే సృజింపఁబడిన యంగన లెందఱో కలరుకదా. ఊర్వశిం గూడి వారెల్ల భవదాజ్ఞఁ గొని దేవలోకంబునకుం బోదురుగాక. పదాఱువేలయేఁబదిమంది మిచ్చటనే యుండఁగోరెదము. ఇట నుండి మీకు సేవ లొనరించుచుందుము. మీరు రుభయులు తాపసోత్తములుగదా. ఓమాధవా! వాంఛితంబుఁ దెలుపుఁడు. ఇత్తునంటిరివి. సత్యవాక్యను బాలింపుము. స్త్రీలకాశాభంగము గావించుట హింసాతుల్య మనఁబడునుగదా. అందును గామార్తలమగు మాయాశకు భంగ మొనరించుటంగూర్చి చెప్పవలసిన దేమున్నది? నీవు తత్త్వజ్ఞుఁడవు. ధర్మమూర్తివి. మాయదృ

ష్టము ఫలించినందుననే యిచ్చటి కేతెంచితిమి. స్వర్గమును వదలితిమి. ప్రేమప్రవాహమున మునిఁగితిమి. మమ్మిట్టివారిని ద్యజింపధర్మమగునే. మహాదేవా! సమర్థుఁడవగు నీ వీయాశను దీర్పుము.

అని రంభాదినిలింపకాంతలు వినయమున వేఁడ నాలకించి నారాయణుం డిట్లు బదులు చెప్పెను. వనితామణులారా! నే నిం దీమునిఁ గూడి వేయిసంవత్సరములు కొఱంత లేకుండఁ దపమొనరింపవలయు. జతేంద్రియుఁడనుగా నుండవలయు. అట్టి వ్రతమునకు భంగము గావించుట న్యాయమగునే. నా కిపుడు కామేచ్ఛ పొడమకున్నయది. ధర్మవినాశమును జేయఁజనదు. పశుధర్మము నాశ్రయించి మతిమంతుఁ డెవఁ డట్లు ధర్మహానిం జేయఁబూనును? శబ్దస్పర్శరూపరసగంధములయందు స్పర్శసుఖముత్కృష్టమనంజను. ఆనందరసమూలమగు తపమునకంటె నెక్కువసుఖముగల దేది కలదు? కాన నోకామినులారా! మీ ప్రభువునుత్తరువుచొప్పునఁ బ్రవర్తిల్లుఁడు. గంధమాధనమున నిచ్ఛమై విహరింపుఁడు. స్వర్గమునకంటె నిట నధికసుఖము గలదని మీకుఁ దోఁచిన నిం దుండుఁడు.

* ఇట్లు దేవాంగనలకుం జెప్పి నారాయణుఁడు తనలోఁ దా నిట్లు తలపోసికొనియెను. అహంకారమున దుఃఖము గల్గును.

---

* ఇది దేవీభాగవత చతుర్థస్కంధ సప్తమాధ్యాయమునుండి గ్రహింపఁబడియె.

సందేహమే లేదు. ధర్మవినాశమునకు మూల మహంకారమే. కావుననే మహాత్ములు దీని నహంకారవృక్షమూల మని వక్కాణించిరి. ఈరావాంగనాసముదాయమురాఁగా మౌనమూని యుండనైతిని. వీరితో మాటలాడినందున నీదుఃఖము సంభవించెను. తపోవ్యయమున కోర్చి దివ్యాంగనల సృజించితిని. వారందఱు కామార్తలై నన్ను బాధించుచున్నవారు. సాలెపురుగు స్వకృతతంతుపటలమునందువలె నీసంసారపంజరమున దృఢముగాఁ జిక్కితిని. ఇఁక నే నేమి చేయఁదగును? నిర్విచారముగా వీరిని ద్యజింతునా. వీ రెల్ల భగ్నమనోరథలై నన్ను శపించి పోవుదురు. ఐనను వీరినుండి విముక్తుఁడనై నిర్జనవనంబునఁ దపఃకేళి నుండెద. అట్లు చేయఁ గ్రోధము నాశ్రయించి వీరిని వదలెదను.

అని నారాయణుఁడు మనమునఁ జింతించి మరల నిట్లాలోచించెను. ఈక్రోధము రెండవ మహాశత్రువు. సంతాపకారకము. ఇది కామమునకంటె నధికము. లోభమునకంటె దారుణము. జనుఁడు క్రోధాభిభూతుఁడై హింసాకర్మము నాచరించును. ఆహింస నరకోద్యానమున సరస్సువంటిది. దుఃఖము నొసఁగునది. అగ్ని దారుద్వయసంయోగమునఁ బ్రభవిల్లి వృక్షమునుగాల్చునట్లు దేహోత్పన్నమగునీక్రోధము దేహంబునే భయంకరాకృతిం బూని కాల్చును. అని యిట్లాలోచించుచున్న దీనమానసుం డగుభ్రాతం గాంచి నరుం డిట్లు పల్కెను. మహాత్మా! క్రోధమునకుఁ దావీయకుము. ఈయహంకృతిని శాంతభావము

నాశ్రయించి పరిమార్పుము. ఇంతకుముందే యహంకారదోష మున మనయిరువురతపస్సు నశించెను గదా. ఆయహంకార దానవునితో సంగ్రామ మొనరించితిమి. తొల్లి ప్రహ్లాదునిమిత్త మై దివ్యవర్షసహస్రము దుఃఖ మనుభవించి హిరణ్యకశిపుం బరి మార్చితిమి. కాన నిపుడు క్రోధమును విడువుము. శాంతుఁడవు కమ్ము.

అనునరునిపలుకు లాలకించి ధర్మనందనుండగు నారాయ ణుండు శాంతుఁ డయ్యెను. అనంతరము జనమేజయుండు సంశ యావిష్టమతియై యిట్లు ప్రశ్నించెను. మహాత్మా! విష్ణుభక్తాగ్రేస రుండగు ప్రహ్లాదుఁడేల నరనారాయణులతో యుద్ధ మొనరించెను? నరనారాయణు లిర్వురు పరమశాంతస్వభావులు, ధర్మపుత్త్రులు నగుదురుకదా. వారేల ప్రహ్లాదునితో సంగర మొనరించిరి? వా రికి మొదటిసమాగమం బెట్లుఁ గలిగె? వారిద్దఱితోఁ బ్రహ్లా దుఁ డొక్కరుఁ డెట్లు సంగర మొనరించెను? దైత్యతనయుండయ్యు నతండు మిగుల ధర్మాత్ముఁడనియుమహాజ్ఞానియనియు విష్ణుతత్పరుం డనియు వింటిని. అట్లే నరనారాయణులు సత్త్వగుణప్రధానులు, తాపసులు నని వింటిని. అట్టివారి కెట్లు సంగ్రామంబు ఘటిల్లెను? పరస్పరవైర మెట్లు సంభవించెను? తపోధర్మములయందు విశేష శ్రమము కలదనియు, సత్యయుగమునందు జపతపశ్చర్యలే ప్ర ధానములనియు వినియుంటిని. అట్టిశ్రమసాధ్యములగు జపతప స్సులచేఁ గ్రోధాహంకారసమన్వితంబగు చిత్తంబు జయింపఁ

బడియె ననియుఁ బెద్దలు వచించిరి. అహంకారాంకురము లేకున్నఁ గ్రోధమాత్సర్యము లుండవు కదా. అహంకారమునుండియే కామక్రోధాదులు పుట్టునుగదా. వేయికోటులసంవత్సరములు తపమొనరించినను అహంకారాంకుర ముండెనేని అది వ్యర్థమగును. రవ్యుదయమునందుఁ దమ స్సుండునా. అట్లే అహంకారాంకురము వెలసెనేని పుణ్యము నిలువఁ జాలదు.

ప్రహ్లాదుఁడు కూడ శ్రీహరితో యుద్ధమొనరించెను. కాఁబట్టి తపస్సు వ్యర్థమయ్యెను. శాంతులగు నరనారాయణులు తపస్సును వదలి యుద్ధ మొనరించి రన శాంత మెక్కడ? సుకృత మెక్కడ? ఇట్టి పరమశాంతులచేతనే యహంకృతి జయింపఁబడలేదు కదా. మావంటివారిచే నది జయింపఁబడునన్న వార్త కల్ల. దీనిం బట్టియాలోచింపఁగా లోకత్రయమున నహంకారపరిత్యక్తుఁడు లేనేలేఁడని దృఢపడుచున్నది. ఇఁక ముందు నట్టివాఁ డుండఁగలఁ డని కాని, ఇదివఱకుండె నని కాని తోఁపకున్నయది. లోహమయములు దారుమయములునగు శృంఖలలచే విముక్తుఁడు కావచ్చును గాని అహంకారనిగళబద్ధుఁడు విముక్తుఁడు కానేరఁడు. స్థావర జంగమాత్మక ప్రపంచము సర్వ మహంకారావృతమయియే యున్నది. విష్ణుమాయాప్రదూషితమ్మగు సంసారమునందుఁ బ్రతి జీవుఁడు తిరుగుచున్నవాఁడు. మోహాసంవృత సంసారమందు బ్రహ్మజ్ఞాన మేలాగున నలవడును? మీమాంసకులమత మిదియే యని తోఁచెడు. మహాత్ములు కూడఁ గామక్రోధ

ప్రముఖదుర్గుణంబులకు లోఁబడి రనఁగా నిఁక మావంటివారి మాట యిటఁ బ్రస్తావింప నేల?

అనుటయు వ్యాసమహర్షి జనమేజయా! భరతకులప్రదీపకా! కార్యము కారణమునకంటె భిన్నముకానేరదు. కటకకుండలాదులు సువర్ణతుల్యములే యగు. సచరాచరబ్రంహ్మాండ మహంకారోద్భవము. దాని వీడినచో వస్త్రమునందలి తంతువులవలె నుండును. స్థిరచరసృష్టియంతయు మాయాగుణముల మూఁట నమరియుండును. ఇట్లు తృణము మొదలు బ్రహ్మపర్యంతముండును. ఏల చింతింపవలయు? బ్రహ్మవిష్ణుమహేశ్వరు లహంకారమోహితులు. అగాధమగు నీ సంసారసాగరమున మునుఁగుచున్నవారు వసిష్ఠనారదాదులగు మునులు గూడ జ్ఞానధనులయ్యు నిందే మునిఁగియున్నవారు. అట్టివారు గూడ నహంకారాభిభూతులై మరల మరల సంసారాబ్ధినిమునుఁగుచునే యున్నారు. రాజా! త్రిలోకములయందును దేహధారి యెవఁడు గాని తదనభిభూతుఁడు గానరాఁడు. ఈ త్రిగుణములు మాయానిర్మితములు. వీనింబాసి సుఖముగనుండువాఁడు లేఁడు. కామక్రోధములు, లోభమోహములు అహంకారసంభవములు. రాజేంద్రా! ఇవి దేహధారి నెవ్వనే విడువవు. వేదశాస్త్రములం బఠించి పురాణముల నెఱిఁగి తీర్థాటనము చేసి దానధ్యానసురార్చనముల నొనరించియు విషయాసక్తుఁడై దొంగవలె స్వకర్మముల యథాపూర్వముగ నేచేయుచుండును. కామమోహమదా

న్వితుఁడై పూర్వమును దలంపఁడు. కృతత్రేతాద్వాపరములయం దు ధర్మవిరాగుణములచేఁ గొట్టఁబడు నన౯గా నిఁకఁ గలియుగ మువూట చెప్పవలసిన దేమి? సద్రోహస్పర్ధయు, లోభామర్ష ములు సదా వెలయుచుండును. సంసార మిట్టిది. దీని విచారణ యేల? లోకమున సాధువ్రలు విరళముగ నున్నారు. గతమత్స రులే సాధువ్రు లనంబడుదురు. జితక్రోధులు జితామయులు దృష్టాంతమునకై మాత్ర మున్నారు.

అన జనమేజయుఁ డిట్లనియె. మునీంద్రా! మదమోహ వివర్జితులే ధన్యులు. వారే పుణ్యమతులు. జితేంద్రియులై సదా చారులై యున్నవా రెవరో వారే త్రిలోకములజయించినవారు. మహాత్ముఁ డగు నాతండ్రి పాతకము విన్న వణఁకుచుందును. నిరప రాధియగు మునికంఠంబున సర్పమును జుట్టెను. దాన వీరికిఁ గల్గిన లాభ మేదియో యెఱుంగఁజాలకున్నాఁడ. బుద్ధిసమ్మోహంబున నేకార్య మెట్లగునో తెలియఁ జాలను. మూఢాత్ముఁడు మధు రసమును జూచునేగాని దానిం గ్రోలి పడి పొరలాడువానిం జూ డఁడు. నిందితకర్మమును జేయునుగాని నరకమునకు భయంపడఁ డు. ఈవిషయ మిటుండనిమ్ము. నరనారాయణులకుఁ బ్రహ్లాదున కునైన సంగరము నెఱింగింపుము. పాతాళమునుండి ప్రహ్లాదుఁడె ట్లు నరనారాయణుల పైకిఁజనియె. బదరికాశ్రమమునందు సార స్వతతీర్థమునందు శాంతులగు నరనారాయణులు మునిసత్తము లయ్యుఁ బ్రహ్లాదునితో సంగర మొనరింప నేమి హేతువు కలిగె?

ద్రవ్యార్థమై విరోధము కలిగెనా? భార్యార్థమై పగ కలిగెనా. ఏషణారహితులగు మహర్షులు యుద్ధ మెట్లు చేసిరి? ధర్మాత్ముఁడగు ప్రహ్లాదుఁడు కూడ సనాతనులయి దేవతలైతగు నరనారాయణుల నెఱింగియు యుద్ధ మేరీతిఁ జేయఁ బూనెను? ఈకథను విస్తరించి వచింపుమా యని వేడ గృష్ణద్వైపాయనుం డిట్లు బదులు చెప్పెను.

## ప్రహ్లాదనరనారాయణసమాగమము.

జనమేజయుం డంతలో నిర్వేదముం బొందెను. తండ్రి చిత్తదుశ్చరితమునుదలంచి కుందఁజొచ్చెను. తండ్రి నుద్ధరించుటకే పనిపూనెను. విప్రావమానకోపంబున యమలోకంబున కేగవలసివచ్చెనుఁ గదా యని విచారించెను. పున్నామనరకమునుండి తండ్రిని దరింపఁ జేసినవాఁడే పుత్త్రుఁడనఁబడునని తలంచెను. సర్పదష్టుఁడగు తండ్రి హర్మ్యోపరితలంబున మృతుండగుటకు విప్రశాపంబు కారణముగదా యని దుఃఖించెను. దుర్గతి పితకుం గల్గెఁ గదా యని పలుమాఱులు నిర్వేదము నొందెను.

ఇట్లు పాటిల్లుతుండగు జనమేజయుండు సంతప్తుఁడై భయవిహ్వలుఁడై వ్యాసమహర్షిం గాంచి నరనారాయణకథను జక్క వచింపుమా యని ప్రార్థించెను. ఆమహర్షియు సంతుష్టుఁడై యిట్లు బదులు చెప్పెను. జనమేజయా వినుము. మహాక్రూ

* ఈకథ దేవీభాగవత చతుర్థస్కంధాష్టమాధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

రుఁడగు హిరణ్యకశిపుఁడు నృసింహపరమాత్మచే హతుఁడుకాఁగా దానవులందఱు ప్రశమితసంతాపులై కొలఁదిదినములకే యారాజ్యపదమునఁ బ్రహ్లాదుని హిరణ్యకశిపుజ్యేష్ఠతనయుని సకలసద్గుణజ్యేష్ఠు నభిషేకించిరి. పట్టాభిషిక్తుఁడగు ప్రహ్లాదుఁడు దేవబ్రాహ్మణపూజకుఁడై రాజ్యమేలుచుండునపుడు భూలోకవాసులగుప్రభువులు యజ్ఞములను జేయుచుండిరి. శ్రద్ధాభక్తులుగలిగియు నుండిరి. బ్రాహ్మణులు తీర్థయాత్రాపరులై తపోనిష్ఠులై యుండిరి. వైశ్యులు స్వకర్మనిరతులు. శూద్రులు వృత్తివిముఖులు గాకుండిరి.

నృసింహమూర్తి ప్రహ్లాదునిఁ బాతాళలోకమున నుంచెను. అందే యుండి యాసద్ధర్మమూర్తి లోకపాలనతత్పరుఁడయ్యెను. ఒకానొకప్పుడు భృగుతనయుఁడు చ్యవనమహర్షి నర్మదానదీస్నాన మొనరించుకుతూహలమున నచ్చటికి వచ్చెను. రేవామహానదిం గాంచి ప్రణమిల్లి దిగెను. స్నానముచేసి వెడలుతఱి విషభయంకరంబగు నాగం బొండు అమ్మహర్షిని బట్టుకొనెను. సర్పగృహీతుఁడై భీతుఁడై యామహర్షి పాతాళమందున్న శ్రీమహావిష్ణువును స్మరించెను. భగవంతుని స్మరింపఁగనే యాసర్పము నిర్విషమయ్యెను. సర్పంబిట్లు నర్మదనుండి పాతాళమునకీడ్చుకొనిపోయిన నుచ్యవనముని దుఃఖితుఁడుకాక నిర్విషసర్పపరిత్యక్తుఁడయ్యెను. సర్పమీమహర్షి నన్ను శపించునేమో యని చాల సంశయించెనుగాని ముని యట్లు శపింపక నాగకన్యాపూజితుఁ

డై యందు సంచరించుచుండెను. నాగదానవసంఘుజుష్టం బగు నగరంబుఁ బ్రవేశించెను.

ఇట్లు తనపురంబున స్వేచ్ఛం దిరుగు భృగుపుత్రునఁ జ్యవనమహర్షి నాకానొకసమయంబున దైత్యనాయకుండగు ప్రహ్లాదుఁడు చూచి ధర్మవత్సలుఁడు కావున నమ్మహాత్మునిం బూజించి మహామునీ!,ఏల యీపాతాళమున కేతెంచితిరి? కారణంబు వినఁగోరెద నని ప్రశ్నించెను. ఇంద్రునిచేఁ బంపఁబడితివా యనియు నడిగెను. సత్యము వచింపుమా వాచంయమేంద్రా యని మరల వినయ ముట్టిపడ వేఁడెను. ఇంద్రుఁడు సదా దానవులపైఁ బగఁ బూనియుండును. ఇపుడు నాయీరాజ్యమును గ్రహింపనెంచి నినుం బంపెనా యని మఱియుఁ బ్రశ్నించెను.

చ్యవనమునియుఁ బ్రహ్లాదా! ఇంద్రునిప్రేరణముననే యిటకు వచ్చితిననియు, దూతకార్య మొనర్ప నెంచితి ననియు భావింతువా! భృగుపుత్రునిగా నను నెఱుంగుము. జ్ఞానచక్షుస్సునిగను ధర్మతత్పరునిగ నను భావింపుము. వాసవప్రేషితుఁడ నని శంకింపకుము. స్నానార్థ మేను నర్మద కరుదెంచితిని. తీర్థమున మునుఁగుతఱి నన్నొకమహాహి పట్టుకొనియెను. విష్ణువును స్మరించితిని. సర్పము నిర్విషమయ్యెను. ఆనారాయణస్మరణప్రభావమున నాగనిర్ముక్తుండనైతిని. ఇందుఁ జొచ్చితిని. ఇట్టి నాకు నీదర్శనం బొదవెను. దైత్యేంద్రా! నీవు శ్రీమహావిష్ణుభక్తుండవు. నన్ను విష్ణుభక్తునిగా నెఱుంగుము.

అనుచు నమ్మహాముని మాటల కెంతయు సంతసించి గౌరవపూర్వకముగా సకలతీర్థమహిమములఁ బ్రశ్నించెను. మహాత్మా! భూలోకమున నేవేవి పుణ్యతీర్థము లనఁబడును. పాతాళమందును, స్వర్గమందు నేవేవి పుణ్యతీర్థవిఖ్యాతిం గాంచును. ఈవిషయ మెఱింగింపుమా? యని వేఁడెను. చ్యవనుఁడా! ప్రశ్నమునకు మిగుల సంతసించి యిట్లనియె. రాజేంద్రా! * మనోవాక్కాయశుద్ధుల కెల్ల తీర్థములు పవిత్రములే యగు. మలినచిత్తులకు వియద్గంగయు నపవిత్రయే యగు. తొలుదొలుత పాపవివర్జితమై మనస్సు పరిశుద్ధమయ్యెనేని సర్వతీర్థములు పావనములగు గంగాతీరంబున నెన్నియో నగరములు విరాజిల్లుచుండును. గొల్లపల్లెలు ప్రజాకరములగు గ్రామములు ♦ ఖేటములు నిషాదనివాసములు, కైవర్తవాసస్థానములు, హూణవంగఖసమ్లేచ్ఛస్థానములు ఎన్నియోఁగలవు. పరమపవిత్రమై జ్ఞానప్రదమగు నాగంగాసలిలంబును అందుండువారెల్లఁ ద్రాగుచుందుగు. త్రికాలములయందు నిచ్ఛానురూపంబుగా స్నానము చేయుచుందురు. అందొక్కఁడైనను దన్మహిమమున శుద్ధాత్ముఁడు కాఁడు గదా. కాఁబట్టి విషయోపహతాత్ములకుఁ దీర్థములతో నేమిలాభము? కారణము మనస్సే? ఇతరమేదియుఁగాదని తలం

---

* 'మనోవాక్కాయ శుద్ధానాం రాజం స్తీర్థం పదే, పదే కథామలినచిత్తానాం గంగాపికీకటాధికా' అని మూ.

♦ ఖేటములనఁగా వ్యవసాయముచేయువారు నివసించు గ్రామములు.

పుము. కావునఁ బరిశుద్ధుఁడు కాఁదగువాఁడు తొలుత స్వచిత్త మును బరిశుద్ధము గావించుకొనవలయు. మనస్సును వంచించు వాఁడు తీర్థతటవాసి యయ్యుఁ బాపాత్ముడే యగును. మఱి యుఁ బుణ్యతీర్థంబుల నొనరించు పాప మనంతమగును. కావునఁ దొలుత మనశ్శుద్ధి ప్రధానము. అది పరిశుద్ధ మయ్యెనేని సకల పదార్థములు పరిశుద్ధములే. వేఱొకభంగిఁ గావు. అట్లే ఆచా రము పరిశుద్ధము కావలయు. అపుడు తీర్థము ప్రసన్నమై యా తనిం దరింపఁజేయును. లేనిచో నతఁడు చేసిన పుణ్యకార్యము లన్నియు నిష్ఫలము లగును. కర్మముచేతను బుద్ధిచేతను భూత దయ సంపాదింపవలయు.

ప్రహ్లాదా! నీవు ప్రశ్నించినందున నుత్తమతీర్థములను జెప్పెద వినుము. నైమిషము, పుణ్యతీర్థము, చక్రతీర్థము, పుష్కరము, పుణ్యతీర్థములు. భూలోకమున నిట్టి తీర్థము లెన్ని యోగలవు. వానిలెక్కింప శక్యముగాకుండును. పరమపావ నములని విఖ్యాతిఁ గాంచిన వెన్నియో ఉన్నవి. అనిచ్యవన ముని వచియింపఁ బ్రహ్లాదుఁడు నైమిశంబును జూడ నుద్యుక్తుఁ డయ్యెను. హర్షనిర్భరమానసుఁడై దానవులఁ బ్రోత్సహించెను. మహాదానవులార! లెండు. నైమిశక్షేత్రమునుజూడఁబోవుదము. అందు వేంచేసియుండు జనార్దనుని పీతవాసునిఁ జతుర్భుజునిద ర్శింతము. అని పలుకునంతలో దానవులందఱు పరమప్రీతులై పాతాళమును వెలువడి నైమిశారణ్యపుణ్యక్షేత్రమును జేరి

యందుండు తీర్థోదకంబులఁ గృతావగాహులై పరమానంద భరితులైరి. ప్రహ్లాదుండును దైత్యవితతింగూడి పుణ్యతీర్థముల దిరుగుచు సరస్వతీనది నొకనాఁడు దర్శించెను. అది విమలోదకముల విరాజిల్లుచు, నేత్రపర్వమనఁ దగి యుండెను. అందు స్నానముచేసినంతనే ప్రహ్లాదునిచిత్తము సుప్రసన్నమయ్యెను. ఆసత్తీర్థతటమున నివసించెను.

## ప్రహ్లాదునకు నరనారాయణులకు జరగిన యుద్ధము.

* ఇట్లు దైత్యరాజకుమారుఁడగు ప్రహ్లాదుఁ డాతీర్థరాజంబు నాశ్రయించి యుండి యందొకచో విశాలశాఖాసమాచ్ఛాదితభూభాగం బగు వటమహీరుహరాజంబును జూచెను. దానిక్రింద నానావిధాకృతుల నలరి గృధ్రపక్షచిహ్నితములై యతినిశితాగ్రములై శిలాధౌతములై మహోజ్జ్వలములై యున్న బాణరాసులం గాంచెను. వానింజూచి యచ్చెరువడి యివెవ్వరిబాణములై యుండునా యని యాలోచించెను. ఇది మహర్షులనివాసము పరమపావన తీర్థరాజము. ఇందు బాణములుండ నేల? అని యిట్లు చింతించునంతలో నాతనియెదుటఁ గృష్ణాజినధారులయిన మును లిర్వురు తోఁచిరి. అత్యున్నతజటాజూటములలర ధర్మపుత్రులగు వారిర్వురుకనఁబడిరి. వారియెదు

* ఈకథ దేవీభాగవతము, ౪ స్కం. ౯ అధ్యాయమునుండి సంగ్రహీతము.

ట సకలలక్షణములొప్ప బరిశుభ్రములైన ధనుర్వరములు రెం డుండెను. శార్ఙ్గమొకటి. ఆజగము రెండవది. వానిచెంగట నక్ష యములగు నమ్ములపొదులు కనఁబడియె. ధ్యానయుక్తు లగు నాయిరువురు మహర్షులు నరనారాయణు లనునామమునఁ బ్రసిద్ధులు. ధర్మపుత్రు లగువారిం గాంచి యాదైత్యాధిప నందనుఁడు క్రోధరక్తేక్షణుఁడై యిట్లు పల్కరించెను. ఓమును లారా! ధర్మవినాశనమగు దంభకర్మము మీచే నారంభింపఁ బడినది. ఇట్టి క్రూరవ్యాపారము వినఁబడినది లేదు. చూడఁ బడినదియు లేదు. తీవ్రతపశ్చరణము దానివెంట భయంకర ధనుర్ధారణము. ఈయుగమున నీకర్మద్వయ మొకరిచే నవలం బింపఁ డుట విరుద్ధము. ఇది కలియుగమున సర్వమైనది. బ్రాహ్మణునకుఁ దపస్సు న్యాయ్యము. చాపధారణ మేల? దేహమున జటాధారణమేమి? అమ్ములపొదుల ధరించుటేమి? ఇదేమి విడంబనమా? దివ్యభావసముపేతుల రగు మీకు ధర్మాచరణము న్యాయ్యము.

అను ప్రహ్లాదుని పలుకు లాలకించి నరుఁ డిట్లు బదులు చె ప్పెను. దానవేంద్రా! మాతపస్సునందు నీకేల యీవృథాచింత. ఎవరికి సామర్థ్యముగలదో వాని నావిద్యలుపొందును. ఓజడ మతీ! మేమీ రెండు కార్యములయందును సమర్థులము. లోక విశ్రుతులము. యుద్ధమునం దెంత సామర్థ్యముగలదో తపస్స నం దంతటిశక్తి మాకుం గలదు. నీవేమిచేయఁగలవు? యథే

చ్ఛముగా బొమ్ము. ఇందేల సంశయించెదవు? ప్రల్లదము లేల పలికెదవు? బ్రహ్మతేజస్సు దురారాధ్యము. విమోహితుండవగు. నీవేమెఱుంగఁ గలవు? బ్రతికి సుఖపడఁగోరువారు విప్రచర్చ చేయఁ బూనరాదు.

ఇట్లు పలికిన విని ప్రహ్లాదుం డిట్లు తనలో విచారించెను. ఈతాపసులు మందబుద్ధులు. వృథావాగ్గర్వ మోహితులు ధర్మసేతు ప్రవర్తకుండనగు నేనుండ వీరిట్లు మాటలాడఁ జనునే? ఈపావనతీర్థమం దిట్టి యుద్ధాచరణము తగనిపని. అని విమర్శించుకొనుచుఁ దపోధనా! యుద్ధమందు నీశక్తి యెంతయో కనఁబఱపుము. నేఁజూచెద. అని హిరణ్యకశిపునందనుఁ డాడ విని నరుం డిట్లు మరలఁ బల్కెను. దైత్యనందనా! నీకిట్టి యహంకారముఁగలదేని నాతో యుద్ధమొనరింపుము. దైత్యాధమా ఇపుడే నీశిరస్సు ఖండించెద. అను నంతలోఁ బ్రహ్లాదుఁ డతికుపితుండై బలవంతుండుగాన నిట్లు ప్రతిజ్ఞచేసెను. ఏయుపాయము చేతనైన వీరినిరువుర జయించెద. నరనారాయణులను వీరు ఋషులు. తాపసమన్వితులు. అయినను వీరి నోడించిగాని మరలను అనిపల్కుచు ధనుర్దండమును గేలనందుకొని యాకర్ణాంతముజ్యాలతికను లాగి భయంకరశబ్దము గలుగఁ జేసెను.

నరుండును జాపమందుకొని యెక్కుపెట్టి ప్రస్తరములంబోలు నారాచములఁ గురిపించెను. ఆక్రూరనిశితబాణములు ప్రహ్లాదునిమీన నాటరాఁగాఁ బ్రహ్లాదుఁడు తపనీయపుంఖములై

తనరు బాణముల జ్వాలతికకుంగూర్చి వైచి వానిని దిలప్రమా ణశకలములుగా ధరం బడంజేసెను. తన నారాచములు శకల ములై ధరంబడుట కెంతయు నాగ్రహించి నరుండును వేలు మార్గణములం బ్రయోగించెను. తీవ్రవేగములగు వానిం గూ డ నాప్రహ్లాదుండు ఛేదించి యమ్మునియురము నొప్పించెను. నరుండును రోషావేశంబున నాశుగపంచకంబున నాదైత్యరాజ బాహుభాగము నొప్పించెను.

అత్తఱి నాయుద్ధమును జూడంగోరి యింద్రాదినిర్జరోత్త ము లంబరభాగంబున విమానారూఢులై నిలిచిరి. నరుని యు ద్ధనైపుణ్యమును, బ్రహ్లాదుని పరాక్రమమును వరుసం గొని యాడిరి. ఇంతలో దానవరాజు గృహీతచాపుండై మేఘములు వర్షించునట్లు శిలీముఖములం గురిపించెను. నరుండును శార్ఙ్గచా పంబు నాడించి హేమపుంఖనిశితకలంబ పరంపరలం బ్రహ్లాదు నిపైం బరంగించెను. పరస్పర జయాభిలాషలు గల యాయిర్వు రకు యుద్ధము సంకులసమరమనం జెల్లెను. అంబరమున నున్న నిలింపులు వారిపైం బూలవాన వెలయింపం జేసిరి. వారిసంతో షమునకు హద్దుగానరాకుండెను. అంతటం బ్రహ్లాదుం డతిశయ కోపమూని నరునిపై నతి తీవ్రవేగము లగు మార్గణంబుల వైచెను. ధర్మసుతుం డగు నన్నరుండు సునిశితవిశిఖంబులం బరపి త్రుంచెను.

అప్పుడు ప్రహ్లాదుఁ డూరకున్నను వైరి యనుకారణ మున నారాయణుం గూడ రోషంబులం గప్పెను. దానం జలిం ప కున్న నారాయణుపై మరల శిలీముఖంబులం గుప్పించి నొంచెను. నారాయణుండు రోషదుర్నిరీక్ష్యుండై శిలాశితేషు వులం బ్రయోగించి పురస్థితుండగు ప్రహ్లాదునియవయవములు రక్తసిక్తములుగా నొనర్చెను. ఆసమయమున నాసమరమును జూచుఖేచరులకు దృష్టివైకల్యము గలుగఁజొచ్చెను. దేవదాన వులు ఒక్కరీతి జయఘోషంబులు కావింపం జొచ్చిరి. ఇట్లిరు వురశరాసారంబుల నభ్రోభాగమాచ్ఛాదితము కాఁగా దివా భాగము రాత్రి తుల్యమయ్యెను. గాఢాంధకారము విజృంభిం చెను. దేవదానవు లిండ్లారులతో నీసంగరతుల్యసమర మశ్రు తాదృష్టపూర్వమని చెప్పుకొనిరి. దేవర్షులు గంధర్వులు యక్ష కిన్నరపన్నగులు విద్యాధరచారణులు విస్మయము నధికముగాఁ బొందిరి. పర్వతనారదు లాయాయోధనమును జూచుచుండిరి గాన నారదుఁడు మిత్రునితో నిట్టి జన్యము పూర్వము జరగలే దనియె. తారకాసురమహాహవముఁ జూచితిమి. వృత్రాసుర ప్రవిదారణముఁ గంటిమి. మధుకైటభులసమీాపమును దిలకించి తిమి. హరి యిట్లు ఘోరంబుగా సాంపరాయిక మొనరించినట్లు మనము చూడలేదు. ప్రహ్లాదుఁడును బలవంతుఁడై నారాయ ణునితో సిద్ధతపః ప్రభావమున ననీక మిట్లు చేయుచున్నవాఁడు అనియె.

ఈరీతి నాఘోరాహవము దినరాత్ర భేదము లేకుండ నొనరించుచు శుక్లపక్షచంద్రకళవలె నుత్తరోత్తరాభివృద్ధిగాఁ జేయుచుండ నారాయణుఁడు ప్రహ్లాదుని ధనుర్విదళనము చేసెను. ఒక్కబాణమున నీలాగు తనకోదండము ఖండితము కాఁగా రెండవచాప మందుకొని యాసురరాజపుత్త్రుఁడు సమరోన్ముఖుఁ డగు నంతలో నారాయణుండు వేఱొక పత్రిం బ్రయోగించి దానిని శకలద్వయ మగునట్లు చేయ రెండుశరాసనములు ఖండింపఁబడఁగా మూఁడవచాపంబు గ్రహియించుటం గాంచి నారాయణుఁడు మిగులఁగోపించి దివ్యనారాచంబుఁ బరఁగించి దానిని ఖండించెను. మూఁడవధనుస్సు గూడ నిట్లు చెడిపడఁగా ప్రహ్లాదుఁడు పరిఘమును గైకొనియెను. తత్కాలోత్పన్నతీవ్రకోపమున నారాయణు బాహుమధ్యమభాగమును దాన నొప్పింప నెంచెను. తనపై కరుదెంచు పరిఘమునుగని తొమ్మిదియమ్ములు నారింగూర్చి యాదారుణపరిఘమును నవమనే ఖండములుగాఁ బడఁజేసి పదినారాచంబుల దానవేంద్రు నొంచెను. ఆయసమయి యగు గదను ప్రహ్లాదుం డంది నారాయణు జానుదేశమును గుఱిచూచి విసరివేయ నదివచ్చుచుండుటం దలంచి సుస్థిరుండై కదలకుండి నారాయణుం డాయాయుధమును వాడిబాణంబుల నుక్కడంచెను. గగనమందున్న దేవతలు విస్మయమందిరి. ఆగదభగ్నతం గాంచుట కచ్చెరువంది ప్రహ్లాదుఁడు పరివీరధ్వంసకుఁడుగాన వెలువక శక్తిం

గై దండనలకరించి నారాయణవక్షస్థ్సలము లక్ష్యముగా వీచివై చెను. అట్లు పఱతెంచు శక్తి నీక్షించి శ్రీహరివిలాసమువిూఱ నొక్క బాణంబుననే దాని నేడు తుంటలుగాఁ జేసెను. వెంటనే యేడువిశిఖముల దానవనాయకు నొవ్వఁజేసెను.

## శ్రీవిష్ణువు ప్రహ్లాదునకుందోఁచుట.

ఇట్లు పరస్పరమాయోధనమున మించ సాగుచుండు నంతలో దివ్యవర్ష సహస్రమును చెల్లెను. అనిశ మిట్లు సాగుచుం డుట నందఱకు విస్మయమునుబుట్టించెను. అట్టితఱిఁ బీతవాసో విరాజితుఁడై చతుర్బాహువులొప్ప గదాయుధధారియై రమా కాంతుఁ డై రథాంగధరుఁడై పద్మచిహ్నహస్తుఁడై వెలయు భగవంతుఁ డాయాశ్రమంబునఁ దోఁచెను. భగవంతుఁ డిట్లు ప్రత్యక్షము కాఁగా దానవరాజతనయుఁ డతి భక్తిం బ్రణమిల్లి కృతాంజలియై యిట్లు నుతించెను. దేవదేవా! లోకనాయకా! భక్తవత్సలా! మహాప్రభూ! ఈ తాపసుల నేనేల జయింపఁ జాలకున్నాఁడను? శతసంవత్సరములు దేవతలతో జన్యమొన రించి యోడించితి. ఏలొకో వీరోడకున్నవారు? నాకిదియే యచ్చెరువుంగూర్చెడు. అనిన శ్రీమహావిష్ణు విట్లు పలికెను.

వత్సా! మదంశసంభూతులగు వీరు సిద్ధులు. కాన విస్మయ మేల? వీరుజితాత్ములు. అజేయులు. నరనారాయణులు. సమరంబు నాతోడఁ జేసిన ట్లగును గాన నతలమునకుంబోయి

నాయందుదృఢభక్తి నలవరించుకొమ్ము. తాపసులగు వీరితోఁ బగఁబాటింపకుము. అని శ్రీమహావిష్ణు వాజ్ఞాపింపఁ దదాజ్ఞ శిరసావహించి యసురులంగూడి నరనారాయణులకుం బ్రణమిల్లి పూర్వరాజ్యపదంబు నధిష్ఠింపఁబోయెను. నరనారాయణులు యథాపూర్వముగాఁ దపోనియమమున నుండిరి.

మహామతులారా! ఈగాథయే చాలముఖ్యమైనది. ఇది యింటికి పునాదువంటిది. ఇందుఁగల విశేషములతో శ్రీకృష్ణచరిత్రము పరమపావన మని తేలును. జారశిఖామణి, చోరగణేశ్వరుఁడు అన్న దుర్యశము తొలంగును. కాఁబట్టి యించుక సావధానముగాఁ బరికింపుఁడు. నరనారాయణులు ఆదిమ మునులు, ఆయాయికాలములయందు భూభారహరణార్థ మవతరింతురని వినియేయుందురు గదా. వారు భావికాలంబున నెప్పుడేమి యుపకారము సజ్జనులకు దుర్జనులవంకఁ గల్గునో యని తపశ్చర్యచే బలముసంపాదించుకొను నుద్దేశమున బదరికాశ్రమమున నుండిరి. సదా యీర్ష్యాళువగు నింద్రుఁ డెవరివలనఁ దన యధికారమునకుఁ గీడుగల్గునో యనిభీతినొందువాఁడుగావున వారి మనోవాంఛ నెఱుంగక విలోభులను గావరదానమునఁ జేయఁబూని యదిశక్యముగామి నెట్టులైన నాతపోవిఘ్నము చేయక తప్ప దని విచారించి రంభాదినిలింపభోగకాంతలను, దనమాటయందే యభిమానముగలిగి మనోభావములు తన వంటివిగలమదనవసంతులను వారితపోవనమునకుం బంపెను.

ఈ స్వల్పవిషయములకుఁ జలించు స్వల్పమనస్కులా వారు? పాషాణమున కన్నుఁ జక్కిలింతలు పెట్టవచ్చునుగాని వారి నియమమునుగదలింప బ్రహ్మకును శక్యముగాదన నింక స్మరవసంతాదులమాట యిటుఁ జెప్పనేటికి? వీరెల్ల స్వస్వనియమితకార్యముల నొనరించిరి. వనమెల్ల నకాలమున వసంతర్తుధర్మమున భాసిల్లెను. స్మరాజ్ఞనై శుకపికమధుకరములు చెలరేఁగెను. తరువులు లతలు ఫలపుష్పసంభృతములై యొప్పారెను. ఆవిధమునం తయు వారెఱింగిరి. నారాయణుఁడు రంభాదిదేవకాంతలకు బుద్ధిచెప్పెను. వారికిఁ దలవంపులుగా నూర్వశిని బుట్టించెను. మఱియుఁ బెక్కండ్ర నచ్చరమిన్నలమెచ్చని ముచ్చెకంటుల నిచ్చమెయిఁ బుట్టించెను. వీరిని జూడఁగనే రంభాదులుసిగ్గుపడి మునిమహిమమును దెలిసికొని యిట్టిమహనీయుల పాదసేవకన్న స్వర్గమేమి గొప్పయగునా? అని తలంచిరి. శరణు చొచ్చిరి.

నారాయణుఁడు కరుణాశరనిధిగాన వారి మనఃప్రియత్వము నెంచి మీ కేమివరముకావలెనో తెల్పుఁడన వారు మా కుఁబ్రాణనాథుఁడవు కమ్మని ప్రార్థించిరి. బదులు చెప్పటెట్లు? వరమిచ్చి లేదనుటెట్లు? ఈశంకనుంబొందెను. నారాయణుఁ డిట్లు విచారించి కోపము నభినయించి వీరిని మెల్లగాసాగింపవలయునని యూహించెను గాని నరుఁడు తత్కాలము తెలిపిన నీతులఁ గలంకందేఱి వారిసత్కరించెను.అనుటచే నరనారాయణులు శ్రీ విష్ణ్వంశజనితులనియుఁ, దపోబలంబును గార్యానుకూలరీతింబడసి.

లోకమున ధర్మనాశనము గాకుండఁ గాచుచుందురనియు నెఱుంగనగు. ముందు వ్రాయుఁకథను బట్టి యాపదాలువేల యచ్చరల కోరికల నెట్లు తీర్పఁబూని నారాయణుఁడు బదులు చెప్పెనో వినఁగలరు.

ఎట్టివారికైన నహంకారము క్రోధము లోభము నను నవి బాధకములేయని తెలియందగు. అంతటివారినే యీదు ర్గుణములు బాధించినపుడు తక్కినముక్కుడి మానవుల నవి బాధించుటన నొకయబ్బురమా? ఇంద్రకృతనరనారాయణ తపోభంగమునుండి "శ్రేయాంసి బహువిఘ్నాని" అన్నమాట సత్యమనియులోకోపకారమే జన్మఫలమని తలంచు వారికిం గూడ నంతరాయములు గలుగక మానవని యు మహాత్ములు వా నిందప్పించుకొనఁజాలుదురనియు, ఇతరులు వానికి లోఁబడుదు రనియు నెఱుంగనగు. ఈకథనుండియు, జారచోరశిఖామణి యన్న పేరు శ్రీకృష్ణునకు లేదను నీతి పైకథలనుండియు, తేలు నఁగాన ముందుఁ దెలిసికొనఁగలరు. ఇఁకఁ బ్రహ్లాదుని గాథ నిం చుక విచారింపవలయు. ప్రహ్లాదుఁడు పరమభక్తుఁడు. విష్ణుభ క్తులలో నీతని మించినవారులేరని భాగవతమే సాక్ష్య మిచ్చు చున్నది. అట్టి పరమభాగవతోత్తముఁడు

"ప్రహ్లాద నారద పరాశర పుండరీక..."

అను వాక్యమునందు మొదటఁ జేర్పఁబడిన మహానుభా వుఁడు నరనారాయణులతో సంగర మొనరించె ననుట విన్న

తోడనే అచ్చెరువు గొలుపక మానదు. కాని యించుక మౌన మూని యేకాంతమునఁ గూరుచుండి యాలోచించిన నిది యచ్చెరువుగాదు. స్వభావమే యని తోఁచును. ఎట్లనఁగా ఎంతవాఁడైనను బంచభూతాత్మక శరీరముం దాల్చినపుడు తద్గుణములు వ్యాపింపక మానవు. ఒకానొకప్పుడే నెంతవానికే నవి కలుగకమానవు. అందు నహంకారము క్రోధలోభములు దేహమును ముట్టడించియే యుండును. అవియుండుటచేతనే లోకప్రవృత్తి సాగుచుండును. లేనిచోఁ గొలఁది కాలముననే సృష్టి నశించి ప్రాణికోటియంతయు ముక్తినొందును. కాన నహంకారాదులు పనిచేయుచుండఁ గలవియే. అవయవ విశిష్టులందఱును బ్రకృతిని మీఱఁజాలరు. కొందఱు మీఱితిమని ప్రల్లదంబులాడి యమ్మహాశక్తిని దూఱుదురుగాని యిట్లు తమ రని బ్రల్లదములాడించిన దేది యనిమాత్రము యాలోచింపరు. కట్టా! ఏమి వారియశక్తి! పరాశక్తిని మీఱుట యొకానొకప్పుడు భగవంతునకుం గూడ వీలులేదన నింక నితరుల మాట యిటఁ బ్రస్తావింప నేటికి? కాఁబట్టి ప్రకృతి విశిష్టులగు నవయవులందఱు నహంకారాదులకు లోఁబడియే యుందురు. కాని యందును దారతమ్యములు కలవు. ప్రహ్లాదుఁడు జితేంద్రియులయందెల్ల నుత్తమోత్తముఁడు. భక్తజనశిఖామణి యైనను ఇంచుక యహంకారపరవశుఁడయ్యెను. అది యహంకార మని తోఁపకుండఁ జేసినది ప్రకృతియే. ఆసమయమున నరనా

రాయణులు తపస్సొనరించువారయ్యు ధనుశ్శృంగములఁబూని యుండుట ఆకాలమునకు విరుద్ధమని యామాన్యునకుఁ దోఁచెను. యుగాంతరమున నుండఁదగు నీయాచారము నీసత్యయుగమున నేలపూనితిరని వారినాక్షేపించెను. నరనారాయణులు భగవంతుఁడగు శ్రీమహావిష్ణువునంశములే. వారాతనిభావమును గ్రహించిరి. ఒకరీతిగా నుత్తరమిచ్చిరి. మరల మరల నాక్షేపింపఁ దగిన ట్లుత్తరమిచ్చిరి.

ఇట్లు వాగ్యుద్ధముసాగఁగాఁ బ్రహ్లాదుఁడు వారికోలఁ దియెఱుంగక యుద్ధముచేయరమ్మని యాహ్వానించెను. వారును గుఱుతించిరి. పరమపావనుఁ డీప్రహ్లాదుఁడు. ఈతని కీ యహంకారముదయించినది. మాభక్తుఁడు. ఇంచుక దీనింబాపవలయునని భావించిరి. ఆసమయమున మాటలచేత నది యుపశమింపదని యెఱింగిన వారుకాన నతనితోఁ దలపడిరి. సకలశస్త్రాస్త్రములతోఁ బోరాడిపోరాడి యాతఁడోడిపోవుచుండుట చూచుచుండిరి కాని యాభక్తాగ్రేసరు నింకను బాధించుట కిష్టపడరైరి. నేనింక వీరిని జయింపక మాననని తొలుతఁ దాఁజేసిన ప్రతిన నిష్ఫలమసియు, వీరజయ్యులనియు నతనికిఁ దోఁచునంతదాఁక యుద్ధమునుసాగించిరి. ఎప్పు డది యతని మనసునాటెనో తమ యపరస్వరూపుఁడగు శ్రీమహావిష్ణువును బ్రహ్లాదు నోదార్ప రమ్మా యని మనసుననే స్మరించిరి. శంఖచక్రగదాపద్మహస్తుఁడై, చతుర్భుజుఁడై పరమేశ్వరుఁ డా విర్భవించెను. ఏమని హితము

చెప్పెను? వీరుమదంశసంభూతులు. నీవు నీపనిచూచుకొనుచుండు మని యాజ్ఞాపించెను. పరమభక్తుఁడు కానఁ బ్రహ్మోదుఁ డేమియు బదులిడక యపరాధమును క్షమింపుఁ డని వేఁడి తనలోకము నకుఁ బోయెను.

దీనిచే గ్రహింపఁదగిన నీతియేమి? ఏదేనొకసమయ మున నహంకారాదులు పొడసూపినను, వానిని మీఱఁజాలక లోఁబడినను, సాధువు లెవ్వరే హితముపదేశించిన నది మహోపకారమని నమ్మి వానిని దిరస్కరించి యథాపూర్వ ముగా మెలంగుట కలవాటు పడవలయు నను నదియే. ఎవ్వఁడ ప్పుడు కూడ సాధుహితోక్తులఁ బాటింపఁడో వాని కధోగతి యేగాని యుత్తమగతి చేకూరదు. ఇఁక నవ్వలిగాథలం జిత్తగిం పుఁడు. ముందు చదువఁబోవు గాథలం బదిలముగ మదిసిలిపిన శ్రీకృష్ణలీల లన నెట్టివియో బోధపడును.

## శ్రీమహావిష్ణు నానావతారములు.

* జనమేజయుఁడు కృష్ణద్వైపాయనమునీంద్రునితో నిట్లు ప్రశ్నించెను: మహాత్మా! శ్రీహరికి భృగుమహర్షి శాపము గలిగెననియు, నదియు లోకోపకారమునకె పనికివచ్చుననియుఁ జెప్పితిరిగదా. ఆశాపఫలంబెట్టులు శ్రీమహావిష్ణు వనుభవించెను? అవతారము లేవేవి? అవే వే మన్వంతరములయందుఁ గల్గెను?

* ఇది దేవీభా. ౪ స్కం. ౧౬- వ అ. నుండి గ్రహింపఁబడినది.

అవతారకథల వినఁ గోరికకలదు. ఆయవతారగాధ పాపనాశన హేతువగు. వినువారలకు సుఖావహంబునగు నని వినయమున వేఁడెను. రాజిట్లు ప్రశ్నింప శ్రీవ్యాసమహర్షి యిట్లుబదులుచెప్పెను. రాజా వినుము. శ్రీహరియవతారగాధల వచించెద. అవి యేయే మన్వంతరములందుఁగలిగెనో చక్కఁగా వినుము. ఏయవతారమున నేయేకార్యము లొనరించెనో యావృత్తాంతము నెల్ల వచించెద. అదియు సంక్షేపముగనే చెప్పెద. చాక్షుష మనుకాలంబున ధర్మరూపమున నవతరించెను. నరనారాయణులు ధర్మపుత్రులే. వైవస్వతమనువు ధర్మరాజ్యమేలుతఱి శ్రీహరి దత్తాత్రేయుఁడను పేరొందియవతరించెను. అతఁడత్రిమహర్షికిం బుత్త్రుఁడు. ఆదత్తాత్రేయముని బ్రహ్మావిష్ణు మహేశ్వరుల రూపమని ప్రసిద్ధము. ఆకుమారుంగూడి దేవత లాయత్రిమునిభార్యకుం బుత్త్రులై జనించిరి. ఆసుదతి యనసూయ యనం బరఁగి సాధ్వీమణియై యలరె. ఆమెను దేవతలు ప్రార్థించి పుత్త్రులైపుట్టిరి. బ్రహ్మ, సోముఁడు. శ్రీహరి దత్తాత్రేయుఁడు, శంకరుఁడు దుర్వాసుఁడు నయిరి. మఱియు దేవకార్యము నెఱవేర్ప శ్రీనారాయణమూర్తి నరసింహావతారమెత్తెను. అది నాల్గవయుగమం దని యెఱుంగుము. యుగమనఁగా నిట మనువురాజ్యపరిపాలనమున నాల్గవయుగమ నియర్థము. ఆరూపము నృసింహములయాకృతింగలిగి మనోహరమైయుండెను. ఆరూపమున హిరణ్యకశిపుఁడను దానవు వధిం

చెను. ఆయాకృతి దేవతలకుంగూడ విస్మయకరమయ్యెను. త్రేతాయుగంబున బలినియమనము కొఱకుఁ గశ్యపమునికుమారుఁడయి వామననామంబున నవతరించెను. ఆవామనమూర్తి మిషచే బలినుండి త్రిలోకరాజ్యమును హరించి దేవేంద్రునకొసఁగి బలిని బాతాళలోకమున స్థాపించెను. పందొమ్మిదవయుగమునఁ ద్రేతాయుగమునందే జమదగ్నికిం బుత్రుఁడై బలిశాలియై రాముఁడన నవతరించెను. ఆరాముఁడు క్షత్రియాంతకరుఁడై సత్యవాదియై జితేంద్రియుఁడై లోకమెల్ల జయించి కశ్యపముని కొసంగెను. ఎవ్వఁడు పరశురాముఁ డనుపేరం బరఁగునో యతఁడు శ్రీహరిరూపుఁడేయగు. ఆయవతారస్మరణము పాపనాశన మొనరించు నది. త్రేతాయుగమునందే రఘువంశమునందే దశరథాత్మజుఁ డై రాముఁడన నవతరించెను. ఈయవతారమున నరనారాయణాంశములు రెండును గలిసియుండెను. ఇరువదియెనిమిదవమహాయుగమున ద్వాపరమున అర్జునశౌరిరూపములధరాభారావతారార్థము కృష్ణార్జునులుగ నవతరించెను. వీరు కురుక్షేత్రమున భయంకర యుద్ధ మొనరించిరి.

ఇట్లు ప్రతియుగమందును శ్రీహరి యవతరించుచుండును. ఇవి గతించిన యవతారములు. ఇఁక భవిష్యదవతారములఁ దెలిపెద. అవి ప్రకృత్యనురూపమువలనఁ బెక్కులుగ నుండును. ఈజగత్త్రయము ప్రకృతివశంవదము. ఆప్రకృతి యెట్లు

తలంచునో యట్టులీజగము భ్రమించుచుండును. ఈజగము పురుషప్రియార్థము నిర్మింపఁబడుచుండును. పూర్వ మీలోకమును భగవంతుఁడు సృజించెను. సర్వాది యతఁడే. సర్వగతుఁడు. దుర్జ్ఞేయుఁడు. అవ్యయుఁడు. నిరాలంబుఁడు. పరాత్పరుఁ డా పరమేశ్వరుఁడే. ఉపాధివలన నొక్కఁడయ్యు ముప్విధముల విలసిల్లును. ఆప్రకృతి తత్పరమాత్మకు సంబంధించినదియే. ఉత్పత్తికాలయోగమువలనఁ బ్రకృతిభిన్నత్వమునొందును. ఆప్రకృతియే ప్రపంచమును నిర్మించును. సర్వకామముల నొసంగుచు దానిఁ బాలించును. కల్పాంతమందు సంహరించును. త్రిరూపిణియు విశ్వమోహినియు నామెయే. ఆమెం గూడియే బ్రహ్మ సృజించును. విష్ణువుపాలించును. రుద్రుఁడు సంహరించును. ఆజననియే శ్రీరామచంద్రుని సృజించి దానవసంహారముకొఱకు నియోగించెను. ఈసంసారము సుఖదుఃఖమయము. దానియందుఁ దగులుకొని ప్రాణులు సర్వదా తిరుగుచుందురు.

## శ్రీకృష్ణావతారప్రశ్నము.

* మున్ను వసంతాదులు నరనారాయణాశ్రమమును బ్రవేశించి రన్న కథయుం దప్సరసలు నారాయణమూర్తినిగామించిరనియు నంపుల కామహనీయుఁడు ప్రత్యుత్తర మిచ్చెనని యుఁ జదివియుంటిరి. అవ్వలికథ యిటఁ దెలుపఁబడును. జనమే

* ఇది దేవీభాగవతము ౪ స్కం. ౧౭ అధ్యాయమునుండి సంగ్రహీతము.

జయుఁడు వ్యాసులతో నిట్లు ప్రశ్నించెను. మహర్షీ! నరనారాయణాశ్రమమున వారాంగనలుండిరని చెప్పితిరి. వారామహర్షి నెట్లు కామించిరి. స్మరాతురలగు వారికి యుక్తాయుక్త పరిజ్ఞానము లేకపోయెనా? నారాయణుఁడు వారిని శపింపఁ బూనినట్లు నరుఁడు నివారించినట్లు వచించితిరి. అట్టివ్యసనమున నమ్మునియవ్వాల నేమిచేసెను? ఇంద్రుని యాజ్ఞానుసార మావారాంగనలామహర్షిని గామాతురలై పలుసారులు ప్రార్థించిరి కదా. అందులకమ్మునియేమి బదులుచెప్పి వారిని సమ్మతింపఁజేసెను? మహానుభావా! శ్రీనారాయణుని చరితము వినఁగోరెద. ఆనతీయుమా యని ప్రార్థించెను. కృష్ణద్వైపాయనుం డాజనమేజయుంగాంచి ధర్మజ్ఞా! ధర్మపుత్త్రుఁడగు శ్రీనారాయణునిచరితము వినిపించెద. అవధరింపుము. వారల శపింపంబూనియున్న నారాయణుని నరుఁడు శాంతింపఁజేసెను. ఉపశాంతక్రోధుఁడై యానారాయణుఁడు చక్కఁగా నాలోచించి సుస్మితపూర్వకముగా వారాంగనలతో నిట్లు పల్కెను. వనితామణులారా! ఈజన్మమున నేనిట్లే తపంబొనరింప సంకల్పించితిని. మేమిరువురము తపస్సుచేయుచుండువారమేగాని దారసంగ్రహముచేయఁజాలము. కాన నాపైఁ గరుణయునిచి మీరు సురపురికిం బొండు. లోకమున ధర్మసూక్ష్మముల నెఱింగిన వారు వ్రతభంగ మెప్పటికిని జేయరు. ఈ శృంగారమునందు రతియే స్థాయీభావము గదా. అదిమాని మీతో నెట్లు సంబంధము చేయఁగలను? కా

రణవిహీనమగు కార్యము లోకమున నుండదుకదా. శాస్త్రము నందుఁగవులు స్థాయీభావము రసమేయని తెల్పిరి. నేను గురూపినిగాను. సురూపుఁడనే. సర్వాంగశోభనుఁడనే. కాఁబట్టియే మీప్రీతికిం బాత్రుఁడనైతిని. మీరును అకృత్రిమప్రీతిచే నన్నుఁ గోరితిరి. ఐనను మీరెల్లఁగరుణించి నాయీవ్రతమును రక్షింపవలయును. సుందరులారా! మీకు జన్మాంతరమున నేనుభర్తనయ్యెదను. ఇరువదెనిమిదవ ద్వాపరయుగమున భూతలమునన * దేవకార్యసిద్ధికొఱకు నే నవతరింతును. అపుడు మీరెల్ల నాకు భార్యలుగావలయు. వేఱువేఱజన్మింపుఁడు. భూపతిపుత్రికలయ్యు నాకు పత్నులు గాఁగలరు.

అని శ్రీహరి పలుక వారందులకు సమ్మతించిరి. అంత వారినెల్ల యథాపూర్వముగా సురలోకమున నుండుఁడని పనుప వారెల్ల మనస్సంశయములుమాని చింతాజ్వరవిహీనలై యరిగిరి. సురపురికింబోయి జరిగిన వృత్తాంతము నంతయు దేవేంద్రునకు విన్నవించిరి. శతమఖుండును వృత్తాంతము నంతయు విని యూర్వశిం గాంచి మహానందపరవశుం డయ్యెను. ఓహో! ఆమహాత్ముని ధైర్య మేమనవచ్చును? తపోబలము వర్ణనాతీతముకదా. ఊర్వశియుఁదత్సఖీజనము తపోబలంబు

* 'దేవానాం కార్య సిద్ధ్యర్థం ప్రభవిష్యామి సర్వథా, తదాభవత్యో మద్దారాః ప్రాప్య జన్మపృథక్ పృథక్. భూపతీనాం సుతాభూత్వా పత్నీభావం గమిష్యథ' అని మూలము.

నఁ గల్పింపఁబడిరి కదా. అని మదినూహించి ప్రసన్నాత్ముఁడై వారిని బహూకరించెను. ఇట నారాయణుండును వీరిబాధమాం నేఁగదా యని యథాపూర్వముగాఁ దపముచేయ మొదలిడెను.

జనమేజయా! నారాయణమునివరు నద్భుతవృత్తాంతమును వినిపించితిని. నరుని మహిమమును జెప్పితిని. వారిద్దఱే కృష్ణార్జునులన విఖ్యాతులై యవతరించిరి. భృగుశాపమున వారికార్యము నెఱవేర్చు వ్యాజమూని రని యెఱుంగుము. అన జనమేజయుఁడు మునీంద్రా! కృష్ణావతారమును వివరించి చెప్పుము. నామనమునఁ గలసందేహములనివారింపుము. ఎవరి గర్భమున శ్రీహర్యనంతులు పుత్రరూపమున నిలిచిరో యట్టి దేవకీవసుదేవులకు దుఃఖమేల సంప్రాప్తమయ్యె? వారు కేవల పుణ్యాత్ములుగదా. అట్టి దంపతులు కంసునిచే నిగళబద్ధులైచాల వత్సరములు కష్టపడుపఁబడిరేలొకో? శ్రీహరి సాక్షాత్తుగా వారికిఁ బుత్రుఁడయ్యెగదా. కృష్ణమూర్తి మధురానగరమునఁ బుట్టి గోకులమునకేలపోయెను? కంసుని వధించి ద్వారకాపురమునిర్మించి యుందుండనేల? ఏదేశమునఁ దండ్రితాతలు నివసించిరో యాప్రదేశము పవిత్రముకదా. అట్టిదేశమును మాని శ్రీహరి దేశాంతరమున నివసింపఁబోనేల? శ్రీహరివంశము ద్విజశాపమున నేలయుత్సాదితమయ్యెను? భూభారమునుదీర్చి సనాతనుఁడగు వాసుదేవుఁడు వేగంబ యాదేహము నెట్లు విడిచెను? పాపాత్ములవలన భూదేవి భారపీడనము ననుభవించిన దె

ట్లు? అట్టి పాపాత్ముల శ్రీహరియుఁ బార్థుఁడు నెట్లు సంహరించిరి? శ్రీకృష్ణపత్ను లెవరిచేఁ బీడింపఁబడిరో యట్టికూ్రరకిరాతులేల సంహరింపఁబడక పోయిరి ? భీష్మ ద్రోణ కర్ణ బాహ్లీక వైరాట వికర్ణ దృష్టద్యుమ్న సోమదత్తాదులు యుద్ధమున నెట్లు హతులైరి? ఇందఱిని సంహరించిన శ్రీహరిచోరులనేల సంహరింపఁజాలఁడయ్యె? శ్రీకృష్ణపత్నులు మహాపతివ్రతలు దుఃఖములపాలుకానేల? ఈసందేహములు నామనమును బాధించుచున్నయది వసుదేవుఁడు శ్రీకృష్ణునిఁ బుత్రునిగాఁబడసి ధర్మాత్ముఁడై తుదకు సుతదుఃఖతాపితుఁడై అపమృత్యువువాతఁ బడియెఁగదా! ఎట్లు? ధర్మాత్ములగు పాండవులు శ్రీకృష్ణతత్పరులు నయ్యు సకలదుఃఖములపాలైరిగదా ! ఏల ? పతివ్రతాతిలకమగు పాంచాలి యగ్నికుండమునఁ బుట్టి లక్ష్మ్యంశముఁ గలిగియు నెట్లు కష్టములపాలయ్యెను? అందును రజోదోషసమన్వితయయ్యు సభలోని కీడ్వఁ బడియె ? దుర్మతియగు దుశ్శాసనుఁడు మౌఢ్యమున జుట్టుపట్టుకొని సభలో నవమానించెఁగాదే ? ఏటికో ? అరణ్యవాసమొనరించు తఱి సింధుదేశాధిపతి యవమానించె. విరాటుపురంబునఁ గీచకుండు పీడించె. ఆమె తనయు లేవురను ద్రోణపుత్రునిచే వధింపఁబడిరి. ఎందులకు? సుభద్ర కూర్మిపుత్త్రుఁడు చిన్నతనమునందేయని వధింపఁబడియె. ఏల? దేవకీపుత్రపంచకము కంసునిచేఁ జంపఁబడుట కేమికారణము? శ్రీహరి సమర్థుఁడయ్యు నేల నివారింపలేకపోయెను?

ప్రభాసతీర్థంబున యాదవులు శాపంబునహతులైరికదా. దానఁ గులక్షయ మయ్యెఁగాదే. శ్రీకృష్ణపత్నుల జోరులు బాధించిరి. ఏకారణముననో? ఈశ్వరుండగుశ్రీకృష్ణుఁ డుగ్రసేనునిసేవ దాసునివలెఁజేయు టెందులకు? మహాత్మా! ఒక్కసందేహముకలదు. నారాయణమునియందు సర్వజంతుసమానత్వము పదిలమై యుండ హర్షశోకాదులు పొందు టెట్లు? శ్రీహరి కవిలేకుండు టేల? కావున శ్రీకృష్ణచరిత్రము సర్వము వచింపుమా. లోకాతీతమహిముఁడు శ్రీకృష్ణమూర్తి భూతలమున నెట్లు ప్రవర్తిల్లెను? ఎట్లు కాలమునరసి దైత్యులవధించెను? రుక్మిణీదేవిని హరించి పలాయనముచేయ నేల? అది చోరవృత్తిగదా. ఏల శ్రీహరి యట్లొనరించెను? సకలవస్తుసమృద్ధమగు మధురామండలమును వదలి జరాసంధునకు భీతిల్లి ద్వారకానగరగమనము సేయఁ గారణమేమి? అపుడు శ్రీకృష్ణుని శ్రీహరియని యెవ్వఁడే నెఱుంగఁ జాలఁడయ్యెనా? ఈసందియము లడంగ నించుక కారణములఁ దెల్పుము. ఇవ్వియేగాక మఱికొన్ని సంశయము లున్నయవి. సర్వజ్ఞుఁడవుగాన వీనిందీర్పుము. మనసున రహస్యవిషయ మొక్కఁడు సందేహరూపమునఁదోఁచెడి. ఏదన? ద్రౌపదికిఁ బంచభర్తలు గలుగుటచే లోకమున నేల యేవగలు గలుగదయ్యెనని యే. పండితులు సదాచారము ప్రమాణమందురు గదా. సమర్థులయ్యుఁ బాండవులు పశుధర్మము నేలయాచరింపఁ బూనిరి? దేవరూపమున భూతలమునఁబుట్టిన భీష్ముఁడు గోళక

పుత్త్రిలచేఁ గౌరవవంశవృద్ధిసేయ నేమిహేతువు? ఏయుపాయముచేతనైనను బుత్త్రిలంగాంచి వంశాభివృద్ధి సేయవలయునను మునులసిద్ధాంతము తుచ్ఛమనియే నాభావమని పలికి యూరకుండెను.

మహాశయులారా! శ్రీకృష్ణలీలలు పరమపవిత్రములని తెలుపఁబడును. పామరులు తద్రహస్యము నెఱుంగఁజాలక యాక్షేపింతురు. వారు తత్కారణముల నెఱుంగరనుట కన్న మనమెక్కువగా వారిని దూలనాడఁ గాదు. ఈగాథను జదివితిరి గదా. నారాయణుని రంభాదినిలింపకాంతులు పదాఱువేలయేఁబదిమంది కాంక్షించిరి. అందులకు నామహాత్ముఁడేమి తెల్పెను? ఈయవతారము తపస్సుచేయుటకే ధరింపఁబడినది. కాన మీకోరికను జెల్లింపఁజాల. భక్తుల కోరికలనన్నింటిని జెల్లించుటకు భవిష్యత్కృష్ణావతారము సమర్థము. కాన మీరెల్ల భూమిరాజులవంశమున జన్మింపుఁడు. పరిగ్రహించెదను. ఇంతతో సంతృప్తినొందుఁడు. తప్పక మీకోరికలఁ దీర్చెదనని యానతిచ్చెను. వారదియే చాలునని సురపురికరిగిరి. వారే రాజపుత్రికలై పుట్టిరి. పదాఱువేలగోపికాస్త్రీలు కృష్ణునిం గోరి తదేకాగ్రమనస్కలగుటకు హేతు విదియే. ఈ హేతువును స్మరించుచుండుఁడు. శ్రీకృష్ణలీలలం గొన్నింటిని జదువునపుడు మరలస్మరింపుఁడు. దీనితత్త్వమిదిగదా యని తెల్లమగును. ఇంతియగాక మఱొకవిషయమును మీరే యాలోచింపుఁడు. పదాఱువేల

మంది స్త్రీలు తదేకాగ్రచిత్తముల నొక్కపురుషునిఁ గోరుట వింటిమా. హేతు వేదియో లేకుండ నది పొసఁగదుగదా. ఆహేతు వేదని పరిశీలింపుఁడు. భగవచ్చరితమునఁ గళంకములుండ వనియు, నున్నయట్లు తోఁచుట తత్కారణ మరయఁ జాలమిచే ననియుఁ దెలిసికొనుట చాలమంచిది. అదియేతరణోపాయము. ఈకథనుబట్టి పదాఱువేలమంది గోపికాస్త్రీలు తొలిజన్మమున నచ్చరమిన్నలనియు వారే భగవంతుని గామించిరనియు, భవిష్యదవతారమున మీకోర్కులు తీర్చఁగలనని భగవంతుఁడాన తిచ్చెననియుఁ దెలిసికొనవలయును.

ఇంతకుముందే గోలోకవృత్తాంతముఁ జదువునపుడు గోలోకవాసులు సదా శ్రీకృష్ణగాథలం బాడుటయు, నాడుటయు లోనగు కృష్ణప్రీతికరకృత్యముల నొనరించువారనియు, శ్రీహరి యవతరింప సంకల్పించి వారలనుగూడ భూమినవతరింపుఁడని యానతిచ్చెననియుఁ జదివియుంటిరిగదా. వారెల్ల యాదవులన, వృష్టిభోజాంధకులన నవతరించిరి. అచ్చరలెల్ల రాజపుత్రికలై యవతరించిరి. శ్రీకృష్ణపరమాత్మయు నందఱి కోర్కులఁ దీర్పనెంచి దివ్యమంగళవిగ్రహముతో నవతరింప నాయత్తుండయ్యె ననియు నెఱుంగుఁడు. ఇఁకఁ దరువాతి కథను వినిపించెద. అవధరింపుఁడు.

## శ్రీకృష్ణావతారకారణము.

* శ్రీకృష్ణచరిత్రమునఁ బెక్కుసందేహములు పొడము వానిందీర్పుఁడని తన్ను వేఁడి యూరకుండిన జనమేజయుంగాంచి శ్రీకృష్ణద్వైపాయనుం డిట్లనియె. ఓరాజేంద్రా! సందియములం జిక్కుపడకుము. శ్రీకృష్ణదివ్యచరిత్రమును వీనులలర నాలకింపుము. దాన సకలసందేహములు పోవు. అంతియ కాక యవ్యయానంద మొనఁగూడు. అదియే నిన్నుఁ దరింపఁజేయును. అని యారాజచూడామణి సంశయములఁ దీర్పఁదలంచి శ్రీకృష్ణచరిత్రమును జెప్పఁదలంచి సమాహితచిత్తుండవు కమ్మాయని హెచ్చరించి యిట్లనియె. జనమేజయా! శ్రీకృష్ణావతారకారణంబును దొలుదొలుత వచించెద. అందు శ్రీదేవీచరిత్రమును గూడ నించుక తెలిపెద. శ్రీదేవీచరిత్రమును దెలుపక యున్న శ్రీకృష్ణచరిత్రము సంపూర్ణము కానేరదు. కాన వినుము వచించెద.

♦ మున్నొకసారి భూదేవి పాపాత్ముల భరింపఁజాలక తద్భారమునఁ బీడితయై కృశించి రోదనము చేయుచు గోరూప

---

* ఇది దేవీభాగవతము ౪ స్కం. ౧౮-వ యధ్యాయమునుండి సంగృహీతము.

♦ ఇది యింతకుముందు గ్రంథాంతరమునుండి వ్రాయఁబడినది. ఐనను దీనఁ గొన్ని విశేషములు కలుగుట మరల నించుక గా వ్రాయఁబడినదని గ్రహింపఁదగు.

ధారిణినై త్రివిష్టపమునకుఁ బరువెత్తెను. ఇంద్రుఁ డామెం జూచి జాలిఁగొని భూదేవీ! ఏల యిట్లు పరితపించుచుఁ బరువెత్తితివి? ఎవరు నీకిట్టి పీడఁగల్పించిరి. ఏల యింత కృశించితివి. అన నతఁ డేమో తన్నుద్ధరించునన్న నమ్మిక నాయిలాదేవి యించుక యూఱడిల్లి యిట్లనియె. దేవాధీశా! నాదుఃఖకారణమును వినుము. జరాసంధుఁ డనుపాపాత్ముఁడు మగధదేశాధిపతియై విఱ్ఱవీఁగుచున్నవాఁడు. శిశుపాలుఁడు చేదిదేశాధీశుఁడై యున్నవాఁడు. ప్రతాపశాలియగు కాశిరాజు, బలవంతుఁడగు రుక్మియుఁ, గంసుఁడు, నరకాసురుఁడు, సాళ్వుఁడు, సౌభపతియుఁ, క్రూరుండగు కేశియు, ధేనుకవత్సాసురులు లోనగువారు నిండియున్నవారు. వీరుగాక ధర్మవిహీనులై పరస్పరవిరోధములఁ బెనచుకొనుచుఁ, బాపాచారులై, మదోన్మత్తులై, కాలరూపులై వెలయు మఱికొందఱురాజులు ప్రబలిరి. వారిచే బాధితనైతిని. ఆభార మింతయని చెప్పఁజాలకున్నాఁడను. ఎందుఁబోవుదు? ఏమిచేయుదు? ఈచింతయే నాకార్శ్యమునకుఁ గారణము. దేవేంద్రా! శ్రీవిష్ణువు వరాహరూపమున నన్ను బాధించెను. అతి దుస్సహదుఃఖభారమునొందితిని. కశ్యపమునికి దితియందుఁ గల్గిన హిరణ్యాక్షుఁడు నన్నుహరించెను. అపుడు సముద్రజలమున మునిగితిని. అత్తఱి శ్రీహరి ఆదివరాహరూపమున నాతని వధించెను. ఆయుద్ధమున నించుక బాధింపఁబడితిని. వాఁడుపొలియఁగనే నన్నుద్ధరించి వరాహమూర్తి యధా

రీతినిలిపి కష్టమును బాపెను. అట్లు హరిచేయకుండిన చో రసాతలమున హాయిగా నుండియుందును. ఈకష్టములు రాక యుండును.

ఇపుడు మరల నీదురాత్ముల మోయఁజాలకున్నదాన. ముందిరువదియెనిమిదవయుగమున నెంతఱో దురాత్ములు ప్రబలుదురు. శక్రా! యింక నిలువఁజాలను. రసాతలమునకైనఁ బోయి సుఖంపదుదును. కాన నో శతక్రతూ! ఈదుఃఖమహార్ణవము నుండి నన్నుద్ధరింపుము. నీపాదములకు నమస్కారము లాచరించెదను. అనుటయు నింద్రుఁడు చేయునది నేరక భూదేవీ! ఈయాపదను దప్పింప నాకు వశముగాదు. చతుర్ముఖుని శరణు వేఁడుము. నేను గూడ వచ్చెద. ఆచతురాస్యుఁడు నీదుఃఖమును దీర్చును.

అనుటయు నింద్రునిశక్తి నెఱింగి యతిత్వరితగతి భూకాంత బ్రహ్మలోకంబునకుంబోయెను. ఇంద్రుఁడును దేవగణపరివృతుఁడై శతానందుఁ జూడనరిగెను. బ్రహ్మయు వచ్చుచున్న సురభింగాంచి యిట్లుపలికెను. దానింగాంచినంతనే ధ్యానయోగమున భూదేవిగానెఱింగెను. భూదేవీ! కల్యాణీ! ఏలచింతించెదవు? ఈదుఃఖము నీకేల యిపుడుకల్గినది? పాపమతియై దురాచారుఁడు నగునెవనిచేఁ బీడింపఁబడితివి? వచింపుమా యని కరుణాన్వితుఁడై పలికెను. భూమియు నించుక యూఱడిల్లి యిట్లు విన్నవించెను. శతానందా! కలియుగము రానున్నది. దానికే భయంపడుచున్నదానను. లోకనాథా! పాపాచారులు మనుజు లందఱ

బుట్టఁగలరు. రాజులు దురాచారులును, బరస్పరవిరోధులునుగాఁ గలరు. చౌర్యకర్మాసక్తులగు రాక్షసులు పూర్వవైరముదలంచి కలహింతురు. వారినందఱ వధించి నాదుస్సహభారమును దీర్పుము. ఇపుడు భూపతులసైన్య భారముచేఁ బీడితనైతిని.

భూలలన యీలాగు పలుక విని శతధృతి వెలవెలఁబాఱు మోముతో నిట్లు పలికెను. అమ్మా! ఈభారమును బోఁగొట్ట నేనుసమర్థుఁడనుగాను జుమీ. దేవాదిదేవుఁడగు శ్రీవిష్ణువుపరిసరమునకుఁ బోవుదము. దేవేంద్రా! నీవును బరిచరయుతుఁడవై యచ్చటికిరమ్ము. భూదేవింబురస్కరించుకొని మనమరుగుదము. అనివారిం బంచి హంసవాహనారూఢుఁడై చతురాస్యుఁడు విష్ణులోకమున కరిగెను. వేదవాక్యముల శ్రీహరి వినుతించి నమస్కరించెను. కరములు ముకుళించి యిట్లు నుతించెను. ♦దేవాదిదేవా! వేయిశీర్షములు వేయినేత్రములు వేయిపాదములు గలమహాత్ముఁడవునీవే. వేదపురుషుఁడవు. ప్రాచీనుఁడవు. దేవేశుఁడవునీవే. భూతభవిష్యద్వర్తమానము లనుకాలములు నీవే.

---

♦ బ్రహ్మకృత శ్రీ విష్ణుస్తుతిః.

సహస్రశీర్షా త్వమసి సహస్రాక్షస్సహస్రపాత్, త్వంవేదపురుషః పూర్వం దేవదేవస్సనాతనః. ౧. భూతపూర్వం భవిష్యచ్చ వర్తమానంచ యద్విభో, అమరత్వం త్వయాదత్త మస్మాకం చ గమాగతే. ౨. ఏతావాన్మహిమా తేఽస్తి కోనవేత్తి జగత్త్రయే, త్వం కర్తా హ్యవితాహంతా త్వం సర్వగతిరీశ్వరః.

మావంటి వారికి దేవత్వ మనుగ్రహించితివి. నీమహిమ మింత యని యెవ్వఁ డెఱుంగును? ప్రపంచకర్తవు నీవే. పాలకుఁడవు నీవే. సంహర్తవు నీవే. జగములకు గతియననీవే. వేఱొండు దిక్కుగానము.

అని యిట్లు వేదార్థప్రతిపాదకవాక్కులను వినుతించు బ్రహ్మాదులకు శ్రీహరి సందర్శనం బొసంగి సాదరముగ నిట్లు ప్రశ్నించె. దేవతాధిపులారా! మీ కెల్లరకు స్వాగతము. మీరు వచ్చినకార్యమేమో తెల్పుఁడు. అను శ్రీమన్నారాయణు నాదరోక్తుల విని పద్మజుం డంజలి బంధించి యిట్లు విన్నవించెను.

ఓపంకజాక్షా! జగదేకబంధూ! భూభారావతరణ మొనరింపవలయును. కలియుగము రాకముందే ద్వాపరాంతమున దుష్టనృపాలకులనెల్ల సంహరించి భారము సడలునట్లు చేసి భూమిని గాపాడుము. అన జనార్దనుఁ డిట్టు లనియె. పద్మసంభవా! ఈవిషయమున నే నే స్వతంత్రుఁడను గాను. నీవును శివుఁడును స్వతంత్రులుగారు. ఇంద్రాగ్నియమత్వష్ట్రసూర్యవరుణులును స్వతంత్రులుకారు, ఈ ప్రపంచము స్థావరజంగమస్వరూపమెల్ల యోగమాయావశమున నున్నది. బ్రహ్మాదిస్తంబపర్యంత మాదేవి వశముననున్నయది. మేమెల్లఁ దద్వశంవదులము. నేనేస్వతంత్రుఁడనైతి నేని మత్స్యయోనిం బుట్టనేల? కచ్ఛపమయి యుండనేల? తిర్యగ్యోనులయందుఁ బుట్టినచోఁ గీర్తియా భోగమా సుఖమా

యేదిగలదు? పుణ్యము లభించునా. ఫలము గలదా. వరాహ మైతిని. నరసింహుఁడ నైతిని. వామనావతార మెత్తితిని. జమదగ్నిసుతుఁడనుగాఁ బుట్టితిని. మరల నిపుడు రక్తపూరముల హ్రదముల నింపుమందునా. దశరథుని కుమారుడనై రాముఁ డనం బరఁగి నారచీరలు గట్టి జడలుదాలిచి పాదచారినై దండకారణ్యమును జొచ్చితిని. నిస్సహాయుఁడనై ఘోరవనమున నుంటిని. వేఁటలాడి జీవించుచుంటిని. మాయాసమాచ్ఛాదితుఁడనై హిరణ్యమృగముండునా యని యూహింపఁ జాల నైతిని. పర్ణశాలయందు జానకి డించి దానివెంట నంటి పోతిని. నాసోదరుఁ డగు లక్ష్మణుండును మహారణ్యమున నొంటరిగా సీత యుండఁ దగునా యని తలంపక విడిచి తానును వచ్చెను. జాగరూకుడవై సీతను రక్షించుచుండుమా యని నేహెచ్చరించి నదియుఁగూడ మఱచిపోయెను. రావణుఁడు కపటరూపమును ధరించువాఁడు కాన భిక్షుకరూపంబును దాల్చి కడుంగడుదుఃఖించు జానకిం గొనిపోయెను.

నేనును దిరిగివచ్చి యుటజమున సీతగానరామికి వగచితిని. ఏమిచేయుదును? సోదరుం గూడి తిరిగితిరిగి సుగ్రీవునితో మైత్రిని సంపాదించి కార్యవశమున నార్తుఁడయి న్యాయేతర మార్గమున వాలివధించితిని. వాలిశాపమును బొందితిని. అంత వానరులద్వారా సీతా వృత్తాంత మెఱింగి తత్సహాయముంగాంచి లంకాపురంబుఁ బ్రవేశించితిని. అచ్చట యుద్ధరంగమున సోద

రునితోఁగూడి నాగపాశబద్ధుఁడనైతిని. మేమిరువురము తెలివి దప్పి శవములవలెఁ బడియుండ వానరులు విస్మయంపడిరి, గరుత్మంతుఁ డాతఱినరుదెంచి నాగపాశ ముక్తుల మగునట్లుచేసెను. అపుడు దైవమెంత బలవత్తమమని చింతించితిని. రాజ్యము పోయెను. వనవాసమబ్బెను. భార్యపరునిచే దొంగిలింపఁ బడియెను. కష్టతరమగు సంగరము సంభవించెను. దైవ మింకేమిచేయనున్నదో. మహాదుఃఖకరమగు యుద్ధము. రాజ్యనాశనము. వనవాసము. రాజపుత్రికాసహాయుఁడనై ధనహీనుఁడనై యిల్లు వెడలుట యివన్నియు నేమనిచెప్పుదు. దేవతలారా! మహాదుఃఖకరములుకదా. పురము వెడలుతఱి మాతండ్రిగర్వాయెనసీయుఁడయ్యెను. పాదచారినై నిస్సహాయుఁడనై ధనహీనుఁడనై బయలు వెడలితిని. పదునాల్గు సంవత్సరములు వనమువనుంటిని. క్షాత్రధర్మమునువదలి కిరాతవృత్తి నవలంబింప వలసివచ్చెను. విధివశమున నాఘోరాహవమునందు రాక్షసుఁడు నాచే ననిఁ జంపఁబడియె. విజయముగలిగెను. సీతనుమరలఁ దేఁగల్గితి. అయోధ్యను జేర నోచితి.

అయోధ్యయందును బహుసంవత్సరములు సంసారచింతలఁ జిలికితిని. అనేకరీతుల సుఖములను అనుభవించితిని. పూర్ణకోసలరాజ్యమును బాలింపఁగలితిని. అంతఁ గొంతకాలమునకు లోకాపవాద భీతిచే సీతను వదలితిని. కాంతావిరహదుఃఖమున మరలఁ జింతలపాలైతిని. తుదకు భూమినిభేదించుకొని

జానకి పాతాళమును జొచ్చెను. ఇట్లు రామావతారమున ...
విధదుఃఖముల ననుభవించితిని. స్వతంత్రుఁడనేనైనఁ బరతంత్రు
నివలె నన్నిదుఃఖము లేలపొందుదును. చిరకాలమునకు సోద
రులతో నాలోకము నొందఁగల్గితిని. విబుధత్వమలవడినను బర
తంత్రునిజీవనము వ్యర్థమనినాభావము. పంకజోద్భవా! నేను బర
తంత్రుఁడననియే యెఱుంగుము. నావలెనే నీవును రుద్రుఁడును బర
తంత్రులేయని యెఱుంగుఁడు. ఇఁక నీదేవతలమాట యిటఁ జెప్ప
నేటికి? అని పల్కెను.

పాఠకులారా! ఈగాథనుండి పలువిషయములు తేలును. భగవంతుఁడగు శ్రీమహావిష్ణువుగూడ యోగమాయావశంగతుఁడననియెఁ గదా. ఈమాట యచ్చెరువుగఁదోఁచు. తత్త్వమరయుఁడు. భేదబుద్ధిని బరిత్యజింపుఁడు. దేహధారులందఱు ప్రకృతినిబద్ధులుగాని ప్రకృత్యతీతులుగానేరరు. సగుణబ్రహ్మమననర్థమేమి? విరాట్టువు ప్రకృత్యతీతుఁడు. తక్కినవారెల్ల నామహాశక్తికి లోఁబడినవారలే. ప్రకృతి భగవదాజ్ఞానువర్తినిగదా యనకుఁడు. విరాట్పురుషున కదిలోఁబడును. తదిచ్ఛయే ప్రకృతి. తదితరవ్యక్తులన్నియు దాని శక్తికి లోఁబడుదురు. అదివైష్ణవమా! శైవమా! యని ప్రశ్నింపకుఁడు. అదియెవరెవరెట్లెట్లుభావించిన నట్టిదే యగును. శైవశక్తిగా నుపాసించినఁ బార్వతియనఁబరఁగు. వైష్ణవియని యుపాసించిన శ్రీమహాలక్ష్మి యనఁబరఁగు. ఇట్టు లేయే భక్తు లేయేరూపముల నుపాసింతురో

...యారూపముల దర్శనమిచ్చును. కాన నది సర్వ వ్యాపిని. భగవత్కారుణ అపరశక్తిద్వారా ప్రసరించుననియే శ్రీరామానుజాచార్యసిద్ధాంతము. వారిదృష్టిచే నామె మహాలక్ష్మియే. ప్రకృతికిఁ ద్రిమూర్తులు లోఁబడినవారేయని శ్రీశంకరస్వామిసిద్ధాంతము. వారిదృష్టిచే నామె శంకరశక్తియే. ఈలక్ష్మీపార్వతులకు నామభేదమేగాని యితరభేదములేదు. శ్రీహరి మత్స్యకూర్మాదిరూపముల నాయాభక్తులకు దర్శనమిచ్చును. అంతమాత్రమున వీరందఱు వేఱనవచ్చునా ? భక్తానుగ్రహార్థమై భగవంతుఁడే స్త్రీపుంరూపములఁ దాల్చునన్న సిద్ధాంతము నిలువఁగలదు. కాని "యెవరికివారే ? యమునాతీరే" యన్నమాట చాలసేపు నిలువఁజాలదు. అట్టివాదమును నమ్ము వారికిఁ దత్త్వమున మనస్సు స్థిరతంగాంచలే దనవలసివచ్చును. ఇంతయేల? శ్రీకృష్ణుఁడే యోగమాయనుబిలిచి నీవీపనిచేయుమని యాజ్ఞాపించిన ట్లున్నయదికదా. ఏమి దానిభావము? తత్సహాయములేక తానే పనియుఁ జేయఁజాలఁడు.

ఉపనిషత్తులు భగవంతుఁడు నిర్గుణుఁడని, నిరంజనుఁడని, నిర్లిప్తుఁడనియే బోధించును. అతఁడు రూపధారియైన నేమని పిలువఁబడును.? ప్రకృతి విశిష్టుఁడనియే. ప్రపంచము ప్రకృతిపరిణామముకదా. విచిత్రరూపములఁ గనఁబడుచు నశ్వరమైనది. కావున నిందు శంకింపఁదగినవిషయములేదు. యోగులుకూడఁ జిరంతనయోగపరాయణులై ప్రపంచము దేని పరి

ణామమా యని యాలోచింతురు. ఏదో యొకరీతి సిద్ధాంతము చేసికొనవలయునే కాని యిది యిట్లే యని నమ్మింప శక్యము గాదు. ప్రత్యక్షప్రమాణముచాలదు. అనుమానప్రమాణము బుద్ధిచమత్కృత్యధీనము. శాస్త్రప్రమాణము సంశయాత్ములకు నమ్మునట్లుచేయఁజాలదు. ఉపపత్తిప్రమాణము సర్వజనసామాన్యజ్ఞేయముకాదు. కాఁబట్టి యీవిషయమునఁ బూర్వపుణ్యాపరిణామమున నొకసిద్ధాంతము తోఁచవలయును. అపుడు శాస్త్రములు తదనుగుణముగా నర్థమిచ్చును. అనుమానోపపత్తులు సరిపడును. ఇట్లులగుటంబట్టియే యిన్నిమతములు ఇన్నిసిద్ధాంతములు లోకమున వెలసినవి. ఏమతమునందును భక్తియుతులకు ఫలమొక్కటియేయగును. అనఁగా నర్థమేమి? భగవత్తత్త్వమున భేదములేదనియు, మతిభేదములుగల్గిన నదియు భేదయుతముగాఁదోఁచుననియు మన మూహింపవలయును. అంతియుగాని ప్రశ్నముమీఁదఁ బ్రశ్నమనునట్లు శంకలపైశంకలుపెంచుకొనరాదు. అది వృథాకాలక్షేపము. తరుణోపాయము దాన దొరకదు.

కపటవేషధారులు భగవత్తత్త్వమున నేవియో తమకుఁ దెలిసినట్లు నటించి శిష్యుల కుపదేశించి ద్రవ్యముసంపాదించుచుండుట కన్నులార మనముచూచుచున్నారము. పరమతసహనము, దేవతాంతరవిశ్వాసములేనపుడు వారికంటె మూర్ఖులుండరని మనమునమ్మవచ్చును. తాఁదరించినవాఁడు కాని యితరులఁదరింపఁజేయఁజాలఁడు. ధనపిశాచి కావేశపరవశులై భక్తినిబో

ధించుట యెట్టిదనవలయు. కపటభక్తియే యనవలయు. అట్టి వారు పరులవంచించితిమని మనమున నమ్ముచుండురుగాని తన మనసును దాను వంచించి చెడుచున్నాఁడఁగదా యనితలంపఁడు. అక్కటా! వానికన్న మూర్ఖుఁడు కలడా వాఁడెట్లు తరించునా యని యందఱు చింతింపవలయును. ఇఁకనీవిషయము నుజ్జగించి ప్రస్తుత ప్రస్తావనకు వచ్చుచున్నాఁడను.

సామాన్యముగా శ్రీకృష్ణపరమాత్మ జన్మించుటకు ముందు చెప్పఁదగిన విషయములు కొన్నిలిఖించితిని. ఇంకను అందఱుచరిత్రములు తెల్పుచుండుట కొందఱకు విసుఁగుదోఁచు నేమోయని భగవదవతారమునుదెల్పి సమయోచితముగా వారి వారివృత్తాంతములఁ దెల్పువాఁడను. స్వోక్తివ్యాఘాతమనక నాయీచిన్నిచాపల్యమును క్షమింతురని చేతులొగ్గి వేఁడు చున్నాఁడను.

## శ్రీకృష్ణజన్మవిషయక మహర్షికృతప్రశ్నము.

శ్లో. అస్తిస్వస్తరుణీకరాగ్రవిలసత్కల్పప్రసూనాప్లుతం
వస్తు ప్రస్తుత వేణునాదలహరీ నిర్వాణనిర్వ్యాకులమ్,
స్రస్తస్రస్త నిరుద్ధనీ వివిలస ద్గోపీసహస్రావృతం
హ స్తన్యస్తనతాపవర్గమఖిలోదారం కిశోరాకృతి.

కృష్ణకర్ణామృతము.

* వ్యాసమహర్షి శ్రీకృష్ణచరితమును జెప్పఁబూని యుండఁ దమకుఁగలసంశయములఁ దెల్పినఁగాని తత్సమాధానపూర్వక శ్రీకృష్ణావతారకథ చెప్పుట సంభవింపదనియెఱింగి మహర్షులిట్లు ప్రశ్నించిరి. కృష్ణద్వైపాయనమునీంద్రా! పెక్కుమహిమములు వింటిమి. అవతారములు వింటిమి. చిరకాలమునుండిమామనసుల నొకసంశయముగలదు. దానిందీర్ప మీరు తప్ప వేఱొకరుసమర్థులుగారు. బలదేవునియొక్కయు, శ్రీకృష్ణునియొక్కయు, సుభద్రయొక్కయు నుత్పత్తిని వచింపుము. శ్రీకృష్ణసంకర్షణుల యుత్పత్తియెట్లు? వసుదేవునింట శ్రీకృష్ణబలరాములు సుభద్రయు నెట్లుపుట్టిరి? నిస్సారము. మృత్యువిహారము. దుఃఖప్రాయము నగు నీభూలోకసంసారమున నేలపుట్టిరి? ఈసంసారము జలబుద్బుదప్రాయము. అతిభయంకరము. ఆలోచించినచో గగుర్పాటును బుట్టించునది. ఇట్టి ఘోరసంసారమందు గర్భవాసదుఃఖము నేల యనుభవించిరి? శ్రీబలరామకృష్ణులు పుట్టి యేయేకార్యములొనరించిరి? ఆకృత్యముల విస్తరించివచింపుము. వారి యమానుషచర్యలు వినఁగోరెదము. భగవంతుఁడు వసుదేవగృహంబున వాసుదేవత్వమొందెనుగదా. తజ్జన్మం

* ఈకథ బ్రహ్మపురాణము ౩౦-వఅధ్యాయమునుండి గ్రహింపఁబడినది. ఈకృష్ణావతారప్రశ్నమను విషయమీవఱకే వ్రాయఁబడినను దీనియందనేకవిషయము లెఱుంగఁబడును గాన నీపురాణమునుండి మరలవ్రాయఁబడినదని తెలియు నగు.

బున నాగ్సృహాదేవతాజుష్టమై పుణ్యమనీషులచే నావృతంబయ్యె
నుగదా. దేవలోకమునువదలి మర్త్యలోకము నేలభగవంతుఁడు
పొందెనో తెలియఁగోరెదము. ద్యులోకభూలోకములు దేవ
మనుష్యప్రభవములుకదా. శ్రీహరి దివ్యాత్మను మానుషాత్మను
గా నేల నియోగించెను? మనుజసంతాపహరమగు చక్రమును
ద్రిప్పు భగవంతుఁ డీలోకమున జన్మింపనేల? ఈబుద్ధి యేటికిఁ
గల్గెను? భూలోకవాసులకు స్వర్గతిని గల్పించు నారాయణ
మూర్తి యేల భూలోకమున నవతరించెను? మహాభూతము
లెవనినుండిపుట్టునో యట్టిభగవంతుఁడు వానికి లోఁబడిపుట్టుకం
గాంచనేల? శ్రీగర్భుండగు శ్రీకృష్ణుఁ డొకస్త్రీగర్భమున నేలనివ
సించెను? ఏమహానీయుఁడు పాదత్రయమునఁ ద్రిలోకముల
నాక్రమించెనో, దేవకార్యము కొఱకుఁ ద్రిమార్గముల నేర్పా
టుచేసెనో ప్రళయకాలమున జగంబులఁ దనలో నిముడునట్లొ
నరించి యాపోమూర్తియై యుండెనో, దృశ్యాదృశ్య మాయా
త్మచేత లోకముల సముద్రరూపముగా నొనరించెనో, అట్టివా
డెట్లు లీమర్త్యయోనింబుట్టెను? సనాతనుఁడైన యేహరి వారా
హరూపమును దాల్చెనో విషాణాగ్రమున భూమినినిల్పెనో
పురుహూతుని నిమిత్తమై లోకత్రయమును జయించి దేవరా
జ్యమును నిల్పెనో, నృసింహరూపమును దాల్చి రాక్షసనేత
యగు హిరణ్యకశిపునిర్జించెనో, ఔర్వాగ్నిరూపమునుదాల్చి
పాతాళముననుండి సముద్రోదకమునుద్రాగెనో, ఏభగవంతుఁడు

సహస్రశీర్షబాహుపాదుఁడని వర్ణింపఁబడుచుండునో, నాభీకమలమున బ్రహ్మను బుట్టించిన మహాత్ముఁడెవ్వఁడో, మహాప్రళయమున లోకంబు లేకార్ణవములు కాఁగాఁ దారకామయంబయి లోకముదయింపఁ గ్రూరనిశాచరులు ప్రబల వారిం బరిమార్చెనో, సర్వదేవమయశరీరమును దాల్చి గరుడవాహనారూఢుఁడై కాలనేమిప్రభృతుల నేమహాత్ముఁడువధించెనో, ఉత్తరదిగంతమునఁ బాలకడలియం దేభగనంతుఁడు శాశ్వతయోగమూని తిమిరమును గల్పించి శయనించెనో, దేవతాఁపునిర్వారణార్థమై యదితి యేపురాణపురుషునింగనెనో, యజ్ఞస్వరూపుఁడై, యజ్ఞఫలంబై, ఫలభోక్తయై. యేమహనీయమూర్తి వెలయునో యట్టి శ్రీకృష్ణమూర్తి యేల దేవకీగర్భమున జనించెను? మూఁడులోకములు, త్రిమూర్తులు, మూవురగ్నులు, మూఁడుకాలములు, మూఁడుకర్మములు, మూఁడువర్ణములు, మూఁడుగుణములు గలుగునట్లు లోకములనిర్మించి యనంతవ్యాపారములచే వాని నాడించి సర్వభూతాంతర్యామియై యోగిమానసముల విహరించుచుండుఁగదా జగదీశ్వరుఁడు. ధర్మయుక్తులకు గతియుఁ, బాపాత్ముల కగతియుఁ, జాతుర్వర్ణ్యప్రభవుఁడు, తత్పరిపాలకుఁడు, చాతుర్విద్యవేత్త, ఆశ్రమచతుష్టయ సంశ్రయుఁడు, దిగంతరములు. నభము, భూమి, వాయు, విభావసు, చంద్రప్రముఖరూపుఁడు, పరమజ్యోతిస్సు, పరమతపము, పరాత్పరము

ననఁబడు రూపమును దాల్చువాఁడు, దేవాదిదేవుఁడు, దైత్యాంతకుఁడు, ప్రభువు, ప్రళయంబు తఱి నంతకుఁడు, లోకో ద్ధరణసేతువు, పవిత్రకర్మములం బవిత్రతముఁడు, వేదవేత్తలలో శ్రేష్ఠుఁడు, ప్రభువులకుఁ బ్రభువు, అగ్నులకగ్నిఁ, దేవతలకిం ద్రుఁడు, తపస్వులకుఁ దపస్వి, నయవృత్తులకు వినయము, తేజ స్వులకుఁ దేజస్సు, విగ్రహాధారులకు విగ్రహము, గతిమంతు లకు గతి, ఆకాశప్రభవుఁడు, వాయువునకువాయువు, ప్రాణముల కగ్ని యనఁబడువాఁడుగదా శ్రీహరి. రసమునుండి రక్తము, దానినుండి మాంసము, దానినుండి మేదస్సు, దానినుండి యస్థి, దానినుండి మజ్జ, దానినుండి శుక్రము, దానినుండి గర్భము సంభవిల్లును. రస మిన్నింటికిం బ్రధానముకదా. ఆగర్భమున జలభాగము ప్రథమము. అది సౌమ్యరాశియనఁబడు. గర్భోష్మ సంభవము ద్వితీయరాశి. శుక్రము సోమాత్మకము. ఆర్తవము. పావకాత్మకము. వీనిభావములు రసానుగములు. వీనిబీజములు శశిపావకములు. కఫవర్గమున శుక్రము. పిత్తవర్గమున శోణి తము నుండును. కఫమునకు హృదయము నివాసము. పిత్తము నకు నాభి నివాసము. దేహమధ్యమభాగమున హృదయముం డును. అదియే మనస్సనఁబడు. నాభికోష్ఠాంతరస్థానమున హుతా శనుఁడుండును. మనస్సు ప్రజాపతి. కఫము సోముఁడు. పిత్త మగ్ని. అగ్నిసోమాత్మకమే జగత్తు. ఇట్లు గర్భముప్రవర్తిల్ల భగవత్ప్రేరితమై వాయు వందుఁ బ్రవేశించును. ఆవాయుప్ర

శరీరమున నైదువిధములుగా వర్తిల్లును. ప్రాణాపానసమానో దాన వ్యానములని వానిపేరులు. ప్రాణవాయువు పరమాత్మను వృద్ధినొందించుచు వర్తిల్లు. అపానవాయువు దేహపశ్చిమభాగమును, ఉదానవాయువు శరీరయర్ధభాగమును, వ్యానము సర్వశరీరమును, సమానము నాభిని ఆశ్రయించియుండును. దేహము పృథివ్యప్తేజోవాయ్వాకాశమయము. ఆయావాయువు ఆయాస్థానమును బలపఱచుచుండును. దేహముపార్థివము. మారుతమును ప్రాణాత్మనుగా నెఱుఁగఁదగు. వివరము లాకాశతత్త్వోద్భవములు. జలమునుండి స్రావముగలుగు. జ్యోతిస్సు చక్షుస్సులు. మనస్సు సారథి. విషయములు గ్రామములు. అనునీమొదలగువానిని బురుషుఁ డనఁబడు పరమాత్మ సృజించును. ఇట్లే సృష్టియంతయు నని యెఱుంగఁదగు.

ఈపేర్కొనఁబడిన వన్నియు మృత్యువునకు లోఁబడునవి. ఇట్టి నరత్వమును భగవంతుఁ డెట్లుపొందెను? మునీంద్రా! ఇదియే మాసంశయము. ఇందే మాకు విస్మయముగలుగుచుండును. గతిమంతులకు గతియగు శ్రీహరి మనుజత్వమొందనేల? దేవదైత్యవరవినుతుండగు శ్రీమహావిష్ణువు మనుజతనొంద నుద్భవించిన చరిత్రము మాకుఁ జెప్పుము. పరమాద్భుత విష్ణుచర్యాశ్రవణమున నామహనీయుని తత్త్వము తెలియఁబడు. సకలవ్యాపియగు శ్రీవిష్ణువు కృతయుగమున హరిత్వమును, దేవతలయందు వైకుంఠత్వమును, మనుజులయందుఁ గృష్ణత్వమును

బొందెనని వినఁబడియెడు. ఈశ్వరగతి గహనము. గతాగత చరిత్రముల వినఁగోరెదను. సకలదేవతారూపముల విలసిల్లువాఁడు శ్రీమహావిష్ణువుకదా. బ్రహ్మనుగూడసృజించిన యాపరమేశ్వరుఁడు మనుజత్వమొందనేటికి? ఈవిషయమును జక్కఁగావచింపుమా యనిప్రశ్నించిరి.

### మునులప్రశ్నమునకు వ్యాసులు బదులుచెప్పుట.

* శ్రీకృష్ణద్వైపాయనుఁడామునుల ప్రశ్నమునకుఁ బరమానందమంది భగవంతుఁడై దేవాదిదేవుఁడై పురాణపురుషుఁడై శాశ్వతుఁడై చతుర్వ్యూహాత్ముఁడై నిర్గుణుఁడైమఱియు

* ఇది బ్రహ్మపురాణము ౨౧ అధ్యాయమునుండి వ్రాయఁబడినదని యెఱుంగఁదగు.

వ్యాసకృత శ్రీ మహావిష్ణుస్తుతిః.

శ్లో. యస్మాదల్పతరం నాస్తి యస్మాన్నాస్తిబృహత్తరమ్, యేనవిశ్వమిదంవ్యాప్తమజేనస చరాచరం.౧. ఆవిర్భావతిరోభావదృష్టాదృష్టవిలక్షణం, వదంతి యత్సృష్టమితి తథైవాప్యుపసంహృతమ్. ౨. బ్రహ్మణేచాదిదేవాయ నమస్కృత్య సమాధినా, అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే. ౩. సదైకరూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే, నమోహిరణ్యగర్భాయ హరయేశంకరాయచ. ౪. వాసుదేవాయ సారాయ సర్గస్థిత్యంతకారిణే. ఏకానేకస్వరూపాయ స్థూలసూక్ష్మాత్మనేనమః. ౫. అవ్యక్తవ్యక్తరూపాయ విష్ణవే ముక్తిహేతవే, సర్గస్థితి వినాశానాం జగతోయోజగన్మయః. ౬. మూలభూతో నమస్తస్మై విష్ణవేపరమాత్మనే, ఆధారభూతంవిశ్వస్యాప్యణీయాం సమణీయసామ్. ౭. ప్రణమ్య సర్వభూతస్థమచ్యుతం పురుషోత్తమమ్, జ్ఞానస్వ

సగుణుఁడై వరిష్ఠుఁడై వరేణ్యుఁడై యలరు శ్రీమహావిష్ణువునకు నమస్కరించి యిట్లు వినుతించెను. ఏతత్త్వమునకన్న నత్యల్పపదార్థములేదో, దేనికన్న నధికతరవస్తువులేదో, దేనిచే నీ విశ్వకుటుంబము వ్యాప్తమైనదో, ఆవిర్భావతిరోభావదృష్టాదృష్ట విలక్షణమైనదేదియో, అట్టితత్త్వము దానయైన శ్రీహరికి నమస్కారము. ఎవనిచే నీజగము సృజింపఁ బడినదందురో ఎవనిచే సంహరింపఁబడినదనియుఁ జెప్పుదురో, బ్రహ్మస్వరూపుఁడై ఆదిదేవుఁడై సుఖప్రదాతయై యలరు శ్రీహరికి వందనములు. వాసుదేవుఁడై సారభూతుఁడై సృష్టిస్థితిసంహారకారకుఁడై, ఏకానేకస్వరూపుఁడై స్థూలసూక్ష్మమయుఁడై తనరు శ్రీమహావిష్ణువునకుఁ బ్రణామములు. వ్యక్తమనియు వ్యక్తమని చెప్పఁబడి, ముక్తిహేతువై సృష్టిపాలనసంహారకారణకారణుఁడై జగన్మయుఁడై, సర్వమూలభూతుఁడై పరాత్పరుఁడని చెప్పఁబడు నారాయణునకుఁ జేజేలు. ప్రపంచమునకాధారభూతుఁడై యణువులలోఁ బరమాణువై సర్వభూతాంతర్వర్తియై వెలయుపురుషోత్తమునకు జోహారులు. జ్ఞానమయాంగుఁడై నిర్మలుఁడై కార్యరూపమున నున్నట్లు భ్రాంతిని గల్పించుచు, లోకములఁ దలియొత్తిగి లోఁగొనుచు స్థితిసర్గరూపములు తానయై ప్రభువన నుల్లసిల్లు పరమేశ్వ

---

రూప మత్యంతం నిర్మలం పరమార్థతః. ౮. తమేవార్థస్వరూపేణ భ్రాన్తిద ర్శనత స్థితమ్, విష్ణుం గ్రసిష్ణుం విశ్వస్య స్థితిసర్గే తథా ప్రభుమ్. ౯. అనాదిం జగతామీశ మజమక్షయమవ్యయమ్.

రునకు నంజలులు. అనాదియై జగదాదియై అక్షయుఁడై యజుఁడై యవ్యయుఁడనఁబరఁగుచు నసమానశోఁ బ్రకాశించు శ్రీమహావిష్ణుమూర్తికిం జేమోడ్పులు.

అని యిట్లు వ్యాసమహర్షి వినుతించి సమాధియోగమున ధ్యానించి నమస్కరించి మహర్షులు శ్రీకృష్ణచరిత్రమును వినఁగుతూహలులగుట దెలిసికొని వేవేగ బదులుచెప్పి వారల సంశయములఁ దీర్చుట కర్తవ్యమని నిశ్చయించి యిట్లుచెప్ప నారంభించెను. మునులారా! ఇపుడు మీరు నన్నుఁ బ్రశ్నించినట్లే యక్షాదులు మహర్షులు బ్రహ్మను మున్ను ప్రశ్నించిరి. బ్రహ్మవారికిఁ జెప్పినట్లే నేను మీకుం దెల్పెదను.

ఋక్సామాదివేదవాక్యములచే నే భగవంతుఁడు లోకమును బవిత్రము చేయుచున్నాఁడో అట్టి యీశుని, ఏకార్ణవనిర్గతుని ధ్యానించెద. ఏపరమాత్ముని శాసనము సదేవాసుర మానుషమగు లోకములఁ బాలించుచున్నదో అట్టి భగవంతుని మాహాత్మ్యమును మీకువచించెద. ఏభగవంతునిచే సృష్టిని గూర్చి ధర్మాదులు ప్రకటింపఁబడినవో ఆపరమాత్ముని చరిత్రమును వినుఁడు. జలములు నారము లనఁబడు. తత్త్వవేత్తలగు మును లీపేరు జలముల కొసంగిరి. అవి యెవనికి నివాసభూతములో ఆతఁడు నారాయణుఁ డనంబడు. ఆనారాయణమూర్తి సకల ప్రపంచమును వ్యాపించి ప్రభువై నాల్గువిధముగాఁ దన మూర్తిని విభజించి సగుణుఁడై నిర్గుణుఁడై యున్నవాఁడు. అం

దొక మూర్తి శుక్లవర్ణముగలిగి యిట్టిదని యుద్దేశింపరాకయుం డునని వర్ణింపఁబడుచు, జ్వాలామాలావనద్ధాంగియై యోగులకుం బరమధ్యేయాకృతిఁ దనరుచు, దూరమునందున్నట్లును, సమీపమున నున్నయట్లును దెలియఁబడుచు, గుణాతీతమని చెప్పందగి వాసుదేవాభిధానము గలిగి నిర్మమత్వమున నలరారుచుండును. దానికి రూపవర్ణాదులు భావములు కల్పనామయములు గాఁజాలవు. కావనే యది శుద్ధమని సుప్రతిష్ఠైకరూపిణియని వినుతింపఁబడును. రెండవది శేషాఖ్యయగు మూర్తి. అది పృథివిని మూర్ధముచే ధరించుచున్నయది. ఆమూర్తి తామసియని పరిగణింపఁబడును. తిర్యక్త్వమును బొందియుండును. మూఁడవ మూర్తి ప్రజాపాలనతత్పరయై సత్త్వోద్రిక్తయై ధర్మసంస్థానకారిణియై కర్మము నొనరించుచున్నయది. నాల్గవమూర్తి జలమధ్యస్థితింగాంచి పన్నగతల్పము నొంది శయనించుచున్నయది. అది రజోగుణప్రకృతి. అదియే సృష్టినొనరించును. ఏశ్రీహరిమూర్తి మూఁడవదియో ప్రజాపాలన తత్పరమై యుండునో అదియే భూమిని సదా నియతధర్మవ్యవస్థను జేయుచున్న యది. ఏయే తరుణమున ధర్మహాని కలుగునో అధర్మము తలయెత్తునో అప్పుడది యాత్మరూపము నవతరింపఁజేయును. ఆమూర్తియే వరాహరూపమునుదాల్చి తుండమున జలమ్మును దొలఁగఁ ద్రోచి భూమిని దామరతీఁగవలె దనదంష్ట్రాగ్రమున నిల్పెను. నృసింహరూపమునుదాల్చి యాతృతీయమూర్తియే హిరణ్యకశిపును

సంహరించెను. విప్రచిత్తి ప్రముఖదానవులనుగూడ వధించెను. ఆమూర్తియే వామనావతారమున జనించి స్వమాయచే బలిచక్రవర్తినిబంధించి త్రిలోకసమాక్రమణము నొనరించి వెలసెను. ఆమూర్తియే భృగువంశమున జమదగ్నిపుత్రుఁడుగ నుదయించి రామనామమునుదాల్చి పితృవధమును స్మరించి యనేక క్రూరక్షత్రియుల సంహరించెను. అట్లే ఆమూర్తియే అత్రిమునికి దత్తాత్రేయుఁడన జనించి అలర్కుఁడను మహాత్మునకు సాష్టాంగయోగము నుపదేశించెను. ఆసత్వగుణప్రధానమూర్తియే దశరథరాజునకుఁ గొడుకగు రాముఁడై జన్మించి మూఁడులోకములఁ జీకాకుపఱచు రావణాసురుని సంహరించెను.

ఏతరుణమున సృష్టియడఁగి యేకార్ణవముగ నుండెనో అపుడామూర్తిలోకముల నుదరమునందుంచుకొని జనలోకగతులగుమహర్షులచేఁ బ్రస్తుతింపఁబడుచు, సహస్రయుగపర్యంతము నాగపర్యంకశయనము గావించుచు, యోగనిద్ర నాశ్రయించి యుండెనో ఆమూర్తి నాభినుండి దిక్పత్రమండితమగు కమలముదయించెను. అది జ్వలనార్కప్రతీకాశమై శైలకేసరమండితమై మరుత్కింజల్కాన్వితమై పైతామహగృహం బనఁదనరు. దానియందే బ్రహ్మయుదయించెను. చతుర్ముఖముల నతఁడు విలసిల్లుచుండెను.

అత్తఱి నామూర్తి కర్ణమలములనుండి యిద్దఱురాక్షసులుద్భవించిరి. వారు మధుకైటభులను నామములఁ బరఁగిరి.

వారు బలపరాక్రమగర్వముల విఱ్ఱవీఁగువారు గాన బ్రహ్మ నుజంప నుద్యుక్తులైరి. బ్రహ్మయు నప్పుడే పుట్టినవాఁడు గాన బాలుఁడుగా నుండఁగా వారు మత్తులై కొట్టిరి. శ్రీ భగవంతుఁడు హరి శయనోదధినుండి లేచి వారి వధించెను. ఈ మొదలగు ననేకవిచిత్రకృత్యము లామూర్తియే యొన రించెను. సాత్వికి యనం బ్రఖ్యాతిఁగాంచిన యామూర్తియే లోకమున ధర్మసంరక్షణార్థ మవతరించును. అది ప్రద్యుమ్నా ఖ్యనందిరక్షాకృత్యమున నిరతయై యుండు. అది శ్రీవాసుదే వేచ్ఛవలన దేవమనుష్యతిర్యగ్యోనిత్వముల దేని నొందినను దత్స్వభావముల గ్రహించుచుండును. ఆమూర్తియే భక్తులచేఁ బూజింపఁబడి సర్వకామముల నొసంగుచుండును.

ఇట్లు నాచేఁ జెప్పఁబడిన చతుర్వ్యూహామూర్తి కృతకృత్యుఁడైనను మానుషత్వమునొందెను. ఆవిధమువచించెద నవధరింపుఁడు అని పలికి శ్రీవ్యాసమహర్షి పరమేశ్వరుధ్యానించుచు నిమీలితాక్షుఁడై యాభగవన్మూర్తి యందే బద్ధాదరుఁడై యుండెను.

మహాశయులారా! శ్రీవ్యాసులు ఋషులకుఁ జెప్పిన యుత్తరమువింటిరిగదా. దీనిసారమేమి? సత్వరజస్తమోగుణా ఽకారముల భగవదిచ్ఛ యాయాయిరూపముల ధరించుచు, లోకరచనాపరిపాలన సంహారకృత్యముల నొనరించుచుండున

నియు, నీయీకార్యముల నొనరించెననియు, నామూర్తియే యాయాయినామముల ధరించుననియేకదా యేతత్సారము. ఇంచుక యాలోచింపుఁడు. ప్రకృతియే సత్వరజస్తమోగుణప్రధానరూపములఁదాల్చి సృష్టిస్థితిసంహారములను జేయుచు బ్రహ్మాదినామములఁదాల్చును. వాసుదేవాదినామప్రతిపాద్యుఁడే విరాట్టువు. తదిచ్ఛయే యీప్రకృతి. అదియే లోకోపకారిణి. ప్రకృతియనఁగా శక్తియనియు, శక్తియనఁగాఁ శార్వతియనియు నులికిపడ నక్కఱలేదు. భగవంతుఁడు ప్రకృతివిశిష్టుఁడుగానిచో నీకార్యములు చేయఁజాలఁడు. తద్విశిష్టుఁడైనచో సగుణబ్రహ్మనామమునఁ బరఁగి సకలకార్యములు చేయును. దీనిలోఁ గొంపలుమునుఁగు విషయము లేమియున్నవి? బుద్ధియందుఁ గలలోపములే మనల నిన్నివిధములుగాఁ ద్రిప్పుచున్నవి. మతద్వేషమును బూనఁజేయుచున్నవి. పరదేవతాదూషణముచేయఁ బురికొల్పుచున్నవి. కాఁబట్టి సర్వదేవతాసమబుద్ధిని బూనవలయు. మన కభిమతప్రదాత యగు దేవత యెవ్వఁడో ఆదేవతయం దెట్టిభక్తి మనకుఁగలదో ఇతరులకుం గూడ నట్టిభక్తియే దేవతాంతరము నందుండును. దానిద్వేషించి దూషించి పాపముగట్టుకొననేల? దానఁ గలుగులాభ మేది? పాపమేలాభము. కానసర్వాంతర్యామియగు పరమేశ్వరుని రూపాంతరముల దూషింపఁజనదు. ఇతరులభక్తి నాక్షేపింపరాదు. కావుననే పెద్దలు

శ్లో. మహేశ్వరేవా జగతా మధీశ్వరే
జనార్దనేవా జగదంతరాత్మని,
నవస్తుభేద ప్రతిపత్తి రస్తి మే
తథాపి భక్తి స్తరుణేందుశేఖరే.

యని వచించి మార్గదర్శకులైరి. దీనిసారమేమి? దేవతాద్వేషము తనికిరాదనియు ఒక్కదేవతయందు దృఢభక్తి గలిగియుండవలయు నని గదా. కావున వ్యాసోక్తినిదలంచి ప్రకృతిపరిణామశక్తిని గ్రహించి కృతకృత్యులరగుడు. ఇక శ్రీపరమేశ్వరునవతారకథ నాలకింపుడు.

## శ్రీకృష్ణావతార శుభనిమిత్తములు.

* ఇంచుకసేపు మౌనమూని శ్రీకృష్ణద్వైపాయనుడు బుషులంగాంచి మౌనులారా! సవిస్తరముగా శ్రీకృష్ణు నవతారమును జెప్పెద అవధరింపుడు. అవతారకారణములు కొన్నిగలవు. అందు మొదటిది భూభారహరణము. రెండవది భూలోకమునం దలయెత్తి వృద్ధినొందుచున్న యధర్మనాశనము. మూడవది కృశించుచున్న ధర్మమును రక్షించు

* ఇది బ్రహ్మపురాణము ౭౦-వ యధ్యాయమునుండి గ్రహింపబడినది కాని యీగాథయందు శ్రీభాగవతము కృష్ణజన్మఖండము మొదలగు పురాణకథలు గూడం గలిసియుండంగల వని యెఱుంగునది. భూభారకథనము లోపల గ్రంథస్థలముల వ్రాయంబడియెం గాన నిందు సంగ్రహముగ వ్రాయంబడినదనియు నెఱుంగ నగు.

పని. ఇవియే ప్రధానములు. ఈకార్యము లొనరింప శ్రీహరి జనార్దనుఁడు తనదేహమును రెండుగా విభజించి యొకదానిచే ధర్మరక్షణసాధుపరిపాలనముల నొనరించుట, వేఱొకదానిచే దేవవైరులగు క్రూరుల హింసించి యధర్మవిధ్వంసనము చేయుట యనుకార్యములఁ జేయునవతరించును. ఈ రెండు కార్యములచేఁ బ్రజాపాలనముసాగును. ప్రతియుగమునందు నిట్లే యవతరించుచుండును.

మునులారా! పూర్వమొకప్పుడు భూదేవి దుష్టజనభారమును వహింపఁజాలక దేవతలకడకుంబోయి వారితో నిట్లు మొఱ్ఱపెట్టుకొనియెను. సువర్ణమున కగ్నిహోత్రుఁడు గురువు. గోవులకు సూర్యభగవంతుఁడుగురువు. నాకును సకలలోకములకును వంద్యుఁడగు నారాయణుఁడు గురువు. దేవతలారా! ఇపుడు కాలనేమి ప్రభృతులు మర్త్యలోకమునఁ బుట్టి రేయింబవళ్లు ప్రజలబాధించుచున్నవారు. మున్ను కాలనేమి విష్ణుమూర్తిచే హతుఁడయ్యెను. ఆమహాసురుఁడే ఉగ్రసేనునకుఁ బుత్రుఁడై కంసుఁడనునామమునఁ బుట్టినవాఁడు. అరిష్టాసురుఁడే ధేనుకాసురుఁడు. కేశియనుదానవుఁడు ప్రలంబుఁడనఁబుట్టెను. బలితనయుఁడగు సుందుఁడను నుగ్రదైత్యుఁడు బాణాసురుఁడయ్యెను. ఇంక ననేకదానవులు రాజకుటుంబముల నవతరించిరి. ఆదురాత్ముల లెక్కింపఁ జాలను. వారిభారమును మోయఁజాలని నన్నుద్ధరించుటకు మీరెంతసైన్యముతో వచ్చినను శక్తులుగారు. కాన

నన్ను నేమోయఁజాలకున్న దాననని విన్నవింపవచ్చితిని. ఇపుడు నాభారమును దగ్గించు ప్రయత్నమొనరింపుఁడు. నేను గ్రుంగి రసాతలమునొందకుండు నుపాయమాలోచింపుఁడని వేఁడెను.

భూమికృతప్రార్థనమునువిని దేవతలు చతుర్ముఖునిఁ బ్రార్థింప నాబ్రహ్మ యిట్లుపలికెను. దేవతలారా! ఈభూదేవి యార్తిఁబాపుటకు నేనును మీరును ఈశ్వరుఁడును సమర్థులముగాము. మనమెల్ల నారాయణాత్మకులము. భగవద్విభూతులే. ఆయాయి ప్రాణికోటియందు న్యూనముగను హెచ్చుగను వెలసి యొకటి బాధ్యము, ఇంకొకటి బాధకముగ నగుచుండును. కావున మనమెల్లరము క్షీరాంభోధితటమునకుం బోవుదము. అందు భగవంతుని బ్రార్థించి పూజించి విన్నవింతము. సర్వాత్మకుఁడగు జనార్దనుఁడు లోకోపకారార్థమై తనమూర్త్యంశము నవతరింపఁజేసి భూభారమును తగ్గించుచుండును.

అని పలికి భూదేవిని నిర్జరులను దోడుకొని పాలకడలికడకరిగి సమాహితచిత్తుఁడై గరుడధ్వజుని ధ్యానించి యిట్లునుతించెను. *ఓసహస్రమూర్తీ! సహస్రబాహుముఖపాదా! నీకు నమస్కరించుచున్నాఁడను. జగత్ప్రవృత్తి సంస్థానకారకా! వందన

* బ్రహ్మకృత శ్రీహరిస్తుతిః.

నమోనమస్తేఽస్తు సహస్రమూర్తే సహస్రబాహో బహువక్త్రపాద, నమోనమస్తే జగతః ప్రవృత్తి వినాశ సంస్థాన పరాప్రమేయ. ౧. సూక్ష్మాతిసూక్ష్మంచ బృహత్ప్రమాణం గరీయసామప్యతి గౌరవాత్మన్, ప్రధానబుద్ధీం

ములు. అణువులలోఁ బరమాణువవు. గురువస్తువులలో గౌర వాత్ముఁడవు. బుద్ధీంద్రియప్రధానుఁడవు. సర్వలోకప్రధానాత్మకుఁడవు. కావున నన్ననుగ్రహింపుము. ఈభూమి దుష్టరాక్షస భూపాల సంపీడితయయ్యెను. భూరక్షణాదరుఁడవు. కాన నీభూభారహరణార్థము ప్రయత్నింపుము. నేను నింద్రాదులు నిర్జరులు మహర్షులు గలిసి యింద్రుని కార్యము నెరవేర్ప నిన్ను బ్రార్థించుచున్నారము. ఏయేకార్యము లెట్లెట్లు చేయవలయునో ఆజ్ఞాపింపుము.

అని యిట్లు నలువ పలువిధముల వినుతింప శ్రీనారాయణమూర్తి సర్వజగన్నాయకుఁడు పరమప్రీతుఁడై లోకోద్ధారమును జేయఁబూని తనశిరస్సున వెలయు సితకృష్ణకేశములను లాగి వారినెల్లం గాంచి దేవతలారా! చతురాననా! నాయీసితకృష్ణకేశములు రెండును భూతలమున నవతరించి భూభారహరణ మొనరించును. మీరెల్ల భూమినవతరించి దుర్భర శస్త్రాస్త్రములఁ దాల్చి ముందుపుట్టి లోకుల బాధించు పూర్వగీర్వాణుల

---

ద్రియవాక్ప్రధాన లోకాత్మ కాత్మక భగవత్ప్రసీద. ౨. ఏషామహీదేవ మహాప్రసూతైర్మహాసురైః పీడిత శైలబంధా, పరాయణం త్వాం జగతాముపైతి భారావతారార్థమపారపారమ్. ౩. ఏతేవయం వృత్రరిపుస్తథాయం నాసత్య దస్రౌ వరుణస్తథైషః, ఇమేచరుద్రా వసవస్ససూర్యాః సమీరణాగ్ని ప్రముఖాస్తథాన్యే. ౪. సురాస్సమస్తాస్సురనాథకార్య మేభిర్మయాయచ్చ తదీశసర్వమ్, ఆజ్ఞాపయాజ్ఞాం ప్రతిపాలయంత స్తవైవతిష్ఠామస దాస్తదోషాః. ౫.

సంహరింపుఁడు. దైతేయులు భూమి నంతమొందఁగలరు. మీా శస్త్రాస్త్రముల వారు మృతినొందఁగలరు.

వసుదేవపత్ని దేవకీదేవి యెనిమిదవ గర్భమున నాయీా కేశమవతరింపఁగలదు. దుష్టమతియగు కంసుని వధింపఁ గలుగు. కాలనేమియేకదా కంసుఁడుగ నవతరించెను. అని శ్రీహరి యంతర్హితుఁడయ్యెను. అప్పుడు బ్రహ్మాదులాభగవంతునిధ్యానించి నమస్కరించి మేరుపృష్ఠమునుండి భూలోకమున కవతరించిరి.

పాఠకులారా! ఈకథయం దొకయద్భుతము గలదు. దానినేస్మరింపుఁడు. బ్రహ్మాదులు మొఱ్ఱయిడ శ్రీహరిప్రత్యక్షమై నాయీాసితాసిత కేశములు రెండు ధరణినవతరించి దుష్టసంహారమొనరించునని యాజ్ఞ యిచ్చెఁగదా. చక్కఁగ నాలోచింపుఁడు. భగవంతుఁడు చేయుటకుఁ, జేయకుండుటకు, మఱియొకరీతిగాఁ జేయుటకు శక్తిగలవాఁడు. భగవంతుని కేశద్వయమవతరించుననఁగా నీచముగదా యని భావింపకుఁడు. పరమేశ్వరుని యాజ్ఞ యెట్టిపనులనైన నొనరింపఁగలదు. వాజ్ఞామాత్రమున నీలోకములు నశించును. మరల జన్మించును. వృద్ధినొందును. భగవచ్ఛక్తి యిట్టిదని మనము నిర్ణయింపఁజాలము. కనుఁగొనఁ జాలము. సితాసితకేశములే శ్రీకృష్ణార్జునులా! యనిగాని, నరనారాయణు లుదయింతురనిముందు వ్రాయఁబడియెఁగదా. యిదియేమి క్రొత్తమాట వింటిమేయనిగాని, గోలోకవాసి యుదయించునని చదివితిమిగదా యిపుడీక్రొత్తమాట యేమనిగాని యా

లోచింపకుఁడు. మాటభేదమేగాని యభిప్రాయభేదములు లేవు. భగవంతుని సకలేంద్రియములు సకలలోకములు. ఇంద్రాది నిర్జరు లాయన యంగములే. కాన నాయంశ ముదయించునని యిందలి తాత్పర్యమని గ్రహింపుఁడు. ఏసంశయములుండవు. ఒక్కొక్కపురాణమున నొక్కొక్కరీతిగాఁ జెప్పఁబడును. పురాణకర్త యొకఁడే కదా యను ప్రశ్నము రావచ్చును. ఇట సితాసితకేశములనఁగా నరుఁడు శ్వేతవర్ణుఁడు, నారాయణుఁడు నీలవర్ణుఁడు నని భావము. అంతియేగాని యభిప్రాయభేదము లేదు. స్వల్పసంశయముల మానుకొనుఁడు. దీనిచేఁ గాలము వ్యర్థముచేసిన ట్లగును. ఇఁకఁ బ్రకృతకథాభాగమునకు రండు.

## దేవకీ వసుదేవుల వివాహము.

* కశ్యపముని వసుదేవుఁడుగా నవతరించెననియు, దేవకీదేవి దేవమాతయగు నదితియనియు ముందే తెలుపఁబడియెఁ గదా. వీరిరువురు ప్రాక్సుకృతపరిణామమున శ్రీహరినిఁ బుత్రునిగాఁ బడయఁ గలిగిరి. వసుదేవుని తండ్రి దేవమీఢుఁడు. తల్లిమారిషయనుసాధ్వి. వసుదేవుఁడు జన్మింపఁగనే దేవతలు శ్రీకృష్ణునితండ్రియగు మహాత్ముఁడు, దేవేంద్రుని తండ్రియునగు కశ్యపముని పుట్టెనన్న యుత్సాహమున దుందుభిని మ్రోయించిరి. అంతతో తృప్తినొందక ఆనకమను వాద్యమును మ్రోయించిరి.

* ఈభాగము బ్రహ్మవైవర్తపురాణాంతర్గత శ్రీకృష్ణజన్మఖండము 2-వ అధ్యాయమునుండి గ్రహింపఁబడినదని తెలియందగు.

ఈ రెండు వాద్యములు వసుదేవుజన్మసమయమున మ్రోసిన కారణమున ఆనకదుందుభియను పేరు చెల్లునని పెద్దలనిరి. యదువంశదీపకుఁడగు నాహుకుఁ డనువానికి దేవకుఁడు కొడుకయ్యెను. అతఁడు జ్ఞానసింధువు. ఆమహాత్మునకుఁ గూఁతురుకల్గెను. ఆమెయే దేవకీదేవియన విఖ్యాతినొందెను.

* ఉగ్రసేనుఁడు రాజుగానుండెను. ఆతని కుమారుఁడు కంసుఁడు. ఆకంసుఁడు కాలనేమియను రాక్షసుఁడు. దేవకీదేవి కంసుఁడు తోఁబుట్టువులు. దేవకుఁడే యుగ్రసేనుఁడను నామాంతరమును ధరించెనందురు. శూరుఁడను రాజు మధురయందుండెను. మాధురశూరసేనరాజ్యములకుఁ బ్రభువై యతఁడు వెలుగొందుచు మధురాపురమున వసించెను. ఆతనికొడుకు వసుదేవుఁడు దేవమీఢుఁడను నామాంతరము శూరసేనునకుం గలదఁట.

♦ దేవకీదేవికి యుక్తవయస్సురాఁగా తండ్రి వివాహము చేయనిశ్చయించుకొని కులగురువగు గర్గమునిం బిలిపించి యాలోచించి కులగుణరూపశీలములఁ దగినవాఁడు వసుదేవుఁడని యమ్మునిపలుక నంగీకరించి కన్యాదానముచేయ నిశ్చయించుకొనెను. వివాహప్రయత్నములు మిగుల వైభవముతో జరపఁబ

---

* ఈభాగము పురాణసార సంకలితమని యెఱుంగఁదగు.

♦ ఈభాగము శ్రీభాగవతకృష్ణజన్మఖండములను గలుపుచు వ్రాయఁబడినదని తెలియఁదగు.

డెను. శాస్త్రోక్తముగా వివాహతంత్రమును గర్గాచార్యుఁడు నడపెను. సకలవిధవైభవముల నావివాహము ప్రశస్తిఁగాంచెను. శుభముహూర్తమున నావివాహము జరగుట కెల్లరానందించిరి. వధూవరులు చూచువారల కానందమును గల్గించిరి.

ఆవివాహకాలమున * దేవకుఁడు వసుదేవున కరణముగా వేయిఘోటకంబులను, వందలకొలఁది యేనుఁగులను, సకలాభరణభూషితలగు దాసీజనముల వందలకొలఁదిని, నానావిధ పదార్థములను, నానారత్నములను, మణిశ్రేష్ఠములగు వజ్రములను, ప్రీతిమైనొసంగెను. స్వర్ణపాత్రములనిచ్చెను. అత్తఱి దేవకీదేవి సదమలరత్నభూషితయై, శతచంద్రసమానముఖరుచిరయై, త్రైలోక్యమోహినియనం జెన్నారుచు, ధన్యయై, మాన్యయై, యోషిద్రత్నమనం దనరారుచు, రూపాధారయై, సద్గుణాధారయై, సుస్మితమొలరార, వక్రలోచనములఁదనరి, ప్రోద్భిన్న నవయౌవనయై యొప్పులకుప్ప నా నొప్పారుచుండెను.

అప్పుడు వసుదేవుఁడాభార్యను రథమున నిడుకొని స్వగృహమునకుఁ దోడుకొని పోవ నుద్యుక్తుఁడయ్యెను. ప్రయాణసన్నాహములుఁ చేయఁబడియె. కంసుఁడంతట మహానందముతోఁ దన తోఁబుట్టువును బిలుచుకొని పోయి యత్తవారింటవిడిచి రానెంచి

*. దుహిత్రీ దేవకః ప్రాదా ద్యానైర్దుహితృవత్సలః. అని శ్రీభాగవతము. దేవకః - ఉగ్రసేన. అనివ్యాఖ్య. ఉగ్రసేనునకు దేవకుఁ డనునామాంతరము గలదని తెలినదిగదా.

భగినీప్రీతికై రథమునెక్కి సారథ్యము చేయఁబూనెను. *అప్పటి యుత్సాహమున నాతనికి దేహమే తెలియకయుండెను. కావున రథమెక్కి పగ్గములఁ జేనంది తనచమత్కృతి కనఁబఱచుచు రథముదోలుచుండెను. బావయు భగినియు రథమునఁ గూరుచుం డుటయు దాను నరదమునుదోలుటయు నతనికి మహోత్సాహమును గల్గించుచుండెను.

## ఆకాశవాణి కంసుని ద్విగ్నమతిని జేయుట.

ఇట్లు రథము గడపుచుండఁగా దేవకీవసుదేవులు పరమానందభరితులై, యిష్టాలాపముల బ్రొద్దుపుచ్చుచు, గమనవేగమును మెచ్చుచు, దృష్టిపూతములగు పదార్థములకచ్చెరువందుచు, జానపదు లందందు గుంపులుగూడియుండఁ జూచుచు నుల్లాసమునఁ బోవుచుండిరి. అంతట హఠాత్తుగా నంబరము నుండి శరీరము కనఁబడక యొకానొక ధ్వని రథశబ్దమును గ్రిందు పఱచుచు స్పష్టముగా వినవచ్చెను.

♦ "కంసా! రాజేంద్రా! ఏలపరమానందము నొందెదవు. సత్యమువచించెదను. వినుము. దేవకీదేవి యెనిమిదవగర్భము నీకు మృత్యుహేతువగును. తప్పదు."

---

* తస్యా రథ సమీపస్థే కంసే గచ్ఛతి తత్ క్షణే. అనికృష్ణజన్మఖండము. రశ్మీన్ హయానాం జగ్రాహ రౌక్మైరథశతైర్వృతః. అని శ్రీభాగవతము. కంసస్తయో ర్వరరథం చోదయామాస సారథిః. అనివిష్ణుపురాణము. ఇట్లు పురాణము లించుకభేదముగా నీవిషయమును దెల్పుచున్నవి.

♦ కథం హృష్టోఽసి రాజేంద్ర శృణుసత్యం వచోహితమ్, దేవక్యా

అని యాశబ్దార్థము. ఈపలుకులు పిడుగులవలెఁ జెవిసోఁకగనే యదివఱకున్న మహోత్సాహము నశింపఁ గంసుఁడత్యుగ్రుఁడై మహత్తరబలశాలి గావునఁ బగ్గములు తెటాలున నొగలముడిచి కులపాంసనుఁ డౌట మేలు కీడు లాలోచింపక యుక్తాయుక్తములఁ దలంపక జనాపవాదమునకు శంకింపక కేవల స్వప్రాణసంరక్షణ తత్పరుఁడై ప్రపంచజ్ఞానశూన్యుఁడై వడివడిలేచి ఖడ్గపాణియై దేవవాక్యము లివి తప్పవని మాత్రము నమ్మి తనచావు జగముక్రుంగుట యను నానుడికి లక్ష్యభూతుఁడై భగినిని కొప్పుపట్టుకొని చంపఁ బ్రయత్నించెను.

ఆకాశవాణిపల్కులకు మిగులఁగోపించి భగినినిజంపఁ బ్రయత్నించిన కంసునిగాంచి నీతిశాస్త్రవిశారదుఁడై కాలోచిత విధిజ్ఞుఁడుగనొప్పి పండితుఁడై, వాగ్విదులలో నుత్తమోత్తముఁడై యలరారు వసుదేవుఁ డాతని మంచిమాటలతో శాంత కోపాటోపునిగఁ జేయనెంచి వేఱొకయుపాయమున భార్యప్రాణములు దక్కుట దుస్తరమనియు, నెత్తినఖడ్గము కంఠముపై వ్రాలులోపల నాతని హితవచనముల నలరఁ జేయకున్నఁ గార్యము చెడుననియు నిశ్చయించి దుష్టుఁడు ప్రతాపశాలి ధీరుఁడు

హ్యష్టమోగర్భో మృత్యుర్హేతుస్తవైవహి. అనికృష్ణజన్మఖండము. అస్యాస్త్వామష్టమోగర్భో హంతాయాం వహసేఽబుధ. అని శ్రీభాగవతము. యామేనాం వహసేమూఢ సహాభర్త్రారథస్థితామ్, అస్యాస్తవాష్టమోగర్భః ప్రాణానపహరిష్యతి. అని విష్ణుపురాణము.

సత్వరముగా గార్యము నొనర్పంజాలు పోడయనియు నెఱింగి మెల్లగా నతనినోదార్చుచు నిట్టు లనియెను.

ఇప్పట్టున శ్రీభాగవతశ్లోకము వ్రాసి దానికి మహాకవి బమ్మెర పోతనామాత్యుండు వ్రాసినపద్యముల వ్రాసి పాఠకోత్తములనలరింపఁ జేయందలంచితిని.

మూ. శ్లాఘనీయ గుణశ్శూరై ర్భవాన్ భోజ యశస్కరః,
సకథం భగినీం హన్యా త్స్త్రియ ముద్వాహపర్వణి.
౧ అ. ౩౭ శ్లో.

వ్యా. శ్లాఘనీయగుణఇతి గుణకీర్తనమ్. భగినీ మితి సంబంధకథనమ్. పుత్రికోపమేత్య భేదం వక్ష్యతి. హన్యాదితిస్త్రీవధ న్నృత్యాయశోలాభం దర్శయతి, ఉద్వాహ పర్వణీతి సంతాన వృద్ధ్యుపకారం దర్శయతి. అని శ్రీధరాచార్యులు.

ము. సభగవాన్ కథం హన్యాత్ స్త్రీహననమేవ అతిపాతకావహమ్. తత్రాపి భగిన్యాః తదపి వివాహపర్వణ్యే వేతి కిముపక్తవ్య మితి భావః. అని.

ఉ. అన్నవు నీవు చెల్లెలికి నక్కట చీరలు మాడలిచ్చుటో
మన్ననసేయుటో మధురమంజులభాషలనాదరించుటో
మిన్నుల మ్రోతలేనిజము మేలని చంపకుమన్న మాని రా
వన్న సహింపుమన్న తగదన్న నినుఁ శరణంబువేఁడెదన్.

వ. అదియునుంగాక.

మ. చెలియల్ గన్నియ ముద్దరాలబల నీసేమంబె చింతించుని,
ర్మల దీనికి బయలాడుమాటలకునై మర్యాదఁబోఁదట్టి స,
త్కులజాతుండవు పుణ్యమూర్తివకటా! కోపంబు పాపంబు
నె,చ్చెలి నోచెల్లా తెగవ్రేయఁ బాడియగునే చింతింపు
భోజేశ్వరా.

అని పోతనమహాకవి వ్రాసిరి. మహాత్ములారా ! భాషాంతరీకరణముఁజూడుఁడు. ఈపద్యములను మూలశ్లోకమును జూచిన సంబంధమేళ్లేనట్లు తోఁచును. ఇంతియగాక కవి సొంతముగా భాగవతము వ్రాసెనేగాని భాషాంతరీకరణముచేసినవాఁడు కాఁడని యుఁదోఁచును. కాని యించుక యాలోచించిన శ్రీపోతనమహాకవి యెంతచక్కఁగాఁ దెనిఁగించెనో కనఁబడును. "శ్లాఘనీయగుణః" అనువిశేషణమునుండి యన్నయగువాఁడు సోదరి నెట్లెట్లు ఆదరించవలెనో గ్రహించి లోకాచారమునందుఁ జొప్పించి రెండుపాదములు వ్రాసెను. 'యశస్కరః' అనుపదమునకుఁగల యర్థచమత్కృతి నెఱింగి తక్కిన రెండుపాదములు వ్రాసెను. తనభార్యను జంపంబూను బావమఱఁదిని జూచి సామమునఁ గార్యసాధనము జేయఁబూనువాఁ డేమిచెప్పఁదగునో ఆభావమూహించి నాల్గవపాదమున "నినుఁ శరణంబు వేఁడెదన్" అనివ్రాసెను. ఔరా! ఎంతచమత్కృతి! ఎంతటిలోకజ్ఞానము! ఎంత ప్రతిభ! ఎంతటిపాండిత్యము! ఎంతటి లోకోపదేశనైపుణ్యము! వేయినోళ్లున్న నామహాత్ముని బొగడఁదగుఁగాని యల్పబుద్ధినై యొక్కనోరుగల నేనేమి స్తుతింపఁగలను?

వ్యాఖ్యాతలభావ మీవిషయమునే సంగ్రహముగఁ దెలుపుచున్నయది. వ్యాఖ్యాతలభావము మూలమునఁ జేర్పరాదనుకింకఫులమాట యిటఁ బ్రస్తావింపనేల? వ్యాఖ్యానకర్తలభావము మూలకర్తది కావచ్చును, గాక పోవచ్చునన్న విరసుల మాటకు విలువగలదా.

ఇంతమాత్రమున నామహాకవి యవ్వలం బోయెనా. లేదు "సకథంభగినీంహన్యామ్" అనువాక్యమును గ్రహించి "భోజ!" యనువిశేష్యమును జక్కఁగాఁబరికించి నీతోఁబుట్టువు అనివ్రాసి నచో నంతురసమేమిగలదు? 'చెలియల్ కన్నియముద్దరాలబల నీసేమంబ చింతించు నిర్మలదీనిఁ' అని తెనిగించెను. భోజపదమును స్మృతిగోచరమగునట్లుచేసి సత్కులజాతులు మర్యాదను మీఱి ప్రవర్తింపరు. అందును బవిత్రకులసంజాతుఁడవు గావునఁ బరిశుద్ధదేహముగలవాఁడవు. ఇట్టి నీవు పాపహేతువగు కోపంబుం బూనరాదని తెనిఁగించెను.

శ్లో. అనిన్దితైః స్త్రీవివాహై రనిన్ద్యా భవతి ప్రజా,
నిన్దితైర్నిన్దితా నృణాం తస్మాన్నిన్ద్యాన్ వివర్జయేత్.

అను మనుస్మృతివచనమును దలంచి యామహాకవి సత్కులజాతుండవు. అని పుణ్యమూర్తివని రెండు పర్యాయములు వ్రాసి తనసర్వతోముఖపాండిత్యమును వెల్లడించెను. ఇట్టివారికే మహాకవిబిరుదము చెల్లుఁగాక యితరులకుం జెల్లునా?

"ముక్తస్య ముక్తార్థః" అన్నట్లు వ్రాసియిట్లేవ్రాయవలయునని వాదించువారిమాట యిటఁ బ్రస్తావించు టేల? వారిని స్మరింప కుండుటయే మంచిది.

* పాఠకోత్తములారా! ఇఁకఁ గథ ప్రక్కకు మరలుదము. పాపమా వసుదేవుఁడు క్రొత్తగావివాహముచేసికొని గృహప్రవేశమునకై యింటికింబోవుచు మార్గమునఁ బిడుగుపడినట్లు కంసుఁడు ఖడ్గమున భార్యకంఠమును ఛేదింపఁ బూననేమిచేయఁ గలఁడు. పలుభంగుల బ్రార్థించెను. భోజరాజేంద్రా! రాజధర్మమును బాటింపుము. దానిని నీవెఱింగినట్లు గానఁ బడదుసుమీ. నాయీహితవచనమును వినుము. నాపల్కు నీకు సుయశమును దేఁగలదు. సకలదోషములనడంచును. మఱియు శాస్త్రోక్తమ యినదిగాని కార్యముకొఱకై స్వేచ్ఛగాఁజెప్పునదిగాదు. ఇంతియ గాదు. సమయోచితమైనది. నాయనా! నామాటయొక్కటి వినుమా. ఆకాశవాణిచెప్పినదేమని? నీయీసోదరి యెనిమిదవ గర్భము నిను సంహరించుననియేకదా. ఆకాశవాక్కు సత్యమే యని నీవు నమ్మిగదా యీముద్దరాలిని వధింపఁబూనితివి? అయ్యో! ఎంతయవివేకపుఁబనిచేయబూనితివి? ఆమాటలయర్థము నీకుఁదెలియ లేదనియే నాభావము. కాననే నీయీచెలియలిం జంపి దుష్కీర్తిని మెడకుఁ దగిలించుకొన యత్నించితివి. రాజేం

---

* ఈభాగము శ్రీకృష్ణజన్మఖండము ౭-వ అధ్యాయము ౧౯-వ శ్లోకము మొదలుకొనియున్న భాగము ననుసరించి వ్రాయఁబడినదని గ్రహింపఁదగు.

ద్రా! ఇంచుక నామాటలాలింపుము. త్వరపడకుము. నీకునామా టలు సరిపడకున్న నవ్వల నీయిష్టానుసారము చేయుదువులే.

* క్షుద్రజంతువులు హింసచేయునవియేయైనను వానిని వధించిన పండితుఁడు మృత్యుకాలమున నొకకార్షాపణము (రాగినాణెము) ప్రాయశ్చిత్తముగా దానముచేసిన నాపాపము నశించును. హింసచేయనిక్షుద్రజంతువుల వధించినచో నాపాప ము శతగుణమగు. నిశ్చయము. మృత్యుకాలమున దానికిఁ బ్రాయశ్చిత్తము నూఱింతలుగాఁ జేయవలయునని బ్రహ్మయే శా సించెను. శ్రేష్ఠజంతువుల స్వేచ్ఛచే వధించిన నాపాపము శతగు ణమని మనువుచెప్పెను. మ్లేచ్ఛజాతులగు మనుజులవధించిన నాపాపము పూర్వోక్తపాపమునకన్న శతగుణమగును. మ్లేచ్ఛ

---

* వధేచ క్షుద్రజంతూనాం హింసకానాం చ పండితః, కార్షాపణం సముత్సృజ్య మృత్యుకాలే ప్రముచ్యతే. ౧. అహింసకానాం క్షుద్రాణాం వధశ్చతగుణంధ్రువమ్, ప్రాయశ్చిత్తంమృత్యుకాలే కథితం పద్మయోనినా. ౨. వధేవిశిష్ట జంతూనాం పశ్వాదీనాంచ కామతః,తతశ్శతగుణం పాపం నిశ్చితం మనురబ్రవీత్. ౩. నరాణాం మ్లేచ్ఛజాతీనాం వధేశతగుణంతతః, మ్లేచ్ఛా నాంచ శతానాంచ యత్పాపం లభతేవధే. ౪. సచ్ఛూద్రైకస్య చ వధే తత్పాపం లభతేపుమాన్, సచ్ఛూద్రాణాం శతానాంచ యత్పాపం లభతేవ ధే. ౫. తత్పాపం లభతేనూనం గోవధైకేననిశ్చితమ్,గవాందశగుణంపాపం బ్రాహ్మణస్యవధేభవేత్. ౬. విప్రహింసా సమంపాపం స్త్రీవధేలభతేనరః, విశేషతోహిభగినీ పోష్యాచశరణాగతా. ౭. స్త్రీహత్యాశతపాపంచ భవే దస్యా వధే నృప. అని మూలము.

శతవధజనితపాపము సచ్ఛూద్రునొక్కనిం జంపినఁగల్గును. సచ్ఛూద్రశతవధజనితాఘము. ఒక్కగోవునుజంపినఁగల్గును. బ్రాహ్మణవధచేఁ దద్ద్విగుణపాపము గల్గును. బ్రాహ్మణుఁ జంపిన నెంతపాపమో తత్తుల్యపాపము స్త్రీవధచే లభించును. సోదరియుఁ బోషింపఁదగినదియు శరణాగతురాలునగు వనితనువధించిన స్త్రీహత్యాపాపశతగుణ పాపముగల్గును. కావున నీపాపమిట నీసోదరిని జంపినచో నీకుఁ దప్పకగల్గును. తపోదానజపపూజనతీర్థదర్శనవిప్రభోజనహోమాదులు స్వర్గసుఖప్రాప్త్యర్థమై చేయుదురు.

భోజరాజా! ఈజన్మము జలబుద్బుదము వంటిది. స్వప్నతుల్యమునని పెద్దలందురు. కాననే ప్రతిక్షణమును ధర్మమును జేయుఁడని సాధువులు బోధింతురు. ధర్మమతీ! భోజేశ్వరా! అట్లుగావున నీసోదరిని వదలుము. నీవంశమును వేఱొకతావున వెలయఁజేయునది గదా యీభగిని. సభాముఖమున బహురీతుల ధర్మము నెఱింగిన పెద్దలుగలరు. వారి నీవిషయమును బ్రశ్నింపుము. ఈసాధ్వి యెనిమిదవకాన్పను నీకొసంగెద. ప్రియబంధూ! నీవంశమును హరించు సంతతియుండిన నాకేమిలాభము గలదు. అంతమాత్రమున నీకు సంతృప్తిగలుగదేని దీనికింగల్గెడు సంతానములనన్నింటి నొసంగుచుండెద. ఇంతకన్న నీవునన్నుఁ గోరునదేదియుండును? కావున నీభగినిని వదలుము. ఈవనిత నీకుఁ బుత్రికాసమానురాలుసుమీ. నీచేతనే మృష్టాన్నపానా

దులచే వర్ధితురాలుగదా. కాఁబట్టి నామాటలఁ జక్కఁగా నాలోచించి ధర్మాధర్మముల బాగుగఁ బరికించి వదలుము. ఇది నాబుద్ధి తరువాత నీయిష్టము. అని సామవచనముల మన స్సు తృప్తిచెందఁ బలికెను.

కంసుఁ డంతఁ దోఁబుట్టువును జంపుటమాని కొప్పును వదలెను. వసుదేవుఁడును ఎట్లో బ్రదికితిమిరా తండ్రీ! యని భార్యనుబిలుచుకొని తనగృహముచేరెను. కాని కంసునిచరిత్ర ము హృదయమును బాధించుచునేయుండెను. కంసుఁడును సోదరి యష్టమగర్భము తన్నుఁ జంపుననియు నది పొసగకుండ జాగరూకుఁడనై యుండుట మేలనియు నాలోచించుకొను చుండెను.

## కంసుఁడు దేవకీపుత్త్రులం జంపుట.

* కొంతకాల మీలాగున నెట్లోగడచెను. అంత దేవకీ దేవి గర్భమునుదాల్చి పదియవమాసమున సకలవిధముల నుత్త ముఁడగు తనయునింగాంచెను. ఆపుత్త్రుఁడు సర్వాంగసుందరుఁ డై ముద్దులు మూటగట్టుచుండెను. అప్పుడు వసుదేవుఁడు సత్య వాక్యమును బాలింపనెంచి దూరమాలోచించి దేవకీదేవింగాం చి యిట్లువచించెను. వరారోహా! ఇదియె సమయము. మనము

* ఈకథ దేవీభాగవతము ౪ స్కం. ౨౧ అధ్యాయమునుండి గ్రహిం పఁబడినది.

కంసునకుఁ బుత్త్రు సమర్పింపవలయును. నేనుశపథము చేయుటచే నతని నుండి విముక్తురాలవై తివి. కావున నీపుత్త్రునిశాంతమూని సమర్పింపుము. అకృతాత్ములమగు మనచేత విచిత్రకర్మపరిపాక మెఱుంగ శక్యముగాదు. కాలపాశవశవర్తులగు జీవులకెల్ల శుభాశుభరూపప్రాక్కర్మఫలము లనుభవింపఁ దగినవియేకదా. సర్వప్రకారముల చేతను బ్రారబ్ధము జీవులకు విధినిర్మితము. అనిన దేవకి యిట్లుబదులుచెప్పెను. నాథా! పూర్వాకృతకర్మము మనుజు లనుభవింపక మాననయితిగాదు. తీర్థసందర్శనతపోదానముల నది నశింపదని వింటిని. ధర్మశాస్త్రములయందు దానికిఁ బ్రాయశ్చిత్తము లిఖింపఁబడినది. పూర్వార్జితములగు సకల పాపములకు మహాత్ములు ప్రాయశ్చిత్తమును వ్రాసిరి. బ్రహ్మహత్యయు, సువర్ణమును దొంగిలించుట, సురాపానము చేయుట, గురుదారగమనము నను నివి మహాపాతకములు. వీనికింగూడ ద్వాదశాబ్దవ్రతము చెప్పఁబడినది. మన్వాదులు చక్కఁగాఁ బరీక్షించియే ప్రాయశ్చిత్తము నుపదేశించిరి. ఆరీతిఁ బ్రాయశ్చిత్తము నొనరించినఁ బాపములు తొలఁగునా? తొలఁగవా? తత్త్వదర్శులగు మునీశ్వరులు విగీతవచనులుగదా. కానున్నది కాక మానదు. అనునిశ్చయము నాకుంగలదు. అయితే దైవనిర్మితము అడ్డములేక సాగుచుండు నపుడు ఆయుర్వేదము మంత్రవాదములు లోనగునవియేటికి? కాకున్నది కాకమానదనుచోఁ బ్రవృత్తివలన లాభమేమి? స్వర్గసాధనము అగ్నిష్టోమాదికర్మ

ములచే నియతమన్న శాస్త్రము వ్యర్థమే. మహర్షి వాక్యములే తఱినేఁ బ్రమాణములా కావా? వ్యర్థములేమైన ధర్మోచ్ఛేదమున కు హేతువేమి? ప్రయత్నము చేసినచోఁ గార్యముఫలించుట ప్రత్యక్షముగాఁ జూచుచున్నారము. కావున నిపుడు చెప్పఁదగి నది ప్రపంచ మిది చిత్తకల్పితమనియే. ఈ బాలకుఁడు ఎట్లు క్షేమమునను బొందుచున్నాఁడో, అట్లు వచనము వ్యర్థమగుచు న్నది. ఇందు దూషింపఁదగిన విషయ మేదియో తోఁపకున్న యది. అని దేవకీదేవిపలుక విని వసుదేవుం డిట్లనియె.

ఓ సాధ్వీమణీ! సత్యము వచించెద వినుము. ప్రయత్నము మనుష్యకర్తవ్యము. తత్ఫలము దైవాయత్తము. కర్మములు త్రివిధములని వేత్తలు చెప్పుదురు. పురాణము లాగమము లిట్లే చెప్పుచున్నయవి. సంచితములు జీర్ణములు. ప్రారబ్ధములు ఇపు డనుభవింపఁ దగినవి. ఇవి బహుజన్మసమార్జితములు కాని యిప్పటివి మాత్రమే కావు. అన్నియు ఫలానుభవకాలము రా గా గుమిగూడును. జీవుఁడు కర్మవశవర్తియై పూర్వదేహము నుద్యజించి స్వర్గమునో నరకమునో పొందును. స్వర్గసాధనము దివ్యదేహము. యాతనాశరీరము పాపానుభవయోగ్యము. వివి ధభోగాదుల స్వర్గనరకములయం దనుభవింపవలయు. భోగాం తమం దుత్పత్తిసమయము వచ్చును. లింగదేహముతోఁగూడి జీవుఁ డనిపించుకొనును. కర్మము కాలానుసారముగాఁ బుణ్యపా పముల ననుభవింపఁ జేయుచుండును. వర్తమానములు ప్రాయ

శ్చిత్తమున నశించును. సంచితములుగూడ నశించును. ప్రారబ్ధములు భోగమువలననే క్షయములుగా నగునవి. కావున నీకుమారుఁడు కంసున కీయఁదగును. లోకనిందాభిదూషితమగు మిథ్యావచనము నాకుఁగలుగకుండుఁగాక. ఈసంసార మనిత్యము. మరణజన్మములు దైవాధీనములు. కావున నిరర్థకవ్యసనమునొందరాదు. ఎవనిచే సత్యము విడువఁబడునో వానిజీవితము వ్యర్థము. ఇహలోకము గతము. పరలోకము పోఁగొట్టుకొనఁబడినట్లేయగును. కావున నోసాధ్వీ! కంసునకుఁ బుత్త్రునిమ్ము. నేఁదీసికొనిపోయి యిచ్చివచ్చెద. సత్యపాలనమున శుభములు గల్గఁగలవు. పురుషులు సుఖదుఃఖములయందుఁ దప్పక సుకృతమొనరింపఁ దగును.

అని ప్రాణనాథుఁడు పలుక నాదేవకీదేవి శోకపరిభూతచిత్తయయ్యు, వేపమానాంగియయ్యు, భర్తృవాక్పాశబద్ధయై, సత్యసంరక్షణ పరాయణయై పుత్త్రునొసంగెను. ధర్మమతియగు వసుదేవుఁడు కొడుకునెత్తుకొని త్రోవపొడవునను జనులు తన్ను నుతింపుచుండఁ గంసు నింటికింబోయెను. మార్గమునఁ బోవునపుడు మనుజులందఱు ఎలుంగెత్తి యోజనులారా! వసుదేవునిం జూడుఁడు. సత్యపరాయణత్వమును బరికింపుఁడు. యశస్సును గోరువారి చరిత్ర మిట్లుండవలయును. మాటయందే మనస్సు నిలిపి కొడుకునెత్తికొని పోవుచున్నాఁడు. బంధుగృహమునకుం బోవుటలేదు. మృత్యువునకుఁ బుత్త్రుని సమర్పించుటకే.

పోవుచున్నవాఁడు. ఎంతటిసత్యవాక్కు! ఎంతటియనసూయ! ఈయనజన్మమే సఫలము. ఈయద్భుతమును జూచుఁడు. కాలరూపియగు కంసునకుఁ గొడుకునీయఁ దానే వెడలుచున్నవాఁడు. అని మనుజులెల్లఁ గొంతెత్తి నుతించుచుండఁ గంసునింటికిం బోయెను.

కంసుఁడు మిత్త్రులంగూడి కూరుచుండి యుండెను. వసుదేవుఁడు నిర్విశంకుఁడై యమానుషసామాన్యరూపవంతుఁడగు కొడుకు నొసంగఁ గంసుఁడతివిస్మితుండై యామహాత్ముని ధైర్యమున కచ్చెరువంది యాబాలకునెత్తుకొని చిఱునవ్వుమోమునఁ గన్పడ నిట్లనియెను. శూరతనయా! ఇపుడు నీవుధన్యుఁడవైతివి. పుత్త్రసమర్పణము నీయశస్సును బెంపొందఁ జేయుచున్నయది. ఈబుడుతడు నాకు మృత్యువుకాఁడు. ఎనిమిదవశిశువు మృత్యువగు నని యశరీరవాణిచెప్పెను. కాన నీపాపనిఁ జంప నొల్లను. నీయింటికిం గైకొనిపొమ్ము. మహాత్మా! నీయెనిమిదవ కుమారుని నాకొసంగుము. అనిపలుకుచుఁ దానెత్తికొనియున్న కుమారుని వసుదేవునకిచ్చెను.

వసుదేవుఁడు నిర్భరానందమున నాకుమారునెత్తుకొని తనగృహమునకుం బోయెను. కంసుఁడు మంత్రులం గాంచి యేల యీబాలునిం జంపవలయును? ఈతఁడు నాకు మృత్యురూపము దాల్చినవాఁడు కాఁడుగద. దేవకీగర్భమున నెనిమిదవతడవ జనించిన కొడుకు నీకు మృత్యువనికదా యశరీర

వాక్కు వీతెంచెను. కాన నీతొలియర్భకుని జంపి యేల పాపము గట్టుకొనవలయును? అనుడు వారెల్ల నేకవాక్యముగా మంచి కార్య మిది యనిపొగడిరి. వారందఱ నిండ్లకుం బంపి కంసు డేకాంతమున నుండుతఱి నారదమహర్షి చనుదెంచెను. కంసుం డమ్మహర్షి నింగాంచి వడివడి నెదురుచని యాతిథేయసత్కారముల నలరించి కుశలంబడిగి యాగమనకారణమును బ్రశ్నించెను. సుస్మితముతోఁప నారదముని యిట్లు పలికెను. మహామతీ! కంసా! కంసా! నేను మేరుపర్వతమునకుం బోయితిని. అందు బ్రహ్మాదిదేవత లొక్కచోఁ జేరి యాలోచించుచుండిరి. ఆ విధ మెఱింగితిని. దేవకీదేవియందు నీవధార్థమై విష్ణు వవతరించును. తప్పదు. నీవేల యిపు డామె పుత్త్రునివధింప మానితివో యెఱుంగఁజాల కున్నాఁడను. అన విని కంసుఁ డిట్లు బదులు పలికెను. మునీంద్రా! ఎనిమిదవగర్భము నా కంతకమని దేవభాషితము గాన నాశిశువును జంపఁ దలంచితిని. అనుడు పక్కున నవ్వి నారదముని కంసా! ఎంత వెఱ్ఱివాఁడవు? రాజనీతి నెఱుంగఁజాలవు సుమీ! దేవతల మాయాబలము నెఱుంగకున్నాఁడవే. ఏమందును? వినుము చెప్పెద. తనబ్రదుకుగోరు రాజు శత్రు వల్పుఁడైన విడువరాదు. సమ్మేళనక్రియయం దందఱు తనయులు అష్టములే యగుదురు. తెలివితేటలు గల్గియు నీపరిత్యాగముచే మూర్ఖుఁడ వైతివి. ఆలోచింపుమా. అని పలికి త్వరగా నారదుఁడు విశుద్ధమనమునఁ

బోయెను. నారదుఁడు వెడలఁగనే కంసుఁ డాబాలకుని దెప్పించి పాషాణమున వైచి వధించి సుఖముగనుండెను.

* ఇట్లే క్రమంబున రెండవమూఁడవనాల్గవయైదవయాఱవపుత్త్రులం గ్రమంబునఁ గంసుఁడు నారదవచనంబును హితంబుగా గ్రహించి వధించెను. కొడుకుల నన్యాయపథంబునఁ గంసుఁడుచంపుచుండ దేవకీదేవి వెతఁగుందియు భర్త సత్యమును బాలింప నూరకుండి కన్నకొడుకుల భర్తచేతికి నిచ్చుచుండెను.

పాఠకులారా! ఈకథలయం దెట్టిసారముగలదో చక్కఁగా గ్రహింపుఁడు. వసుదేవుఁడు తనభార్యను గంసుఁడు చంపఁబూనినపుడు చెప్పిన పల్కులఁ బరికింపుఁడు. ఎట్టివాఁడుగాని కార్యమును దొలుదొలుత సామముచేతనే సాధింప వలసియుండును. సమయోచితవాక్కులు కార్యమును సాధించినట్లు పౌరుషశతంబును గార్యమును సాధింపఁ జాలదు. అత్తఱి వసుదేవుఁడు పౌరుషమూనినచోఁ గార్యము చెడియుండును. దేవకీదేవి ప్రాణములు కంసు ఖడ్గమున కెరయై యుండును. కావున నెంతటివాఁడైనను భగవంతునిపై భారమును వైచి తాఁజేయఁగల

---

* ఈభాగము శ్రీకృష్ణజన్మఖండము ౭-వ యధ్యాయమునుండి లోపల వ్రాసిన దాని కనుబంధముగా వ్రాయఁబడు నని యెఱుంగఁ దగు. ఇందుఁ బ్రసక్తి ననుసరించి శ్రీభాగవతోక్తి కథయుఁ గలిపి వ్రాయఁబడుచుండును.

కార్యమంతయు సామమున సాధింపవలయునని యీకథ మనకు చెప్పుచున్నయది.

ఆకాశవాణి యేల యీమహావిషయమును గంసునకుఁ జెప్పవలయు? అన్నది రెండవవిషయము. దేవకీదేవి తొలిపుత్రు లాఱుగురు చంపఁ బడవలసినట్లు శాపము గలదు. వారి చరిత్రమును మొదటిసంపుటమునందే చదివియుంటిరి. కాఁబట్టి ఆకాశవాణి దేవకీదేవి యష్టమగర్భము నీచావునకు హేతువగునని చెప్పెను. నారదుఁ డంతతో నూరకుండక తొలికొడుకును జంప మానిన కంసునిఁ బ్రోత్సహించెను. దేవమాయల గ్రహింప శక్యముగాదని యతని హెచ్చరించెను. దానిచే నతఁ డాయాఱుగురను వధించెను. దీన వారిశాపముఁ బాసి కృతకృత్యులైరి. నారదముని వారి కెంతటి యుపకారము చేసెనో దీనిచే నెఱుకపడును. తొలుదొలుత బాహ్యదృష్టికిఁ గటువులుగఁ దోఁచు నారదువాక్యము లంతర్దృష్టితోఁ బరికించిన నెంతటి యుపకారము చేయునవియై యుండునో స్పష్టము గు.ఇంతియగాక దేవతాప్రయత్నములు కపటముతోఁ గూడినవికావు. ఆకాశవాణి యమ్మాట యత్తటిఁ జెప్పకుండినచో శ్రీకృష్ణజన్మమునఁ గంసుఁడు వ్యగ్రమతియై యాశిశువును జంపుట కిన్ని ప్రయత్నములను జేయఁడు. చేయకున్న రాక్షసులు చావరు. అది కాకున్న భూభారమడంగదు. ఇన్నికార్యము లాకాశవాక్కునసాగెను. కాఁబట్టి దేవతాప్రయత్నములు నిష్క-

పటములై న్యాయ సమ్మతములై యుండునని గ్రహింపఁదగు. ఇప్పట్టున మఱొక్క విషయమును ముఖ్యముగా గ్రహింపఁదగి నది. జంతుహింస పాపఫల ప్రద మని చెప్పఁబడియె. అందుఁ బ్రధానవిషయ మేదనినఁ బరపీడ యొనరింపని జంతువులఁ జంపుట. బరపీడ నొనరించు జంతువుల జంపుటకంటె మహాపాప మను నదియే. దీనిచే జన్మముచేత మాత్రమేగాకవృత్తి చేతను యోగ్యత గల్గునని తేలినది. జ్ఞానము పరాపకారము చేయకుండుట, తమవలన నితరులకు భీతిగలుగకుండ వర్తించుట యోగ్యతకు లక్షణములని గ్రహింప వలసియుండును.

వసుదేవుఁడు భార్యను బ్రదికించు కొనుటకై యప్పటి కుచితములుగాఁ జెప్పిన మాటలను గార్యాంతమున వీటిఁ బుచ్చక పుత్త్రుఁడు కలుగఁగనే భార్యకు హిత ముపదేశించి తానే యెత్తుకొని పోయి కంసు ముందటఁ బెట్టె. అత్తఱి నంతటి క్రూరుఁడగు కంసుని చిత్తమేమాయె? మెత్తంబడి వసుదేవుని ప్రవృత్తి మెచ్చుకొను నట్టిదిగ మాఱెను. ఔరా! సత్య ప్రభావము! కఱకురక్కసుని చిత్తమునుగూడ మార్పఁ జాలె నుగదా. దాని కీడు మఱియొండుగలదే. అనన్వయాలంకార ముంబోలి దాని కదియేసాటి. దాని నాశ్రయించిన వారి కెన్ని కష్టములు పడవలసి వచ్చినను అవలంబించి తుదకు దిగ్విజయ మొందఁగలరనుట నిక్కము. వసుదేవుఁడు సత్యమును గాపాడు

టచే దిగంతవిశ్రాంతకీర్తి నార్జించుటయేగాక శ్రీకృష్ణునకుఁ దండ్రి కాఁదగిన యదృష్టమును బొందెను.

ఇంకఁ గథాభాగమునకు మరలుదము. కంసుఁ డిట్లు భాగినేయుల నార్వురం జంపి యంతతో నిశ్శంకగ నుండఁజాలఁ డయ్యె. ఏడవగర్భము దేవకి కెప్పుడు నిలుచునా యని వేచి యుండ వలసినవాఁ డయ్యెను. ఇంతియకాక నారదముని రహస్యముగ వసుదేవనందప్రభృతులు, దేవకీదేవి మొదలగు యాదవకాంతలు దేవతాంశసంభూతులు. నిన్నుం జంపుటకై భూమి నవతరించిరనియు, జాగరూకుఁడవై యుండవలయునని యు హెచ్చరించెను. ఆరహస్యమెఱింగి నప్పటినుండియు నాతనికి మఱింత క్రోధముఁ హెచ్చఁజొచ్చెను. రాత్రిం దివములు నిద్రాహారములు మాని యెట్లీ యెడరు తప్పించుకొనఁ జాలుదునా యని యాలోచింపఁ బూనెను. తదనుగుణ్యముఁగ రాక్షసులు మిత్రులుగఁ జేరి యాలోచనలు చెప్పుచుండిరి. మేమెల్ల మీకు సాయపడి ప్రాణముల నర్పింతుమని పంతము లాడుచుండిరి. పాపమా కంసుఁ డీమాటల నమ్మి వారి సాయమున నీ యాపత్సముద్రమును దరింపఁ గలనుగదా యనినమ్మి యుండెను.

దేవకీదేవి యేడవచూలు ధరించెను. కంసుఁడా విధమెఱింగి కడుంగడు జాగరూకుఁడై కాపాడుచుండెను. తనయందు విశ్వాసముగల వారి నెందఱినో సేవకుల నేర్పఱచెను. అంతటి

తోఁ దృప్తినొందక వసుదేవకుటుంబమును దినతంత్రిని కారాగారమున నిగళబద్ధులఁ జేసి యుంచెను. అందును బెక్కండ్ర సేవకుల నియోగించి రేయిం బగల్లు దేవకీదేవి గర్భవార్తల నరయుచుండెను.

## బలరాముని పుట్టుక.

అత్తఱి లోకంబున ప్రలంబ బక చాణూర తృణావర్త మహాశన ముష్టి కారిష్ట ద్వివిద పూతనా కేశినామక దానవులు, ఇతర భూపాల రూపరాక్షసులు, బాణ నరకాసురులు, జరాసంధ ప్రభృతులు విచ్చలవిడిఁ బెచ్చుపెరిగి హెచ్చిన గర్వమున దుర్వార భుజాబలమున విఱ్ఱవీఁగి బలహీన భూపాలుర, సాధు యాదవుల నింకను బ్రజల బాధింపఁ జొచ్చిరి. దుర్జనాక్రాంతమై దేశమంతయు ధర్మమునకు నించుకంతయు నిలువ నీడ నీయక యుండెను. బీద జనుల కష్టములు వచింప నలవిగాకుండెను. సాధుజనులు శ్రీహరీ! ఎపుడు కటాక్షింతువో మమ్ము ద్ధరింతువో యని నిరంతరము జేజేలుపెట్టుచుండిరి. సాధ్వీమణులు ఏక్షణమున నీదుష్టరాక్షస భూపాలురచే నేబాధలు పొసఁగునోకో యని యుల్లమునఁ దల్లడిల్లు చుండిరి. అట్టి తఱి భగవంతుఁ డింకఁ దడవుచేయక ప్రజయార్తిఁ బాపవలయునని నిశ్చయించెను.

తనరాకకై దేవాంశజనితులు వేచి యుండుటయుఁ బ్రజలార్తిఁబడి కుందు చుండుటయు, ధర్మమునకు నిలువ నీడలే

కుండుటయుఁ దలంచి శ్రీకృష్ణమూర్తి యోగమాయం దలంచెను. తలంచిన మాత్రమున నెదుట నామహాశక్తి యావిర్భవించెను. భగవంతుఁ డాదేవిని * దేవీ! భద్రా! అని సంబోధించి నీ వీక్షణమున వ్రజంబున కరుగుము. అందు నందాదులు బృందారకాంశభవు లున్నవారు. వారెల్లఁ గంసభూపాల బాధితులై యున్నవారు. అందే వసుదేవపత్ని రోహిణి యున్నయది. దేవకీదేవిగర్భమున ననంతాఖ్యమగు మదంశము గర్భరూపమున వెలసెడిని. దానింగొని రోహిణీ గర్భమునఁ జేర్పుమా. ఆవల నేను నంశమున దేవకీగర్భమున జనియించెద. నీవును నందపత్నియగు యశోద యందుఁ బుట్టువుం గాంతువు. ♦ ఈ లోకోపకారకకార్య మొనరించిన నిన్ను లోకమున భక్తులందఱు నానావిధములఁ బూజింతురు. నీవు సర్వకామప్రదాయినివి. ఈశ్వరివి. ఆరాధించువారికి నేయేవరములు వలసిన నిచ్చుదానవు. ఈలోకమున నీకు భక్తులు పెక్కు నామధేయములు కల్పిం

---

* గచ్ఛదేవి వ్రజంభద్రే గోపగోభి రలంకృతం, రోహిణీ వసుదేవస్య భార్యాస్తే నందగోకులే. శ్రీభాగ. ౧౦ స్కం. ౨ అ. ౭ శ్లో.

♦ అర్చిష్యంతి మనుష్యాస్త్వాం సర్వకామ వరేశ్వరీం, నానోపాబలిభి స్సర్వకామ వరప్రదాం. నామధేయాని కుర్వంతి స్థానాని చ నరా భువి, దుర్గేతిభద్రకాళీతి విజయా వైష్ణవీతి చ, కుముదా చండికా కృష్ణా మాధవీ కన్యకేతిచ. అని మూ. ౨అ. ౧౨ శ్లో. సర్వాన్ పుత్రాదీన్ కామయంతే యే తేషాంవరాాం ఈశ్వరీం.నియంత్రీం, అర్చకానాం సర్వకామవరాన్ ప్రదదాతి యాతామ్. అని వ్యాఖ్య.

తురు. అనేకస్థానములఁ గల్పించి యందు నీరూపమును బ్రతి
ష్ఠించి పూజింతురు. దుర్గాదేవియని, భద్రకాళియని, విజయాంబ
యని, వైష్ణవియని, కుముదాంబికయని, చండికాదేవియని, కృష్ణా
దేవియని, మాధవియని, కన్యకయని, మాయాదేవియని, నారా
యణియని, ఈశానయని, శారదయని, అంబికయని యీ నామ
ముల నిన్నుం బూజించి నానావిధోపచారముల బలిదానముల న
ర్పించి తృప్తిపఱచుచుందురు. గర్భమును ఆకర్షించి వేఱొకతా
వున సంక్రమింపఁజేయుకతన సంకర్షణనామంబున నాయంశ
ము తనరఁగలదు. లోకమును రమింపఁజేయుక తనరామాహ్వ
య మొప్పారఁగలదు. బలోచ్ఛ్రియమున బలభద్రనామము
సుప్రసిద్ధంబగు అని యానతిచ్చెను.

అను భగవంతు నాజ్ఞంగొని యాపరాంబ యట్లే యొన
రించె దనని భూలోకమున కేగెను. అత్తఱి దేవకీదేవి గర్భవతియై
యుండెను. కంసుఁడు కడుంగడు జాగరూకుఁడై యాగర్భము
గాపాడుపొంటె దాసీదాసజనంబుల నియమించి వీరభటులఁ
గారాగారద్వారమునఁ గావలియుంచి తాను నపుడపుడు పరి
కించుచుండెను. ఏడవగర్భము స్పష్టముగాఁ దెలియరాఁగాఁ
గంసుఁడు వ్యగ్రమతియై దీనిని ఇఁకఁ గలుగఁబోవు గర్భము
ను బొలియించిన నా కిఁకఁ జావులేదు గదా యని యూహిం
చుచుండెను.

భక్తవరులారా! ఇటఁ గొంచెము మదిని సమాహిత
ముచేసి యాలోచింపుఁడు. భగవంతుఁడు యోగమాయను

స్మరించెననియు, అప్పుడే యామె సన్నిహిత యయ్యెననియు శ్రీభాగవతమునందే కనుపట్టెడిని ఆశ్లోకములను బఠింపఁగలరు. తదర్థము మీకుసుబోధమేయగు. ఇందలి రహస్యమేమని యించుక మానమూని యేకాంతమున నూహింపుఁడు. భగవంతుఁడు యోగమాయం బిలిచి నియోగించెనుగదా. దీనినుండి గ్రహింపఁ దగిన విషయమేమి? మాయయనఁ బ్రకృతికదా. తత్సహాయములేక యేకార్యమును దాఁజేయఁ బూనఁడు. తన యిచ్ఛామాత్రమున నాశక్తియే సర్వకార్యములను జేయుచుండును. భక్తులకు సకలవాంఛితముల నొసంగునది యాజగజ్జననియే కదా. కావుననే యీగర్భమును వేఱొకచో నునుపుమాయని యాజ్ఞాపించెను. ఈఘట్టమున బ్రహ్మపురాణమున నీక్రిందివచనములు కనుపట్టు పరికింపుఁడు.

శ్లో. యోగనిద్రా మహామాయా వైష్ణవీ మోహితంయయా,
అవిద్యయా జగత్సర్వం తా మాహ భగవాన్ హరిః.

౭౩ అ. ౩౭ శ్లో.

ఈశ్లోక మిట్లే విష్ణుపురాణమునఁ బంచమాంశమునఁ బ్రథమాధ్యాయమున ౭౦-వ శ్లోకముగనున్నది. ఇంతియకాక విష్ణుపురాణమునందు

శ్లో. త్వంచ శుంభనిశుంభాదీన్ హత్వా దైత్యాన్ సహస్రశః,
స్థానై ర శేషైః పృథివీ మశేషాం మండయిష్యసి. ౮౧
త్వంభూతి స్సన్నతిః కాంతి ర్ద్యౌః క్షాంతిః పృథివీధృతిః,

లజ్జాపుష్టి రుషాచైవ కాచిదన్యా త్వమేవసా. ౮౨
యేత్వామార్యేతి దుర్గేతి వేదగర్భాంబికేతిచ,
భద్రేతి భద్రకాళీతి క్షేమదే సుఖదేతిచ. ౮౩

ఈ శ్లోకములు కనఁబడియెడు ఏదియేది వ్యక్తపదార్థమో అది నీచే మోహితమేయని నీని సారముకదా. ఏ కోరికల నిచ్చినను నాయనుగ్రహమున నవి ఫలించును. దీనిభావమేమి? అవ్యక్తతత్వము నేను. వ్యక్తపదార్థము నీకల్పితము. అని కదా. ప్రపంచము. ఇంతయేల? సగుణబ్రహ్మము తన్మోహితముగదా. కాఁబట్టి విష్ణుభక్తులు శక్తియన నులికిపడ నేటికో తెలియకున్నది. ఇందలి భగవద్వాక్యమే తప్పందురా? లేక యీ శ్లోకములు ప్రక్షిప్తములందురా. ప్రక్షిప్తములన్న నన్నియుఁ బ్రక్షిప్తములే యన్న ప్రశ్నమువచ్చును. కావునఁ గేవలాజ్ఞానకృతపక్షపాతమును వదలి ప్రకృతి నుపాసించి తత్ప్రసాదసమాసాదితజ్ఞానమున భగవంతుని దెలిసికొనవలయును. ప్రకృతి శివశక్తియే యనునది పొరపాటు. అది వైష్ణవియనుచో లక్ష్మియనఁ బరఁగు, శివశక్తియనుచోఁ బార్వతి యనఁబరఁగు. బ్రహ్మమయి యనుచో శారదయనఁబరఁగు. శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవిని వక్షస్థలమున నునుచుకొనె ననుచో భావమేమి. ప్రకృతిని హృదయంగతగా నొనరించుకొనియున్నవాఁడని కాదా. బ్రహ్మ శారదను ముఖమున నునుచుకొనెననఁగాఁ దాత్పర్యమేమి? వేదవాక్కులచేఁ దాని తత్వ మెఱింగెననికాదా. ఈశ్వరుఁడు సగ

పాలు శరీర మామె కొసంగెనన సారమేమి? భగవంతునకుఁ బ్రకృతికి సృష్ట్యాదికార్యమున సమానస్వాతంత్ర్యముగల దని తెలుపుట యని కాదా. కాఁబట్టి శ్రీమచ్ఛంకరభగవత్పాదులు—

శ్లో. శివశ్శక్త్యా యుక్తో యది భవతిశక్తః ప్రభవితుం,
న చే దేవం దేవో నఖలు కుశల స్స్పందితు మపి.

యని వివరించిరి. పైపురాణము లీయర్థమునే గదా దృఢపఱచినవి. కావున విగతమత్సరులగు భక్తులు చక్కఁగా నాలోచించినచో భగవతి సర్వదేవతారూపిణి. సృష్ట్యున్ముఖుఁడగు భగవంతుఁడు తదావృతుఁడు తత్సహాయము లేక యేకార్యము చేయఁ బూనఁడు. భగవత్సన్నిధి లేక యాశక్తి యేపనియుఁ జేయఁజాలదు. భగవదిచ్ఛయే ప్రకృతి. ఆద్యంతరహితయై యాపరాంబ యలరారు. ఏరూపమును ధ్యానించినను, బూజించినను, నుతించినను ఆమెనే చెందును. ఈ రూపములు తత్కల్పితములు. విరాట్టువు నిరాకారుఁడు, నిరంజనుఁడు, నిర్లిప్తుఁడు, నిర్వికల్పుఁడు, తత్సన్నిధిని దదాజ్ఞంగొని యీపరాంబయే సకలకార్యముల విచిత్రరీతి నొనరించుచుండును. తన్మోహితులమయ్యుఁ దన్మహిమమును గనుఁగొనఁజాలక తొట్రుపడుచున్నారము. మతద్వేషమను తుచ్ఛగుణము నాశ్రయించి దేవతాంతరదూషణము చేయుచున్నారము. సర్వదేవతాస్వరూపము లాపరతత్త్వాంశముల నిగ్రహింపఁ గల్గియు వృథాభిమానమూని గ్రహింపఁ బూనకున్నవారము. కాఁబట్టి మన మేలు

మనము వలదని త్రోసివేసికొనుచున్నారము. అట్టులౌట దేవతాస్వరూపము లొక్కతేజస్సునుండి వెలువడిన వని దేని నుపాసించినను ఫలమొక్కఁడే యని, దేవతాంతరదూషణము చేసిన నది తన యుపాస్య దేవతయందుఁగూడ వ్యాపించు నని గ్రహించుటయే యుత్తమమార్గము. ఇంతట నీవిషయ ముజ్జగించి కథ ప్రక్కకు మరలుదము.

భగవంతుఁ డిట్టు లాజ్ఞాపింప నా జగజ్జనని యోగమాయ తదాజ్ఞ శిరసావహించి భూలోకమునకుఁ బోయెను. ఊర్ధ్వలోకమునుండి మనుజలోకమునకుం బోయి యాపరాంబ తన శక్తిచే దేవకీగర్భమును హరించి రోహిణీగర్భమున నా యనంత రూపమును జేర్చెను. ఏక్షణమున గర్భము రిక్తయయ్యెనో అపుడు దేవకీగర్భము విధ్వంసమయ్యెనని పౌరులు దుఃఖించిరి. గర్భమిట్లు విస్రంసితము కాఁగా జాగరూకతతోఁ గాచుచున్న కావలివాం డ్రావార్తను వెంటనే కంసున కెఱింగించిరి. సప్తమ గర్భము నశింపఁగా గంసున కొక్కగండము తప్పెనని తోఁచెను గాని యాకాశవాక్కును నమ్మినవాఁడౌట నెనిమిదవగర్భ మెపుడు చెడిపోవునా యని కోరుచుండెను.

రోహిణియందు స్వాంశము బలరాముఁ డన నవతరింపఁజేసి భగవంతుఁడు గోలోకమునుండి స్వాంశమును ఆనకదుందుభిమనసునఁ బ్రవేశించెను. శ్రీభగవంతుఁడు భూభారహరణప్రయత్నమున సన్నద్ధుఁ డయ్యెను. ఏదినమున శ్రీకృష్ణుఁడు స్వాం

శమును భూలోకమున వెలయించెనో ఆదినమున యోగమాయాదేవి యశోదాగర్భమును జొచ్చెను. * దేవకీదేవి గర్భమత్తఱి వాయుప్రపూరితమై శిశువుతోఁ గూడియుండినట్లు కనఁబడెను. ఎనిమిదవగర్భముత్పత్తికాఁగా నాదేవకీదేవి మిగులఁ దేజశ్శాలినియై కనఁబడెను. అందుండుటకు సంకల్పించినది శ్రీకృష్ణతేజము. తత్తుల్య మేమిగలదు? త్రిలోకవంద్యమై యద్వితీయమగు నమ్మహాతేజ స్సందుఁ బ్రవేశింపఁ దలఁచి నపుడు దేవకీదేవి మోము కోటిశశాంకులఁ దిరస్కరించె నన్న నతిశయోక్తి యని యెవ్వఁ డనఁ గలఁడు? అట్టు లయ్యు దేవకి నిరంతరచింతాసముద్రనిమగ్నచిత్త గావున నపు డపుడు విచారమును దోఁపఁజేయుచునే యుండెను. ఒకప్పు డంబరవాక్కును నమ్మియు నొకప్పుడు కంసునిచర్యను దలంచియు నుయ్యేలవలె నూఁగులాడు చిత్తము గల దయ్యెను.

అత్తఱిఁ గంసుఁ డొకనాఁ డా భగినిం జూచి యచ్చెరువడియెను. ఈమె యిపుడు ముఖకాంతి నిర్జితతుహినమయూఖయే యనఁ దగి యున్నది. ఈగృహమును వెలిగింపఁ జేయుచున్న యది. ఔరా! మున్నెన్నఁడే నిట్టి యత్యద్భుతజ్యోతి స్సీమెకుం గల్గియుండెనే. నేనెఱుంగ. కాఁబట్టి యిప్పటి యీమెరూపమే క్రొత్త సృష్టి యన వలయు. వాస్తవముగా

* "తస్యాపివాష్టమో గర్భో వాయుపూర్ణో బభూవహ" కృష్ణజన్మఖండము. ౭ అధ్యా ౩౦. శ్లో.

నన్నుఁ జంప శ్రీహరి యిందుఁ బ్రవేశించియే యున్నాఁడు. ఈయష్టమగర్భమే మత్ప్రాణహరము. కావుననే నాకే అరుదుగా నీమె కనఁబడియెడు. ఇపుడు నే నేమి చేయవలయు? దేవతంత్రమగు నిది నాపౌరుషమును నిష్ఫలము చేయక పోవునా. ఈ దేవకినే చంపిన సోదరీవధజనిత మహాపాప మిది యశశ్శ్రీలను దీర్ఘాయుస్సును హరింపక మానునా. కీర్తి దురాసదమైనది. అది దీనఁబోవక నిలువదు. సాధువులు యశోవిహీనుని త్యజింతురు. ఎవఁడు ఘాతుకత్వమూని జీవించునో వాఁడు జీవించియు మృతుఁడే. అట్టివానిని మనుజులెల్లఁ జీ ఛీ యందురు. అట్టి యపకీర్తిభాజనమగు దేహము నశింపఁగా [illegible]ము సిద్ధముగ నుండును. అని యిట్లనేకభంగులఁ జింతి[illegible]చుఁ దన్నివృత్తి కుపాయ మారయుచుండెను. కూరుచున్నను నిలుచుండిన నడుచుచుండిన నిద్రింపఁబోవుచుండిన ని[illegible] దపు డననేల సర్వదా చింతాపహృతమనస్కుఁ డయ్యెఁ గాని భగవన్మయ మీ ప్రపంచ మని తెలిసికోనఁ జాలఁ డయ్యెను. మఱింత జాగ్రత్తగా రక్షింపఁదగువారల నియోగించి తానును జాగరూకుఁడై ఆగర్భము నరయుచుండెను.

తొమ్మిదినెలలు నిండెను. పదియవమాసము వచ్చెను. అందును గొంతభాగము గడచెను. శుక్లపక్షశశికళవలె గర్భము తేజోవంత మయ్యెను. జఠరవాసము భగవంతునకు లేదు. తదాజ్ఞచే వాయువు నిండియుండెను. శ్రీకృష్ణుఁడు దేవకీహృ

త్పద్మకోశము నధిష్ఠానముగాఁ జేసికొనియెను. విశ్వంభరగర్భ యగు నాదేవకియు మందిరాభ్యంతరమున జడరూపమున క్లేశ యుక్తయై నివసించెను. ఇదియె విచిత్రము. ఆమె రవంత సేపు పరుండును. ఇంచుకతడవు లేచి నిలుచును. మఱి కొంచెము కాలము నడుచును. క్షణము నిద్రించును. ఇట్టులుండు దేవకిం గాంచి వసుదేవుఁడు ప్రసూతిసమయము సమీపించె నని యెఱింగి సకలాపన్నివారకుఁ డగు భగవంతుని స్మరించెను. ఆమీఁద నామందిరమున వసుదేవుఁడు రత్నప్రదీపముల నుని చెను. చంద్రాయుధమును, శుద్ధజలమును, హుతాశనుని, మంత్రవేత్తను, బంధుపత్నుల నుండ నియమించెను. భయాకులుఁడై విద్వాంసుఁడగు బ్రాహ్మణప్రవరుని బ్రార్థించి నిలిపెను. పెనుభీతి తను ముంప బంధువుల నుండుఁ డని ప్రార్థించి యొడఁబడఁజేసెను. ఇట్లు కంసవిధ్వంసకుఁడగు శ్రీమంతుఁడు భగవ ద్వంశమున నవతరించు నను పెనునమ్మకమున నెన్నియో ప్రయత్నముల నొనరించెను.

ఇట్లు వసుదేవుఁడు ప్రసూతిసమయము డాసె నని తలంచుచుండఁగా బ్రహ్మాదిదేవతలు చిరకాలమునుండి భూభారము హరింపుమా యని భగవంతుం బ్రార్థించి తదనుజ్ఞ చేఁ గాచుకొనియున్న వారు గావున నాసమయమున శ్రీదేవకీదేవి యందావహించిన శ్రీకృష్ణపరమాత్మను దివ్యదృష్టి నెఱింగి పరమసంతోషమున నిట్లు వినుతించిరి.

## దేవతలు శ్రీకృష్ణపరమాత్మను వినుతించుట.

*శ్రీపరమేశ్వరా! నీవు సత్యవ్రతుఁడవు. సత్యము చేతనే పొందఁదగినవాఁడవు. సృష్టిస్థితి ప్రళయసమయముల యందు నుండు వాఁడవు. సత్య జనకుఁడవు. పృథివ్యప్తేజోవాయ్వాకాశములు పుట్టుస్థలము నీవే. పంచభూతములందు నలరువాఁడవు. ఆభూతపంచకము లయమందఁగా నేకరూపమున నుండు వాఁడవు. సత్యవాక్కును సమదర్శనమున సాగించువాఁడవు. సర్వాత్మకుఁడవు. ఇట్టి సత్యరూపుఁడవగు నిన్ను శరణుపొందుదుము. ఈప్రపంచమే ఆదివృక్షము. అది సమష్టివ్యష్టి దేహ

---

* శ్రీకృష్ణ స్తుతిః.

శ్లో. సత్యవ్రతం సత్యపరం త్రిసత్యం సత్యస్య యోనిం నిహితం చ సత్యే, సత్యస్య సత్యమృత సత్యనేత్రం సత్యాత్మకం త్వాం శరణం ప్రపన్నాః. ౧. ఏకాయనో௨సౌ ద్విఫల(స్త్రి)మూల శ్చతూరసః పంచవిధష్షడాత్మా, సప్తత్వగష్టవిటపో నవాక్షో దశచ్ఛదోద్విఖగో హ్యాదివృక్షః. ౨. త్వమేక ఏవాస్య సతః ప్రసూతి స్త్వంసన్నిధానం త్వమనుగ్రహశ్చ, త్వన్మాయయాసంవృత చేతస స్త్వాం పశ్యంతి నానా నవి పశ్చితోయే. ౩. బిభర్షి రూపాణ్యవబోధ ఆత్మన్ క్షేమాయలోకస్య చరాచరస్య, సత్వోపపన్నాని సుఖావహాని సతామభద్రాణి ముహుః ఖలానాం. ౪. త్వయ్యంబుజాక్షా ఖిలలోకధామ్ని సమాధి నావేశిత చేతసైకే, త్వత్పాదపోతేన మహత్కృతేన కుర్వంతి గోవత్స పదంభవాబ్ధిం. ౫. స్వయం సముత్తీర్య సుదుస్తరంద్యుమన్ భవార్ణవం భీమమభద్రసౌహృదాః, భవత్పదాంభోరుహ నావమత్ర తే నిధాయ యాతా స్సదనుగ్రహోభవాన్. ౬. యే௨న్యే

రూపము. దానికిఁ బ్రకృతియే యాశ్రయము. దానికి సుఖదుఃఖములు ఫలములు. సత్త్వరజస్తమోగుణములు మూఁ

---

ఽరవిందాక్ష విముక్తమానిన స్త్వయ్యస్తభావాద విశుద్ధబుద్ధయః, ఆరుహ్యకృచ్ఛ్రేణ పరంపదంతతః పతంత్యధోఽనాదృత యుష్మదంఘ్రయః. ౭. తథా న తే మాధవతావకాః క్వచిద్భ్రశ్యంతి మార్గా త్త్వయిబద్ధసౌహృదాః, త్వయాభిగుప్తా విచరంతి నిర్భయా వినాయకానీకపమూర్ధసు ప్రభో. ౮. సత్త్వం విశుద్ధం శ్రయతేభవాన్ స్థితౌశరీరిణాం శ్రేయఉపాయనం వపుః, వేదక్రియా యోగ తపస్సమాధిభి స్తవార్హణం యేన జనస్సమీహతే. ౯. సత్త్వం నచేద్ధాత రిదం నిజంవపు ర్విజ్ఞానమజ్ఞానభిదాపమార్జనం, గుణప్రకాశై రనుమీయతేభవాన్ ప్రకాశతే యస్యచ యేనవాగుణమ్. ౧౦. ననామ రూపే గుణకర్మ జన్మభి ర్నిరూపితవ్యేతవతస్యసాక్షిణః, మనోవచోభ్యా రనుమేయ వర్త్మనో దేవక్రియాయాం ప్రతియంత్యథాపిహి. ౧౧. శృణ్వన్ గృణన్ సంస్మరయంశ్చ చింతయ న్నామానిరూపాణిచ మంగళానితే, క్రియాసుయ స్త్వచ్చరణారవిందయో రావిష్టచిత్తోనభవాయకల్పతే. ౧౨. దిష్ట్యాహరేస్యా భవతః పదోభువో భారోపనీత స్తవజన్మనేశితుః, దిష్ట్యాంకితాం త్వత్పదకైస్సుశోభనైః ద్రక్ష్యామగాంద్యాంచతవానుకంపితాం. ౧౩. నతేఽభవస్యేశభవస్యకారణం వినావినోదం బతతర్కయామహే, భవోనిరోధః స్థితిరప్యవిద్యయా కృతాయత స్త్వయ్యభయాశ్రయాత్మని. ౧౪. మత్స్యాశ్వ కచ్ఛప నృసింహ వరాహహంస రాజన్యవిప్రవిబుధేషు కృతావతారః, త్వంపాహినస్త్రిభువనం చ తథాధునేశ భారంభువోహరయదూత్తమ వందనంతే. ౧౫. దిష్ట్యాంబతే కుక్షిగతఃపరంపుమా నంశేన సాక్షా ద్భగవాన్ భవాయనః, మాభూద్భయంభోజపతేర్ముమూర్షో ర్గోప్తాయదూనాం భవితాతవాత్మజః. ౧౬. శ్రీ భా ౧౦ స్కం. ౧ అ.

డును వేఱులు. ధర్మార్థకామమోక్షములు నాలుగు రసములు.
జ్ఞానేంద్రియము లైదును జ్ఞానప్రకారములు. బుభుక్షు, పిపాస,
శోకము, మోహము, జరయు, మృత్యువునను నాఱు దానికిస్వ
భావములు. చర్మరుధిరమాంస, మేదోమజ్జాస్థి శుక్లము
లను సప్తధాతువులు దానికిఁ బైచర్మములు. హస్తద్వయము,
పాదద్వంద్వము, శిరస్సు, కంఠము, వక్షము, జఠరము నను నీయె
నిమిది దానికిం గొమ్మలు. నవద్వారములు కోటరములు. నాగ,
కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ, ప్రాణాపానవ్యానోదానస
మానము లను నీపదియు దానికి నాకులు. జీవేశ్వరు లిద్దఱు
దానియందుండు పక్షిద్వయము. ఇట్టి సంసారవృక్షమును
బుట్టింపఁ బెంప సంహరింప వలంతివి నీవే. జగదీశ్వరా! నీమా
యచే నావృతంబగు చేతస్సు గలపామరులు నిన్ను నానారూ
పములుగ వెలసిన పరమాత్మగ భావింపఁ జాలరు. రామకృష్ణాది
రూపములఁ దాల్చి జగంబుల నుద్ధరించువానిగాఁ దలంపఁ
జాలరు. విద్వాంసులగు వారు నిన్ను సర్వవ్యాపిగా నానారూ
పవిరాజమానునిగఁ జూడఁజాలుదురు. ఇట్టి పరాత్పరుని నిన్నుఁ
బ్రార్థింతుము. భగవంతా! సాధువుల కానందమును గల్గించునవి
యు క్షుద్రులకు శుభదములుగాఁ దోఁపని యనేకరూపవిశేష
ముల నవతారములను ప్రఖ్యాతి గలవానిని దాల్చి లోకముల
కు మంగళమును గల్గించుచుందువు. సమస్తలోకాధారా! నీనా
మము పరమపవిత్రము. దానిమహిమము నెఱిఁగిన వారల నది

క్కాపాడుచుండును. సమాధిచే నావేశిత చిత్తులగు వారు నీపాద పంకజమను నౌక నాశ్రయించి భవసాగరమును దరింతురు. వారిపాలిటి కాభవసాగరము ఆవుదూడకాలిపంటిదయి కనఁబడును. అట్టి మహిమము నీపాదపంకజమునకుఁగల దని యెఱిఁగినవారే పండితులు. వారే యోగులు. వారే భక్తులనియుఁ జెప్పఁబడుదురు. సాధువులు భీమ సంసారసాగరమును దాఁటి సర్వభూతములందును నిష్కలంకదయాసమగ్ర బుద్ధులై యుందురు. సంసారార్ణవమునుండి తరింపఁజేయునది నీపాదనౌకయే. దానినెఱుంగుదురుగాన వారు తరించుసాధనము నాశ్రయింతురు. పంకజాక్షా! కొందఱు పండితమ్మన్యులు నీభక్తియోగనిబద్ధచిత్తులుగాక అందున పరిశుద్ధబుద్ధులై బహుజన్మములెత్తి యధోగతిపాలగుదురు. ఏలయన వారు యుష్మదంఘ్రిపంకజము నాశ్రయింపనివారు. కాఁబట్టి యధోగతిపాలగుదురే కాని ముక్తికిఁ బోవఁదగరు. ఏమహాత్ములు నీనామమహిమము నెఱింగి నీయందే మనస్సునిలిపి దాన సంరక్షితులై నిర్భయులై విఘ్నములఁ దొలఁగఁద్రోయఁజాలి నీస్థానమును గనుఁగొందురు. ఆశ్రమచతుష్టయము నిన్ను సేవింప నీవు శుద్ధంబును శ్రేయస్కరము నగు దివ్యరూపమును దాల్తువు. ఓపరమేశ్వరా! నీమూర్తిశుద్ధసత్వగుణము గలది కాదేని విజ్ఞానప్రదమై యేలాగున నజ్ఞానమును బోఁగొట్టఁజాలును? గుణమయకార్యములచే నీవనుమానింపఁ బడుదువు. (అనఁగాఁ గార్యమునకుఁ గారణ

భూతుఁడవగుదువు) ఏకార్యమేగుణంబునఁ గలుగునో ఆగుణమూని ఆకార్య మొనరింతు వని నిన్నెఱుఁగుదురు. నీగుణములచేతను, నీకర్మములచేతను, జన్మములచేతను నీనామరూపములు తెలియంబడవు. వానికి నీవు సాక్షిభూతుఁడవగుదువు. మనోవాక్కులచే నరయఁదగని నిన్నుపాసకులు ధ్యానబలమున నెఱుంగఁజాలుదురు. నీదివ్యమంగళరూపముల వినుచు, ధ్యానించుచు, వాని మహిమముల స్మరించుచు, ఇతరులచేస్మరింపఁజేయుచు, దత్పాదాంభోజముల సంసక్త చిత్తులయి యుండువారు పునర్జననమునందరు. పురుషోత్తమా! భూభారము తొలఁగెను. నీజన్మముననే యదితొలఁగినట్లే భావించితిమి. భవత్పాదకమలముల నాశ్రయించిన మేము హలకులిశాదిసురేఖాంకిత భవచ్చరణకంజముల నంకితమగు భూభాగమును స్వర్గమును గృతకృత్యములుగా భావింతుము. జన్మమునకుఁ గారణభూతుఁడవు నీకుఁ బుట్టువెక్కడిది? అట్టి నీవు జన్మించుటయన నొకవిలాసమని భావింతుము. సంభవము లోనగునవి అజ్ఞానకల్పితములు. అవిద్యచేఁ గల్పింపఁబడునది. అవిద్యావిరహితుఁడవగు నీకవి యెక్కడివి? ఉన్నట్లు కనుపట్టుచుండును. పరమార్థమున నాలోచింప నీకవి లేనేలేవుకదా. మత్స్యకూర్మ వరాహ నారసింహ వామన హయగ్రీవాద్యవతారము లెత్తి మముం గాపాడితివి. రాజరాజవై మమునేలితివి. బ్రహ్మాసురపతివై సకలబాధల నణఁచితివి. ఇపుడు యదువంశమున నవతరిం

చితివి. మముం గాపాడుము. భూభారమును దొలఁగింపుము. యదువంశము నుద్ధరింపుము. నీకునమస్కరింతుము. లోకమిప్పు డు దుష్టరాక్షసాకీర్ణముగ నున్నయది. సాధువులకు నిలువ నీడ లేకున్నది. కానఁ ద్వరగా వెడలిరమ్ము. లోకంబులఁ గాపాడుము అని వినుతించి దేవకీదేవినుద్దేశించి యోజననీ! నీపూర్వజన్మసు కృతవితతిచే శ్రీమత్పరమపురుషుఁడు నీకుక్షియందున్న వాఁడు. భగవదంశమును గుక్షియందు ధరించు భాగ్యము నీకుం గల్గి నది. భోజరాజకళత్రమా! నీమనస్సంతాపము నశించెను. ఇఁక నీవేలాటి చింతలం బొందవలదు. పరమపురుషుఁడు నీకుం బుత్త్రుఁడుకానున్న వాఁడు. మరణింప సిద్ధముగానున్నవసు దేవుని భయమునశించెను. యదుకులరక్షకుఁ డుదయింప నున్న వాఁడు. అంబా! నీవలన లోకములకు సకలకల్యాణ ములు చేకూరును.

ఇట్లువినుతించి తనివిసనక మఱియును భక్తి నమ్రులై యిట్లు వినుతిచేయ సాగిరి. *పరమేశ్వరా! జగత్కారణుఁడవు. నీకొకఁడు కారణభూతుఁడు లేఁడు. అనంతుఁడవు. అవ్యయుఁ

* జగద్యోనిరయోని స్త్వ మనంతోఽవ్యయఏవచ, జ్యోతిస్స్వరూపో హ్యనఘు స్సగుణో నిర్గుణోమహాన్. ౧. భక్తానురోధాత్సాకారో నిరా కారో నిరంకుశః, నిర్వ్యూహోనిఖిలాధారో నిశ్శంకోనిరుపద్రవః. ౨. నిరు పాధిశ్చనిర్లిప్తో నిరీహోనిధనాంతకః, స్వాత్మారామః పూర్ణకామో నిర్దోషో నిత్యఏవచ. ౩. స్వేచ్ఛామయ స్సర్వహేతు స్సర్వస్సర్వ గుణాశ్రయః,

డవు. జ్యోతిస్స్వరూపుఁడవు. పాపరహితుఁడవు. సగుణుఁడవు. నిర్గుణుఁడవు. మహాత్ముఁడవు. భక్తులుప్రార్థింప నాకారమును బొందితివి. వాస్తవముగ నాలోచింప నిరాకారుఁడవు. అప్రతిహతుఁడవు. నిర్వ్యూహుఁడవు. సకలాధారుఁడవు. శంకావిరహితుఁడవు. ఉపద్రవ శూన్యుఁడవు. నిరుపాధివి. నిర్లిప్తుఁడవు. నిరీహుఁడవు. మృత్యుమృత్యువవు. స్వాత్మారాముఁడవు. నిరంతర సంపూర్ణకాముఁడవు. దోష లేశము లేనివాఁడవు. నిత్యశబ్ద వాచ్యుఁడవు. స్వేచ్ఛామయుఁడవు. సర్వహేతువనఁ బడువాఁడవు. సర్వశబ్దవాచ్యుఁడవు. సర్వగుణాశ్రయుఁడవు. సుఖప్రదాతవు. దురాత్ములకు దుఃఖప్రదాతవు. దుర్జనాంతకుఁడవు. సకలకల్యాణమయుఁడవు. దుర్భగుఁడవు. వాగ్మివి. దురారాధ్యుఁడవు. దురత్యయుఁడవు. వేదహేతువవు. వేదరూపుఁడవు. వేదాంగమవు. వేదవేత్తవు. సర్వలోకాధిపతివి. ఓజగదీశ్వరా! ఇట్టి నీకునమస్కరించువారము. అని పలుభంగుల భక్తివినమ్రులై వినుతించి తమతమ నెలవులకుఁ జనిరి.



సుఖదోదుఃఖదో దుర్గో దుర్జనాంతక ఏవచ. ౮. సుభగో దుర్భగో వాగ్మీ దురారాధ్యో దురత్యయః, వేదహేతుశ్చ వేదశ్చ వేదాంగో వేదవిద్విభుః. ౯. ద్విచత్వారింశన్నామాని ప్రాతరుత్థాయయఃపఠేత్, దృఢాంభక్తిం హరేర్దాస్యం లభతే వాంఛితంఫలమ్.

శ్రీకృష్ణజన్మఖండము ౭ అధ్యా.

## —శ్రీకృష్ణావతార ఘట్టము.—

రాత్రి రెండుజాములు గడచెను. మధురానగరము నిశ్శబ్దముగనుండెను. పిపీలికాదులు సైతము చేష్టలు మాని సుఖసుషుప్తిఁజెంది యుండినవి. గాఢాంధకార మెల్లయెడల వ్యాపించి తన కీడు జోడులేక ప్రభుత్వము చేయసాగెను. రాత్రి పదునేను ముహూర్తములుగ విభజింపఁబడును. పగలు కూడనట్లే. ముహూర్త మనఁగా నీవిభాగమున రెండుగడియలు. అట్టి ముహూర్తములలో నేడు ముహూర్తములు గతించెను. అష్టమముహూర్తము ప్రవర్తింపసాగెను. ఆముహూర్త సమయము వేదాతి రిక్త దుర్జ్ఞేయము. సర్వోత్కృష్టము. శుభనిధానము నయియుండెను. అప్పటిలగ్నమును జంద్రాదిశుభగ్రహములు చూచుచుండిరి. పాపగ్రహముల దృష్టి దానిపైఁ బ్రసరింపకుండెను. ఆకాలమున కర్ధరాత్రమని జ్యోతిశ్శాస్త్రము శాసించుచుండును. నక్షత్ర మపుడు రోహిణి. అష్టమి తిథి. జయంతీ యోగ సంయుక్త మాశుభదివసమని పరిగణితము. చంద్రుఁ డర్ధోదితుఁ డగుచుండెను. ఆలగ్నమును బాలచూచుటకు సూర్యాదులు భీతిల్లుచుండిరి. సర్వగ్రహములు సుప్రసన్నములై యుండెను. గ్రహములన్నియు బ్రహ్మశాసనము ననుసరించి క్రమగతిని మాని యాకాలమున నేకాదశస్థానమున నుండిరి. అది మీనలగ్నమని పిల్వఁబడు. అదియే లగ్నైకాదశస్థానము. మేఘము లెల్లయెడలంబర్వి సంతోషమును వెలి

పుచ్చుచు శుభగర్జనములలర వర్షించెను. వాయువులు సుఖస్పర్శములై మెల్లఁగా వీవసాగెను. భూమి సుప్రసన్నయై వెలసెను. దిక్కులు సుముఖములయి కనుపట్టెను. మేఘము లట్టె విచ్చిపోవ నాకాశము నిర్మల తారకాగ్రహగణసంశోభితమై చూపట్టెను. ఋషులు, మునులు, యక్షులు, గంధర్వులు, కిన్నరులు, దేవతలు, దేవకాంతలు, పరమానంద సాగరనిమగ్నులైరి. అచ్చరమిన్నలు నృత్యముచేయసాగిరి. గంధర్వశ్రేష్ఠులు పాడిరి. విద్యాధరకన్యకలు మధుర స్వరములలర గానము చేసిరి. వియచ్చరులు పారిజాత ప్రసూనములు వర్షించిరి. అది పెనువృష్టిని మించెను. సాగరములు శ్రుతిహిత నినాదములలర ఘూర్ణిల్లెను. ఆబ్రహ్మస్తంభపర్యంతము జీవకోటి సంతోషభరితమయ్యెను. ఏకాలమున నెప్పుడే లభింపని యానందమా సుసమయమున నెల్లరకు కారణముగఁ బొడసూపెను. దుష్టమతులకు వచింపనలవిగాని తాపముకల్గెను. సజ్జనుల కపరిమితానందము శాంతియుఁ బొడకట్టెను.

అత్తఱి భూదేవి తన మహాభారమును దీర్ప నవతరించిన భగవంతునిఁ బుండరీకాక్షుని సర్వజగన్మంగళకారకుని వేదవేద్యుని దర్శింపఁగోరి పైఁబైఁ బొంగు కోరికలు ఫలింప నారీరూపమును ధరించి సూతికాగృహమును బ్రవేశించెను. ఆమెయు సామాన్యస్త్రీయనియే వసుదేవాదులు తలంచిరి. జయజయ

నాదము, శంఖనిస్వనము, హరిశబ్దము ఎచ్చటనుండియో వినఁబడియె.

* ఇట్లు సర్వలోకశుభావహచిహ్నములు పొడసూప భగవంతుఁడావిర్భవించు తరుణమాసన్నముకాఁగా దేవకీదేవి స్మృతిదప్పి పడిపోయెను. ఇట్లా మహాసాధ్వి స్మృతివిరహితకాఁగా నామె పవిత్రతయ గర్భమునుండి వాయువు వెడలివచ్చెను. ఆవాయువే యామెగర్భమున నిండియుండెను. గర్భవాస దుఃఖము శ్రీభగవంతునకుం గల్గునా? గర్భచిహ్నములు గలుగు నట్లొనరించి బాలరూపమును దాల్చి భగవంతుఁడా విర్భవించునుగాని పామరులఁ బోలి గర్భమునఁ దొమ్మిదినెల లుండి తత్కష్టముల ననుభవించునని వచించుట కేవలము పామరముగదా. ఇట్లు వాయువు వెడలివచ్చువిషయ మాదేవకీ దేవికిఁ దెలియఁదగదనియే భగవంతుఁడామెకు స్మృతిలేకుండఁ జేసె నని గ్రహింపవలయును.

ఈతీరున వాయువు గర్భమునుండి వెడలిరాఁగా భగవంతుఁడు దివ్యరూపమును దాల్చి దేవకీహృత్పద్మకోశమునుండి

---

* ఏతస్మిన్నంతరే తత్ర పపాత దేవకీసతీ, నిస్ససారచవాయుశ్చ దేవకీజఠరాత్తతః. తత్రైవ భగవాన్ కృష్ణో దివ్యరూపం విధాయచ, హృత్పద్మకోశాద్దేవక్యా హరిరావిర్బభూవహ. అని మూ.

కృష్ణజన్మఖండము. ౭ అ.

వెడలివచ్చెను. ఆరూప మతి కమనీయము. *ద్విభుజము. మురళీ విరాజిత హస్తము. స్ఫురన్మకరకుండలము. సుస్మితమనోహరము. ప్రసన్నవదనాంబుజము. భక్తానుగ్రహకాతరము నైయుండెను. మఱియు మణిగణ ఖచిత దివ్యాభరణములు వెలుంగ నవ జలధరశ్యామమై పీతవాసస్సునుదాల్చి చందనాగరుకస్తూరీ కుంకుమ ద్రవచర్చితమై శరద్రాకాశీతమయూఖుని మించిన ముఖము వెలయఁగా నధరబింబ మొప్పార మయూరపింఛము శిరమునఁ జెలువుసూప రత్నకిరీటము చెలువారఁ ద్రిభంగ వక్రమధ్యమమలర వనమాల హృదయపీఠమునఁ గనుపట్ట శ్రీవత్సచిహ్నము వక్షస్థ్సలమున మెఱయ నందే మనోహర కౌస్తుభముగ్రాల నాపరమేశ్వరు బాలరూపము చూడఁజూడ వేడుకగా నుండెను. శాంతరసమారూపమున నలరారుచుండెను. బ్రహ్మశంకరులను మించిన సౌందర్య ముట్టిపడునట్లుండెను. అట్టి మహనీయమూర్తిని గన్నుల పండువుచేయుచున్న శ్రీకృష్ణపరమాత్మను దేవకీదేవి యెదుటంగాంచి విస్మయమున మేను గగుర్పాటునొందఁ బరమభక్తియుక్తుఁడై

* ఈఘట్టమున శ్రీ భాగవతమునందు 'చతుర్భుజం శంఖగదాద్యుధాయుదమ్' అని కనుపట్టెడు. విష్ణుపురాణమునందును 'ఫుల్లేందీవరపత్రాభంచతుర్బాహు ముదీక్ష్యతమ్' అనిచూపట్టెడు. ఈరీతిగానే ఈశ్లోక మే బ్రహ్మపురాణమున నున్నయది. ఐనను గోలోకవాసియగు శ్రీకృష్ణపరమాత్మ యావిర్భించినట్లు ఆపురాణమును ప్రధానముచేసికొని వ్రాయుటంబట్టి యట్లు వ్రాయఁబడినదని గ్రహించుట సరసము.

ధన్యోఽహం ధన్యోఽహ మ్మని తలంచుచు వసుదేవుఁడు కరయుగళము ముకుళించి భక్తిభారమున మస్తకమునువంచి యానందబాష్పములు ధారగాఁ బ్రవహింపఁగా నిట్లు వినుతించెను.

ఇంద్రియాతిక్రాంతుని, ఇదమిత్థ మని తెలియరాన ట్లున్నవానిని, నాశనరహితుని, గుణరహితుని, సర్వలోకాధీశుని, ధ్యానింపసాధ్యము గాకుండువానిని, ఎల్లజీవుల కీశ్వరుని నిన్ను

---

* వసుదేవకృత శ్రీకృష్ణ స్తుతిః

శ్లో. త్వా మతీంద్రియ మవ్యక్త మక్షరం నిర్గుణం విభుమ్, ధ్యానాసాధ్యంచ సర్వేషాం పరమాత్మాన మీశ్వరమ్. ౧. స్వేచ్ఛామయం సర్వరూపం స్వేచ్ఛారూప ధరం పరం, నిర్మలం పరమం బ్రహ్మ బీజరూపం సనాతనమ్. ౨. స్థూలా త్స్థూలతరం వ్యాప్త మతిసూక్ష్మ మదర్శనం, స్థితం సర్వ శరీరేషు సాక్షిరూప మదృశ్యకమ్. ౩. శరీరవంతం సగుణ మశరీరం గుణోత్కరం, ప్రకృతిం ప్రకృతీశం చ ప్రాకృతం ప్రకృతేఃపరం. ౪. సర్వేశం సర్వరూపం చ సర్వాంత కరమవ్యయం, సర్వాధారం నిరాధారం నిర్వ్యూహం స్తౌమి కిం విభుమ్. ౫. అనంత స్తవనేఽశక్తోఽశక్తా దేవీ సరస్వతీ, యంవా స్తోతు మశక్తశ్చ పంచవక్త్రః షడాననః. ౬. చతుర్ముఖో వేదకర్తా యం స్తోతు మక్షమ స్సదా, గణేశో న సమర్థశ్చ యోగీంద్రాణాం గురోర్గురుః. ౭. ఋషయో దేవతాశ్చైవ మునీంద్ర మనుమానవాః, స్వప్నే తేషా మదృశ్యంచ త్వా మేవం కిం స్తువంతి తే. ౮. శ్రుతయ స్స్తవనేఽశక్తాః కిం స్తువంతి విపశ్చితః. విహాయైవం శరీరంచ బాలో భవితు మర్హసి. ౯. వసుదేవ కృతం స్తోత్రం త్రిసంధ్యం యః పఠేన్నరః, భక్తిం దాస్య మవాప్నోతి శ్రీకృష్ణ చరణాంబుజే. ౧౦. విశిష్టపుత్రం లభతే హరిదాసం గుణాన్వితం, సంకటం నిస్తరేత్తూర్ణం శత్రుభీత్యా ప్రముచ్యతే. ౧౧. శ్రీకృష్ణజన్మఖండము. ౭ అ.

నే నేమని వినుతింతును? స్వేచ్ఛామయుండవు. సర్వరూపధా రివి. కాలోచితరూపధరణసమర్థుండవు. నిర్మలుండవు. పరబ్ర హ్మమవు. బీజరూపుండవు. సనాతనుండవు. స్థూలపదార్థములలో స్థూలవస్తువవు. వ్యాపకుండవు. అతిసూక్ష్మవస్తువులలో నతిసూ క్ష్మవస్తువవు. సర్వశరీరాంతర్భూతుండవు. సాక్షీమాత్రుండవు. అదృశ్యరూపుండవు. ఇట్టి మహాత్ముని నిన్ను సేవించెదను. శరీర ముగలవాండవు. సగుణుండవు. శరీరశూన్యుండవు. గుణసము దాయముగలవాండవు. ప్రకృతివి. ప్రకృత్యధిపతివి. ప్రకృతి వశుండవు. ప్రకృత్యతీతుండవు. సర్వేశుండవు. సర్వరూపుండవు. సర్వము నశింపఁజేయఁగలవాండవు. అవ్యయుండవు. సర్వాధారుం డవు. నిర్వ్యూహుండవు. ఇట్టి పరబ్రహ్మను నిన్నే నేమని వినుతిం తును? నిన్ను నుతింప ననంతాఖ్యగన్న యాదిశేషువే యశక్తుం డయ్యెను. సరస్వతీదేవి నుతింపఁజాలకున్నయది. పంచవక్త్రుండగు శంకరుండు, షడాననుండగు కుమారస్వామియు నశక్తులైరి. వే దకర్తయగు చతుర్ముఖుండు గూడ నసమర్థుండై యున్నవాండు.

---

## శ్రీభాగవతస్థ కృష్ణస్తుతిః.

విదితో ఽసి భవాన్ సాక్షా త్పురుషః ప్రకృతేః పరః, కేవలాను భవానంద స్వరూప సర్వ బుద్ధి దృక్. ౧. స ఏవస్వప్రకృత్యేదం సృష్ట్వాగ్రే త్రిగుణాత్మకం, తదనుత్వం హ్యప్రవిష్టః ప్రవిష్ట ఇవ భావ్యసే. ౨. యథే మే వికృతా భావా స్తథా తే వికృతైస్సహ, నానావీర్యాః పృథగ్భూతా వి రాజం జనయంతిహి. ౩. సన్నిపత్య సముత్పాద్య దృశ్యంతే ఽనుగతా ఇవ,

గణాధిపతి వినుతింప నేమియుఁ దోఁపక యున్నవాఁడు. యోగీంద్రులకును, ప్రపంచగురువులగు మహానుభావులకును నీవే గురుఁడవు. ఋషులు, దేవతలు, మునీంద్రులు, మనువులు, మానవులు నిను వినుతింపఁజాలకున్నవారు. వారికి స్వప్నమునందుఁగూడ నదృశ్యుఁడవు. ఇట్టి నిన్ను నజ్ఞుఁడనగు నే నేమని వినుతింపఁబూనుదు. వేదములు నీమహిమమును జెప్పఁజాలకుండఁగా నిఁకఁ బండితు లేమని వర్ణింపఁగలరు. శరీరమును వదలి బాలుఁడవైతివి. అని యిట్లు వసుదేవుఁడు వినుతించెను.

ఈ స్తుతి వసుదేవకృతము. దీనిని త్రికాలములందు నెవరు పఠింతురో వారికి భక్తియు భగవద్దాస్యము లభించును.

---

ప్రాగేవ విద్యమానత్వా న్న తేషా మిహాసంభవః. ౪. ఏవం భవా న్బుద్ధ్యనుమేయ లక్షణై ర్గ్రాహ్యై ర్గుణై స్సన్నపి తద్గుణా గ్రహః, అనావృతత్వా ద్బహిరంతరం న తే సర్వస్య సర్వాత్మన ఆత్మవస్తునః. ౫. య ఆత్మనో దృశ్య గుణేషు సన్నితి వ్యవస్యతే స్వ వ్యతిరేకతో బుధః, వినానువాదం చ న తన్మనీషితం సమ్యగ్యత స్త్యక్త ముపాదదత్పుమాన్. ౬. త్వత్తోస్య జన్మస్థితిసంయమా న్విభో వదంత్యనీహా దగుణా దవిక్రియాత్, త్వయీశ్వరే బ్రహ్మణినో విరుధ్యతే త్వదాశ్రయత్వా దుపచర్యతే గుణైః. ౭. సత్వం త్రిలోక స్థితయే స్వమాయయా బిభర్షి శుక్లం ఖలు వర్ణమాత్మనః, సర్గాయ రక్తం రజసోప బృంహితం కృష్ణంచ వర్ణం తమసా జనాత్యయే. ౮. త్వమస్య లోకస్య విభో రిరక్షిషు ర్గృహేఽవతీర్ణోసి మమాఖిలేశ్వర, రాజన్య సంజ్ఞాసురకోటి యూథపై ర్నిర్వ్యూహ్యమానా నిహనిష్యసే చమూః. ౯. అయంత్వ సభ్య స్తవజన్మ మేగృహే శ్రుత్వాగ్రజాం స్తే న్యవధీత్సురేశ్వర, స తేఽవతారం పురుషై స్సమర్పితం శ్రుత్వాధు నైవాభిసరత్యుదాయుధః. ౧౦.

సద్గుణవంతుఁడగు పుత్రుఁడు గల్గు. అతఁడు హరి దాసుఁడగు ఎవఁడీ వినుతిని బఠించునో వాఁడు సకలకష్టములనుండి విముక్తుఁడగు శత్రుభీతి యతనికుండదు.

ఇట్లు వినుతించి మఱియుఁ దనివి చెందక యానందబాష్పములు ప్రవహింపఁగా నిట్లుస్తుతించెను. దేవా! నీవు ప్రకృతికిఁ బరుఁడవైన పురుషుఁడవనియు, నానందస్వరూపుఁడవనియు, సర్వబుద్ధి సాక్షివనియు దెలిసికొంటిని. అట్టి మహామహిముఁడవగు నీవే నిజమాయచే సత్వరజస్తమోమయంబగు నీజగంబును మొదటసృజించియు నందుఁ బ్రవేశింపక యుండియుఁ బ్రవేశించినట్లు తోఁపఁజేయుచుందువు. వేఱువేఱుగా నుండి విశిష్టకార్యముల నొనరింప సమర్థములుగాని యీ మహదాదులు పరస్పరసమ్మిళితములై యజాండమును నిర్మించి యద్దానియం దనుగతంబులై తోఁచెడిని. ఈ మహదాదుల జాండమునకుఁ బూర్వమేయుండుటచేఁ గారణములకు బ్రహ్మాండములోన జన్మించుట సంగతము కానేకాదు. అట్లే రూపాదిజ్ఞానమున లక్షణ మనుమానింపఁ దగినది కాఁగ గ్రాహ్యములైన గుణములంగూడియు వానిచే నీవు గ్రహింపఁబడకయుందువు. సర్వస్వరూపుఁడవు. సర్వాత్ముఁడవు. సర్వవ్యాపకుఁడవు. వస్తుస్వరూపుఁడవు నగు నిన్నేకదేశవర్తియుఁ బరిచ్ఛిన్నము,వ్యాప్యము, అవస్తువు నగుపదార్థసముదయ మావరింప సమర్థముగాదు. అట్లావరింపఁబడని నీకు బాహ్యాభ్యంతరభేదంబు గలుగదు. ఆత్మ

యదృశ్యగుణములయం దాత్మ వ్యతిరేకమున దేహాదు లుం డఁగలవని నిశ్చయించి వాదించువాఁడు పండితుఁడు కాఁడ నుట నిశ్చయము. చక్కఁగా విచారింపఁగా దేహాదులెల్ల వాంఛారంభమాత్రములు కావున నవస్తువు లగుటంజేసి జగంబు బాధితంబగు. దానియెడ వస్తుబుద్ధి గావించువాఁడు విద్వాంసుఁ డనఁ దగినవాఁడా? గణింపఁబడక, యనీహుఁ డై యవికారుఁడు ననఁబడు. నీవలన నీలోకమునకుఁ బుట్టుక, పాలనము, లయములు గలుగుననుటయు నీశ్వరుఁడవు, బ్రహ్మ స్వరూపుఁడవు నగు నీయం దసమన్వితంబుగాదు. భవదాశ్ర యములైన గుణములకుఁగల కర్తృత్వాదిధర్మములు, ప్రభుసే వకదృష్టాంతమున నీయం దుపచరింపఁబడుచుండు. అట్టి యచింత్యమహిముఁడ వగు నీవు స్వమాయావిలాసమున జగ త్సంరక్షణనిమిత్తము స్వసత్త్వోపబృంహితం బగు శుక్లవర్ణ మును, సృష్టికొఱకు రజోభావితమగు రక్తవర్ణమును, లయా ర్థమై తమోమయంబగు కృష్ణవర్ణమును గైకొందువు.

మహాత్మా! ప్రస్తుత మీలోకంబును రక్షింప నాయింట నవతరించి రాజు లను పేరుపెట్టుకొని లోకమును బాధించు రాక్షసవీరులు ప్రోత్సహించు భటుల నశింపఁ జేయుదువు. దుర్మార్గుఁడగు కంసుఁడు సర్వేశ్వరుఁడవగు నీవు నాకుఁ బుత్త్రుఁ డవు గాఁ బుట్టుదువని విని యింతదనుక నీయగ్రజన్ములం

ధ్వంసించెను. ఇప్పుడు నీయవతారమును నిజదుష్టభృత్యులవలన నెఱింగి యాయుధపాణియై వచ్చును. మహాత్మా! నన్నుద్ధరింపుము. దురాత్ములఁ బొరిగొని ధర్మమును గాపాడుము. అని యిట్లు వినుతించి కరములు మోడ్చి యున్న వసుదేవు నవలోకించి శ్రీకృష్ణమూర్తి ప్రసన్నవదనుఁడై భక్తానుగ్రహకాతరుఁడై యిట్లు పలికెను.

## శ్రీకృష్ణుఁడు వసుదేవుని భీతిఁ బాపుట.

వసుదేవా! నీతపఃఫలముగా నే నీకుఁ బుత్రుఁడనైతిని. కావున వరముఁ గోరుము. నీకు సకలశుభములు గల్గఁగలవు. సంశయింపకుము. పూర్వము నీవు తపస్విశ్రేష్ఠుఁడవై ప్రజాపతివిగ నుంటివి. నీభార్య పృశ్ని యనుపేరుగల సాధ్వి. అట్టి నీవు నన్నుఁగూర్చి తపస్సొనరించితివి. దాన నేఁబరమానందభరితాంతఃకరణుఁడ నైతిని. ప్రత్యక్షమై వర మడుగు మంటిని. అత్తఱి నావంటి కుమారుఁ డొకఁడు నీకుం గనఁబడియె. అట్టి పుత్రుం బ్రసాదింపుమా యని వేఁడితివి. నావంటికుమారుఁడు నీకుం గలుగఁ గలఁ డని వరమిచ్చితిని. ఇట్లు నీకు వరమొసఁగి మనమున నిట్లాలోచించితిని. నావంటి కుమారుఁడు లోకమున లేఁడు. ఆకారణమున నేనే బుత్రుఁడనుగాఁ బుట్టవలయు. తపఃప్రభావమున నీవే కశ్యపుఁడవైతివి. నీభార్య దేవమాతయై మహాతపస్విని యగు నదితి యనఁ బరఁగెను. ఇపుడు కశ్య

పాంశమువలన వసుదేవుఁ డన జన్మించితివి. పూర్వభవమున నీవు నాకుఁ దండ్రివి. అదితియే దేవకీదేవి. ఈమె అదితియంశ సంభూతురా లని యెఱుంగఁదగు. తొల్లి అదితికి నీవలన జన్మించి నాయంశమే వామనుఁ డన విఖ్యాతి నొందెను. ఇపుడు గోలోకమునుండి సంపూర్ణరూపముతో నీతపఃఫలముగా నీకుఁ బుత్రుఁడ నైతిని. నీవు నన్నుఁ బుత్రభావమునఁ గాని బ్రహ్మభావమునఁ గాని తలంపుము. ఓమహాప్రాజ్ఞా! వసుదేవా! జీవన్ముక్తుఁడ వగుదువు. నన్నుఁ జేరఁగలవు.

మఱియొక హితముపదేశించెద. నన్ను వేవేగ యశోదాభవనమును జేర్పుము. ఆభవనము వ్రజమున నున్నయది గాన నా కది వాసయోగ్య మగును. తండ్రీ నన్నందునునిచి యందున్న మాయాపుత్రికను గైకొని రమ్ము. అని యాదేశించెను.

అంత దేవకీదేవియు స్మృతిగల్గిన కారణమునఁ దనయెదుట దివ్యమంగళవిగ్రహమున నలరు జలజాక్షుని శ్రీకృష్ణపరమాత్మను జూచి గద్గదకంఠమునఁ జేతులు ముకుళించి యిట్లు వినుతించెను.

ఏపరమేశ్వరుఁడు *అనంతరూపుఁడయ్యు, సకలప్రపంచరూపుఁడయ్యు నాగర్భమునుండి యల్పదేహము చేతనే సక

---

దేవకీకృత శ్రీకృష్ణస్తుతిః.

శ్లో. యో ఽనంతరూపో ఖిలవిశ్వరూపో గర్భేపి లోకాన్ వపుషా బిభర్తి, ప్రసీదతామేష సదేవ దేవో యోమాయయా విష్కృతబాలరూపః. ౪.

లలోకముల భరించెనో ఆదేవదేవుఁడు మాయచేఁ గైకొనిన బాలరూపుఁడు సర్వేశ్వరుఁడు నన్ననుగ్రహించుఁ గాక. ఓ మహానుభావా! సర్వాత్మకా! ఈచతుర్భుజవిరాజమానరూపము నుపసంహరింపుము. నీయీ యవతారమును గంసుఁ డెఱుంగ కుండుఁగాక. విమలుఁ డను రాక్షసుఁ డుగ్రసేనరూపమున జన్మించినవాఁడు. పెండ్లియాడకయే యొకతుకను భార్యగా భావించి దానియం దీకంసుని బుట్టించెను. కావుననే వీఁడు విమలాత్మజుఁ డనఁ బడుచున్నవాఁడు. ఇట్టి మహాపాపాత్ముఁడు భగవంతుఁడవు నీవని తెలియకుండుఁగాక.

ఓభగవంతా! ఏనీరూపము నవ్యక్తముగను, నాద్యముగ ను,బ్రహ్మముగను, జ్యోతీరూపముగను, నిర్గుణముగను, నిర్వికార ముగను, సత్తామాత్రముగను, నిరతిశయముగను, నిరీహము గను, వినుతింతురో ఆ నీవు ప్రత్యక్షవిష్ణుమూర్తివి. అధ్యాత్మ

---

ఉపసంహార సర్వాత్మన్ రూపమేత ‌చ్చతుర్భుజఁ, జానాతు మావతా రంతే కంసోఽయం విమలాత్మజః. ౨ విష్ణుపురాణము. 'విమలాఖ్యేన దైత్యేన ఉగ్రసేన వేషధారిణా తద్భార్యాయాం చౌర్యేణోత్పాదితః కంస ఇతి హరివంశోక్తిః.' అని వ్యాఖ్య.

శ్రీభాగవతాంతర్గత స్తుతిః.

రూపం యత్త త్ప్రాహు రవ్యక్త మాద్యం బ్రహ్మజ్యోతి ర్నిర్గుణం నిర్వికారం, సత్తామాత్రం నిర్విశేషం నిరీహం సత్వం సాక్షా ద్విష్ణు రధ్యాత్మదీపః. ౧. నష్టేలోకే ద్విపరార్థావసానే మహాభూతే ష్వాది భూతంగతేషు, వ్యక్తేఽవ్యక్తం కాలవేగేన యాతే భవానే కశ్శిష్య తే శేష సంజ్ఞః. ౨.

దీపమవు. బ్రహ్మాయాయుస్సున రెండు పరార్థములు గతింపఁగా దానియంతమందు సకలమహాభూతము లాది భూతమున లీనములు కాఁగా శేషాహ్వయమున మిగులువాఁడవు నీవొక్కఁడవే. సకలప్రాణిబంధూ! ఆయానామముల వ్యవహరింపఁబడు కాలములు నీస్వరూపములే. ఏ నీవు కదలిన లోకముల ప్రవృత్తి సాగును. ఆకాలము నిమేషము మొదలు వత్సరాంతముగఁ బరిగణింపఁబడు. అట్టి సకల శుభనిధానమగు నిన్ను శరణువేఁడెదను. మర్త్యుఁడు మృత్యువను త్రాఁచు పామునకు భీతిల్లి పరుగిడి సర్వలోకములఁ జొచ్చునుగాని యాతనిభీతిమాత్రము నశింపదు. భక్తుఁడగుమానవుఁడు నిర్భయుఁడై త్వత్పాదాంబురుహముల నాశ్రయించి స్వస్థుఁడై నిదురించును. మృత్యువా

---

యోఽయ కాలస్తస్య తే వ్యక్తబంధో చేష్టామాహు శ్చేష్టతే యేన విశ్వమ్, నిమేషాది ర్వత్సరాంతో మహీయాం స్తం త్వేశానం క్షేమధామ ప్రపద్యే. ౩. మర్త్యో మృత్యు వ్యాళభీతః పలాయన్ సర్వాన్ లోకాన్నిర్భయం నాధ్యగచ్ఛత్, త్వత్పాదాబ్జం ప్రాప్య యదృచ్ఛయాద్య స్వస్థశ్శేతే మృత్యు రస్మాదపైతి. ౪. సత్వంఘోరా దుగ్రసేనాత్మజాన్నస్త్రాహి త్రస్తాన్ భృత్య విత్రాసహాసి, రూపం చేదం పౌరుషం ధ్యాన ధిష్ణ్యం మా ప్రత్యక్షం మాం సదృశాం కృషిష్ఠాః. ౫. జన్మతే మయ్యసౌ పాపో మావిద్యాన్మధుసూదన, సముద్విజే భవద్ధేతోః కంసా దహ మధీరధీః. ౬. ఉపసంహర విశ్వాత్మన్నదోరూపమలౌకికం, శంఖచక్రగదాపద్మశ్రియా జుష్టం చతుర్భుజం. ౭. విశ్వం యదే తత్స్వతనౌ నిశాంతే యథావకాశం పురుషః పరో భవాన్,బిభర్తి సోఽయం మమగర్భజోఽభూ దహోన్నృలోకస్య విడంబనం మహత్. ౮.

భక్తునకు వెఱచి పాఱును. అట్టి యచింత్యమహిమగల నీవు భయంకరోగ్రసేనతనూజుని వలని భయమునుండి మమ్ముద్ధరింపుము. నీవు భృత్యజనకష్టసుఖముల నెఱిఁగినవాఁడవు. భక్తుల భయములఁ బరిహరించువాఁడవు. ఈరూపము ధ్యానస్థానమైనది. మాంసచక్షుస్సులకుఁ బ్రత్యక్షముగ నుండునట్లు చేయకుము. ఓమధుసూదనా! పాపాత్ముఁడగునీకంసుఁడు నాగర్భమున నీవు పుట్టుకం గాంచుట యెఱుంగకుండుంగాక. చంచలచిత్తురాలను గాన నీవు నాకుఁగొడుకవై తివిగదా కంసుఁడేమిచేయునో యని భీతిల్లుచున్నదాన. కాఁబట్టి యలౌకికమగు నీదివ్యరూపము నుపసంహరింపుము. శంఖచక్రగదాపద్మముల విరాజిల్లు నీచతుర్భుజములు కనఁబడక యుండుఁగాక. పరమేశ్వరా! ఈ ప్రపంచమంతయు బ్రహ్మనిశాంతమున యథావకాశముగ నీతనువున నిముడును. నీవు పరమపురుషుఁడవు. అట్టి నీవు నాగర్భముననుంటివి. ఏమి యాశ్చర్యము! ఇది నీవిలాసముగాక మఱే మనఁదగును?

అని యిట్లు దేవకీదేవి వినుతింపఁగా శ్రీహరి వసుదేవునకుం జెప్పి నట్లే పూర్వజన్మవృత్తాంతము నెఱింగించి యామె ప్రార్థనము చెల్లింపఁబూని నట్లే బాలరూపమును ధరించెను. శ్రీకృష్ణుఁడు నిజరూప ముపసంహరించి బాలరూపమును ధరింపఁగనే దేవకీదేవికి స్మృతినశించెను. నిద్ర నొందిన ట్లుండెను.

ఏకాలమున దేవకీదేవి యెనిమిదవగర్భమును ధరించెనో యాకాలముననే నందవ్రజమున యశోదయు గర్భమును

దాల్చెను. శ్రీకృష్ణజనన సమయముననే యాయశోదాదేవికిని గొమరిత ముద్దులుమూట గట్టున్న రూపమున జనించెను. కాని మాయామోహితురాలై యశోద నిదురించెను. సూతికాగేహమున నున్నవారెల్ల నొకలు తెలియక పవ్వళించిరి. ఒక్కరికైనను స్మృతి యన నెట్టిదో తెలియరాకుండెను.

ఇట్లిచ్చటి స్థితియుండఁగా నిట బాలరూపుఁడై శ్యామలాంగమున నలరారుచు దివ్యమంగళరూపమునఁ గ్రాలుచున్న బాలునిం జూచి వసుదేవుఁడు హర్షనిర్భరహృదయుఁడై యంతలో విష్ణుమాయావిమోహితుఁడై ఏమి యీసూతికాగృహ మిట్లపూర్వముగ నున్నదే యనుకొనుచు నేమియుఁ దోఁచక యుండి భగవంతు నాదేశానుసారము చేయు నూహ యపుడు మనస్సున నంకురింప నాబాలు నెత్తుకొనిపోయి యశోదాదేవి కడ నునిచి యందున్న కన్యకను గొని రానెంచెను.

* ఇట్లు చేయు నూహ మనమునఁ దట్టగా నావసుదేవుఁడు కారాగారమునుండి యెట్లు పోఁగల నను సంశయము నొందక భగవత్ప్రేరితుఁడు గాన నాబాలకుఁ బొదిగిట నిడుకొని యర్థరాత్రసమయమునఁ బయన మయ్యెను. అత్తఱి ధారాధరములు వారిధారలచే భూమిని ముంచుచుండెను. ఘనతరగర్జారవములు ప్రళయమును గల్గించునట్లు భీతిని గొలుపు

* ఈభాగము బ్రహ్మపురాణము 23 అధ్యాయము, ౧౯ శ్లోకము పిదప నున్నట్లు వ్రాయఁబడిన దని గ్రహింపఁ దగు.

చుండెను. ఏఱులు కాల్వలు నేకమై ప్రవహించుచుండెను. యమునానది యిరుతటముల నాచ్ఛాదించి ప్రవహించుచుండెను. రంగత్తుంగతరంగములు దాని మహిమమును దెల్పుచున్నవో యన నోరుమని ధ్వనిచేయుచుండెను. ఎట్టివారేని ఆనదిని దేటి పాఱిచూడఁ జాలకుండిరి. ఇట్లు భగవదాజ్ఞచే నాసమయమున నేజంతువుగాని యున్నతావునుండి కాలుకదల్పవీలులే నట్లుండెను. ఇవన్నియు వసుదేవుని రహస్యప్రయత్నమునకు సహాకారము లని భగవంతుని యాశయము.

అట్టి కట్టడికాలమున నావసుదేవుఁ డేయనుమానము నొందక యాసుందిరమందిరుని బాలకుని సూక్ష్మరూపమును దాల్చి ప్రాకృత బాలకుని చందమున నున్న పరమేశ్వరుని పొదిగిట నిడుకొని కడువడి వెడల నుంకింపఁగా నాతనికిం దెలియకుండఁగనే కాలిసంకెళులు తొలఁగినవి. ద్వారమున నతిజాగరూకులై కావలియున్న వీరభటులు దీర్ఘనిద్రం బొందిన చందమున నేలాటి తెలివియు లేక నిదురించుచుండిరి. కంసుఁడు కావలియుంచిన దాసీజనము దేవకీదేవి ప్రసవించెనో లేదో యెఱుంగక పడిపోయినది. ఈచిత్రమేమి యని యాలోచించువా రొకర్రైనను లేరు. వసుదేవుఁ డిట్లు బయలువెడలఁగా ద్వారములు తమంతన తామే మార్గము నొసంగునట్లు తెఱవఁబడిన ట్లుండినవి. ఆచిత్రమేమి యని వసుదేవుఁ డాలోచింప వీలులేకుండ భగవన్మాయ యాతని నాచ్ఛాదించియుండెను.

సర్వవ్యాపిని యగు యోగమాయ మధురానగరము నం దంతటను జీవకోటి నాచ్ఛాదించియుండెను. అట్లుండ ద్వారపాలకు లప్పట్టున నేమిచేయఁగలరు? వసుదేవుఁడు శ్రీకృష్ణమూర్తిని బొదిగిట నిడుకొని వడివడిఁ జనుచుండ నే ద్వారపాలకుఁడు గాని కన్నుదెఱచి చూచిన పాపమునఁ బోలేదు. గాఢ నిద్రలో నుండిరి. కారాగారపాలకులగతి యిట్లుండఁగా వసుదేవుఁడు నగరము దాఁటిపోవుచుండుతఱి నగరరక్షకులు కరముల ఖడ్గములఁ దాల్చి యేమఱుపాటులేక గోపురమున నుండువారు ద్వారముల నానుకొని నిలుచున్నవా రట్లే నిద్రాపరవశులై యుండిరి. ఆమహాద్వారములు కూడఁ దమంతన తొలఁగెను. భగవదాజ్ఞకుఁ జరాచరభూతము లన్నియు లోఁబడవలసినవియే కదా. ప్రాణరహిత పదార్థములుగూడ శ్రీకృష్ణు నాజ్ఞను శిరసావహించియుండెను.

ఇట్లు లానకదుందుభి బాలునెత్తుకొని పోవుచుండఁగా నవమేఘములు కడవలతోఁ గ్రుమ్మరించినట్లు వర్షించుచుండ జల ముప్పొంగి యొకచినుకునకుఁ బదిచినుకులుగాఁ దోఁపఁ జేయుచుఁ బ్రవహించుచుండఁ దజ్జలములచే యమునానది మఱింతగ నుప్పొంగి ప్రవహింపసాగెను. రంగత్తరంగములువియద్ధునీసముత్తుంగతరంగములతో నాడుకొనుచున్న యట్లు లుండెను. చేఁపలు మిట్టిపడుటం జూడ నిందుండి మందాకినీపాఠీనములతో దురమొనరించు వేడుక గలవిగ నున్నట్లు తోఁచును.

ఆనదీవతంసము దాఁట నేరికే నశక్యమై భయంకరధ్వనితో నిరుగట్టులను మీఁఱి పాఱుచుండెను. వసుదేవున కీనది ప్రవహించుటగాని వర్షము కుంభవృష్టి యనునట్లు పైఁబడుటఁగాని తెలియదు. ఛత్ర మున్నదియా లేదు. దీపము సాయముగ లేదు. గాఢాంధకారము. రెండుజాములరాత్రి. ఎట్లు పోవుదునా యను నూహ యతనికిఁ దోఁచనేలేదు.

ఈరీతి నామహావృష్టిసమయమున శ్రీహరిని దోసిటను నుంచుకొని పోవుచుండఁగా నొక్కచినుకైన నాతని మేనుసోఁక లేక తూలిపడుచుండెను. చలిగాలి యాతని సోఁకఁజాలక యుండెను. * ఆదిశేషువు భగవదాజ్ఞచే నావసుదేవునిఁ దన సహస్రఫణముల నాచ్ఛాదించి వెంటఁబోవుచుండెను. అట్టి సాయము గలుగఁగా నాతనికిం గొఱఁతయేముండును? యమునానది గంభీరముగ ననేకావర్తభయంకరముగఁ బ్రవహించుచుండియు శ్రీహరిదర్శనమాత్రమున నావసుదేవునకు మోకాలిబంటియై కనుపట్టెను. భూమి యుబికెను. జలము తగ్గెను. ఆనది నవలీలఁగా దాఁటఁ బూని వసుదేవుఁడు దేహము తెలియక వేవేగ పోయి నదిని దాఁటెను.

ఆదినమందే నందాదియాదవబృందములు కంసునకుఁ జెల్లింపవలసిన ద్రవ్యమును దీసికొని మధురానగరమునకు

---

* 'సంఛాద్యతం యయౌ శేషః ఫణైరానకదుందుభిమ్.' అని మూ.

వచ్చుచు వర్షబాధవలన నాయమునాతటమున నుండిరి. * వారినెల్ల వసుదేవుఁడు చూచెను కాని వారు ఈయనను జూడకుండిరి. వారితో వసుదేవుఁడు మాటలాడఁబూనలేదు. వడివడిం బోయెను. అత్తటి యశోదాదేవి యోగమాయామహిమమున నొడలు తెలియక నిద్రించుచుండెను. సూతికాగృహమున నున్న యాఁడువారి కందఱికిని పుట్టినపిల్ల కన్యకయా? పురుషుఁడా? యని తెలియలేదు. మత్తుగొని యుండిరి. వసుదేవుఁడచటికిం బోవునప్పటికి గుఱువెట్టి నిద్రించుచుండిరి. ఆమంచముపై బాలునిం బరుండఁబెట్టి యాకన్యకను బొదిగిట నిడుకొనియె. క్షణమైనను నిలువక వెనుకకు మరలెను.

వసుదేవుఁడు వెడలఁగనే యశోదకు నిద్రమబ్బు తొలఁగెను. తనకుం గొడుకుపుట్టినట్లే భావించెను. నీలోత్పలదళశ్యా

* ఈవిషయమున శ్రీకృష్ణజన్మఖండము విసంవాదిగనున్నది. నందుఁడు తనగృహమున నిద్రించుచున్నట్లు కనఁబడియెడు. 'నిద్రాన్వితంచ నందంచ సర్వం తత్ర గృహేస్థితమ్.' అని మూ. విష్ణుపురాణమున బ్రహ్మపురాణశ్లోకములే కనుపట్టెడు. విష్ణుపురాణమునందే 'ఆద్యం సర్వపురాణానాం పురాణం బ్రహ్మ ఉచ్యతే' అని కనఁబడియెడు. కాన బ్రహ్మపురాణమునకు విష్ణుపురాణము పుత్రికవలెఁ గనుపట్టెడు. శ్రీభాగవతమునందు—'నందవ్రజం శౌరిరుపేత్య తత్ర తాన్ గోపాన్ ప్రసుప్తా నుపలభ్య నిద్రయా, శిశుం యశోదా శయనే నిధాయ తత్సుతా ముపాదాయ పునర్గృహానగాత్.' అని యున్నది. శ్రీకృష్ణజన్మఖండము భాగవత మొక్కరీతిగా నున్నవి. ఈమాత్రము భేదమునఁ గథకుఁ బాధలేదు. ప్రధానవిషయమే గమనింపఁదగినది.

ముఁడై ముద్దులుమూటగట్టుచున్నట్లుండిన యాబాలుకుంగాంచి పరమానందాంబుధి మునింగెను. అందఱు నిద్రనుండి లేచిరి. బాలకుం గాంచిరి. పూర్వపుణ్యఫలమని తలంచిరి. యశోద యదృష్టవంతురాలని పొగడిరి. పరమానందమున నుల్లసిల్లిరి.

వసుదేవుం డంత నాబాలామణిం గొని నిమేషమాత్రమునవచ్చి మధురానగరమున నిర్బంధగృహమును జొచ్చెను. దేవకీఖట్వమున నుంచెను. వసుదేవుఁ డిల్లు చొరఁగనే ద్వారములు యథారీతి ముద్రితములయియే యుండెను. ద్వారపాలకులు హెచ్చరికలుగలిగి తమరు నిద్రించనట్లే తలంచుచుండిరి. * అంతట దేవకీదేవకికి మరలస్మృతివచ్చెను. భగవన్మాయచేఁదనకుఁ గలిగినది కుమారితయే యని యప్పుడామెతలంచెను. ఆబాలామణి కావుకావుమని యేడువసాగెను. ప్రక్కలోఁబరుండి యేడ్చు నాబాలికంగాంచి యాసాధ్వి మిగుల సంతోషించెను.

ఆబాలిక యేడువఁగనే ద్వారపాలకు లాలకించిరి. కొందఱాధ్వనికే మేల్కాంచిరి. ఆరోదన ధ్వనియే వారిని ప్రబోధించెను. ♦ వారు వడివడి లేచి చూచి దేవకి ప్రసవిం

* ఇటనుండి శ్రీకృష్ణజన్మఖండమునుండి వ్రాయఁబడినట్లు గుఱుతింపఁ దగు.

♦ కంసునింట కేబాలికం గొనిపోయి ద్వారపాలకు లప్పించినట్లు లీపురాణమునఁగలదు. భాగవతమున, బ్రహ్మపురాణమున, విష్ణుపురాణమునందును గంసున కావార్తను దెలిపి నట్లున్నది. కాన నీమార్గమునే యనుసరించితిని.

చెఁ గదా యని త్వరపడి కంసునంతఃపురంబునకుం బోఁటి మహా రాజా! భోజేంద్రా! దేవకీదేవి ప్రసవించె నని తెల్పిరి. కంసుఁ డామాట చెవిసోఁకఁగనే యులికిపడి లేచి వెండ్రుకలువీడఁ బై వల్లెనుగూడ మఱచి ఖడ్గపాణియై కారాగారమున నున్న సూతి కాగృహమున కేతెంచి యాబాలికం జూచి యంతగా సంతు ష్టుఁడు గాకపోయెను. ఆబాలికయు నత్తఱి బిట్టురోదనము చే యసాగెను. ఆపసికందువును గాంచి కంసుఁ డించుకంతయు ద యచూపఁజాలక తెంపగితనమునఁ జంపఁ బూనెను. ఆబాలికను నిర్దయుఁడై చేత నెత్తిపట్టుకొని కఠినపాషాణముపై వైవ యత్నించెను.

ఆసమయమునఁ గడుపుశోకము నాపఁజాలక దేవకీదేవి కన్నుల నీరు ప్రవహింపఁ జూచుచున్న ప్రాణనాథు నాశయమె ఱింగి ముందుకుం జని కంసునితోఁ దడఁబడుమాటలతో నిట్లు వేఁడెను. ఈఘట్టమున శ్రీభాగవతశ్లోకముల నుదాహరించి మహాకవి పోతనపద్యముల వ్రాసి పాఠకుల నలరింపఁ బ్రయ త్నించెదను.

శ్లో. తమాహ భ్రాతరం దేవీ కృపణా కరుణంసతీ,
స్నుషేయం తవ కల్యాణ స్త్రియం మాహం తు మర్హసి.
బహవో హింసతా హ్యాంగ శిశవః పావకోపమాః,
త్వయా దేవ నిసృష్టేన పుత్రికైకా ప్రదీయతామ్.

నన్వహం తేఽహ్యవరజా దీనా హిత సుతా ప్రభో,
దాతు మర్హసి మందాయా మ మే మాం చరమప్రజామ్.

శ్రీ భాగ. ౧౦ స్కం. ౪ అధ్యా.

వ. అంత దేవకీదేవి యడ్డంబువచ్చి యిట్లనియె.

ఉ. అన్న శమింపుమన్న తగ దల్లుఁడు కాఁ డిది మేనగోడలా
మన్నన సేయుమన్న విను మానినిఁ జంపుట రాచపాడిగా
దన్న సుకీర్తివై మనఁ గదన్న మహాత్ములుపోవు త్రోవఁ బో
వన్న భవత్సహోదరిఁ గదన్న నినుఁ శరణంబు వేఁడెదన్.

క. కట్టా యార్గురుకొడుకులఁ
బట్టి వధించితివి యాఁడుఁపడు చిది కోడల్
నెట్టన చంపఁగ వలెనే
కట్టఁడివి గదన్న యన్న కరుణింపఁగదే.

క. పుత్త్రుఁడు నీ బ్రదుకునకును
శత్త్రుం డని వింటె గాన సమయింపఁ దగున్
బుత్త్రులకు నోఁచ నైతిని
బుత్త్రీ దానంబు చేసి పుణ్యముఁ గనవే.

ఈఘట్టమున మూలశ్లోకములం బఠించితిరి. శ్రీపోతనగారి పద్యములం జదివితిరి. మూలమునకుఁ దెనుఁగు సంబంధము లేదని హఠత్తుగాఁ దోఁచును గాని సావధానముగ్గాఁ బరిశీలించిన నందొక్కొక్కమాటయందుఁ గల స్వారస్య మీపద్యములు

వెదఁజల్లుచున్నట్లు గనుపట్టు. "కరుణాకరుణంసతీ" అన్నమూలమును బద్యములు సార్థకము చేయుచున్నవి. ఎట్టికట్టడిమానిసికైన నీపద్యములఁ జదువునపుడు కన్నీరు మున్నీరుగాఁ బ్రవహింపకపోదన నా నమ్మకము. శ్రీరామచంద్రకరుణాపాత్రులది గదా యీకవిత్వము. కాననే సరసజనహృదయంగమముగ నున్నది. అయితే యించుక మూలము నతిక్రమించె నని చెప్పక తప్పదు గాని మూలముతోఁ బోల్చక యీపద్యములం జదువునపుడు వ్యాసతాత్పర్య మిట్లుండునే యని తోఁపకమానదు. లోకజ్ఞానము మహాకవి పోతనగారికిఁ గలిగినట్లు సామాన్యదృష్టి నాలోచింప నితరులకు లేదని చెప్పుట యంతగా సాహసము కా దని నేనెంతును. ఇంకఁ బ్రస్తుతకార్యమునకుం గడంగెద.

అన్నా! భోజకులోద్ధారకా! కల్యాణగుణసాంద్రా! కంసా! నీతిశాస్త్రవిశారదుఁడవు. నా యీమాట నించుక యాలకింపుము. నీతి యుక్తము గాదేని త్రోసిపుచ్చుము. నీ కహింతమైనను విడువవచ్చును. నాయాఱుగురు కొడుకులం జంపితివి. అంతతో నీకుఁ దృప్తి కలుగదయ్యెను. ఏడవగర్భము చెడిపోయెను. ఇదెనిమిదవ గర్భము. ఆకాశవాక్కు ఎనిమిదవ కుమారుఁడు నిన్ను వధించు నని వినఁబడియెఁ గదా. ఇదే యెనిమిదవతడవ నాకుం గల్గిన సంతానము. ఇది యాఁడు బిడ్డ. మిన్నులమోఁతలు నిజము లని నమ్మకుమా యని యానాఁడే

చాటి చెప్పితి. వినక నాపుత్రులం జంపితివి. ఇపు డేమైనది. కొడుకు పుట్టెనా. ఆకాశవాణి యసత్యమాయెఁ గదా. ఈపుట్టినది యాఁడుది. నీ కంతకురాలు గాదు సుమీ. ఇంక నీయాయువు పొడవునొందుఁగాక. దిగులు తొలఁగెఁగదా. అట్టులయ్యు నీబాలికల జంపఁబూనెదవే. ఏల? రాజనీతి యిదియేనా? ఇది యబల. నాకుం గడచూలు. దీనిం జంపిన నీకప్టైశ్వర్యములు లభించునా? ఆఁడుబిడ్డను జంపఁబూనుట రణశూరులగు మీవంటి రాజకుమారులకు న్యాయముగాదు సుమీ. నాయీ వేఁడికోలు నంగీకరించి యీకసుగందును నాకిచ్చి పుణ్యము గట్టుకొమ్ము. తోఁబుట్టువుల నేడ్పింపరాదు. దాన శుభములు గలుగఁజాలవు. శాస్త్రముల నెఱుంగుదువు. పెద్దల సహవాసము నీకుం గలదు. వాని ఫలమేమియో నాకుం దెలియకున్నయది. అన్నా! నన్ను మన్నింపుము. పుట్టినబిడ్డలం దెచ్చి నీకర్పించి నాకంటె నెక్కుడుగ నీమేలు గోరు బావం జూడుము. మాటలాడఁజాలక కన్నీరు విడుచుచున్నవాఁడు. ప్రియసోదరా! పుట్టిన బిడ్డల నెల్ల నీపొట్టనఁబెట్టి వట్టిచేతులతో నుండు మాకీ పుత్రికను లాలించు భాగ్యముం బ్రసాదింపుము. న్యాయశాస్త్రము నాలోచింపుము, పెద్దలమాటలం బరిశీలింపుము. ఆకాశవాక్కు లసత్యము లని నిర్ణయింపుము. నాకూఁతు నాకిమ్ము. నీమేలుఁగోరిన దాననే యని నన్ను నమ్ముము. ఇంకను దుఃఖముల పాలుచేసిన మేలు చేకూరదని సిద్ధాంతము చేసికొనుము.

అన్నా! నాకీ బాలిక నిమ్మా! కడుపు శోకము భరింపరానిది. చాలకాలము వగలఁ బొగిలితిని. ఇంకను దుఃఖింపఁజేయకుమా యని దీనయై వేఁడెను.

వసుదేవుఁడును జేయునది యేమని తోఁచక నాలుగు నీతివాక్యములను బల్కి యూరకుండెను. దేవకి వచించిన మాటలన్నియు హృదయశల్యములు కాఁగాఁ గంసుఁడు దుర్మతిగాన నిట్లు బదులు చెప్పెను. సోదరీ! నా మాటలఁ జక్కఁగా నాలింపుము. వినిన వానియర్థ మిది యని గ్రహింపుము. విధాతతృణముచేఁ బర్వతమును భేదింపఁగలఁడు. కీటముచే శార్దూలమును, మశకముచే గజమును, శిశువుచే మహావీరుని, క్షుద్రజంతువులచే మహాజంతువులను, మూషకముచే మార్జారమును, మండూకముచే ఘోరఫణిని జంపింపఁగలఁడు. జన్యపదార్థముచే జనకపదార్థమును, భక్ష్యముచే భక్షకమును, వహ్నిచే జలమును, శుష్కతృణముచే వహ్నిని బొడవడఁగఁ జేయింపఁగలఁడు. ఒక్క బ్రాహ్మణునిచే సముద్రసప్తకజలమును ద్రావించెను. కాన ధాతగత విచిత్రము. త్రిలోకములయం దెవ్వనిచేత ను గ్రహింపఁ దగినదికాదు. దైవగతిచే నీబాలిక నన్నుఁ జంప సమర్థురా లగును. కావున నీబాలికను వధించెద. సందియము లేదు.

అని పలికి 'వలదన్నా! యాఁడుబిడ్డను జంప న్యాయముగా' దని పలుకుచు నడ్డమువచ్చు సోదరి నదలించి క్రూరమానసుఁ

షుఁడుఁ దుర్వినీతుఁడు నగు నాకంసుఁడు తనచేతినుండి లాగు కొని పొదిగిట నిడుకొని మోమునందమును జూచి వెక్కి వెక్కి యేడ్చు దేవకి నాదరింపక యిది యాఁడుది నాకంతమును జేయునది గాదని యాలోచింపక, నలుగురు పెద్దలు విన్న నేమందురో యని జంకక, ఈదేహము జలబుద్బుదప్రాయము దీనికై యిట్టి ఘోరకృత్యములు చేయనేల యని యూహిం పక యీదేహమే స్థిరమని నమ్మి యిప్పటిప్రభుత్వమే శాశ్వత మని నిశ్చయించి సోదరీకరద్వయమున ముద్దులు మూటగట్టు నట్లున్న యాకసుగందును లాగికొని చంప నుద్దేశించెను.

కంసుఁడు బాలికనుం జంపఁబూనఁగా నాబాలిక మెగిరిపోయి నీతిచెప్పుట.

ఇట్లు వధింపఁ బూను కంసునిం గాంచి మఱియు నాలు గు మంచిమాటలు చెప్పఁబూని వసుదేవుం డిట్లు లనియె. భోజరాజా! వ్యర్థముగ నీబాలిక నేల హింసించెదవు? కరుణా నిధీ! ఈబాలికను నాకు నిమ్ము. అను నంతలోఁ గంసుఁడు తుష్టినొంది చంపమాను టకూహించెను. ఇట్టిసమయమున నో కంసా! యని సంబోధించుచు నాకాశవాక్కొకటి యొకఁడు వీతెంచెను. * ఈబాలికను వధింపుము. హరిగతిని దెలియక

* 'హేకంస హంసికాంమూఢ నవిజ్ఞాయ హరే ర్గతిమ్, కుత్ర చిత్త వ న్నిహంతాస్తి కాలే వ్యక్తో భవిష్యతి' అని మూ. ఈవిషయము శ్రీభాగవ తాదులయందుఁ గానరాదు.

యూరకున్నావేల ? ఒక్కచోట నిన్నుఁ జంపువాఁడు కలఁడు. ముందావిషయము వ్యక్తము కాఁగలదు. అను నీమాటలు వినఁబడఁగానే కంసుఁ డాబాలికను వదలెను. వేఱొకచోటఁ దన్నుఁ జంపువాఁడు గలఁ డని వినుటచే నీపుత్త్రిక తనకు నంత కుఱాలు గాదని నమ్మికొని పొమ్మని దేవకీదేవి కిచ్చెను. దేవకీ వసుదేవులు ఆబాలికను గ్రహించి ప్రమదమునఁ బొందలుచు మృత్యువక్త్రమునుండి మరల వచ్చినట్లు భావించుచుఁ దమ యింటికిం బోయిరి. ఇట్టి యదృష్టము గలిగినందులకై వసుదేవుఁడు బ్రాహ్మణోత్తములకపారధనముల నొసంగెను. ఆ బాలిక శ్రీకృష్ణపరమాత్మకుఁ బ్రియసోదరి. పార్వత్యంశసము ద్భూతురాలు. వసుదేవుఁ డాకన్యకను బెంచి ద్వారకాపురమున దుర్వాసునను ముని కొసంగెను. ఆముని శంకరాంశ సంభవుఁడు.

పాఠకులారా! ఈకథ శ్రీకృష్ణజన్మఖండమున నున్న యట్లు వ్రాయఁబడినది. ఇది క్రొత్తగాఁ దోఁచవచ్చును. అసంగతము మాత్రముకాదు. శ్రీకృష్ణమూర్తి వేఱొకతావునఁ గంసుం జంపనున్నవాఁ డనుట యాకాశవాక్కు ద్వారా కంసుఁ డెఱింగెను గదా. ఇదియే కథకు ముఖ్యాంశము. కానఁ బురాణభేదము నంతగా పాటింప నవసరములేదు. జగద్విస్తృతిం గాంచిన కథ గాన నందఱకుఁ దెలిసియున్నట్లే వ్రాసెదను.

* కంసుఁ డిట్లు సోదరియుఁ దత్పతియు నెంత వేఁడుకొనుచున్నను లెక్క సేయక యాబాలిక నొడిసిపట్టుకొని సోదరివంతందలంపక వధ్యశిలపై వైవ నెగవేసెను. ఖడ్గపాణియై నిలిచి ఖడ్గధారపై నాబాలిక పడి రెండు తునుకలగు నని భావించి నిక్కచూచుచుండెను. ఎగురవేసినంతనే యాబాలిక క్రింద బడక దివ్యరూపమును ధరించి యంబరమున నిల్చి యెనిమిది బాహువుల దివ్యాస్త్రములు వెలుంగఁ దన్నుఁ దేటి చూడ నలవిగాని గతినొప్పి యట్టహాసమొనరించి రోషతామ్రాక్షు లమరి నెల్లరకు వినఁబడునట్లుగ నిట్లు పలికెను.

మూ॥ కిం మయాఽక్షిప్తయా కంసజాతో యస్త్వాం హనిష్యతి,
సర్వస్వ భూతో దేవానా మాసీ న్మృత్యుః పురాసతే.
తదే తత్సంప్రధార్యాశు క్రియతాం హిత మాత్మనః.
బ్రహ్మ. 83 అ. 30 శ్లో.

మూ॥ కిం మయా హతయామంద జాతః ఖలుతవాంతకృత్,
యత్ర క్వచి త్పూర్వ శత్రు ర్మాహింసీః కృపణాం వృథా.
శ్రీభాగవతే. ౪ అ. ౧౨ శ్లో.

ఉ. తెంపరివై పొరింబొరిని దేవకిబిడ్డలఁ జిన్నికుఱ్ఱలం
జంపితి వంతనైన నుపశాంతివహింపక బాలమీఁద నొ

* బ్రహ్మపురాణము 83 అధ్యాయము, ౨౯ శ్లోకము మొదలుకొని యున్నవిషయము ననుసరించి భాగవతవిషయమును గలుపుచు నీభాగము వ్రాయఁబడినదని యెఱుంగవలయు.

ప్పింపఁగ నిస్సిరో యిదియు బీరమె నా సరసన్ జనించినన్
జంపెడి పేరుఁ డొక్కఁడెస సత్కృతినొందెను వాఁడు దుర్మతీ.

బమ్మెర పోతనసుకవి.

పాపాత్మా! కంసా! నన్నుఁ జంపఁ బూనితివి. ఏమిలాభము నందువాఁడవో నిన్నుఁ జంప నవతరించిన మహాపురుషుఁ డొక తావుననున్నవాఁడు. అతఁడే దేవతాసర్వస్వభూతుఁడు. పూర్వము నీకతఁడే మృత్యువు. ఇపుడు నిన్ను వధింప నవతరించినవాఁడు. నా యీమాటను మనమునఁ బదిలముగ నిలిపి నీకుహితమేదియో దానిం జూచుకొమ్ము. అని పలికి యా యోగమాయ సకలదేవ వినుతులం గాంచుచు మహర్షు లొనరించు పూజలం గైకొనుచు బహునామములం గాంచి పెక్కుస్థలముల నర్చలం బొందుటకై యదృశ్య యయ్యెను. కంసుఁడా దేవిం జూచుచు నిదేమి యాశ్చర్యమా యని వెచ్చనూర్చుచు నేమియుం దోఁపకయుండెను.

పాఠకమహాశయులారా! శ్రీకృష్ణావతారదివ్యకథాసుధాలహరి మునింగితిరి. శ్రీపరమేశ్వరుని నూతనావతారకథ నాలకించితిరి. దశావతారములవంటి దీయవతారము గాదని యిందు మూలమునఁ దెలియఁబడియెఁ గదా. ఇట్టి జగదుద్ధరణకార్యదక్షమగు నవతారమును దెల్పు గాథ పరమ పావనమైనదని వేఱుగఁ జెప్పవలయునా. ఇందుఁ జిత్తము నూఁచి యూఁచి వైచు శంకలు గొన్ని గలవు. దేవకి తొలికొడుకును

వసుదేవుఁడు కంసునొద్దకుం గొని చనియె. వానింజూచి కంసుఁ డీతనిం జంపనేల? వీఁడు నాకు నంతకుఁడు కాఁడు గదా యని మరల వసుదేవున కిచ్చెను. పులి నాకి వదలినట్లు బాలుఁడు మృత్యువువాఁతనుండి తప్పించుకొనియె. ఇంతియేచాలు నదృష్ట మని వసుదేవుఁ డింటికిం గొని చనియె. అంతఁ గొంపమునిఁగి నట్లు నారదుఁడు కంసునిచెంతకుఁ బిలువని పేరంటముగా వచ్చి హితముపదేశించుచు దేవకీపుత్త్రులం జంపక వదలుట మంచి పనిగాదనియు దానఁదప్పక ముప్పువాటిల్లు ననియుఁజెప్పి తన యిచ్చంబోయెను. నారదముని బ్రహ్మనిష్ఠుఁడు. మహాయోగి. పరమభక్తుఁడు. సర్వభూతదయాపరుఁడు. అట్టివాఁడు దురాత్ముఁ డగు కంసునకు మిత్త్రుఁడై శిశుహత్యకుం బురికొల్పునని యోజించుట న్యాయమగునా. కావున నిట మాయాహాలఁ జక్కని మార్గమునఁ బ్రసరింపఁజేయుఁడు. దేవకీపుత్త్రు లాఱుగు రెవరు? వారి పూర్వవృత్తాంత మేమి? అను నదియే యిట ముఖ్యము. వారివృత్తాంతము ప్రథమాధ్యాయమునఁ జదివితిరికదా. వారి కా తరుణమున మరణము కావలసియుండినది. అదియేగదా వారి కోరిక. అది కారణముగనే వారా దేవకీదేవికిం బుత్త్రులై జనించిరి. కర్మసిద్ధాంతము ప్రబలతమ మైనది. దాని కడ్డమునున దియే లేదు. అది మార్పరానిది. నారదముని ప్రోత్సహించి కంసు నకు ఆశిశువులం జంపఁ బుద్ధిపుట్టించెను. నారదముని కర్మపేరి తుఁడు. అంతియేగాక ఆమహాముని పుట్టినశిశువు లెవ్వరైనది

యెఱుంగును. వారికి శీఘ్రమరణమున మేలు చేకూరునని యెఱిం గియే విరమించియున్న కంసప్రయత్నము నుద్దీపింపఁజేసి యాకా ర్యమును సాగించెను. దాన వారికి యథాపూర్వజన్మము లభిం చెను. అంతియేగాని నారదముని కలహప్రియుఁడుగాని శిశు హత్య చేయింప నెంచు దుర్మతిగానికాఁడు.

ఏడవగర్భమునుండి పుట్టి కంసునకు నాహుతికాఁదగిన జీవుఁడు లేకపోయెను. భగవంతుఁడే తన తేజము నందుంచి భగ వంతుఁడు పుట్టఁదగిన యదృష్టముగల రోహిణిగర్భమున నీతే జస్సును జేర్పుమని యోగమాయ కాజ్ఞాపించెను. పూర్ణగ ర్భమును రోహిణీగర్భమునం దామాయాదేవి చేర్చెను. ఇది శక్యమా యని సందియ మొంద నక్కఱయుండదు. మనబోం ట్లకది యశక్యమేగాని భగవంతున కశక్యమగు కార్యము లేదు. సప్తమగర్భము చెడినట్లు కంసునకుఁ దోఁపఁజేసెను. తన దివ్యతేజ మక్షయము గాన నది గుణమణి యగు రోహిణి యందుఁ జేర్చెను. ఇది భగవత్కృత్యములలో నత్యల్పము. కావున నిది శక్యమా యని సంశయింప నవసరము లేదు. ఏ యేకార్యమేరీతిగా నొనరించిన నేయేఫలములు గలుగునో అవి యామహాత్ముఁడే యెఱుంగును. కాననే సర్వజ్ఞశబ్దమా పరమ పురుషునకుం జెల్లినది. భగవదిచ్ఛయే కర్మము. అది యప్రతిహ తము. దుర్విజ్ఞేయము. కాఁబట్టి యది ప్రవర్తించియే తీఱును.

దాని కట్టికశక్తి ప్రసాదించినవాఁడు కర్మస్వరూపుఁడగు భగవంతుఁడే.

ఇట్లు శ్రీకృష్ణావతారము లోకోద్ధరణక్షమమై పరమపావనమై యోగీంద్రవినుతిపాత్రమై ధర్మసంరక్షణ దృఢమూలమై ప్రవర్తిల్లినది. ఇత్తరుణమున గోలోకము భక్తనికరాకీర్ణమేగాని శ్రీకృష్ణపరమాత్మయు శ్రీరాధాంబికయు భూలోకమునసుండుట యథాపూర్వముగ లేదు. అంశమాత్రము గాక సర్వస్వరూపమున నవతరించితి నని శ్రీహరియే వచించెఁగదా. ఈ పరమపావనగాథ జన్మమృత్యుజరాబాధలనడించి సుఖమును గల్గఁజేయఁ జాలునది. భక్తులార! స్వల్పసంశయములకుం జోటీయక పవిత్రమనస్సుతో దీనిం బఠించి బ్రహ్మాదికృత శ్రీకృష్ణస్తవముల నారాయణము చేయుఁడు. కలికాలమున నన్నితపస్సులకంటె శ్రీకృష్ణపరమాత్మ నామసంకీర్తనమే పరమ కర్తవ్యము. నిరపాయము. సులభమార్గము. ద్రవ్యసహాయ మక్కఱలేక యితరుల సాయముతోఁ బనిలేకుండ సాగింపఁ దగిన దిది యొక్కటియే. వేఱుమార్గములు ఇట్టివి లేవు. కాయక్లేశము లవ్వానియందుననుభవింపఁదగియుండును. హింసాకర్మము కొంతదనుక నవసరమై యుండును. ఇతరుల తోడ్పాటు వలసియుండును. యాచనావృత్తి నవలంబించి యెందఱినో పీడింపవలసియుండును. ఈమహాపావనకార్యము దట్టి లేమియు నుండవు. కాలనియమములు లేవు. భక్తియే క్షణమున దృఢముగా నుండునో యప్పుడే యిది చేయఁదగినది. హెచ్చుతగ్గులకుఁ బ్రాయశ్చిత్తము

లేదు. కాఁబట్టి భక్తిశ్రద్ధలుగలిగి శ్రీపరమేశ్వరనామసంకీర్తనము చేయుచు నామహాపురుషుని యవతారగాథలం బఠింపుచు గాలమును బుచ్చుచు శ్రీకృష్ణకరుణాపాత్రుల రగుఁడు.

## శ్రీ కృష్ణజన్మాష్టమీజయంతీవ్రతవిధానము.

పై నియమములకు ఫలముగా శ్రీహరి యావిర్భవించిన పురుషార్థచతుష్టప్రదకాలమును గొనియాడుటయు, శ్రీహరినారాధించుటయుఁ జేయఁదగు కృత్యములుగదా. కావునఁ దద్విధానము నెఱుంగుట ముఖ్యము. అదియే ఫలవంతము. ఊరక కథలంబఠించిన నంతగ లాభము లేదు. భక్తిప్రబోధకము శ్రీహరిభజనము. అది యర్చారూపమున వెలసిన మఱింత మంచిది. కాఁబట్టి శ్రీకృష్ణమూర్తి యవతరించిన తిథి నక్షత్రములు వారము కాలము ప్రధానములు. ఆసుదివసమున శ్రీహరిఁ బూజించుట యొక యుత్తమమార్గము. కాన దానిని శ్రద్ధగాఁ బఠించి ఆరీతిగా భగవంతు నారాధింపుఁడు.

శ్రీమన్నారాయణమూర్తివలన శ్రీకృష్ణావతార రీతిని విని నారదముని యిట్లు ప్రశ్నించెను. పరమేశ్వరా! జన్మాష్టమీవ్రతము నుపదేశింపుము. అదియేగదా వ్రతరాజమనం దగినది. అది జయంతీయుక్తమైన ననంతపుణ్యప్రదము గాన విస్తరించి నాకుఁ దెలుపుము. అద్దినమున భుజించిన నేపాపముగల్గును? జయంతియందుపవాసమున్న నేపుణ్యము గల్గును? వ్రత

నియమ మెట్టిది? పూజాపద్ధతి యేవిధము? ఉపవాసానంతర పారణ నియమ మేలాగు? కరుణించి యనుగ్రహింపుమా యని లోకక్షేమమును గోరి నారదముని ప్రశ్నించెను. నారాయణమూర్తి యాప్రశ్నమున కానందించి యిట్లు బదులుచెప్పెను. *నారదా! చక్కని ప్రశ్నము చేసితివి. ఇది భక్తులకుఁ బెన్నిధి సుమీ. సావధానముగా నాలకింపుము. భక్తుఁడు సప్తమియం దేకవారమును హవిష్యమును భుజింపవలయును. భోజనమతి నియతుఁడై చేయవలయును. హవిష్యమును భుజించుట యుపవాసతుల్య మని తలంపుము. ఆదిన మిట్లుగడపి యరుణోదయకాలమున మేల్కాంచి ప్రాతఃకృత్యములఁదీర్చి స్నానము చేయ సంకల్పింపవలయు. వ్రతోపవాసములకు ఫలము శ్రీకృష్ణప్రీతియే. మన్వాదిపుణ్యకాలములు దొరకగా స్నానపూజనము లొనరించిన నేఫలము గలుగునో ఆఫలము ♦భాద్రపదాష్టమియందు స్నాన మొనరించినఁ గలుగును. అదియు మన్వాదికాలజనితపుణ్యమునకన్నఁ గోటి గుణితమగు. ఆపవిత్రదినమునందుఁ బితరులకు నుదకమునఁ దర్పణము మాత్ర

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము నందలి యష్టమాధ్యాయమునుండి గ్రహింపఁబడిన దని గ్రహింపవలయు.

♦ భాద్రపదాష్టమి యనఁగా భాద్రపదశుక్లాష్టమి యని యర్థము. శ్రీకృష్ణజయంతి శ్రావణకృష్ణపక్షాష్టమియ దుఁ గదా యని శంకనొంద నక్కఱలేదు. భాద్రపదశుక్లాష్టమి యనఁగా శ్రావణకృష్ణపక్షాష్టమియే యగును. ఎట్లనఁగా చాంద్రసౌరమానములయం దమావాస్యతో మాసపూర్తి

ము చేసినను గయాశ్రాద్ధము చేసినట్లే. అంతియగాక శతవత్స రములు గయాశ్రాద్ధము చేసిన ట్లగును. ఇందులకు శంకలేదు. ఇట్లు నియతుండై స్నానమొనరించి నిత్యకృత్యమును దీర్చి సూతికాగృహమును నిర్మించవలయు. లోహఖండములచేతను వహ్నిజ్వాలలచేతను సంరక్షిత మగునట్లు ఏర్పాటుచేయవలయు. అందు బహువిధపదార్థముల నాభిచ్ఛేదనసాధనాదుల నునుపవలయు. ధాత్రీరూపిణియగు నొకస్త్రీని నుంచవలయు. షోడశోపచారములకుఁ బూజకుఁ దగినద్రవ్యముల నందు స్థాపింపవలయు. ఎనిమిదివిధములగు ఫలములను మధురోపహారవస్తువులనం దమరించవలయు. జాతీఫలము, కంకోలము, దాడిమీఫలము, శ్రీఫలము, నారికేరము, జంబీరము, కూష్మాండము నం దలరింపఁ జేయవలయు. ఆసనము, వస్త్రము, పాద్యము, మధుపర్కము, అర్ఘ్యము, ఆచమనీయోదకము, స్నానోదకము, శయనము. గంధము, పుష్పము, నైవేద్యము, తాంబూలము, ధూపదీపములు, ఉపచారములు పదాఱును, పాదప్రక్షాళనము అను నీ

యగు. బార్హస్పత్యమానముల ననఁగా వింధ్యపర్వతోత్తరదేశములయం దట్లు గాదు. పూర్ణిమతో మాసపూర్తి యగు. కాన నీపురాణములు ఆర్యావర్తదేశమున నైమిశారణ్యమున వ్రాయఁబడినవి. అందు బార్హస్పత్యమానమే. యాచారముల నడపుదు, కాన నందు శుక్లపక్షము వింధ్యపర్వతదక్షిణదేశములనుండు వారికిఁ గృష్ణపక్షమగును. కాఁబట్టి భాద్రపదాష్టమి యనఁగా మనకు శ్రావణకృష్ణాష్టమియే యగు నని గ్రహింపవలయు.

శ్రీహరి! యంగీకరింపుము. అనేకవిధ చందనచూర్ణసమ్మిళితమై మూలద్రవసంయుతమై కస్తూరికాపంకసంకలితమగు గంధము ను ఓలక్ష్మీనాయకా! గ్రహింప ననుమతింపుము. సద్గంధమున నలరి కుంకుమతోఁగలిసి సర్వదేవతలకు మిగులఁ బ్రీతిని గల్గించు పుష్పమును ధరింప సమ్మతింపుము. ఓశ్రీకృష్ణా! లోకేశ్వరా! స్వస్తికోక్తమై సుపక్వఫలసంయుక్తమై మిష్టము నగు నైవేద్యము నాయొసంగు దానిని బ్రీతిపూర్వకముగాఁ గైకొనుము. లడ్డుకంబుల, మోదకముల, ఘృతమును, క్షీరముల,గుడమును, దేనెను, నవోద్ధృతమగు దధిని, దక్రమును, నైవేద్యముతో గ్రహింపుము. శీతలమై, శర్కరాయుతమై, క్షీరస్వాదువై,భోగసారమై,కర్పూరాదిసమన్వితమునగు నీతాంబూలము నాదృతి స్వీకరింపుము. అవీరచూర్ణమై రుచిరమై తరువిశేష రసోత్కర్షమై గందముగలిగి యగ్నితోఁగూడి సర్వదేవతాప్రియమై చెలువారు ధూపమును బరిగ్రహింపుము. ఘోరాంధకారనాశైకహేతువయి శుభావహమయి దీప్తికరమై యున్న యీదీపమును మహాప్రభూ! కటాక్షముల వీక్షింపుము. శ్రీరాధామాధవా! కర్పూరాదిసమన్వితమై పరమపావనమై నిర్మలంబునై సర్వబీజజీవనము నగు జలమును బానార్థమై మనోమోదమొప్పఁ గైకొనుము. నానావిధసురుచిరకుసుమసమాయుక్తమై సూక్ష్మతంతు గ్రథితమై శరీరభూషణమయి తగు నీమాల్యమును స్వీకరింపుము. ఇంతియగాక శక్తికొలఁది సేక

రించియున్న పదార్థములను బూజోపయుక్తములను సమర్పించి వ్రతస్థానమున నుంచిన సకలవిహితవస్తువులను ఫలములను దరుబీజములను స్వాదువులై సుందరములుగ నున్న వానినెల్ల భక్తియుక్తి సమర్పింపవలయును. ఇట్లు సమర్పించి యావాహితదేవతలనెల్లఁ బ్రత్యేకముగాఁ బూజింపవలయును. ఇట్లు సకలదేవతలఁ బూజించి పుష్పాంజలిత్రయమును సమర్పింపవలయును. సునందనందకుముదులను, సకలగోపకులను, గోపికలను, రాధికాంబికను, గణపతికార్తికేయులను, బ్రహ్మను, బార్వతీపరమేశ్వరులను, లక్ష్మిని, సరస్వతిని, దిక్పాలకులను, గ్రహములను, ననంతుని, సుదర్శనాయుధవరమును, పార్షదప్రవరులను, మఱియు సకలదేవతలను బూజించి దండాకారముగా నమస్కరించి బ్రాహ్మణులకు నైవేద్య మొసంగి దక్షిణల నిచ్చి శ్రీకృష్ణజన్మాఖ్యానోక్తకథను భక్తిభావితుఁడై వినవలయును.

అంతటఁ గుశాసనముననుండి వ్రతనియమమురీతి జాగరణ మాచరింపవలయును. ప్రభాతమున మేల్కాంచి యాహ్నికకృత్యములఁ దీర్చి శ్రీహరిని బూజించి బ్రాహ్మణభోజనమును జరపించి హరికీర్తన మొనరించ వలయును. అని నారాయణమూర్తి తెలుపుటయు, నారదుఁ డానందపరవశుఁడై యిట్లు ప్రశ్నించెను. నారాయణా! లోకనాయకా! దీనబంధూ! వేదోక్తమై సర్వసమ్మతముగ నొప్పు వ్రతకాలవ్యవస్థను వేదార్థము నాలోచించి పురాతనసంహితను దయమెయిం దెల్పుము.

ఉపవాసమునందు, వ్రతమునందు జాగరణమునందు నేమిఫల ముగలదు. ఆదినమున భుజించిన నేమిపాపము లభించును. వేద విద్వరా! కరుణించి వచియింపుము. అని ప్రశ్నింప శ్రీమన్నా రాయణమూర్తి యిట్లు వచించెను.

మునీంద్రా! వినుము. అష్టమీతిథి బ్రహ్మదేవతాకమగు రోహిణీనక్షత్రముతోఁగూడి యర్ధరాత్రసమయమునఁ గనుప ట్టునేని అదియే ముఖ్యకాలము. ఆకాలమునందే శ్రీహరి యుద యించెను. ఆకాలమున శ్రీహరిని బూజించిన జయము సుకృ తము లభించును. కాఁబట్టియే జయంతి యని దానికిం బేరు కలిగినది. ఆపుణ్యదినమున నుపవసించి వ్రతమొనరించి జాగర ణము చేయవలయును. సకలసంశయములఁ బోఁగొట్టుకాల మిది యే. సర్వసమ్మతము ప్రధానము నగు. ఇది వేదవిద్వాణి. బ్రహ్మ యే మున్ను వచించెను. ఆతరుణమున జాగరణమొనరించి వ్రతము నుపవసించియే చేయవలయును. అట్లొనరించినఁ గోటి జన్మముల నార్జించిన పాపములు నశించును. సంశయము లేదు. మునీంద్రా! సప్తమీతిథితోఁగూడిన యష్టమి త్యజింపఁదగినది. కృత్తికావిద్ధ కాని రోహిణీనక్షత్రమందు దేవకీనందనుఁడు జన్మించెను. వేదవేదాంగగుప్తమై మిగుల శ్రేష్ఠమునగు శుభ ముహూర్తమునందు శ్రీకృష్ణపరమాత్మ యవతరించెను. కావున రోహిణీనక్షత్ర మతిక్రమింపఁగాఁ బారణ మొనరింపవలయును. తిథ్యంతమున శ్రీహరిని సమర్చించి దేవతలఁ బూజించి భగవ

ద్దిత్యావతారమును స్మరించుచుఁ బరమపవిత్రమై సర్వపాపప్ర ణాశనం బగుపురాణము నుపవాసాంగభూతముగను, సత్ఫలప్ర దముగను, సిద్ధికారణంబుగను భావించి పఠించవలయు. సర్వోప వాసములయందుఁ బారణము పగటిపూటనే చేయఁదగినది. అన్యథా యాచరించినచో ఫలహాని యగు. ధారణపారణ ములు పగటికాలముననే చేయఁదగినది. రాత్రియందుఁ బారణ మొనరింపరాదు. రోహిణీవ్రతమున నా నియమములేదు. మహా నిశనువదలి రాత్రికాలముననే పారణము చేయవలయును. విప్ర దేవార్చనమును జేసి పూర్వాహ్ణముననే పారణము చేయవల యును. సర్వసజ్జనసమ్మతమగు వ్రతము నాచరింపవలయు. రోహిణీవ్రతము నితరులు వలదన్నను ఆచరింపవలయును. సోమ బుధవారములలో నొకటి జయంతిదినమునఁ బొసఁగెనేని అట్టి జయంతీవ్రతము చేయు భక్తుఁడు మరల గర్భవాసదుః ఖము ననుభవింపఁడు. ఉదయమునఁ గొంచె మష్టమియుండి నవమి సంపూర్ణముగ నుండెనేని బుధసోమవారములలో నొక్కటి యపుడు వారమయ్యెనేని రోహిణీనక్షత్రము చెలు వారునేని అట్టి పుణ్యకాలము నూఱువత్సరముల కైనను లభిం చునా యన లభింపదు. అట్టి శుభతమకాలమున వ్రతము నా చరింపవలయును. ఆచరించుచో గోటిమానవులఁ దరింపఁజే యును. హీనసంపదలు గల భక్తుల కీవ్రతము దప్పక యాచ రింపఁదగినది. అవకాశము లేదేని ఉపవాసమున్నను శ్రీహరి ప్రీతుఁ డగును. నానావిధోపచారములచేతను, భక్తిచేతను,

రాత్రి జాగరణముచేతను, శ్రీకృష్ణమూర్తి జయంతీవ్రతము నొసం గును. ద్రవ్యలోభముచేయక వ్రత మాచరించినఁ జక్కని ఫల ము నొందఁ గలఁడు. విత్తశాఠ్యము చూపినచోఁ దత్తుల్యఫల మునేపొందును. అష్టమియందును, రోహిణియందును బారణము చేయరాదు. అట్లుచేసినచో నుపవాసాదిసాధితపుణ్యమును బోఁ గొట్టుకొనును. తిథి యెనిమిదిగుణముల హరించును. నక్షత్రము నాల్గుగుణముల హరించును. కానఁ బ్రయత్నపూర్వకముగాఁ దిథినక్షత్రాంతమునఁ బారణ మాచరింపవలయును. తిథినక్ష త్రాంతకాలము మహానిశయందైనచో తృతీయభాగమునఁ బారణమాచరింపఁ దగు. రాత్రియందు దాఁ జుముహూర్తము లతి క్రమింపఁగా నవ్వలికాలము మహానిశ యనంబడును. ఆమహా నిశయందు భుజించినచో బ్రహ్మహత్యాపాపము గలుగును. ఆకా లమునఁ దాంబూలము వేసికొన్నను, ఫలముల భక్షించినను, జలములఁ ద్రావినను, గోమాంసము విణ్మూత్రముల భక్షించి నట్ల యగు. శుద్ధులగు పురుషులు ఫలహారముగూడఁ జేయరా దన నిఁక భోజనముమాట యిటఁ జెప్ప నేటికి? త్రియామను రజనీనామమునఁ బిలుతురు. ఆదియందు నాలుగుగడియలు, కొసన నాలుగడియలు దివసాద్యంత సంజ్ఞలుగలవి. జన్మాష్టమి యందు జాగరణవ్రతముల నాచరించిన మానవుఁడు శతజన్మ కృతపాపమునుండి విముక్తుఁ డగు కేవల జన్మాష్టమియందే యు పవసించిన అశ్వమేధఫలము వ్రతజాగరణముల మాసినను గ

ల్గును. బాల్య కౌమార యౌవనవార్ధకములం దొనరించిన సప్తజన్మముల వగుపాపములు నశించును. ఈవిషయమున శంకింపఁ బనిలేదు. శ్రీకృష్ణజన్మదివసమున నేనరాధముఁడు భుజించునో వాఁడు మాతృగమనదోషమును, బ్రహ్మహత్యాశతదోషమును బొందును. ఇంతియగాక కోటిజన్మార్జితపుణ్యము క్షీణించును. మఱియు నతఁ డశుచియై, సభానర్హుఁడై దైవపిత్ర్యకార్యములయందు యోగ్యుఁడు కాక యుండి మృత్యనంతరమునఁ గాలసూత్రమునందు రవిచంద్రులుండు దనుక నుండును. అందును గృహములు శూలతుల్యతీక్ష్ణదంష్ట్రాళుల భక్షింప బాధితుఁ డగుచుండును. అట్టి పాపాత్ముఁడు మరల భారతవర్షమున జన్మించి యఱువదివేలయేండ్లు విష్ఠయందుఁ గ్రిమియై యుండును. అవ్వల కోటిసహస్రవర్షములు గృధ్రరూపమునను, నూఱుజన్మములు సూకరరూపమునను, శతజన్మములు శునకరూపమునను, ఏడుపుట్టుకలు సృగాలరూపమునను, సప్తజన్మములు సర్పరూపమునను, జన్మసప్తకము కాకరూపమునను నుండి పిదప మర్త్యయోనిం బుట్టుకంగాంచి మూకతనొంది గళత్కుష్ఠియై మఱియుఁ బుట్టినతఱిఁ బశుఘ్నుఁడై వ్యాలగ్రాహియై మఱొకపుట్టువునందుఁ జోరుఁడై ధర్మహీనుఁడై లోభియై మృతినొంది వెండియుం బుట్టి రజకుఁడై క్రమమునఁ దైలకారకుఁడై దేవలకుఁడై బ్రాహ్మణుఁడై యందు నశుచియై ఉపవాసాసమర్థుఁడై యొకవిప్రునైన భుజింపఁజేసినచోఁ బాపము

క్షీణించును. ఇంచుక దానములు చేసిన నా ఫలము ద్విగుణమగును. అప్పుడు దేవీమంత్రమును బ్రాణాయామపురస్సరముగా సహస్రము జపించి ద్వాదశపర్యాయము లావ్రతము నొనరించవలయు. నారదమునీ! కుమారా! ఇది వ్రతవిధానము. ధర్మముఖమునుండి వినినట్లు తెలిపితిని. వ్రతోపవాసపూజనముల నొనరింపకున్నచోఁ గలుగు పాపములఁ దెలిపితిని. ఈ రీతిని మది నిలిపి యాచరించవలయు. మునీంద్రా! యిదియు కృష్ణాష్టమీవ్రతవిధాన మని నారాయణుఁడు తెలుప నారదముని సంతుష్టాంతరంగుఁ డయ్యెను.

## కంసుఁడు మంత్రులతో నాలోచించుట.

* ఆ బాలిక యదృశ్యయై కంసునిమనస్సులికిపడం బలికి సకలదేవతావినుతులం గాంచుచు బహువిధనామధేయములఁ బూజ లందఁబోయెను. ఇట్టు లామాయాదేవి యదృశ్యరాలు కాఁగా కంసుఁడు దిక్కుదోఁచక కొంతసే పుండి పదంపడి తనప్రయత్నము నిష్ఫలముకాఁగా ముందు తాఁ జేయఁదగు కార్య మేది యని యాలోచించుటకైన మనస్సు సమర్థము కాకపోఁగా ప్రపంచము మునిఁగినట్లు, ఆకాశము నెత్తిపైఁబడినట్లు తలంచుచు ఖడ్గమును విసరివైచి దైవయత్నమును మార్పరా దనుసూక్తి నిజమని తోఁపఁగా నింకేమి గతి?

* ఈకథ బ్రహ్మపురాణము డెబ్బదినాల్గవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

ఎట్లు కార్యమును సాధింతును? ఎవరు తోడ్పడువారు? అక్కటా! దైవ మింతటి క్రూరచిత్తమగునే? యని తలపోసికొనుచు నిట్టూర్పులు పుచ్చుచుఁ, గన్నీరు స్రవించుచుండఁగా దీనుఁడై యింటికింబోయెను.

తన మందిరమును జేరి యించుకయైన నాలసింపక దారుణచిత్తులు క్రూరకార్యనిరతులు పరుషవచనులు భయంకరరూపులు నగు ప్రలంబకేశిప్రముఖుల రావించి యథోచితాసనోపవిష్టులగు వారిం గాంచి దైవమును దూఱుచు నిట్లు పలికెను. ఓ ప్రలంబమహాసురా! ఓ కేశిదనుజేశా! ఓ ధేనుకాసురవర్యా! ఓపూతనా! ఓయరిష్టాదిదానవోత్తములారా! నా వాక్యము నాలకింపుఁడు. నన్ను వధించుటకై యింద్రాదులు నిర్జరులు మునులును దుర్మతులై గొప్ప ప్రయత్నమును జేసిరి. నా ప్రతాపాగ్నికిఁ దాళఁజాలక మూలమూలల నొదిగియున్న యీనీచులగు దేవతలకుఁ దదధీశులకు మునులకు భయంపడను. వీనిని లెక్కింపను. కాని యా బాలిక యంబరమున నిల్చి పలికిన పలుకులు ములుకులవలె మదినాటి నన్నేఁచుచున్న యవి. ఆశ్చర్యమునుగూడఁ గలిగించినవి. దేవతలు నన్నుం జంపఁ బ్రయత్నించుట నే నెఱుఁగుదును. నాకించుకంతయు జంకుగలుగలేదు. కాని యాబాలిక పలుకుల కుల్లము తల్లడిల్లెడు. స్మరించినంతనే మది నుడికించుచున్న యామాటలు మీకుఁ జెప్ప నోరాడకున్న యది. ఇఁక నా ప్రయత్నమును వినుఁడు.

నన్నుఁ జంప దేవత లెంతటి ప్రయత్నముల నొనరించిరో వారి నడంప నేనును గొప్పప్రయత్నముల ననేకభంగుల నొనరింపవలయును. ఆదురాత్ముల నామము ప్రపంచమున లేకుండఁ జేయవలయును. ఆబాలిక వియద్వీథినిలిచి భూతభవ్యభవత్ప్రభువు నిన్నుం జంపఁ బుట్టియున్నాఁడు. జాగ్రత్తపడుము. అని నన్నుం గూర్చి పలికెను. ఆబాలిక నాసోదరియగు దేవకీగర్భసంభూతురాలు. కావున భూమండలమునఁ బుట్టియున్న బాలకులను జంపు ప్రయత్నము చేయవలయును.

'ఉత్పన్నశ్చాపి మృత్యుః'

అని వచించిన కారణమున నిపుడేపుట్టినవాఁ డని గ్రహింపఁదగియున్నది. అనఁగానే శిశువునందు లోకసామాన్య బలాధిక బలాదులు కనుపట్టునో ఆశిశువును వధింపవలయు. నన్నుం జంపఁ బుట్టినవాఁడు భగవదంశసంభూతుఁడు కావలయుఁ గదా. అట్టివానిగుణాదులు లోకసామాన్యములుగాక యద్భుతజనకములుగా నుండవలయు. కావున నట్టి శిశువులం దెంపున వ్రందింపవలయు. ఆప్రయత్నమును మనము తప్పక చేయవలయు? ఈవిషయమున మీసహాయము నాకుం గావలయును. అని పలుక వారెల్ల నేకవాక్యముగా నందుల కంగీకరించి తమరాపని నెఱవేర్చిగాని విరమింప మని బీరములు పలికిరి. అందుఁ గొంద ఱిప్పుడపోయి మర్త్యలోకమెల్లఁ గలయఁ గ్రుమ్మరివత్తు మని మీసములు మెలిపెట్టిరి. కొంద ఱీవిష

యమున నింతగా నాలోచింపవలయునా? స్వల్పకార్య మిది
కదా యనిరి. నేనొక్కఁడన పోయి లోకముల నెల్లఁ దిరిగి
యట్టిశిశువులం బొరిగొని వత్తు నని యొక్కఁ డనియెను. ఇట్లు
వారెల్ల నాతని భీతిపోవునట్లు కార్యతత్త్వ మ్మెఱుంగక తోఁ
చినట్లు ప్రల్లదము లాడిరి.

కంసుఁ డామాటల నమ్మి మోసపోయెను. దేవతాకార్య
మెఱుంగ శక్యమా యని యూహింపఁజాలకుండెను. బాలిక
యిట్లు పలుక సాధారణముగాదు కదా? యిందేదో యుపద్రవ
ప్రయత్నము దేవతాకృతముకలదు. దీనఁ జేటువాటిల్లు నని
నిశ్చయింపఁ జాలకపోయెను. భగవచ్చేష్టితము నావంటివాని
కెఱుకపడునదియా? యని తెలివితో నూహింప శక్తుఁడు కాఁ
డయ్యెను. మూర్ఖుఁడు కాన తనవంటివారిమాటలు సార్థకము
లని నమ్మెను. వారి నిండ్లకుఁ బోవం బనిచి యభ్యంతరమందిర
మున కరిగెను.

ఇట్లరిగి తనలోఁ దాఁ దలపోసికొనుచుఁ గారాగారము
నుండి దేవకీవసుదేవుల రావించి బంధవిముక్తులఁ జేసి బహు
మానపురస్సరముగా వారిని గూరుచుండ నియోగించి సమ
యోచితవాగ్వైఖరి మెఱయ నిట్టు లనియెను.*

శ్లో. అహో భగిన్యహో భావ మయా వాం బత పాప్మనా,
పురుషాద ఇవాపత్యం బహవో హింసితా స్సుతాః.

* ఇప్పట్టున భాగవతాదులందున్న విషయములుగూడఁ గలిపి వ్రాయఁ
బడు నని యెఱుంగ నగు.

సత్వాహం త్యక్త కారుణ్య స్త్యక్తజ్ఞాతి సుహృత్ఖలః,
కాంస్తు లోకాన్ గమిష్యామి బ్రహ్మహేవ మృతశ్శ్వసన్.
శ్రీభాగవతే. ౪. అ. ౧౬. శ్లో.

ఉ. పాపుఁడ బాలఘాతుకుఁడ బంధువిరక్తుఁడ దుష్టచిత్తుఁడన్
గోపనుఁ కన్ జరన్మృతుఁడఁ గ్రూరుఁడ బ్రాహ్మణహంతభంగిమీ
పాపలఁ జంపితిన్ బయలి పల్కుల నమ్మితి సాధులార! నా
పాపము లుగ్గడింపక కృపాపరులై కనరే శమింపరే.
శ్రీపోతనకవి.

పై రెండుశ్లోకముల కిదియేపద్యము. "పురుషాద ఇవాపత్యమ్" అనుమూలమునకు "పురుషాదో రాక్షసో యథా స్వాపత్యమేహి నస్తి తద్వత్" అని వ్యాఖ్య. ఈభావము పద్యమున వదలివేయఁబడినది. రెండవపాదమునఁ గలవిశేషణములం బట్టి యీభావము రాదా యన్న నెట్లో వచ్చును. ఇంతకన్న నధికార్థమే కనఁబడుచున్నది. ఇంతియగాక "కాంస్తులోకాన్ గమిష్యామి బ్రహ్మహేవమృతశ్శ్వసన్" అను దాని యందుఁగల యర్థచమత్కృతి పద్యమునఁ గానరాదు. బ్రహ్మహత్య యొనరించిన వానివలె మృతినొందిన పిదప నిట్టూర్పులు పుచ్చుచు (ఇట్టి ఘోరపాపముల నొనరించితినే. ఏమి నాగతి యని చింతించుచు) ఏలోకములకుఁ బోవుదును. మహాపాపము నొనరించిన వాని కేలోకము వాసార్హమో అద్దియే నాకని దానిభావము. ఆభావము పద్యమున బ్రాహ్మణునిఁజంపిన వాని

వలె మీపాపలఁ జంపితి నని తెనిఁగింపఁబడినది. ఈయాంధ్రమున మిగుల నర్థచమత్కృతి కలదు గాని మూలము ననుసరింపఁబడలే దని మాత్రమే చెప్పఁదగినది. రసాలవాలమే యీ పద్యము. సంశయమే లేదు, మహాకవిపుంగవుని పద్యము సకలపాపలతాలవిత్రమని యిటఁ జేర్చితిని. అట్టి మహాత్ముల స్మరించుటయుఁ బుణ్యకార్యము కదా.

## కంసుఁడు దేవకీవసుదేవుల వేఁడుట.

ఓ ప్రియసోదరీ! బావా! మిగులఁ బాపాత్ముఁడ నగు నాచే మీపెక్కు తనయులు హింసింపఁబడిరి. ఈకార్యముక్రూరరాక్షసుఁడు తన సంతానమును దానే హింసించునట్టి దనవలయు. కరుణాలేశములేనివాఁడను. బంధువులను మిత్రులను విడనాడితిని. మూర్ఖుఁడను. ఇట్టి క్రూరకార్య మొనరించిన నేను బ్రహ్మహత్య యొనరించిన వానివలె నిట్టూర్పులు పుచ్చుచు నేలోకములకుఁ బోఁగలనో తెలియఁజాలకున్న వాఁడను. మీ పుత్రులను వృథా సంహరించితిని. *నామృతికై వేఱొకఁడు పుట్టిన వాఁడు. తెలియక మిన్నుల వాక్కులను నమ్మి మీపాపల వధించితిని గదా. దీన నేమి మేలు నాకుఁ జేకూరెను? ఊరక మహాపాతకమును సంపాదించుకొంటిని. ఏమి చింతించిన నిఁక

* 'కోప్యన్యఏవ నాశాయ బాలో మమ సముద్గతః' అని బ్రహ్మపురాణము.

నేమిలాభము. ప్రియసోదరీ! బావా! నాపల్కు లాలకింపుఁడు. ఆనాఁడు మహోత్సాహమున రథము గడపుచుంటిని. నా యుత్సాహ మింతయని వచింపనలవిగాకుండెను. ఆతరుణమున నాయుత్సాహ మంతరించునట్లు, మనస్సు దుఃఖాంబునిధిలో మునుఁగునట్లు వియత్పథమునుండి నీసోదరి యష్టమగర్భము నీకు మృత్యువని శబ్ద మొక్కఁడు చక్కఁగా వినఁబడియె. తుచ్ఛములగు నీప్రాణములయందుఁ గలమోహమున నింతటి చెడుకార్యములను జేసితిని. తలపోయఁగాఁ బ్రాణుల నందఱను నిజోచితకర్మములు వరుసగాఁ ద్రిప్పుచుండుననియుఁ, బ్రాణు లొక్కొక్కరూపమును ధరించి యొక్కొక్కమార్గమున గమనాగమనము లొనరించుచు నాయాయి ఫలముల నొందుదురనియుఁ దేటపడియెడు. కాఁబట్టి చంపువాఁ డెవ్వఁడు? చంపఁబడువా రెవ్వఁడు? ఎవ్వరికిఁ గాని కర్తృత్వము లేదు. కర్మములు వారివారి నాడించుచుండును. చర్మనిర్మితప్రతిమలవలె దేహధారు లాడుచుందురు. అంతియకాని చంపునవి కర్మము లేకాని ప్రాణులు గారు. ఒక్కొక్కఁడును శత్రువుల జయించితిననియు; లేక శత్రువులచే భంగము వాటిల్లెననియుఁ జెప్పుకొనుచుందురు. ఆత్మకు విరోధముగాని మైత్రిగాని లేవు. పగకు మైత్రికి సూత్రప్రాయము కర్మముగాని వేఱొక్కటిగాదు. కావునఁ జింతింప నక్కఱలేదు. బాలకు లెల్ల స్వకర్మమున హతులైరి. కొడుకు లెక్కడ? మీ రెక్కడ? ఏమిసంబంధము?

ఆయురంతము కాఁగా హతులైరి. ఇందుఁ గర్తృత్వ మెవ్వని కిఁ గలదు?

అని మంచి మాటలాడి కన్నీరునించి వారి మనస్సులు కరఁగఁ జేసి వారికి నమస్కరించెను. కారాబంధనముల వదల్పింపఁ జేసెను. ఎన్నియో నీతులు దెలిపెను. కర్మకృతమేగాని నా తప్పు లేదని జ్ఞాన ముపదేశించెను. అయిన దానికి వగచి లాభము లేదని బుద్ధిగఱపెను. మీరిఁక సుఖముగ నుండుఁడు. జరగినదానిని స్మరింప వలదని వేఁడెను. నన్ను మన్నించి కరుణాంతరంగులరు గండని వినయము లొలుకఁ బలికెను. దీనఁడై వారి నెన్నియోభంగులఁ బ్రార్థించెను. ఏయేవిధముల వారిని సంతోషింపఁ జేయనగునో అన్నిరీతుల సంతోషింపఁ జేసెను.

ఇట్లు వారి నాశ్వాసించి కోపం బనిచి యంతఃపురమునకుం జని యీయెడరు తప్పించుకొను టెట్లు లని యోజించుచుండెను. కొంతసే పిట్లు తలంచుచు నెట్లో యారాత్రిని గడపెను. కాని నారద వాక్కులు, ఆకాశవాణియు, నసత్యములు కావనియు, నందులకుం దోడు ఆబాలికవచించిన వాక్కులు వానిమనస్సును గలంచుటచే నించుకంతయు శాంతినొందకపోయెను. తెల్లవాఱుజామున లేచి నిత్యకృత్యములం దీర్చి యీదినమే గూఢచారులం బంపి రాష్ట్రముల వెదకించి బాలకుల నధికదేశ్యాలురఁ జంపింపవలయు ననియుదలఁచెను. యథాకాలమునకు ముందే యాలోచనమందిరమునకు వచ్చి ప్రలంబాదు

ల మరల నప్పించి వారితోరహస్యాలోచనము లొనరించుచు సత్వరము యీకార్యమును సాధింపవలయు నని వారిని హెచ్చరించుచు వారాడు బీరముల విని యించుక యూఱడిల్లుచు బాలిక పలుకులు స్మృతికిం దగులఁగా నక్కటా! యెట్లీయెడరు నుండి తప్పించు కొందునా యని విచారించుచునుండెను.

## వసుదేవుఁడు నందాదుల వ్రేపల్లియకుం బొమ్మని ప్రోత్సహించుట.

* వసుదేవుఁడు భార్యతోఁ గంసునిచే విముక్తినొంది స్వగృహమునకుంబోయి మనమున నపరిమితానందము ననుభవించుచు బాహ్యమున విచారము గలవానివలెఁ బ్రవర్తించుచు నుండెను. ఏదినమున శ్రీహరి వసుదేవునిచే నందగృహమునకుఁ జేర్పఁబడియెనో ♦ ఆరాత్రి త్రోవలో వసుదేవుఁడు నందాదుల మధురానగరంబునకుఁ గప్పముఁ గట్టునిమిత్త మరుగువానిం గాంచెఁ గదా. ఆనందాదులందఱు మధురానగరంబునకు వృష్టిబాధితులై యరుదెంచి కంసునిం గాంచి కప్పము

* ఈగాథ బ్రహ్మపురాణము డెబ్బదియైదవ యధ్యాయమునుండియు, నితరపురాణములనుండియు గ్రహించి యథార్థముగా వ్రాయఁబడునని యెఱుంగఁ దగు.

♦ ఈ కథ భాగవతమున నించుక మార్పునొందింపఁబడినది. పుత్రోత్సవానంతరమున నందుఁడు మధురానగరమున కరిగి కప్పము చెల్లించి నట్టులున్నది. దీనఁ గథకేలాటికళంకము లేదని తెలియుట స్పష్టము.

లు సమర్పించిరి. యథోచితమర్యాదలం గాంచి పుర౦బుల కరుగం దలంచి యుండిరి. వసుదేవుఁడును గార్యాంతరమున నరుగుచుఁ గనఁబడిన నందాదులం గాంచి మహోత్సాహమున నలరు నందునితో నార్యా! నీవదృష్టవంతుఁడవు. నిన్నుం బోలు నదృష్టశాలురు లేరు. ముదుసలితనమున సత్పుత్రుం డుదయించెఁ గదా. ఇంతకన్న నదృష్ట మింకెట్టిది? వార్షికమగు కప్పము భూనాథునకు సమర్పించితివి గదా. వచ్చినపని యైనదిగదా. ఇఁక నిటఁ దడవుసేయక వ్రేపల్లియకుం బొమ్ము. వచ్చినపని నెఱవేఱగనే స్వస్థానమున కరుగవలయునని పెద్దలందురు. కాన గోకులమునకు వేగంబ పొమ్ము. నాకును గుమారుఁడు రోహిణి యందు జన్మించినవాఁడు. ఆశిశువును నాకు బదులుగ నీవే రక్షించుచుండుము. నీకుమారునివలె నాతనిం జూచుకొమ్ము. ఐన నొక్కమాటఁ జెప్పెద. సంతతిలేదని చిరకాలము చింతలం గూరితివి. ఎన్నియో వ్రతములాచరించితివి. అట్టి నీకీ శుభసమయమున ముద్దులకుమారుఁడు జనించెను. లోకమున సంతతి విహీనునకు సౌఖ్యము లేదని పెద్దలందురు. సోదరా! నిన్నుం గంటిని. ముదముం గంటిని. చిరకాలము శ్రమములం జిక్కిన నాకు నీవు కనఁబడుటయు నదృష్టమే. మన మొకచోటనుండు నవకాశముకలుగలేదు. నదీజలములందుఁ గలిసి పోవు దారుద్వయము తరంగచలనమున వేఱుచేయఁబడి యెడబాటు పొందులాగునఁ బలువంతలఁ

గుండువారు మిత్రులం గలిసియుండు భాగ్యముగలవారు కారు. నందా! మనగ్రామములందలి యావులు రోగములు లేక సుఖముగా నున్నవికదా. ధేనువులు చక్కఁగాఁ బాలిచ్చుచుండును గదా. తటాకములు, సరస్సులు, పల్వలములు జలపూరితములై యున్న యవి కదా. యాలమంద లుండు తావులఁ గ్రూరమృగముల సంచరణము లేదు కదా. మనపల్లెలు చక్కగా నుల్లసిల్లుచున్న యవి కదా. పచ్చని పచ్చిక బయళ్లు కలవుగదా. అడవుల నాకు జొంపములు వెలయుచుండును గదా. నందా! ఏగృహస్థుఁడు తనవారిని భోజనాదులచేఁ దృప్తిపఱుపక వారితో సరసాలాపములాడక యెందో జీవించుచుండునో అట్టి గృహస్థునకు నేవిధమగు సంతోషమైనఁ గలదా వచింపుము. మఱొక్కమాట! నీభార్యయగు యశోదనొద్ద నీవును ఆమెయు నలరింపఁగా నిన్నుఁ 'దండ్రీ' యని పిలువఁగ నామెను 'దల్లీ' యని పిలువఁగ నొక బాలకరత్నము నాకుమారుఁడే యయ్యె నందున్నవాఁడు. మఱువకుము. ఇఁక బొమ్మనియె.

నందుఁ డీమాటల కాశ్చర్యమునొంది వసుదేవా! నీకుమారుల నందఱ నీపాపాత్ముఁడు కంసుఁడు హింసించెను. తుదకు ఆఁడుబిడ్డను ఛేదింప నెగురవేయుఁగా నాబాలిక దైవయత్నమున నంబరముననే యదృశ్యురా లయ్యె నఁట. ఇట్టి యాపదలం బడితివి. దైవయత్నమునకు నీవు ప్రతీకార మేమిచేయఁగలవు? సజ్జనుఁడు దుఃఖములకు విచారింపఁడు. అట్టి నీవు నా

కుమారుని నీకుమారునిగా భావించుటయు నాకొడుకే యను
టయు విచిత్రము. దీనియర్థము నాకుం దోఁపకున్న యది.
అనియెను. వసుదేవుండు నామాటలకు బదులుచెప్ప నుంకిం
పక నందా! ఏమో పల్కితివి. నాసూనుని నీసూనుఁ డనఁగూ
డదా. భేదమేమి? వచ్చినపనిఁ దీర్చితివి. ఇఁకఁ దడయుట
పాడిగాదు. వేగంబ గోకులమునకుం బొమ్ము. నీకందు నన్నియు
మేలయ్యెడు మని సాగనంపెను.

* వసుదేవునిచే ననుజ్ఞాతుఁడై నందుఁడు పరమానంద
మున గోకులమును బ్రవేశించెను. ఆతురంబునఁ బురిటింటిలో
నికింబోయెను. భూమిపైనున్న కుమారునిఁ గాంచెను. నవనీర
దాకారము విలసిల్ల నతిశయసుందరాకారుండై నగ్నుఁడై
యాబాలుఁ డుండెను. గృహాలంకారభూతుఁ డగు నాకుమా
రుఁడు శరత్కాలరాకానిశాకరప్రతీకాశమై మోమువెలయ
నీలేందీవరనయనములు మురువుచూప నెంతో వేడుకగా నుం
డెను. మఱియు నత్తఱి నాయుత్తమబాలకుఁడు ఏడ్చుచు నంత
లో నవ్వుచు వేణుగానప్రియత్వము హస్తనిక్షేపణమునఁ దెలి
యఁజేయుచుఁ బాదము లరవిందములకు సిగ్గునొదవింప నల్లా
రుముద్దుగా నుండ నందుఁడు చక్కఁగాఁ గాంచి యశోదం
గూడి పరమానందసాగరమున నోలలాడెను. అంత ధాత్రి

* ఇటనుండి కథను శ్రీకృష్ణజన్మఖండము ౬౫ శ్లోకమునుండి వ్రాయఁ
బడినదని యెఱుంగవలయు.

యాశిశురత్నమును బొడిగిట నిడుకొని * శీతోదకమున స్నానము చేయించెను. వెంటనే నాడీచ్ఛేదము చేసెను. గోపికలందఱు బాలు నాశీర్వదించిరి. గోకులమున నున్న గోపికలెల్ల నుల్లాసముల శ్రోణీభరమున నడకలు మందములు కాఁగా చలద్వక్షోరుహములు లలరారఁ జనుదెంచి నేత్రఫలమగు నాకుమారమణిం గన్గొనిరి. బాలికలు యశోదానవయస్కలగు తరుణులు బ్రాహ్మణభార్యలు వచ్చి సూతికాగృహమునకు మంగళాశిషము లిడిరి. బాలునిఁ గన్నుల కఱవుదీఱఁ గాంచిరి. కొందఱు మందయాన లాబాలకు నెత్తుకొని ముద్దాడి రూపము నుతించుచు నందే యుండిరి.

అంత నందుఁడు సచేలస్నానమొనరించి ధౌతవస్త్రముల ధరియించి పారంపర్యవిధిని జరపెను. బ్రాహ్మణులకు భోజనమిడి హృష్టమతులం గావించి శుభాశిషముల నిప్పించెను. బహువిధవాద్యధ్వనులు చెలరేఁగెను. స్తుతిపాఠకులకు ధనము నొసంగి తృప్తులం గావించెను. అంతట నందుఁ డుప్పొంగునానందంబున విప్రోత్తములకు ధనరాశి నొసంగెను. మిగుల మేలైనరత్నములను, పగడములను, హారకముల సాదరంబుగా నిచ్చెను. సువర్ణమిశ్రితములగు తిలరాసుల నపమృత్యు పరిహారా

* 'ధాత్రీ తం స్నాపయా మాస శీతతో యేనబాలకమ్' అని మూ. దీనిచే మధురాప్రాంతములఁ జల్లని నీటిచేఁ దొలుతటిస్నానముచేయించుటాచారముగ నున్నట్లు కనుపట్టు.

ర్థము దాన మిచ్చెను. వెండిని, ధాన్యరాశిని, వస్త్రములను, గోసహస్రమును, పాలు, పెరుగు, శర్కర, వెన్న, నేయి, తేనె, లడ్డుకంబులఁగూడిన మిష్టాన్నమును, స్వాదుమోదకములను, సర్వసస్యాఢ్యయగు భూమిని, వాయువేగ తురంగములను, తాంబూలములను, తైలములను, దానముగా నొసంగి పరమానందభరితుఁ డయ్యెను. సూతికాగృహమునకు దుష్టగ్రహపీడగలుగకుండ రక్షించుటకు విప్రోత్తముల నియోగించెను. మంత్రజ్ఞులగు నాభూసురులు స్వకర్మపరతులై యుండిరి. మఱియు నందుఁడు సోదరులై ముదుసలులు నగు గోపాలకుల నాసూతికాగేహరక్షణార్థము నియోగించెను. గోపికలాదృతిమై నందాజ్ఞనం దుండిరి. శ్రీహరినానైకమంగళములగు వేదములఁ బఠింప నియోగించెను. భక్తిచే నందుఁడు బ్రాహ్మణుల ద్వారా సకలదేవతాపూజల నొనరించెను. గోపికలు గోపకులు సకలాభరణములం దాల్చి సంతోషమునఁ జిఱునవ్వులు ముఖముల నలంకరింపఁ ద్వరపడి నంద మందిరమును జేరిరి. జ్యోతిశ్శాస్త్రమునఁ బండితులగు పెక్కుమంది సిద్ధాంతులు వాఙ్నియమముగలిగి పుస్తకములఁ గరంబులం దాల్చి వేవేగ చనుదెంచిరి. విప్రపత్నులు సంతోషాంబుధిమునుంగుచు వయస్సు చెలువుసూప వచ్చిరి. వృద్ధవిప్రపత్నులును యశోదానందనుం జూడఁగోరి వచ్చిరి. బాలికాబాలకులు అందఱికన్న ముందు చనుదెంచిరి. నందుఁడు వారందఱ రత్నాభరణవస్త్రాదు లొసంగి

యలరఁజేసెను. సాదరముగా ననేక ధేనువుల వారి కొసంగెను. పెద్దలకెల్ల నమస్కరించి వినయమున వారి యాశిషములఁ బరిగ్రహించెను. వచ్చిన పెద్దలందఱు జయాశిషముల నీయఁగోరి యాబాలకుం గాంచి హర్షించి దీవించిరి. సిద్ధాంతుల యనుమతంబున నందుండు చేయఁదగిన కృత్యముల నెల్లఁదెలిసికొని యారీతి నొనరించెను. ఈరీతి సంస్కారసంస్కృతుఁడై యాబాలుఁడు సర్వజ్ఞుఁడయ్యుఁ బ్రాకృత బాలునిరీతి నలరారుచుఁ జంద్రరేఖవలె వృద్ధినొందెను. బలభద్రుఁడును నందమందిరముననే యుండి తల్లి స్తన్యమును గ్రోలుచుఁ బెరుగుచుండెను.

రోహిణియు సకలసుగుణాభిరాముఁ డగు రామునిం గాంచి పరమానందమున నలరుచు సజ్జనులకు ధనముల నొసంగెను. ముత్తైదువులకు నూనె, సిందూరము లోనగు వస్తువుల నొసంగెను. వా రావస్తువులం గైకొని యాశీర్వదించి తమతమ గృహంబుల కరిగిరి.

శ్రీకృష్ణమూర్తి యవతరించిన రాత్రి నందునకుఁ గుమారుఁడు గలిగె నను శుభవార్త వినఁబడగనే వృద్ధవనితలందఱు సంతోషమున మైమఱచి సూతికాగృహమునకు రాఁ బూని తమలోఁ దాము సంభాషించుకొనుచుండి

ఆ. ఏమి నోము ఫలమొ యింతప్రొద్దొక వార్త
వింటి మబలలార వీను లలర

మన యశోద చిన్ని మగవానిఁ గనె నఁట
చూచివత్తమమ్మ సుదతులార!

అని పలికిరి. ఈపద్యము పోతనగారి భాగవతమునఁ గనఁబడీ యెడు. ఈపద్యమునందుఁ గల "ఇంత ప్రొద్దోకవార్త, మన యశోద చిన్ని మగవాని గనె నఁట" యనుపదములకు మనలోఁ గొందఱు పండితులు విచిత్రరీతుల నర్థములఁ దెలుపు చుందురు. ఇంతకాలమునకు మంచివార్త వింటిమి. ఇది యాశ్చ ర్యజనకము. మనయశోద = మన మిఁక నీమెకు సంతానము గలుగదు. వృద్ధురా లగుచున్న దనుకొనుచున్న యశోద. చిన్ని మగవానిఁ = చిన్నిపాపనిని. ఆమె యొడ్డుకుఁ బొడవునకు నింత కాలమునకు జేనెడు బెత్తెడు మగవానిఁ గనె నఁట యని యప హాస్యముగ మాటలాడుకొని రని యర్థములఁ జెప్పుచుందురు. అట్టి యర్థము లీపద్యరత్నమునఁ గనరావు. చాలకాలమునకు మనయశోదకుఁ జిన్నిపాపఁ డుదయించె నఁట. త్వరపడి రండు. పోయి చూచివత్తుము. ప్రొద్దు పోయినదని మానరాదు. అని దీనిభావము. దీనిచే మహోత్సాహమునఁ జనుదెంచునట్లు గనఁబడునేగాని నవ్వులాటలుగా మాటలాడినట్లు గానరాదు.

శ్లో. గోప్యశ్చాకర్ణ్యముదితా యశోదాయా స్సుతోదయమ్,
ఆత్మానం భూషయాం చక్రు ర్వస్త్రాకల్పాం జనాదిభిః.

అని మూలము.

ఇట్టి ఘట్టములఁ బోతనమహాకవి తన చమత్కృతిని బలుభంగు లఁ జూపి యున్నవాఁడు. మూలార్థము నెంతయో జాగ్రత్తగాఁ బోషించెను. అంతతోమానక శాఖాచంక్రమణముగా నెన్నియో ధ్వన్యర్థములఁ గల్పించుకొని సృష్టి కర్తృత్వమునొందెను. అట్టిపద్యముల కిట్టి విపరీతార్థములఁ జెప్పుట సరసముకాదు.

ఇట్లు బలరామశ్రీకృష్ణులు సకలలోకమంగళకరు లుదయించిరి. ఆశుభదినమున గోకులమెల్లఁ జూడఁజూడ వేడుకగానుండెను. సంతోషమున విఱ్ఱవీఁగక సకలవిధాలంకారముల మేనులఁ గైసేసికొనక యున్న ప్రాణి లేకుండెను. గోవులు గోలోకనాయకుఁ డరుదెంచెఁ గదా యన్న సంతోషమున ద్విగుణముగాఁ బాలిచ్చెను. దూడలం బొరవంబులఁ దమ యానందమును దెలిపెను. పశువులకు నిట్టిజ్ఞానము లేదని కొందఱందురు. కాని వారి కించుక లోకజ్ఞానము తక్కువయనక తప్పినదికాదు. పాఠకు లీచాపల్యమును క్షమింతురుగాక.

'అంత స్సంజ్ఞా భవంత్యేతే సుఖదుఃఖ సమన్వితాః.'

అని వృక్షవిషయమునఁ బ్రాచీను లనువదించిరి.

శుచిర్భూత్వాతరోః పూజాం కృత్వా స్నానానులేపనైః,
రోపయే ద్రోపితశ్చైవ పత్రైస్తైరేవజాయతే.

బృహత్సంహిత. ౫౦ అ. ౮ శ్లో.

సాయం ప్రాతశ్చ ఘర్మాంతే శీతకాలే దినాంతరే,
వర్షానుచ భువశ్శోషే సేక్తవ్యారోపితాద్రుమాః. ౯ శ్లో.

ధ్రువమృదుమూలవిశాఖాగురుభం శ్రవణ స్తథాశ్వినీహస్తమ్,
ఉక్తాని దివ్యదృగ్భిః పాదపసంరోపణేభాని. ౩౧ శ్లో.

అని ప్రమాణములు కనుపట్టెడు. వృక్షములకుఁ బరిశుద్ధుఁడై పూజచేయవలయు నని చెప్పఁబడినది. స్నానానులేపనములే పూజయని ప్రతిపాదింపఁబడినది. ఇంతియగాక 'దివ్యదృగ్భిః పాదపసంరోపణేభాని ఉక్తాని' యని శ్రీ వరాహమిహిరాచార్యులు నేటికి పండ్రెండువందల సంవత్సరముల క్రిందట వచించిరి. జ్ఞానదృష్టిగల మహాత్ములు వృక్షముల స్థితిగతులఁ దెలిసికొనఁ జాలుదురని మోమోటమి మాని ఆచార్యులు వచించిరి. వృక్షముల విషయమై నూతనపరిశోధకులు ప్రాచీనోక్తులను దృఢపఱచుచున్నవారు గదా. ఈవఱకు నమ్మనివారిపుడు పండ్లికిలించుచు నబ్బా! పూర్వులమాటలు రిత్తలనుట బుద్ధితక్కువగదా యనుచున్నవారు. వృక్షముల విషయమై యిట్లుండఁగా నంత కన్న నెక్కువ జ్ఞానముగల వని మనుజులకుం దెలుపుచున్న పశువులకు నందును గోవులకు నట్టిజ్ఞానము లేదనుట కేవలము వెఱ్ఱితనముగాక మఱేమిటి?

పశుజాతిలో గోవులమించిన జ్ఞానముగలజాతి మఱొకటి గానరాదు. కాఁబట్టియే లోకమున మంచివానిని "గోవు వంటివాఁడు" అనుట. గోవు మనుష్యులకుం గూడ నుదాహరణమైనది. చూచితిరా. దానియం దెంత మహిమముగలదో. అట్టిగోవులు శ్రీకృష్ణపరమాత్మ యవతరించు తఱిఁ దమ

యానందమును దెలుపు ననుట న్యాయమే గాని యిం దాశ్చ ర్య మేమియు లేదు. మఱొక్క యాశ్చర్యము గనఁబడియెను. గోవుల కట్టి జ్ఞానము లేదనుటయే యచ్చెఱువును బుట్టించును. అట్టివారమాట యిటఁ బ్రస్తావింప నేల? ప్రకృత మనుసరించెద. ఇట్లు గోకులం బంతయు సంతసమునఁ బొదలుచుండెను. యశోదారోహిణులు నందుఁడు మహానందసాగరమున మునిఁగి తేలుచుండిరి.

## శ్రీకృష్ణమూర్తి బాల లీలలు.

శ్లో. అపాంగరేఖాభి రభంగురాభి
రనంగలేఖా రసరంజితాభిః,
అనుక్షణం పల్లవ సుందరీభి
రభ్యర్చ్యమానం విభుమాశ్రయామః.

శ్రీకృష్ణకర్ణామృతము ౧౦ శ్లో.

శ్లో. కరారవిందేన పదారవిందం
ముఖారవిందే వినివేశయంతమ్,
వటస్య పత్రస్య పుటేశయానం
బాలం ముకుందం మనసాస్మరామి.

ప్రాక్తనసూక్తిరత్నము.

పాఠకులారా! భక్తిరసప్రపూర్ణహృదయులారా! శ్రీపరమేశ్వరుఁడు గోలోకమునుండి సకలకల్మషవినాశార్థ మవతరించిన కథను బఠించితిరి. వారికిముందే యవతరించి తత్సహాయ

మొనరింప సంసిద్ధులగు దేవతలలోఁ గొందఱ చరిత్రము లీవరకే చదివితిరి. ఇఁక నారాయణమూర్తికిఁ గుడిభుజమనందగి దుష్ట సంహారమునకుఁ దోడ్పడఁ జాలు నరుని (అర్జునుని) జన్మమును వినవలసియుండును. ఐనను శ్రీహరి యుదయించినవెంటనే లోకులకుఁ గనఁబఱచిన సర్వజ్ఞత్వ సర్వనియంతృత్వముల ను ముందుగాఁ బఠింపఁగల కుతూహలము భక్తుల కుండునని నేనెఱుంగుదును. కాన నర్జునుఁడు లోనగు వారిజన్మముల నిట వ్రాయఁబూనక శ్రీకృష్ణబాలలీలల నిపుడు వ్రాయఁ దలంచితి. కొన్నింటిని వ్రాసి యవ్వల నర్జునాదులజన్మకథనమును దెలిపెద. ఇది యొకయపరాధముగా భావింపరని నమ్మెదను.

శ్రీకృష్ణపరమాత్మ తొలుదొలుతఁ దల్లిదండ్రులకుఁ దన సర్వజ్ఞత్వమును దెలిపెను. సర్వకర్తృత్వమును క్రియారూపముననే కనఁబఱచెను. తన యఘటనాఘటనశక్తి యమునా సంతరణమున వసుదేవునకుం గనఁజేసెను. తన సర్వాతిశయిత్వము ను జన్మింపఁగనే హితబోధరూపమునఁ దెలిపెను. తనసగుణ బ్రహ్మత్వమును మాయాశక్తిని దెచ్చి యిటనుంచుఁడనుమాట వలననే యెఱింగించెను. ఇట్టి పుణ్యామునకుఁ బౌత్రుఁడగు వసుదేవునివంటి ధన్యుఁ డింకొకఁడు భూలోకమునఁగా దేలోకము నందునైన నుండునా యని సంశయింప నేల? ఉండఁడు.

శ్రీహరి యాజ్ఞానుసారము వసుదేవుఁడు కృత్యముల నిర్వహించి సఫలమనోరథుఁడయ్యెను. దేవకీదేవియుఁ గృతకృ

త్య యయ్యెను గాని యాదంపతులకు మనసులఁ గొంత లేద నరాదు. నందునితో నిన్నుఁ దండ్రిగా భావించు నాకుమారుఁ డున్నవాఁ డనుపలుకు వలననే యీవిషయము తేలకపోదు. స్త న్యదానమున నాబాలుని నలరించుభాగ్యము లేకపోయెఁ గదా యని దేవకీదేవికిని, కుమారు నెత్తుకొని ముద్దాడి యీబాలుఁ డు నాకుమారుఁ డని యేకవచనమున నలుగురితోఁ దెలుపుచు నానందించు నదృష్టము లేకపోయెఁ గదా యని వసుదేవునకు ను గొంత లుండనే యుండెను. కాని నందగోకులమునఁ దమ కుమారుఁడు సుఖముగఁ బెరుగుచుండుటయే చాలు నను నా నందము మాత్రము వారి కొంత నాపుచు వగను గలిగింప కుండెను. నందగోకులమునకుఁ బలుమాఱులు పోకుండెను. తుద కు బలభద్రునింగూడఁ బలుసారులుచూచి ముద్దాడి పెంచుభా గ్య మావసుదేవునకు లేకపోయెను. కాఁబట్టియే కాఁబోలు శ్రీ త్యాగరాయులు "కుమారా! రారా! యని పిలువనోచిన దశర థుఁడు తప మెంత చేసెనో తెలియఁ జాల" నని పలికెను. అ ట్టి పుణ్యమునకు వసుదేవుఁ డీజన్మమునఁ బాత్రుఁడు కాఁడయ్యె ను. కారణ మేమని ప్రశ్నమేల? వసుదేవుఁ డన నెవ్వఁడు? కశ్యపమహర్షి గదా. ఏల యీమర్త్యలోకమునఁ బుట్టెను? లో భగుణమునఁ జేసిన యకార్యమునఁగదా. అది యెట్లు తప్పును? సకలదుర్గుణములకును జననివంటిది లోభగుణము. దానికి లోఁ బడువారల కిడుమలు రాక యెట్లుతప్పును? పూర్వకర్మములు

ఫలవంతములు కాక విడువవను సూక్తి మఱువరానిది. కాఁబట్టి యాపుణ్యమునకు వసుదేవుఁడు నోచకున్నను భగవంతునకుఁ దండ్రియగు మహాపుణ్యమునకుఁ బాత్రుఁడయ్యెను. అది చాలదా. ఇంతకు మించిన పుణ్య మిం కేమి కావలయును?

యశోదానందుల పూర్వచరిత్రమును ముందే చదివితిరికదా. కడుపున శ్రీహరిని గన నోచకున్నను మూలప్రకృతిని బుత్రిగాఁ గననోచిరి. శ్రీహరిని జననానంతరమునుండి పెంచ నోచిరి. ఆదంపతుల పూజాఫల మింతింత యని వచింప నలవియగునే. కావున నీకుఁ దడవుచేయక శ్రీకృష్ణబాలలీలలఁ గొన్నింటి వ్రాసి యవ్వల నరాముల జననమును వ్రాసెద. మహాత్ములారా! ఒక్కొక్కలీలయు భగవంతునిశక్తికి మించినకార్యము లేనేలే దని లోకమునకుఁ జాటును. కాన భక్తియుక్తులై కుప్రశ్నములు చేయు నూహాలకు నించుకయుఁ జోటీయక పఠింపుడు. భగవచ్చరిత్రమును జదువుటకంటె మనమెక్కువ సత్కృత్యములఁ జేయఁజాల మని నిశ్చయించుకొనుఁడు. ఇఁకఁ గథ వినుఁడు.

కంసున కాకాశవాణి కర్తవ్య ముపదేశించుట.

*అటఁ గంసుఁ డుదయమునలేచి కృత్యములం దీర్చి సభ నలంకరించెను. ప్రలంబాది దుష్టదనుజులు సభ నలరారుచుండిరి.

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము పదియవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

స్వర్ణ సింహాసనమునఁ గూరుచుండి కంసుఁడు రాజ్యపాలనము చేయుచుండెను. తొలినాఁటి రేయి తనచింతను మరలఁ బ్రలంబా దులకు నుచితరీతుల నోరు లెఱుంగకుండఁ దెలుపుచుండెను. ఇట్టులుండఁగా దైవవాణి కంసుని శ్రుతిపథముల నిట్లు చక్కఁగాఁ బ్రవేశించెను. అది సత్యసంయుతమై స్పష్టాక్షరమై వినఁబడియెను.

"ఓరీ మహామూఢుఁడా! ఏల చింతించెదవు. నీమేలు దేనఁగలునో యీ యాలోచనము చేయుము. నీకంతకుఁడు భూతలమున నవతరించెను. రాజా! మృత్యునిబర్హణోపాయ మాలోచింపుము. వసుదేవుఁడు నిన్నుం జంపఁబుట్టినకుమారుని నందునకొసంగి కన్యక నందుండి కొనివచ్చి నీకొసంగి మాయామోహితుఁడై యున్నాఁడు. ఆబాలిక మహామాయాంశసంభూతురాలు. వాసుదేవుఁడు సాక్షాద్ధరియే. నీకు మృత్యువై జనియించి యిపుడు గోకులమున నందమందిరమునఁ బెరుగుచున్నవాఁడు. దేవకీసప్తమగర్భము నందునిసౌధమున వెలయుచున్నది దేవకి యేడవగర్భము చెడిపోలేదు. అమృతుఁడగు పుత్రుఁడం దుదయించుట నెఱింగి మాయాంబ యాగర్భమును జేకొని తనయపారశక్తిచే రోహిణీగర్భమున నునిచెను. ఆమెకు శేషాంశమున బలదేవుఁ డన మహాబలుండగు తనయుఁ డుదయించెను. గోకులమున నాతనయు లిద్దరు నీకు మృత్యురూపులై నందునింట దినదినాభివృద్ధినొందుచున్నవారు. కావున నీఁక జాగరూకుఁడవై యుండుము. హితముఁ దెలిపితిని"

ఈరీతి నంబరవాణి వినంబడంగాం గంసుండు నస్రుకంధరుం డయ్యెను. సకల విషయవిరక్తుండై యాహారమును మాని చింతాసముద్రమున మునింగెను. తుద కున్మత్తుం డయ్యెను. కొలువు సాలించి యింటికిం బోయెను. ఏకార్యమును జేయను మనసు రానందున బాలఘాత మొనరించుటయే యిప్పని పని యని నిశ్చయించెను. ఇందుల కేదియుపాయ మని చాలసే పూహించెను. ఒక యాలోచనము తన మదికి సరిపడంగా నిదియ యిపుడు చేయందగిన దని యెన్నుచు రహస్యమును దెలుపంజాలిన చారు నొకనిం బిలిచి యీక్షణము పోయి పూతన యను రక్కసిం బిలుచుకొని రమ్మా యని పంపెను. వాండాక్షణము పోయి దానిం దోడ్కొని వచ్చి తనప్రభువు చెంత నిలిపెను.

## కంసుండు పూతనను గోకులమునకుం బంపుట.

ఆపూతన కంసునకుం బ్రాణములకంటెం బ్రీతిపాత్రురాలు. ఆరక్కసి సాధ్వియే. కంసునకు హితమగు పనిం జేయునది. అందులకే కంసుండు నారదవాక్యానంతర మాదానవిని బిలిపించి రక్షించుచుం దనకు వలసినతఱి యరుదెంచెనేని కృత్యమును దెలుపుదు ననియె. ఆమెయు లోకమున నందులకే పుట్టినది. రాక్కసి. ఆమెను గంసుండు సోదరిసిగా భావించుచుండెను. అత్తఱి వచ్చిన సోదరిం గాంచి నీతివచనముల నిట్లు పలికెను. ఆమెతో మాటలాడినచోటు గృహమున నలరు సభా

స్థానము. సోదరీ! పూతనా! గోకులమున కిపుడే పొమ్ము. నాకా ర్యము నీయదిగా భావింపుము. నంద మందిరము నుపాయమునఁ ప్రవేశింపుము. అందొక్క బాలకుఁ డద్భుతదర్శనుఁడుండు. స్త న్యము విషాక్తమై యుండునట్లు చేయుము. ఉపమ నాశ్రయిం చి యెట్లో ఆబాలునకుఁ బాలిమ్ము. ఇప్పని శక్యమా యనకుము. నీవు మనోవేగముగలదానవు. మాయాశాస్త్రమున నీవంటివా రు లేరు కదా. కాన నీరూపమును మఱుగు పఱిచి మాయా మానుష విచిత్రరూపమును దాల్చి యోగినీ! నందునింటికిం బొమ్ము. ఇంతియగాక నీవు దుర్వాసుఁడను మునివలన మంత్ర మును గ్రహించితివి గదా. దానిచే నెచ్చటికైనఁ బోఁగల శక్తి నీకలరునుగాదే. నీవలసినరూపమును దాల్పఁ జాలుదు వని నే నెఱుంగుదును. నీప్రఖ్యాతియు నేఁదెలియుదును. కాన నాహిత ము పొంటె ఏతత్కృత్యము నొనరింపుము. అని పలికి యూర కుండెను.

పూతనయుఁ గంసహితము నొనరింపఁ గంకణముక ట్టు కొనియుండునది. ఆసమయ మాతనికి ముఖ్యతమ మనియు నె ఱుంగును. కాన సోదరీ! యని పిలిచి యాజ్ఞాపించిన కంసునిం గాంచి యట్లే యొనరించెద నని సమ్మతిమీఱఁ బలికి నమస్క రించి తదాజ్ఞను శిరసావహించి కామచారిణి గాన వెంటనే మధురానగరమును వదలి వెడలెను.

ఆపూతన క్రొత్తరూపము నొకదానిందాల్చెను. ఆరూప మాదిశేషువునకేని వర్ణింప నలవిగాకుండెను. ఆమె దేహచ్ఛాయ పుటముపెట్టిన బంగారమును దిరస్కరించుచుండెను. భూషణములు సురుచిర సకలరత్నమయములై వెలయుచుండెను. మాలతీమాల్యముల నలంకృతమై కబరీభారము ముద్దులు మూటగట్టుచుండెను. అలికమునఁ దిలకము కస్తూరీబిందురచితమై వింత కాంతి నిచ్చుచుండెను. మొలయందలి యొడ్డాణెము పాదాలంకృతమగు మంజరీద్వయము కలరవముల నీనుచుండ నారక్కసి నడచునపుడు సెబాసననివాఁడుండఁడు. ఇట్టి నిరుపమానరూపమును దాల్చి పరులకుఁ బ్రవేశింప నలవిగాని గోకులము నెట్లో ప్రవేశించెను. ఆగోకులమున కలంకారము సుందరనందమందిరమే. ఆగోకులము సముద్రమువలె గంభీరములగు పరిఖలచే సంవృతమై యలరుచుండును. ఆపరిఖలనిండ జలము భయమును గల్గించుచుండును. దానిని జూడఁగనే గోకులమును బ్రవేశింపక దుష్టులు పరుగిడిపోవుచుందురు. ఆనగరము శ్రీకృష్ణపరబ్రహ్మ మవతరించి యిటఁ బెరుగఁ గలఁడని ముందే విశ్వకర్మ రత్నముల నలవరించెను. అంతఁ బ్రతిగేహము ఇంద్రనీలమరకతపద్మరాగరత్నవిభూషితమే గాని పాషాణ నిర్మితము కానేకాదు. గృహములన్నియు విచిత్రశిఖరోజ్జ్వలములై సువర్ణకలశవిభూషితములై యుండును. నాలుగు ద్వారములు గలిగి యాకసము నొరయుచుండు ప్రాకారములు

పెక్కు లాపురమును గాచుచుండును. ఆద్వారము లొక్కొక్కటియు లోహమయకవాటములు గలిగి ద్వారపాలసంరక్షితములై యుండును. సుందరీబృందము లానగరవీథుల వేడుకగాఁ దిరుగుచుండఁగా దివినుండి దేవతలు కన్నులపండువుగాఁ జూచుట గలదు.

ఆగోకులమునఁ గోటికి మిక్కిలిగ గోవులుండును. వాని కొమ్ములకు, మెడలకు, ముత్తియపుసరులు, మాణిక్యహారములు, సువర్ణదామములు వేయఁబడియుండును. పాలుపిదుకుటకై స్వర్ణపాత్రములు, బంగరుకుండలు కనబడుచుండును. ఇంటింటను సేవకులుండుట యాపురియందువాడుక. గోపాలకులు సంఖ్యకు మిగిలి యుందురు. దాసీజనులు లక్షలు కనఁబడుదురు. అందఱును స్వస్వకార్యవ్యగ్రమతులేగాని యూరక తిరుగువారుగారు. ఆనగరము సత్యముగా పరంధామునకు నివాసార్హముగనే యుండెను. గోలోకమునుండి గోపకు లెందరో యం దవతరించి క్రిక్కిరిసియుండిరి. గోలోకమును వీడి శ్రీపరమేశ్వరు నాలింగనాదుల నలరింపఁగోరి గోపిక లవతరించిన దాపురమునందే. స్వర్గలోకమునుండి శ్రీహరిం గోరి యవతరించిన పదాఱువేలఁ ఱేఁబదియొండి కాంతలలోఁ గొంద ఱందుఁ గలరు. మఱికొందఱు రాజకన్యకలై పుట్టిరి. మఱికొందఱు బృందావనసమీపమునఁ బుట్టిరి.

ఆనగరము నాపూతన మనోహరాకారముతో సంతోషమును వెలిఁబుచ్చు చిఱునగవుతోఁ బ్రవేశించెను. దానిందిలకించి యచ్చెరువాఁది యందలి సుందరులు తమతమగృహములకు రా ననుమతించిరి. కొంతమంది దానింగాంచినంతనే యావనితామణి పద్మాలయ యగు లక్ష్మియా? లేక త్రిభువనముల మోహసముద్రమున ముంచఁజాలు రూపగరిమ నలరు దుర్గాదేవియా? మన బాలకృష్ణునింజూడ వీ రిద్దఱిలో నొకరువచ్చిరి. ఇట్లు కొంద ఱూహించునంతలో గోపికలు గోపాలురు ఆమెకు వందనములొనరించి కుశలములడుగసాగిరి. కొందఱు పాద్యములర్పించిరి. మఱికొందఱు సింహాసనమునఁగూర్చుండుమా? యని వేఁడిరి.

పూతనయు వారిసాదరంబుగా వీక్షించి కుశల మడిగెను. ఎంతో గౌరవముట్టిపడ సంభాషించెను. ఈసాధ్వి సాక్షాల్లక్ష్మియే యని వారి నమ్మించెను. ప్రతిగృహమును జూచుచు నందమందిరమును బ్రవేశించెను. అందు దాసీజనులు మర్యాద లొనరించిరి. దయచేయుమా? యని వేఁడిరి. ఆమెయు వారిచ్చు పాద్యమును సాదరముగా గ్రహించెను. ఉచితపీఠమున నలంకరించెను. కూరుచున్నంతనే చెంతఁ గూరుచుండి గోపికలు మన్ననమీఱ నీవిపుడు మాకీశ్వరివి? నీ నివాస మెందు? నీపేరేది? ఏకార్యమును గోరి యిట కరుదెంచితివి. తెలుపుమా? యని లలితవచనము లాడిరి. ఆరక్కసియు నా నారీమణుల యకృత్రిమానురాగమున కలరి మధురవాక్కుల నిట్లు పలికె

ను. నేనుండు నది మథురాపురము. గోపి యని నన్నందఱు పిలుతురు. నే బ్రాహ్మణిని. పదిమంది చెప్పుకొను మాటలలో అతిశయమంగళ సూచకమగు నొకవార్తను దెలిసికొంటి. చాల కాలమునకు నందునకుఁ బుత్త్రుఁడు కలిగె నఁట. ఇది చక్కని యదృష్టము గదా. ఈమాట వినఁబడఁగానే మదిలోని సంతసమును బట్టఁజాలక యాచిన్నికొమరునిఁ జూడఁగోరియు నాశీర్వదింపఁ గోరియు వచ్చితిని. ఇదియ నాయాగమనకారణము. అక్కలారా! యాశిశురత్నమునుఁ దెచ్చి నాకుఁ జూపుఁడు. తనివితీఱఁ జూచి యాశిషము లిడి నాయిష్టముఁ దీర్చుకొని వెడలుదు. అని తేనెలొలుకు పలుకుల వారి నలరించెను.

యశోదయు నాబ్రాహ్మణి (పూతన) చెప్పినమాటల కానంద పరవశురా లయ్యెను. తన యదృష్టము మథురాపురమునఁ గూడఁ బొగడ్తఁగాంచె గదా యని హృష్టురాల య్యెను. వెంటనే యామె కోరినట్లు తన కుమారు నెత్తుకొని వచ్చి యాబ్రాహ్మణికి నమస్కారముచేయించి యామె చేతికిచ్చెను. ఆమెయుఁ బ్రేమ ముటిపడ నాముద్దులయ్య రాగా! రారా నాతండ్రీ! నినుఁజూడఁగోరి వచ్చితినిరా! కృష్ణా! నీకోరికదీఱ నాయొడిలోఁ గూరుచుండుము. స్వామీ! యని పలుకుచుఁ బొదిగిట నిడుకొని తడవి తడవి చూచి యాకొడుకును ముద్దాడెను. శిరసుమూర్కొనియెను. సుఖాసీనురాలై ముద్దాడుచు స్తన్యము నీయఁబూనెను. నాపుణ్యము పండినది. రారా

ముద్దు కృష్ణా! యని పలుకరించెను. ఆకుమారుని యాకారము చక్కఁగాఁ జూచి యబ్బురపాటున నమ్మలారా! ఈబాలకుఁ డద్భుతాకారుఁడు. సుందరుఁడు. గుణములచే నారాయణతుల్యుఁడు. గోపసుందరి యగుయశోదపుణ్యమున జనించెను. ఇట్టి వాఁడు లోకమున లేఁడు. అని పలుకుచు యశోద కానందమును గల్గించుచు దన కోరికలీడేఱె నని తలంచి స్తన్యము నీయసాగెను.

శ్రీకృష్ణుఁ డప్పుడే మేలుకొని నట్లు నటించెను. ఆవులించెను. ఇంచుక దేహము నిక్కించెను. కన్నులు తెఱచి యారక్కసిం జక్కఁగాఁ జూచెను. ఇంచుక నవ్వెను. మరలఁ గన్నులు మూసికొనియెను. మరల నావులించెను. ఆఁకలికొన్న యట్టిచందముఁ గనఁబఱచెను. రెండుచేతులు సాఁచెను. దేహము సంకుచితముగ నొనరించెను. ఏమియుఁ దెలియని యట్లు ఆమె ముద్దాడఁగా నూరకుండెను. నాకుమారా! పాలు త్రాగుమా! ఇంతదూరము నీకొఱకై వచ్చితిని నాముద్దుఁ దీర్పుమా? యని యారక్కసి వేడఁగా నట్లే కానిమ్మను నూహను గనఁబఱచు నట్లు స్మితమొనరించెను. బాలచేష్టలు చూపి దానిని మోసపుచ్చెను.

అంతలోఁ గొందఱు గోపికలు వచ్చి అమ్మా! మాపాపనికి నీవు పాలీయకుము. క్రొత్తవారిపాలు మాపిల్లవానికి సరిపడవు. నీబుజ్జగింపులు చాలు ననిరి. మఱికొందఱు పాపమీ యమ్మ

యమ్మధురానగరమునుండి యింతదూరము వచ్చినది. ఎత్తుకొన్న నేమి భయము. అని సమాధానము చెప్పిరి. ఇట్లు వీరిలో వీరాక్షేపసమాధానములతోఁ గాలము గడుపుచుండఁ ద్వర పడి యాపూతన పైఁటచెఱఁగు బాలునిముఖమున కడ్డముగాఁ గట్టి కంచుకబంధము సడలించి స్తన్యమునీయ మొదలు పెట్టెను. బాలుఁడును మహాసంతోషమునఁ బాలుత్రాగఁ బూనెను. సవ్యహస్తమున నాపూతన కుడివక్షమును బీడించుచుఁ బాలు త్రాగుచుఁ గుటుకుగుటుకుమను చప్పుడు వినఁబడు చుండఁగాఁ దనశక్తిమెయి యాదానవి ప్రాణపంచకమును బీల్చెను.

ఒక్కొక్కచుక్కపాలు త్రాగుకొలఁది దానిముఖకాంతి తప్పుచుండెను. నేత్రశోభయడుగంటెను. ముఖము వెల వెల బాఱసాగెను. చేష్టలు మార్పునొందెను. దేహచ్ఛాయ వికార ముగాఁ జూపట్టెను. గుండెలు తటతటఁ గొట్టుకొన మొదలు పెట్టెను. ఇదేమిబాలుఁడమ్మా ప్రాణము విసుగుచున్నది. అబ్బా? చాలురా నాయనా? నీవెక్కడి పిల్లవాఁడవురా. అబ్బా! అబ్బా యనునంతలో శ్రీకృష్ణమూర్తి మైదుగ్రుక్కలు పాలుత్రాఁగెను. పంచప్రాణములు పీల్చెను. దాని విషక్షీర మా పరమేశ్వరున కమృతప్రాయ మయ్యెను. ఇంతలో నది తాళఁజాలక బాలుని పాఱవేయఁజూచెను గాని యప్పని కది సమకట్టులోపలఁ బ్రాణము లేకనిలువఁజాలమని వెడలిపోయెను. దానియత్నము మాయమయ్యెను. నాలుక వెడలఁబెట్టి వికారధ్వనిచేయుచు

నది క్రిందఁబడియెను. ఆవికారధ్వనితోఁటి మైదవప్రాణము దానిమేనుతోఁటి మైత్రిని మానుకొనియెను. పూతన భూమిపై మెల్లఁగాఁ దొరలెను. అప్పుడు దానిముఖము రక్కసిముఖము వలెఁ గనుపట్టెను. సుందరరూపము కనఁబడదయ్యెను.

అంత నద్దానవి స్థూలశరీరమును వదలి సూక్ష్మశరీరమును ధరించి విమానము నధిష్ఠించెను. ఆవిమానము రత్నసారవినిర్మితము. పార్షదప్రవరు లావిమానమునుగొని వచ్చియుండిరి. శ్వేతచామరము లొప్పుచుండెను. దర్పణము లెల్లచోఁ వ్రేలాడుచుండెను. అగ్నివలెఁ బరిశుద్ధమగు సూక్ష్మవస్త్ర మావిమానమును బరివేష్టించి యెంతో వింతగఁ గనుపట్టుచుండెను. రత్నకలశములు బహువర్ణచిత్రములై దాని నలంకరించియుండెను. శతచక్రములు దానఁగనుపట్టుచుండెను. ఆవిమానము సుందరవస్తువుల కుదాహరణముగ నుండెను. రత్నకాంతులచే నది ప్రకాశించుచుండెను. పార్షదప్రవరుఁ డాపూతనను మర్యాదగా నావిమానమునఁ గూరుచుండఁజేసి చామరలువీచుచు నచ్చరలు సేవింప నమందానందమునొందు నాపుణ్యాత్మురాలిని గోలోకమునకుం గొనిపోయిరి.

భక్తజనశేఖరులారా! పూతనచరిత్రమునువింటిరి. ఈకథ క్రొత్తదిగాదు గాని యిందలి రహస్యములు క్రొత్తవియే. అనఁగా మరల మరల స్మరింపఁదగినవి. పరమదుష్టబుద్ధిగల నిశాచరిగదా పూతన. కంసునిచెంతనుండి యనేక దుష్కార్యములాచ

రించునది. భూతదయాపశ్చాత్తాపములు దానికి లేవనుట స్పష్ట
ము. ఇంతియగాక మాయాస్వభావము గలది. కపటాత్ములకు సు
గతి చేకూరదని పెద్దలందురు. శాస్త్రము లట్లే ఘోషించును. పు
రాణములు "తథాస్తు" అనును. ఇతిహాసరాజు లట్లేయని యం
గీకరించును. ఇట్టి పాపాత్మురాలు పూతనయని యీగాథవలన
నే తేలినదికదా. కంసుఁ డీదుశ్చరితను విషసహితక్షీరముల నిచ్చి
నందమందిరమున నానందపరవశుఁడై యున్న యానందనుని
మ్రందునట్లు చేసి రమ్మా యని పంపెను. ఇదొక గొప్పకార్య
మాయని యిక్కఱకు రక్కసి మాయాశక్తిని సుందరాకార
మును ధరించెను. కార్యమిషయమున నందుఁ డున్న గోకులము
ను జొచ్చెను. అందఱ మోసపుచ్చెను. యశోదగృహమునకుం
బోయెను. మర్యాదలందెను. బాలుని ముద్దాడెను. తండ్రీ! ప్రా
లుత్రాగుమా! నాముద్దులకృష్ణా! రారా! యని పలుకరించెను.
చివరకు అందఱకన్నులలో విశ్వామిత్ర చూర్ణముచల్లి బాలు
నెత్తుకొనియెను. శిరముమూరుకొనియెను. చుబుకము దువ్వెను.
చక్కఁగా నెత్తుకొని వక్షస్థలమును జేర్చెను. ఇతరులు చూచి
మోసపోవలెనని యతిశయ ప్రీతిని గనఁబఱచెను. ముహూర్త
మాత్రము శ్రీకృష్ణమూర్తిదేహమునఁ దనదేహమును బవిత్ర
ము గావించుకొనియె. పాలిచ్చెను. అపుడుగూడ ప్రేమముట్టిపడ
భగవంతుని శ్రీమద్దివ్యనామమును స్మరించెను. ఇంతలోఁ బ్రాణ
ములు పోయెను. ప్రాణోత్క్రమణసమయమున నాకృష్ణదివ్య

మంగళవిగ్రహమును జూచుచునే పడిపోయెను. వెంటనే దివ్య విమానారూఢురాలయ్యెను. గోలోకమునకుఁబోయెను. ఇది కదా కథాసారము. ఇందేది గ్రహింపఁదగిన విషయము? తొలుదొలుతఁ గొందఱ కీవృత్తాంత మసంగతముగాఁ దోఁచును. ఇంచుక యాలోచించిన నాయూహ సమంజసము కాదని స్ఫురింపక మానదు. ఇట్టిపాపాత్మురాలు పూతన ప్రారబ్ధము ననుభవింపక యెట్లు సుగతికిఁ బోవునని యెుండి ప్రశ్నము చేయరాదు. ఏనియమముగాని భగవంతునియందు మార్పునొందును. లోకనియమములు భగవత్కృత్యములయందు విరుద్ధములగును. అఘటనాఘటన సమర్థుఁడను పేరా మహాత్మునకు వచ్చిన దెందులకు? ఎట్టి దుర్ఘటకార్యమునైనను సులువుగ సాధింపగలఁడు. ఎంత సులభసాధ్యకృత్యమునైన సాధింప నశక్యముగా జేయఁగలఁడు. కావుననే యప్పరమపురుషునకు సర్వేశ్వరనామము ప్రసిద్ధమయ్యెను. ఇఁకఁ గథా నీతి సారము వినుఁడు.

ఎట్టి దుష్టుఁడుగాని యంత్యకాలమున శ్రీభగవంతుని స్మరించినచో ననేకజన్మకృతసకలదురితములు తొలంగు. "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అన్నసూక్తి యిటుఁ జెల్లదు. ఇది సామాన్యశాస్త్రము. సామాన్యశాస్త్రము విశేషశాస్త్రముచే బాధింపఁబడును.

"సత్యాన్నాస్తి పరోధర్మః"

అనువిధివాక్యము గూడ సర్వకాలము కాదు. ఒక్కప్పు డది

విధివాక్యముగాదు. ఒక్కొక్కసమయమున దీని నుల్లంఘింప వలయు నని స్మృతి చెప్పుచున్నది.

శూద్రవిట్క్షత్ర విప్రాణాం యత్రర్తోక్తా భవేద్వధః,
తత్రవక్తవ్య మనృతం తద్ధి సత్యా ద్విశిష్యతే.
మను. ౮. అ. ౧౦౪ శ్లో.

వర్ణినాం హి వధోయత్ర తత్రసాక్ష్య నృతం వదేత్,
తత్పావనాయ నిర్వాప్య శ్చరుస్సారస్వతోద్విజైః.
యాజ్ఞ. వ్యవహార. ౮౩ శ్లో.

ఈ స్మృతివాక్యములం గాంచితిరికదా. "సత్యా న్నాస్తి పరోధర్మః" అనునది సామాన్యశాస్త్రము. "శూద్రవిట్ క్షత్ర విప్రాణామ్" అను నది విశేషశాస్త్రము. వేదములఁ బఠించి తదర్థము నెఱింగిన మన్వాదులే యిట్లు తెలిపిరి. కావుననే నియమముగాని యొకానొకప్పుడు ప్రవర్తింపకవ్యర్థమగు. అపుడు విశేష విధి ప్రవర్తిల్లు. కావుననే "ప్రారబ్ధం భోగతోనశ్యేత్" అను నది భగవత్కృత్యములచే మార్పునొందంపఁబడు. అనఁగా భగవత్కరుణకుఁ బాత్రులు కానిచో ప్రారబ్ధకర్మము ననుభవింపక తప్ప దని యర్థము చెప్పక తప్పదు. కాఁబట్టి పూతన సకలపాపముల నాచరించినను అంత్యకాలమున శ్రీకృష్ణపరమాత్మ దేహమును స్పృశించి ముద్దాడి యాపరమేశ్వర నామవర్య మనఁ దగు శ్రీకృష్ణశబ్దమును బ్రీతిమీఱ నుచ్చరించెను. ఆ ప్రీతి వాస్తవమా? యని ప్రశ్నింపరాదు. ఎట్టిది కానిండు.

ఫలింపక తప్పదు. భగవన్నామము ఎట్లుచ్చరించినను ఫలిం
చును. అగ్నిని తెలియక స్పృశించినను గాల్చును. అట్లే భగ
వద్దివ్యనామము ఫలము నీయకమానదు.

శ్లో. నైకాంతికం తద్ధి కృతేఽఘ నిష్కృతే
మనః పునర్ధావతిచేద సత్పథే,
తత్కర్మ నిర్హార మభీప్సతాం హరే
ర్గుణానువాదః ఖలుసత్త్వభావనః.
అథైనం మాపనయత కృతాశేషాఘ నిష్కృతం,
యదసౌ భగవన్నామ మ్రియమాణ స్సమగ్రహీత్.
సాంకేత్యంపారి హాస్యం వా స్తోభం హేళన మేవవా,
వైకుంఠనామ గ్రహణ మశేషాఘ హరం విదుః.
పతితః స్ఖలితో భగ్న స్సందష్ట స్తప్త ఆహతః,
హరి రిత్యవశేనాహ పుమా న్నార్హతి యాతనామ్
అజ్ఞానా దథవా జ్ఞానా దుత్తమశ్లోకనామయత్,
సంకీర్తిత మఘం పుంసో దహత్యేథో యథాఽనలః.
శ్రీభాగ. ౬ స్కం. ౧౨ శ్లో.

అజామిళోపాఖ్యానమునందలి శ్రీశుకోక్తులీయవి పై
విషయమును దృఢపఱచుచున్న యవి. అంత్యకాలమునందుఁ
బూతన శ్రీకృష్ణమూర్తి దివ్యసుందరమంగళమూర్తిని జక్కఁ
గా వీక్షించి స్పృశించెను. ఇంతియగాక సంభాషించెను.
కాఁబట్టి సకలపాపములు నశింప నాకాంత ముక్తికాంతామంది

రమునకుఁ బోవఁ బాత్రు రా లయ్యెను. ఈవిషయమున శంక లింకను గలుగకుండ భగవద్గీతాశ్లోక్తి నుదహరించుచున్నాఁడను.

శ్లో. అంతకాలేచ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరమ్,
యః ప్రయాతిసమద్భావం యాతినాస్త్యత్రసంశయః. ౫
యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్,
తంత మే వైతి కౌంతేయ! సదా తద్భావభావితః. ౬
తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్యచ,
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామే వైష్యత్యసంశయః. ౭
అక్షరపరబ్రహ్మయోగము.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసియుక్త్వైవమాత్మానంమత్పరాయణః.౩౪
రాజవిద్యారాజగుహ్యయోగము.

ఈభగవద్గీతాసూక్తులఁ బరిశీలింపుఁడు. సకలసంశయములఁ బోఁగొట్టును. భగవంతుఁడే యీరీతిగాఁ బలికెను. కాఁబట్టి ఎట్టిపాపాత్ముఁడైనను మరణకాలమున భగవన్నామమును స్మరించిన, వీలులేనిచోఁ దలంచిన సకలపాపవినిర్ముక్తుఁడై ముక్తి నొందఁగలఁడు. అట్లుగాక నిరతవిషయములం జింతించిన సంసారాంధువునఁ గూలఁగలఁడు.

ఇంతియగాక మఱొక్కవిషయ మిటఁ దెలుపక తప్పదు. పూతన రక్కసి. భూభారహరణార్థమే యవతరించినది. ఇట్టి వా రవతరింపకున్న నధర్మము వృద్ధినొందుట పొసఁ

గదు. అది పోసఁగకున్న భగవంతుఁ డవతరింప నవకాశ మొదవదు. కావునఁ గ్రూరులు కూడ భూభారమును దగ్గింపఁ దోడ్పడు రని తెలిసికొనవలయు. అట్టివారు భగవంతునిచే మృతి లభించునా యని కోరుదురు. రావణాదులు కోరలేదా. కాఁబట్టి శ్రీకృష్ణపరిపీతప్రాణానిల యగుపూతనపరిపూతచిత్తయై విమానమున నధివసించి గోలోకమున కరిగెననుట యాశ్చర్యకరముగాదు.

ఇంతట నీవిషయమునుండి మరలి కథ వైపును బరికింతము. ఇట్లు వికృతాకృతిఁబూతన కనుపట్టు డయ్యశోద దిక్కుతోఁపమి నాబాలు నెత్తుకొని నాకన్నకుమారా! యని శిరము మూర్కొని దృష్టిదోషపరిహారమగు కర్మము నొనరించి కులదైవములం బ్రార్థించి పూజించిన ప్రసాదపత్రముల శిరమున నిడి చన్నుఁగుడిపి బ్రాహ్మణోత్తములచే మంగళకరకృత్యంబులం జేయించెను. నందుఁ డావార్త విని పరుగిడివచ్చి యాక్రూరరాక్షసిం గాంచి విస్మయమునఁబొదలుచు బాలకృష్ణుని కడ కేగి నిదురించుచున్న పాపని లేపి శిరము మూర్కొని ముద్దాడి భగవంతుఁడు నీకాయురారోగ్యములు ప్రసాదించుఁ గాత మని దీవించెను. ఎల్లరు శ్రీకృష్ణుని కభ్యుదయములు గలుగవలయు నని భగవంతుని బ్రార్థించిరి గాని యీయద్భుతకార్య మొనరించెను గదా. యీబాలుఁడే భగవంతుఁ డని తలంపఁ జాలరైరి. అందఱ నాభగవంతుఁడే మాయాపరవశులం జేసెను.

ప్రత్యక్షముగా నమానుషకృత్యమును జూచియు నేమో యను కొనిరి గాని హేతువు నూహింపఁజాలక పోయిరి.

అవ్వల నందుఁడాదానవి దేహమును గాల్పించెను. శ్రీహ రిదివ్యదేహస్పర్శనమునఁ బరిపూతమగుట నాతనువు గాల్పఁబ డునపుడు దివ్యపరిమళము దిక్కుల వ్యాపించెను. అంద ఱిది యేమని యబ్బురపడసాగిరి. ఆపరిమళము ప్రపంచమునకుఁ గ్రొ త్తది. వారీవఱకు నెఱింగిన సువాసన వంటిదికాదు. ఆకీర్తి నంత యుఁ గన్నులారఁగాంచి గోపికలు గోపకులు పరమాద్భుతచిత్త ముల బాలుం గొనియాడుచుఁ దమతమ గృహములకుం బోయిరి.

## పూతన పూర్వజన్మవృత్తాంతము.

ఇట్లు వినిపింపఁగా నారదమునివిని నారాయణమూర్తిం గాంచి కైముకుళించి మహాత్మా! ఈపూతన యెవ్వతుక? రాక్షసీ రూపమును ధరించిన పుణ్యవతియు సతియు నగు నీమె జన్మ వృత్తాంత మేది? తొలిభవమున నేపుణ్యమొనరించి తత్ఫలము గా శ్రీకృష్ణమందిరమును బొందఁ గల్గెను? ఈవృత్తాంతము నెఱింగించి నాసంశయమును దీర్పుమా యని వేఁడెను. మౌని వరుం డిట్లు ప్రశ్నింప నారాయణమూర్తి యిట్లు బదులుచె ప్పెను.

నారదమునీ! విను మావార్తను జక్కఁగా వచించెద. తొల్లి శ్రీహరి ఇంద్రు నాపదలఁ బాపంగోరి యదితి కడుపునఁ

గశ్యపునకుఁగొడుకై పుట్టి వామనుఁడన విఖ్యాతినొందెనుగదా. ఆవామనమూర్తి వటువై సకలవేదవేదాంగపారగులగు విప్రులు బలిచక్రవర్తియొనరించు మహాధ్వరమునకుఁ బోవుచుండ వారివెంటఁ జనియె. బలిచక్రి యావటుపుంగాంచి సంతసనే సంతసించి సాదరముగఁ గూరుచుండ నియోగించి సంభాషించుచుండెను. అత్తఱి నాబలి తనయ నింపుజవ్వనమున నలరుచు నా పరమేశ్వరు నిరుపమానమంగళాంగమును దేఱి పాఱిచూచెను. ఆమెమనస్సు తదేకాయత్తమయ్యెను. ఆబలిపుత్రి విదుషీమణి! సుందరాంగి! దీర్ఘాలోచనమున నలరునది. పెద్దల గోష్ఠిగలది. దేవతాభక్తి విభూషితస్వాంత. ఆమెపేరు రత్నమాల. అత్తరుణి యావటువు నాకృతింగాంచి వెఱఁగుపడి పుత్రవాత్సల్యమును జూపెను. మనసున నిట్టి కుమారుఁడు నాకుం గలుగునా? అంతటి పుణ్యము నాకు లభించునా? నాతపఃఫలముగా నీశ్రీకృష్ణుఁడు నాకుఁ గుమారుఁడు గాకున్నను బుత్త్రసదృశుఁడై నా స్తన్యము పానముచేసిన నావక్షమున నిడుకొనుదు. ఆయదృష్టము నాకు లభించును గాక? అని తలంచెను.

భగవంతుఁడగు వామనమూర్తి యారత్నమాల హృదయము నెఱింగెను. జన్మాంతరము నీమె స్తన్యమును గ్రోలెద. ఈజన్మమున నిది కారాని పని. భవిష్యత్కాలంబున శ్రీకృష్ణావతారమున నప్పని సాగును. ఈమెకు మాతృగతి ననుగ్రహించెద. అని యాకృపానిధి యాదృతి వరమిచ్చెను. ఆరత్నమాల

యే యిప్పుడు పూతన యన జన్మించెను. భగవత్కృపకుఁ బాత్రురాలుగాన స్తన్యమొసంగి తడవుసేయక ముక్తినొందఁ దగు పుణ్యముగలది గావున విషస్తన్యము శ్రీహరి కిచ్చెను. దానఁ బూర్వము తాఁగోరిన కోరిక లీడేఱ నిముసమాత్రము మాతయై భక్తితత్పరురాలుగా మాఱి భగవద్దర్శనస్పర్శనములఁ బరిపూతురాలయి ముక్తింగాంచి పునరావృత్తిరహితపద మగు గోలోకమునకుం బోయెను. మునీంద్రా ! ఇది పూతన పూర్వచరిత్రము. శ్రీకృష్ణగుణసంకీర్తనము చేసితిని గదా. ప్రతి పదమనోహరమగు శ్రీభగవత్కథల నింకను వచించెద వినుమా యని పలికెను.

## శ్రీకృష్ణుఁడు తృణావర్తదైత్యుని బొలియించుట.

* గోకులమున యశోద మహానందమునఁ గుమారు నుపలాలించుచు నందమనఃప్రమోదకారిణియై సాధ్వీశిరోమణి యనం బ్రసిద్ధిఁ గాంచియుండెను. ఆమె యొకనాఁడు గృహకర్మములు నిర్వర్తించి శ్రీకృష్ణుని వక్షస్స్థలమునఁ బరుండఁ బెట్టుకొని శయనించి యుండెను. అపుడా శ్రీహరి వాత్యారూపమున గోకులమునకు వచ్చుచున్న తృణావర్తుని మనసునఁ దెలిసికొని భారయుక్తుఁ డయ్యెను. యశోద మిగుల బరువైయున్న బాలకుని మోయఁజాలక మంచముపైఁ బరుండఁ బెట్టి హాయి

* ఇది కృష్ణజన్మఖండము పదునొకండవ యధ్యాయమునుండియు, శ్రీభాగవతము నుండియు గ్రహింపఁబడినది.

గా నాడుకొనుచుండు లేచెంగి యమునకుఁ బోయెను. ఇంత లోఁ గామరూపమును ధరించిన రాక్షసుఁడు తృణావర్తుఁ డను వాఁడు శ్రీకృష్ణుని సామాన్యబాలునిగ భావించి కంసునకుఁ బ్రియముఁ గూర్చువాఁడై కంసప్రేరితుఁడై వచ్చిన వాఁడు గాన నాబాలుం గొని చాలదూరము పోయెను. ఆసుడిగాలి గోకుల మును బ్రవేశింపఁగనే భూరివృక్షశాఖలు భూమిపైఁ బడియెను. గోకులమున నెవ్వరికిం గాని కన్నులు కానరా వయ్యెను. ఎల్ల రు దిక్కుదోఁపమి వెఱఁగుపడిరి. యశోదయు బాలునికై పరి తపించుచుండెను గాని బాలునిఁ బరుండఁబెట్టిన తావైనను దెలి సికొనఁ జాలకపోయెను. గోపకు లిది యొకమహాప్రళయ మని భావించి తల్లడిల్ల సాగిరి. గోపికలు చేయునది నేరక శోకింప సాగిరి. తల్లికిఁ బిల్లయు, పిల్లకుఁ దల్లియుఁ గనఁబడక యుం డిరి. ఇట్లు గోకుల మాకులతంగాంచెను.

శ్రీకృష్ణమూర్తి యారక్కసు నుక్కడంపఁబూని తన్నె త్తుకొని యెటకోపోన నుంకించు నసురమెడను రెండుచేతుల బట్టుకొని వ్రేలాడసాగెను. బాలకృష్ణు నాకార మపు డారక్క సునకుఁ గొండవలెఁ గానఁబడియెను. వాఁ డిటు నటు కదలఁ జాలకుండెను. తనమాయాబల మంతయు నిష్ఫలముకాఁగా బెండువడి యిఁక నీయెడ రెట్లు తప్పునా? స్వామీ! యని యూ హింపసాగెను. క్షణక్షణమున కాబాలుఁడు పర్వతరాజ మట్లు భారముకాఁగాఁ దప్పించుకొనినయెనఁ బోవు వెర వూహింపఁ

జాలక ప్రాణములపై నిఁక నాకాశ లేదని నిశ్చయించుకొని యెను. ఇంతలో శ్రీకృష్ణుఁడు వానిఁ గరముల బిగించి వ్రేలాడు చుండఁగాఁ గొందలనైన నెత్తుకొనిపోవు తన శక్తి నిష్ఫలమగు టకు వగచుచు వాఁడు గోకులమున నొక్కచత్వరాతిపైఁ బడి గోఁజుచుఁ బ్రాణముల వదలెను. కాని శ్రీహరి వానిమెడను వదలకుండెను.

తృణావర్తుఁ డాక్రూరరూపమును వదలి దివ్యరూప మును ధరించి దేవతానీతస్యందనవర్యము నెక్కి తనపూర్వపాప క్షయమున కానందించుచుఁ బాండ్యదేశమునఁ బుట్టి దుర్వా సునిశాపమువలన రాక్షసుఁడైన తాను తనచరిత్రమును దలం చుకొనుచు శ్రీహరి కరచరణస్పర్శమునఁ బవిత్రుఁడై గోలో కమునకుం బోయెను.

ఆవిషయ మించుకే నెఱుంగని నందాదులు సుడిగాలి యెచ్చటనుండియో వచ్చి బాలు నెత్తుకొనిపోయె నని విచా రించుచు భయవిహ్వలులై శయ్యపై శ్రీకృష్ణుం గానక చింత లపాలై వక్షస్థలంబుల మోఁదుకొనుచు నేడ్చుచుండిరి. అందుఁ గొందఱు మూర్ఛమునింగిరి. మఱికొందఱు రోద నము చేయ సాగిరి. ఇంకను గొంద ఱెటునటు తిరిగితిరిగి చత్వ రాతిపై రక్కసుని మెడఁబట్టుకొని వారిపై నాడుకొను బాలక రత్నముం గాంచిరి. ఆశిశువు ధూళిధూసరసర్వాంగుఁడై పుష్పోద్యానాంతర్భాగమున నుండెను. ఆచత్వరాయి ఉద్యాన

వనమధ్యభాగమున నొక సరస్సీరమున నుండెను. అందు నాకాశమును జూచుచు భయంపడిన ట్లున్న బాలకృష్ణుని జూచిరి. నందుఁడును వారి వెంటనుండెను గాన బాలకు నెత్తుకొని వక్షమున నునుచుకొని ముఖమును దనివితీఱఁ గాంచుచు శోకమాపఁ జాలక బోరున నేడ్చెను. యశోదయు రోహిణియు నచ్చటికి వేవేగ చనుదెంచి బాలుంగాంచి దుఃఖించిరి. యశోద బాలుని లాగుకొని స్తన్య మిచ్చుచు మోమును బలుసారులు ముద్దుపెట్టుకొనియె. భయనివారక మంత్రము లుచ్చరించి విప్రులు రక్షాబంధము చేసిరి. అంతట బాలుఁ డాడుకొనసాగఁగా నంద ఆనందాంబుధి నోలలాడిరి. గోకులము సంతసిల్లెను. గోపికాగోపకులు చింతలం బాసి బాలు నాశీర్వదించిరి.

## తృణావర్తుని పూర్వజన్మవృత్తాంతము.

అని నారాయణమూర్తి పలుక నారదముని శంకాకుల స్వాంతుఁడై యిట్లు ప్రశ్నించెను. లోకనాయకా! దుర్వాసుఁ డేల పాండ్యదేశాధిపతిని శపించెను? ఆపురాతనేతిహాసమును వినవలతు. అనుగ్రహసమగ్రచిత్తుఁడవై యుపదేశింపుమా యని ప్రార్థించెను. నారాయణమూర్తి యిట్లు ప్రార్థించు నారదునిం గాంచి బదులుచెప్పఁ బూని యిట్లు పలికెను. నారదా! మంచిప్రశ్నముచేసితివి. వినుము సదుత్తరమును వచించెద.

పాండ్యదేశాధీశుఁడు ప్రతాపశాలి సహస్రాక్షుఁ డను పుణ్యమూర్తి రాజ్య మేలుచుండెను. అతనికి భోగకాంతలు వేయిమందిగలరు. ఆమహీజాని మనుష్యులు లేక మనోహరమై సకలర్తుపుష్పసంభారయుతమై సుఖాస్పదమై యలరు గంధమాదనంబునకు స్త్రీసహస్రముం గొని విహరింపఁబోయెను. అందొక నదీతీరమునఁ బుష్పోద్యానమున మనస్సు పరమానందపరిపూర్ణము కాఁగా నానావిధశృంగారచేష్టలం గనఁబఱచు నాకాంతలంగూడి రతిశాస్త్రరీతి విహరించుచుండెను. నఖదంతక్షతాదుల వారికెల్ల నలరించుచుండెను.

ఆరాజు యోగబలమున నొక్కొక్కతరుణి యొద్ద నొక్కొక్కరూపమున నిలిచి స్థలవిహారమొనరించి తనివినొంది జలవిహారముచేయ నుపక్రమించెను. *భోగకాంతలు వివస్త్రలై జలముల దిగిరి. రాజపత్నులు నగ్నలై సలిలావగాహము చేయఁబూనిరి. ఆనదిని బుష్పభద్రయని యందరు పిలుతురు. సకలర్తుపుష్పసంశోభితతటద్రుమసంయుతిఁ గాంచుట దాని కాపేరు సార్థక మనియే యంద అంగీకరించిరి. ఇట్లాపుష్పభద్రానదీజలములఁ గ్రీడించుచు వనితల నానందింపఁజేయుచు మన్మథు నారాధించుచునే జంకులేక యుండెను. అట్టితఱి నెవ్వారికింగాని శంకాలేశము లుండవుకదా.

---

* 'నార్యో వివసనా సర్వా నగ్నాశ్చ నృపయోషితః' అని మూ.

అత్తఱి మహాముని దుర్వాసుఁడు శిష్యలక్షపరివృతుఁడై శంకరుదర్శింప నరుగుచు నచ్చోటికి వచ్చెను. *సహస్రాక్షునృపాలుఁడు మదాతిరేకమునజలముల వెడలి మునిని మర్యాద చేయఁడయ్యెను. పోనీ యందుండియైన నమస్కరింపఁ డయ్యెను. అది లేకున్నను వాక్కుచే గౌరవింపఁ డయ్యెను. దానికి నవకాశము లేకున్న హస్తసంజ్ఞచే నైన మునిని సన్మానింపఁడయ్యెను. దుర్వాసుఁ డానృపతిం గాంచెను. వానిచెంతనున్న వేయిమందిభోగకాంతుల వీక్షించెను. ఆతని గర్వమును దెలిసికొనియెను. ఆగ్రహ మూనెను. ఇది యుట్టి రాజునకు మర్యాద గా దని నిశ్చయించెను. ప్రాయశ్చిత్తమునఁ గాని యీగర్వము తగ్గ దని యూహించెను. శాపరూప ప్రాయశ్చిత్తమునఁ దద్గర్వమును హరింప మది దృఢపఱచుకొనియె. క్రోధ మగ్గలమగుడు నధరోష్ఠము వడఁకసాగెను. అంతఁ బరుషాక్షరముల నిట్లు పలికెను.

సహస్రాక్షభూపాలా! పాపాత్మా! యోగినని గర్వించుచుందువు కదా. ఆయోగబలము నశింప భూలోకమునందే రాక్షసుఁడవై పుట్టుము. భారతవర్షమున లక్షవర్షము లారూపమున నుండుము. నరాధమా! నీకీశాపము తగినది. అని పలికి దివ్యదృష్టి భావినెఱింగి లక్షవర్షములు పూర్తికాఁగా శ్రీకృష్ణ

* 'దృష్ట్వా మునిం మహామత్తో నోత్తస్థానన నామహ, వాచా హస్తేన రాజాచ సంభాషాం నచకారహ.' అని మూ.

పదస్పర్శమున నిర్ధూతకల్మషుఁడవై గోలోకమునకుం బొమ్ము. తప్పక యీశాపము తర్వాతిఫలము నీకుం గలుగఁగలదు. ఓ రాజపత్నులారా! మీరెల్ల భారతవర్షమునందే ప్రతిరాజగృహమునందు జన్మింపుఁడు. మీరెల్ల రాజేంద్రపత్ను లగుదురు. సంశయింపఁ బనిలేదు. అని శపియించి యమ్మునివర్యుఁడు శిష్యలక్షసమేతుఁడై శంకరాలయమునకుం బోయెను. ఆదుర్వాసుని శిష్యు లందఱు కరుణాళువు లౌట హాహాకారములు చేసి దుఃఖించిరి. అక్కటా! యిట్టి రాజున కిట్టి బెట్టిదపు శాపము గలిగెఁ గదా యని వగచిరి. చేయునది లేక యమ్మునివెంటఁ జనిరి.

ఆపాండ్యభూపాలుఁ డట్లుమునీంద్రుఁడు శపించి యరిగిన పిమ్మట నది వెడలివచ్చి తటమున నిలిచి పెద్దపెట్టున రోదనముచేయసాగెను. తనయవివేకమును స్మరించి చింతించెను. ఎట్లీ తరుణుల విడిచి యుండఁగల నని విచారించెను. లక్షసంవత్సరము లసురరూపమున నెట్లుందునా యని పరితపించెను. ఐనను దుదకు భగవత్పదస్పర్శమున గోలోకమున కేగఁజాలుదు గదా యని యించుక యూఱడిల్లెను. తత్కాంతలెల్లఁ దద్విరహాతురలై రోదనముగావించిరి. ఎట్లు మిమ్ము విడిచియుండఁగల మని పలపించిరి. ఓనాథా! రమణశ్రేష్ఠా! యని నోటికఱవుదీఱఁ బిలిచిబిలిచి శాపమునుదలంచి పలువగలఁ గుందిరి. నాథా! నిన్ను వదలి మేమెందుఁబోగలము? మమ్ము విడనాడి నీవెందుఁబోఁజాలు

దువు? చెప్పుమాయని వేడిరి. నిన్నుఁగూడి యిఁక నిట్టితావు ల విహరించుభాగ్యము మాకు లేకపోయెఁ గదా యని తల్ల డిల్లిరి. మమ్మువదలి రాజ్యమైనఁ బాలింప నొల్లకుంటివే. నా థా! ఇట్టి నిన్నెట్లు లెడఁబాసియుండఁగలము వచింపుమాయని దీనాలాపములబలికిరి. ఇఁక నిన్నువదలి యిండ్లకుఁ బోజాలమని నిశ్చయమును దెలిపిరి. పార్వణ చంద్ర సుందరమగు నీ మోము నింకెప్పుడు చూతుమని డగ్గుత్తిక లొప్ప నుడివిరి. అర్గళబాహు వులు చాఁచి మముం గౌగిలింప నలరు భాగ్యము మాకిఁక లే దు గదాయని నిట్టూర్పులు పుచ్చిరి. ఇట్లనేకభంగుల రాజు నె దుటఁ బరితపించుచుఁ బలికిరి. ఆరాజుపాదములఁ దాఁకి యట్లే మూర్ఛల మునింగిరి.

అంతట వారి దుఃఖమును రాజెఱింగెను. తనయవజ్ఞతను దలంచుకొని యిఁక దుఃఖించి యేమి లాభముఁ నొందునని ని శ్చయించుకొనియె. అప్పుడే యాపుష్పభద్రానదీతీరమున నొ క యగ్నికుండము సిద్ధము చేయించెను. చందనతరువరముల నం దగ్ని ప్రజ్వరిల్లసాగెను. పత్నులను భోగకాంతలం గూడి యాసహస్రాక్షుభూజాని శ్రీకృష్ణదివ్యచరణారవిందముల మది నిలిపి.

"అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ,
తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష జనార్దనః."

అని స్మరించుచు నయ్యగ్నిం బ్రవేశించెను. తోడన నం

నామణులెల్ల నందుఁ బడిరి. ఆకసమునుండి దేవత లాఘో
కృత్యమును గాంచి మనోధైర్యమెడల హాహాకారము లొన
ంచిరి. మహర్షు లాకార్యము నెఱింగి దైవము బలవత్తరమనుట
స్న వేఱొకమాట చెప్పఁ జాలమని తమ సిద్ధాంతమును వెల్ల
ంచిరి. నారదమునీ! పాండ్యదేశాధిపతి యాసహస్రాక్షుఁడే త
ాపమునఁ దృణావర్తుఁడనుపేరి రాక్షసుఁడయ్యెను. ఆతఁడే
ాలాంతరమునఁ గంసునొద్దఁ జేరి మిత్రుఁడై తద్ధితకృత్యముల
ొనర్చుచు మనఃప్రియుఁ డయ్యెను. ఆతఁడే కంస ప్రోత్సాహ
మున హరిఁ జంప నందమందిరమునకుం బోయెను. తత్పదపంక
స్పర్శమున విగళితకళంకుఁ డయ్యెను. దుర్వాసుఁ డన్న యట్లే
ర్ధూతపాపుఁడై శ్రీకృష్ణ ప్రీతిపాత్రమగు గోలోకమునకుం
ోయెను. ఆతనిపత్నులందఱు భారతవర్షమున రాజగృహముల
జన్మించిరి. నారదమునిచంద్రా! శ్రీహరి మహిమమును వచించి
తిని. రాజేంద్రునకుఁ గలిగిన శాపము తన్మోక్షముగూడ నెఱింగిం
చితిని. ఇంకను శ్రీకృష్ణమూర్తి పావనచరిత్రముల వినఁగోరిక
ీకుం గలదని తోఁచెడి. కాన మఱియు నవ్వాని జెప్పెద నాల
కింపు మని శ్రీనారాయణమూర్తి యిట్లు చెప్పఁదొడఁగెను.

ఆర్యశిరోమణులారా! తృణావర్తుని కథను వింటిరి.
వాని పూర్వజన్మవృత్తాంతమును వింటిరి. ఇందు గ్రహింపవల
సిన విశేషములు పెక్కులుగలవు. సహస్రాక్షభూపాలుఁడు
భార్యలను భోగకాంతలను గూడి నిర్జనవనమున విహరింపఁబో

యెను.* అందు నాతావు పర్వతోత్తమమగు గంధమాదనము. అందు మనుష్యులు రాకపోకలుచేయు మార్గములు లేవు. మహారణ్యభాగములు గలది. సింహవ్యాఘ్రాదులం దుండుట నెవ్వరచటికిం బోవ వెఱతురు. అట్టితావున విహరించు నెపమునం బాండ్యభూమండలాధిపతి పోవుట న్యాయవిరుద్ధముకాదు. రహస్యస్థలమనియే యతఁడు భావించెను. భార్యలతో విహరించుట శాస్త్రవిరుద్ధము కాదు. పరభార్యలను బలవంతపఱచి తీసికొనిపోయినవాఁడు కాఁడు. ఇట్టితావున నతనికి దుర్వాసుఁడు శాప మీయనేల? అని ప్రశ్నము రాక తప్పదు. అది న్యాయమే. కాని సామాన్యదృష్టింజూడక యించుక సూక్ష్మదృష్టిం బరిశీలింపుఁడు. మహర్షి త్రికాలవేత్త. రాజేమి సామాన్యుఁడా యోగి. ప్రతాపశాలి. కాని చేయుకార్యము హద్దుమీఱినది. రతియం దాసక్తియుండవలసినదే కాని యది మితిమీఱరాదు. తదేకమనస్కుఁడై పెద్దల నవమానింపరాదు. అది సత్కార సమయము కాదనఁ బోకుఁడు. పుణ్యారణ్యముల మహర్షులుందు రని రాజెఱుంగును. ఇంతియగాక ఏకార్యముగాని యితరులకు నేవగింపు పుట్టింపరాదు. హద్దుమీఱ రాదు. తదేకమతియై విహరించుచుం దాఁ జేయఁదగు నితరకృత్యముల మఱువరాదు. అతిథి సత్కారమును మించినపని వేఱొకటి గానరాదు.

'ధన్యం యశస్య మాయుష్యం స్వర్గ్యం చాతిథిపూజనమ్'

మనుః.

అని స్మృతి విధించుచున్న యది.

ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామంతి యూనస్థ్సవిర ఆయతి,
ప్రత్యుత్థానాభి వాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే.

మను. ౨ అ.

ఇట్టి ధర్మమును రాజు క్రీడాసక్తి మఱచెను. పెక్కు మంది శిష్యులతో వచ్చిన దుర్వాసుంగాంచి యొడలెఱుంగక సిగ్గువదలి రాజు తనగర్వమును జూపెను. గర్వనిర్వాపణమునం గాని యీరాజుత్తమలోకము నొంద నర్హుండు కాండని ముని యెఱింగెను. భావికృత్యముల నాలోచించెను. శ్రీకృష్ణుం డవతరించుట యెఱింగెను. ఆమహాత్మునిచే ముక్తులు గాందగినవారిలో నీతం డొకం డని తెలిసికొనియెను. గట్టి శాపమిచ్చినం గాని యీకండకావరము తగ్గ దని నిశ్చయించెను. కనికరమూనక గట్టి శాపమిచ్చెను. దాన నారాజున కపకారము తత్కాలమునం గల్గిన నది మహోపకారమయ్యెను. పునరావృత్తిరహిత భగవత్పదప్రాప్తికి హేతువయ్యెను. రాజుపైం జూపిన క్రోధమును వనితలపైం జూపెనా—

అన్యథా భూషణం పుంసాం క్షమా లజ్జేవయోషితామ్.

అను సూక్తి నామహర్షి యెఱుంగును. లక్షమంది పురుషులతోం దానగపడినపుడు విహారమును జాలించి వస్త్రములం గట్టుకొనుట విహితకృత్యమైన నట్టు లొనర్పకుండుటయే వారియందుం గనంబడు తప్పని యమ్మునివరుం డెఱింగి యించుక శ్రమమును

గల్గించు శాపమునొసంగెను. కాఁబట్టి యేకార్యముగాని విహిత మైనను బదుగుర కేవగల్పింపనిరీతిఁ జేయవలయునేగాని యిం దుఁగల తప్పే మని విచ్చలవిడి మెలఁగరాదని యీకథ బోధిం చుచున్న యది. మఱియు నిందఱు కాంతలును దానును ఆరాజు హుతవహునియందుఁ బడి మ్రగ్గుట ఆత్మహత్యకదా. అది మ హాపాతకము గాదా యను ప్రశ్నము రావచ్చును. ఆ ప్రశ్న ము చేయఁదగినదే ఐన నాలుగుమాటలు వినుఁడు.

మన పూర్వులు అగ్ని కుండమునఁ బడి బుద్ధిపూర్వక ముగాఁ బడి మృతినొందుట కలదు. అది తప్పుగాదు. ఎట్లన, అట్టివారు నిర్మలస్వాంతులై యోగబలమునఁ బ్రాణముల విడు తురు. మఱికొందఱు దృఢతమస్వాంతులు దేహము నగ్నికా హుతి యిచ్చి పరమపదము నొందుదురు. నిండు ప్రాణముల బలవంతముగా నగ్నికి బలియీయరా దనుట సామాన్య విధి. ఇది సర్వత్ర పనికిరాదు. ఇదియే విధియైనచో యుద్ధ మృతి యు నట్టిదియే కదా. యోగబలమున మరణించుటయు నట్టిది యే కాదా. యోగియు, భటును స్వకృత్యముల నొనరించి సూర్యమండలమును భేదించుకొని పోవుదురని ప్రాచీనసూక్తి కలదు. ఇట్టితావుల ఆత్మహత్యను ఆరోపించుట కేవలము తెలి వి తక్కువయే. అట్టియోగమూనువాఁడు తనదేహమును భగ వదర్పణము చేయఁబూని యగ్నిని ముందుచుకొని "అగ్నిము ఖావై దేవాః" అన్న శ్రుతిని నమ్మి నాయాత్మ నీ కుపహారమిచ్చు.

న్నవాఁడను. అని పలుకుచు యోగబలమునఁ బ్రాణముల వలుదురు. అది యొక పద్ధతి. ఈతనువు తుచ్ఛమని యుత్తమ రుషార్థమునుగోరి ప్రాణములు వదలుట యొకపద్ధతి. ఇది త్మహత్యగాదు. కోపముచేతనో, ఓర్వలేని తనముచేతనో, భీతి తనో దేహత్యాగముచేయుట ఆత్మహత్య యనఁ బడును. ది దుర్మరణమే. కాబట్టి పాండ్యరాజు హుతవహున కాత్మా హుతి నొసఁగి కృతకృత్యుఁ డయ్యెను. తత్పత్న్యులాతనితో ద లోకమని భావించి కృతకృత్యులైరి. ఇంతట నీ విషయ ముజ్జగించి యవ్వలి భగవచ్చరిత్రమునకుఁ బోవుట న్యాయము.

## శకటాసురభంజనము.

ఒకప్పుడు నందపత్ని యశోద సానందపూర్వకముగా నందను నెత్తుకొని గోవిందా! ఆఁకలియైనదియా? అని పలుకుచు వక్షమునఁ జేర్చుకొని పాలిచ్చుచుండెను. ఇంతలో నగరము నఁగల ముదుసలిసువాసినులు తరుణులు బాలికా బాలకుల తో యశోదం జూడవచ్చిరి. వారిరాకఁ గాంచి యా నంద భార్య యత్పుత్రుఁడగు బాలునిఁ బరుండఁబెట్టి వారికి నమస్క రింప లేచెను. కూరుచుండ నియోగించి పెద్దవారికి నమస్క రించి తైలము సిందూరము తాంబూలము లోనగు సత్పదార్థ ముల వారి కొసంగి గారవించెను. అవ్వల మధురపదార్థములఁ దినఁబెట్టెను. వస్త్రముల నొసంగెను. ఉచిత భూషణముల నిచ్చి సంతసింపఁజేసి వారి యాశిషములం గైకొనియెను.

ఇట్టి తఱి శ్రీకృష్ణమూర్తి యాఁకలిగొన్నట్లు లేడ్చెను. మాయేశుఁడగు నాబాలకుఁడు స్వమాయం గైకొని చరణమును పైకెత్తి తలఁచుకొనిన ట్లేడ్చెను. పైకెత్తిన చరణము నొక శకటమునఁ బడియెను. చూచుటకు శ్రీకృష్ణపాద మాశకటమునకుఁ దగిలినట్లుండెఁగాని యాస్పర్శము పిడుగుపాటువలె దానిని జూర్ణముచేయఁ జాలెను. ఇట్లు విశ్వంభరుని పాదఘాతమున ఆశకటము పిండి యయ్యెను. ఈకరణి శకటము భగ్నముకాఁగా దాని శాఖలు విఱిగి ధరనొఱిగెను. అందుండి పెరుగు, పాలు, వెన్న, నెయ్యి, తేనె మొదలగు వస్తువులు క్రిందఁ బడియెను. ఆయాశ్చర్యమును గోపికలు గాంచి బాలకుని చెంతకుఁ బరుగిడిరి. భగ్నశకటమును, దారు శకలముల నడుమనున్న యాగోపాలబాలుని గనుఁగొనిరి. మఱియు నట నలుఁగడలఁ బడియున్న ఛిన్నభాండముల నిరీక్షించిరి. గోరస మెల్లెడలఁ బ్రవహించుట వీక్షించిరి. ఆదారుశకలముల నవలం ద్రోచి యాశిశువు నెత్తుకొని ముద్దాడిరి. ఆబాలకుఁడు మాయారక్షితసర్వాంగుఁడై యాఁకలిగొన్నట్లు లేడ్చుచుండెను. అంతలో యశోద పరుగిడివచ్చి బాలునందుకొని పాలిచ్చి యేడుపుడిపి యిట్టి యుత్పాతము గలిగెఁ గదా యని వగచెను.

బాలకుఁ డిట్లు శకటమును భంజించుట యెట్లులని యందున్న బాలకుల గోపకులడిగిరి. బాలకు లేవిచిత్రము కానరాదు

శ్రీకృష్ణుఁడు చరణమెత్తుటఁ గాంచితిమి. శకటము పడినది. బాలుని పదాఘాతముననే శకటము విరిగెను. అని బాలకులు నిష్కపటాత్మకులుగాన దాఁచక చూచినవిషయమును మార్పు యథాతథ్యముగ వచించిరి. ఆవార్త లాలించి యాశకట శకలములు లోనగు వస్తువులం జూచి గోపికలు గోపకులు సంశయంబులఁ బొదలిరి.

అచ్చట లేని ప్రజ లీవార్తను విని యిది యంతయుఁ గల్ల యని పలికిరి. అంత యశోద మరలమరల నాచిత్రమును దలంచుకొనుచుఁ గన్నీరు మున్నీరై ప్రవహింప బాలుని వక్షమున నదుముకొనుచుఁ బాలిచ్చెను. ఈఘట్టమునందు

ఆ. అలసితివి గదన్న యాఁకొంటివి గదన్న
మంచియన్న యేడ్పు మాను మన్న
చన్ను గుడువు మన్న సంతస పడు మన్న
యనుచుఁ జన్ను గుడిపె నర్భకునకు.

పోతనమహాకవి.

ఈపద్యరత్నమునకు మూలము.

రుదంతం సుత మాదాయ యశోదా గ్రహ శంకితా,
కృత్వా స్వ స్త్యయనం విప్రైస్సూక్తై స్తన్య మపాయయత్.

అని కనుపట్టెడు "రుదంతం సుత మాదాయ యశోదా స్తన మపాయ యత్" అనుపదములకుఁ బైపద్య మెంత చక్కఁగా లోకాచారమును బట్టి వ్రాయఁబడినదో పరికింపుఁడు.

ఆ. "గ్రహముసోఁకె ననుచుఁ గడు మది శంకించి
యేడ్చుచున్న బాలు నెదను జేర్చి
యా యశోద స్తన్య మర్భకునకు నిచ్చె"

అన్నను బద్యమే యగును గాని యదిభాషాంతరీకరణపద్ధతిగాదు. ఒక యుత్పాతమునుండి తప్పియున్న శిశువును గన్నతల్లి కనుఁ గొన్నతఱి నామె మనోభావము నెట్లు మాటలచేఁ దెలుపునో మహాకవిపోతనయే యాపద్ధతిని దెలిపెను. అదియే భాషాంతరీకరణము. రెండవదియు నాటవెలదియే. యతి గణభంగములేదు. కాని యిది పద్యముకాదు. "ముక్కస్యముక్కార్థః" యని తెనిగింపవలయు నన్న కాకవుల పద్ధతి. మహాకవిపోతనపద్యరత్నము మూలమున కలంకారప్రాయము. రెండవది మూలచ్ఛేదకము. గణములు యతిప్రాసము లున్నంతనే కవిత్వముగాదు.

సీ. యతియుక్తవాక్యాను గతి నంటవలయు వ
త్సంబు ధేనువువెంట దవిలినట్లు
మెట్టు మీఁదను గాలుపెట్టఁ గైదండ యం
దిచ్చినట్టులు ప్రాస మెనయవలయు
సానపట్టినమణి చందానపదమర్థ
నారీశుభంగి బంధంబువలయు
దివి వెలుంగు మెఱుంగుఁ దీఁగె య ట్లర్థంబు
తేట దెల్లంబుగాఁ దెలియవలయు

తే. నలంతి దొలవడ్డ చంద్రమండలమువలన
జలజలనరాలు నమృతంపుజాలు లీల
రసము తులకింపవలె నట్టి రమ్యకవిత
రసిక రసనారి రంసచేం బ్రబలకున్నె.

'ని యడిదము సూరకవీంద్రుండు చెప్పినట్లు కవిత్వ మలరార లయు. అట్టిది పోతనమహాకవికి ఉగ్గుతోం బెట్టంబడిన ట్లాగాంపవలసియుండును. నిఘంటువు లుంచుకొనక పూర్వగ్రంథముం జెంతనుంచుకొని యాపద్యరత్నములందలి ప్రాసపదము ను దొంగిలింపక తోంచనపుడు "తుహిభస్మహావై" మొదలగు పాదపురాణపదములవంటి పదములం బ్రయోగించుచుండు వారి కాకవిత్వశుద్ధి యలవడునా? ప్రస్తావవశమున మహాకవి పోతన పద్యరత్నమునుస్మరించి నాలుగుమాటలు వ్రాసితి. ఇంకం గథ యెట్లనిన.

ఆసాధ్వీమతల్లి యిట్లు బాలకు నాంకలింబాపి బ్రాహ్మణపుంగవులచే శిశువునకు స్వస్త్యయన కర్మము నొనరింపం జేసెను. ఒక్క బ్రహ్మముని శ్రీకృష్ణుని దేహముపై హస్తము నునిచి యీకవచమును బఠించి రక్ష గట్టెను. నారదమునీ! ఆకవచము సకలాపత్పరిహారదక్షము కాన వచించెద. ఆలకింపు మని నారాయణమూర్తి యిట్లు పలికెను. ఈ కవచమును శ్రీహరి పాలసంద్రమున శయనించియున్నతఱిం దన్నాభికమలసంజాతుండగు బ్రహ్మకు మాయాంబ యొసంగెను. అత్తఱి బ్రహ్మాండమం

తము జలమయంబుగా నుండెను. అత్తఱి మధుకైటభు లరుదెం చిరి. వారిం గాంచి బ్రహ్మ భయపడియెను. జగజ్జనని నీవే దిక్కని బ్రహ్మ మూలప్రకృతిని వినుతించెను. అపుడు యోగనిద్రాదేవి యిట్లు పలికెను. పంకజాసనా! భయము దూరమయ్యెనని తలంపుము. శ్రీహరియుండ నీకేమిభయము. నేనుండుచో భయముండునే. జగత్పతివి కాఁగలవు. సుఖముగానుండుము. అని యీ కవచము నుపదేశించెను.

* బ్రహ్మ! నీముఖమును శ్రీహరి కాపాడుఁగాక. మస్తకమును మధుసూదనుఁడు రక్షించుఁగాక. నేత్రముల శ్రీకృష్ణుఁ డోముఁగాక. నాసికను రాధానాథుఁడు కాచుఁగాక. కర్ణములను గంఠమును గపాలమును మాధవుఁడు మనుచుఁగాక. చెక్కిళ్లను గోవిందుఁడు, కేశములను కేశవుఁ డేలుఁగాక. నీయధరోష్ఠమును హృషీకేశుఁడును, దంతములను గదాగ్రజుఁడును, నాలుకను రాసేశ్వరుఁడును, తాలువులను వామనమూర్తియు, వక్షమును ముకుందుఁడును, జఠరమును దైత్యహంతయు, నాభిని జనార్దనుఁడును సదా

---

* పరమాద్భుతకవచము.

శ్రీహరిః పాతుతే వక్త్రం మస్తకం మధుసూదనః, శ్రీకృష్ణశ్చక్షుషీ పాతు నాసికాం రాధికాపతిః. ౧. కర్ణయుగ్మంచ కంఠంచ కపాలం పాతు మాధవః, కపోలం పాతు గోవిందః కేశాంశ్చ కేశవస్స్వయమ్. ౨. అధరోష్ఠంహృషీకేశో దంతపంక్తిం గదాగ్రజః, రాసేశ్వరశ్చరసనాం తాలుకం వామనోవిభుః. ౩. వక్షః పాతు ముకుందశ్చ జఠరం పాతుదైత్యహా, జనా

కాతురుగాక. పురుషాంగమును విష్ణువు, నితంబములను గుహ్యమును బురుషోత్తముఁడు కాపాడుఁగాక. జానువుల జానకీనాథుఁడును, హస్తముల నృసింహుఁడు సర్వకష్టకాలములందును గాచుఁగాక. పాదయుగళమును వరాహమూర్తిని దాల్చిన కమలాక్షుఁడు రక్షించుఁగాక. ఊర్ధ్వభాగమును నారాయణమూర్తియు, అధోభాగమును గమలాపతియు, పూర్వభాగమును గోపాలుఁడు, ఆగ్నేయభాగమును దశకంఠహంతయు, దక్షిణభాగమును వనమాలియు, నైఋతిభాగమును వైకుంఠుఁడును, బశ్చిమరభాగమును నిరతరసాధుసంరక్షకుఁ డగు వాసుదేవుఁడును, వాయవ్యభాగము నజుఁడును, ఉత్తరభాగమును జలజాసనుఁడును, ఈశాన్యభాగము నీశ్వరుఁడును, సర్వభాగములను శత్రు

---

ర్దనః పాతునాభిం పాతువిష్ణుశ్చ మేహనం. ౪. నితంబయుగ్మం గుహ్యంచ పాతుతే పురుషోత్తమః, జానుయుగ్మం జానకీశః పాతుతే సర్వదా విభుః. ౫. హస్తయుగ్మం నృసింహశ్చ పాతు సర్వత్ర సంకటే, పాదయుగ్మం వరాహశ్చ పాతుతే కమలోద్భవః. ౬. ఊర్ధ్వం నారాయణః పాతు హ్యధస్తాత్కమలాపతిః, పూర్వ స్యాం పాతుగోపాలః పాతు వహ్నౌ దశాస్యహా. ౭. వనమాలీ పాతుయామ్యాం వైకుంఠః పాతు నైఋతౌ, వారుణ్యాంవాసుదేవశ్చ సతోరక్షాకరస్స్వయమ్. ౮. పాతుతే సంతతమజో వాయవ్యాం విష్టరశ్రవాః, ఉత్తరేచ సదాపాతు తేజసా జలజాసనః. ౯. ఐశాన్యా మీశ్వరః పాతు పాతు సర్వత్ర శత్రుజిత్, జలే స్థలే చాంతరిక్షే నిద్రాయాం పాతు రాఘవః. ౧౦. ఇత్యేవం కథితం బ్రహ్మన్ కవచం పరమాద్భుతం, కృష్ణేన కృపయా దత్తం స్మృతేతివ పురామయా. ౧౧. శ్రీకృష్ణజన్మఖండే, ౧౨-వ అధ్యాయే. ప్రతిపాదితం కవచం సంపూర్ణమ్.

హంత యగుపరమేశ్వరుఁడును గాపాడుదురుగాక. జలమునందు
ను, స్థలమునందును, అంతరిక్షమునందును, నిద్రయందును రాఘ
వుఁడును గాపాడుఁ గాక. అని యీకవచమును యోగనిద్రాంబ
యుపదేశించి పంకజాసనా! యీకవచము శ్రీకృష్ణపరబ్రహ్మ
యే నాకొసంగెను. పరమాద్భుత మైనది. సకలకష్టములఁ దొ
లఁగించునది. అని నారాయణమూర్తి నారదున కుపదేశించి
మఱియు నిట్లనియె.

నారదమునీ! ఈకవచప్రభావమున నాయోగనిద్రాంబ
మున్ను శుంభమహాసురునితో సంగరమొనరించుచుండి దీనిని
స్మరించెను. తన్మహిమమున నాఘోర సంగ్రామమున నాకసమం
దుండిన యాదైత్యుఁడు క్రిందఁబడియెను. ఆయుద్ధము శతసం
వత్సరములు జరిగెను. శుంభదైత్యుఁడు మృతి నొందగనే
మాయాంబకు శ్రీకృష్ణమూర్తి మాలాకవచముల ననుగ్రహిం
చి గోలోకమునకు వేంచేసెను. మునిచంద్రా! ఇది యీకల్పపు
వృత్తాంతముకాదు. కల్పాంతరవృత్తాంతమును వచించితిని. ఈక
వచమును జపించిన బాహ్యాభీతి యడంగుట యటుండ మనోభీ
తులుతొలంగు. నేఁజూచుచుండఁగనే కోటికోటులు బ్రహ్మలు
గతించిరి. నేనో శ్రీహరింగూడి కల్పము నెల్లఁ గాంచుచున్నవాఁ
డ. యోగనిద్రాంబయు స్థిరతం గాంచుచున్న యది. అని పలికి
మఱియు నారాయణుఁ డిట్లనియె. నారదమునీంద్రా! ఇట్లు
మాయాంబ పలికి యాకవచమును బ్రహ్మ కొసంగి యదృశ్య

పాఠకమహాశయులారా! ఈకవచమును దత్ఫలమును బఠించితిరి. దీనిని నారదమునికి శ్రీమన్నారాయణమూర్తి యే తెల్పెను. బ్రహ్మకు యోగనిద్ర యీకవచము నుపదేశించె నఁట. ఆమెకు శ్రీకృష్ణభగవంతుఁ డుపదేశించె నఁట. త్రిపురాసురుల సంహరించు కాలమున శంకరుఁ డీ కవచమును కంఠమునఁ దాల్చి విజయమును బొందె నఁట. మహాకాళియు, దుర్గయు దీనిమహిమమున రక్తబీజుని శుంభుని వధించిరఁట. ఆదిశేషువు దీనిశక్తిచే భూమిని దేలికగా మోయుచున్నవాఁ డఁట. నారాయణమూర్తియు, నారదముని, సనత్కుమారుఁడు దీని ప్రభావముననే విఖ్యాతిం గాంచిరఁట. ఈవిషయమును బఠించినపుడు లేనిపోని శంకలు గలుగకమానవుకాని యించుక శ్రద్ధమై నాలోచించిన నిందేమియు విచిత్రముగాని సంశయింపఁదగిన విషయముకాని కానరాదు. ఎటులనగాఁ బ్రీతిమై వినుఁడు.

ఈపురాణము బ్రహ్మవైవర్తము. దీనియందు గోలోకవాసియగు శ్రీకృష్ణపరమాత్మమహిమము ప్రధానముగఁ జెప్పఁబడును. సర్వము తన్మయమని యుపదేశింపఁబడును. స్కాందపురాణమున సర్వము శివమయమని తెల్పంబడు. విష్ణుపురాణమున సర్వము విష్ణుమయమని బోధింపఁబడు. కాళీపురాణమున సర్వము కాళికామయమని నిర్ణయింపఁబడు. నృసింహపురాణమున నిట్లే తెలుపఁబడు. ఇవన్నియు నేకార్థముసే బోధించును

గాని విపరీతార్థమును దెల్పుటలేదు. సగుణబ్రహ్మము లోకసం రక్షణార్థము నానాదేవతారూపముల వెలయు. ఏరూపమును భక్తుఁ డుపాసించినను సగుణపరబ్రహ్మము నుపాసించినట్లే. ఐత్తే భక్తుల కర్మములన్నియు నొక్కరీతిగ నుండవు. కావునే భిన్న భిన్నధర్మము లేర్పడినవి. ఏదేవతామహిమను పేర్కొనఁబడు నపు డాదేవతయే సర్వేశ్వరుఁ డని తెల్పఁబడు. అట్లు తెల్పి నఁగాని భక్తుల మనస్సు తృప్తినొందదు. తత్త్వ మారయ నట్లు పదేశించుటయేమంచిది. సర్వరూపము లాభగవంతుఁడే యెత్తి నపు డేరూపము నందును లోపము లుండరాదు. ఉండవు. అట్టి భగవద్రూపములలో నొకటి యుత్తమము. వేఱొకటి మధ్యమ మని చెప్పుట, నమ్ముట బుద్ధితక్కువచేఁ గాని వేఱుకాదు. సర్వే శ్వరుఁడు, సర్వభూతాంతర్యామి, సర్వకర్త, సర్వసాక్షి యనుట సర్వజనాంగీకృత మయ్యెనేని దేవతాభేదము లుండరాదు. ఉండినచో బూటకమే యనవలయు. ఏవ్రత మాచరించిన నది వ్రతోత్త మనఁబడును గదా. కారణమేమి? భక్తిభారమున నేవ్రతము చేసినను ఫల మొక్కటి యనియే దాని రహ స్యము. ఇన్నిమంత్రములు, ఇంతమంది దేవతలుండుట భక్తుల వాంఛలు. వారి సుకృతములు ప్రత్యేకములుగ నుండుట చేతనే భగవంతుఁడు సర్వనామవాచ్యుఁడు. అందొక నామ ముత్తమ మని వేఱొకటి యధమ మను నంతటి వెఱ్ఱితనము వేఱుగ నుండరాదు. శ్రీరామకృష్ణావతారములలోఁ గూడ భేదము

గల దని యొకటి యుత్తమోత్తమ మని చెప్పువా రుండఁగా నిఁకఁ జెప్పవలసిన దేమి? ఈ భేదములు సుకృతాల్పత్వకల్పితము లుగాని వాస్తవములుకావు.

త్రిలోకాధిపతి యింద్రుఁడు. ఆతఁ డిచ్చిన శక్తి కర్ణునొద్దనుండెను. కర్ణుఁడు ఘటోత్కచునిపై దానిని వైచెను. కృష్ణుఁడు దానిపోక కానందించుచు నది యుండి నంత దనుక నిద్ర లేక యర్జునుని గాపాడితిననియు, నిఁక భయము తీఱినదనియుఁ జెప్పినట్లు భారతమునఁ గనఁబడియెడు. ఇంద్రుఁడు దిక్పతి. ఆత నిరక్షించుటకే మహావిష్ణు వెన్నియో యవతారముల నెత్తెను. అట్టి యింద్రుఁ డిచ్చిన శక్తికై శ్రీకృష్ణమూర్తి భయపడితి నని చెప్ప నేల? దాని రహస్యమేమి? తన యంశమేదియైన సర్వజనపూజ్యమను భావమును దృఢపఱుచుటకే కదా. కాకున్న ఆశక్తిని మరలించుట భగవంతున కొక గొప్పకార్యమా. కాదు. ఐనను ఇంద్రు నారాధించువారలకు, విష్ణువు నారాధించువారలకు, భక్తితుల్యమయ్యెనేని, ఫలము సమానమగును. కావున నిట్టి విషయముల సమన్వయము చేసికొనుటలో లోపము లుండునేగాని తత్త్వమున లోపములు లేవు. శ్రీహరి నారాయణ కృష్ణ శంకరాది శబ్దవాచ్యుఁడు సగుణబ్రహ్మమే. నామభేదమే గాని వేఱుగాదు. ఇందెవ్వరి సేవించినను ఫలభేదము లేదు. ఇదియే ఈకవచఫలస్తుతి మనకుఁ దెల్పుచున్నది. కాఁబట్టి లేనిపోని శంకలకు మదిని జోటీయక యిష్టదైవమును సర్వేశ్వరునిగా

నుపాసింపవలయును. ఇంతట శాఖాచంక్రమణప్రయత్నము చేయఁబూనక కథాసారము నెఱుకుదము.

నందుఁడు నందనునకు వసుదేవానుమతి నామకరణ మహోత్సవమును జేయింప గర్గమునిని రప్పించుట.

* నారదమునీ! ఇంకను విచిత్రతమమగు శ్రీకృష్ణకథను వినుము. అది సకలాంతరాయముల నడంచి పాపములఁ బోఁ ద్రోలి మహాపుణ్యము నొడఁగూర్చి పరమపదమును బ్రసాదించును. ఒకానొకశుభదినమున నందపత్ని యశోద శ్రీకృష్ణుని హృదయపీఠమున నిడుకొని బంగారుపీఠమున నాసీనయై యాఁకొన్నవాఁ డని పాలిచ్చుచుండెను. అట్టితఱి నొకబ్రాహ్మణప్రవరుఁడు శిష్యసమూహములం గూడి బ్రహ్మవర్చస్సు ప్రజ్వరిల్లుచుండ శుద్ధస్ఫటికమాలం గొని త్రిపరబ్రహ్మమంత్రమును జపించుచు దండియు, ఛత్రియు, శుక్లవస్త్రధారియు, పరిశుద్ధదంతపంక్తివిరాజితుండునై యరుదెంచెను. జ్యోతిశ్శాస్త్రము మూర్తీభవించిన ట్లాయన దివ్యదృష్టి వెలయుచుండెను. వేదవేదాంగపారగుఁడై జటామండలవిరాజితుఁడై యుండెను. ఆజటాజూటము పుటముపెట్టిన బంగారువలెఁ గనఁబడుచుండెను.

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము పదుమూఁడవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది. ఇతరపురాణమునఁ గల మార్పు లింకఁ జేర్పఁబడును నని గ్రహింపఁ దగు.

ముఖము పూర్ణిమాశశాంకబింబముం బోలి కన్నులపండువు సేయుచుండెను. గౌరాంగుఁ డనియుఁ, బద్మలోచనుఁ డనియు, యోగీంద్రుఁ డనియు, ధూర్జటి శిష్యుఁ డనియు, గదాధారియందు దృఢభక్తిగలవాఁ డనియు, వ్యాఖ్యాముద్రాకరుఁ డనియు నామహాత్మునిం బిలుచుట సార్థకముగనే యుండెను. ఆమహాత్ముఁడు శిష్యులకుఁ బాఠములుచెప్పుచు వేదములకు వ్యాఖ్యను బహువిధముగఁ జేయుచున్న వానివలెఁ గనఁబడుచు, నాల్గువేదము లేకమై యీరూపమును ధరించెనో యన నొప్పుచు, సాక్షాత్సరస్వతీకంఠుఁడై, సిద్ధాంతైకవిశారదుఁడయి, సంతత శ్రీకృష్ణపాదాంభోజధ్యానైక నిష్ఠుఁడై, జీవన్ముక్తుఁడై, సిద్ధేశ్వరుఁడై, సర్వజ్ఞుఁడై, సర్వము నెఱుఁగఁజాలి యీమహాత్ముఁడు కనఁబడియెను.

ఆమహాత్మునిజూడఁగనే యశోద పరమ ప్రమోదభక్తులలర లేచి నమస్కరించెను. పాద్యమునొసంగి గోవు నిచ్చి స్వర్ణమయపీఠమును వేసి యామునిని గూరుచుండఁ జేసెను. శ్రీకృష్ణుని మునిపాదములపై వైచి నమస్కరింపఁజేసి సంతసించెను. యశోద మోమునఁ జిఱునవ్వు చిందులాడుచుండెను. మునియు మనమున శ్రీకృష్ణమూర్తి కనేకశతప్రణామము లాచరించెను. కాని బాహ్యదృష్టికిం దోఁపకుండ వేదమంత్రోపయోగికమ్ముగ నాశీర్వదించెను. యశోదయుఁ బిదప వారిశిష్యులకు నమస్కరించి వారియాశిషములం బడిసెను. శిష్యులకును బాదా

ద్యాతిథేయసత్కారము లొసంగి గౌరవించెను. వారి పాదో దకమును శిరమునఁ దాల్చి పీఠముపై నుపవిష్టురా లయ్యెను.

అంత నాయశోద యంజలి పుటముతోఁ వ నేమో ప్ర శ్నింప నారంభించెను. తనభుజాంతరమున శ్రీబాలకృష్ణమూర్తి యుండఁగా భక్తి నమ్రాత్మకంధరయై మహాత్మా! మీవంటిమహా త్ములను బ్రశ్నింపఁజాలను. వినయమునడుగుచున్నాను. తన నామధేయ ము తెలుపఁ దెలియఁగోరుచున్నాను. అబలను బుద్ధిహీనురాల ను. ఇట్టి నావాగ్దోషముల క్షమింపవలయు. సాధువులు సర్వదా మూఢులదోషముల క్షమింతురు. అంగిరసుఁడో, అత్రియో, మరీ చియో, గౌతముఁడో, క్రతుమునియో, ప్రచేతసుఁడో, పులస్త్యుఁ డో, పులహుఁడో, దుర్వాసుఁడో, కర్దముఁడో, వసిష్ఠుఁడో, గర్గుఁ డో, దేవలుఁడో, కపిలుఁడో, సనత్కుమారుఁడో, సనకసనందు లో, పంచశిఖుఁడో, సౌభరియో, విశ్వామిత్రుఁడో, వాల్మీకియో, వామదేవుఁడో, కశ్యపుఁడో, సంవర్తుఁడో, ఉతథ్యుఁడో, కచుఁ డో, బృహస్పతియో, భృగువో, శుక్రుఁడో, చ్యవనుఁడో, నర నారాయణులో, సక్థియో, పరాశరుఁడో, వ్యాసుఁడో, శుక దేవుఁడో, జైమినియో, మార్కండేయ, లోమశ, కణ్వ, కాత్యా యనులో, అస్తీక, జరత్కారువులో, ఋష్యశృంగ, విభండక, పౌల, స్త్యాగస్త్య, శరద్వ, ద్గిరి, శమీ, కారిష్టనేమి, మాండ వ్య, పైల, పాణిని, కణాద, శాకల్య, శాకటాయ, నాష్టావక్ర, భాగురి, సుమంతు, వత్స, జాబాల, యాజ్ఞవల్క్య, వైశంపా యన, హంసి, పిప్పలాద, మైత్రేయ, కరూ, షోపమన్యు, గౌ

రము, ఖారుణిమునులో, ఔర్వుఁడో, కక్షీవ, ద్భరద్వాజ, వేద శిర, శ్శకుంకర్ణ, శౌనకులో ఈరూపమున నన్ననుగ్రహింప వచ్చిరని తలంచెదను. ఈమునులు పుణ్యశ్లోకులు. మహానుభావులు. వీరిలో నీవెవఁడవో తెల్పుము. బహులుచెప్పవలసిన యదృష్టము నాకుండినట్లు మీకుఁ దోఁచె నేని కరుణింపుఁడు. కింకరుఁడు కింకరియుఁ నమవంటి మునివరులం బ్రశ్నింపఁ దగుదురే. ఎవరెవరిసేవానిరతులో వారు వారినివదలి, మఱియెవ్వరినడుగుదురు? ఇపుడు నేను ధన్యురాలను, కృతకృత్యురాలను, నాజన్మము సఫలము. భవత్పాదారవిందరజస్స్పర్శమునఁ గోటి జన్మకృతపాపములు నశించినవి. మీపాదోదకసంస్పర్శమున భూదేవి పవిత్రురాలైనది. మీరు దయచేసిన కతన నాయీగృహము పరమపవిత్రమైనది. వేదములయందు వేదపవిత్రులనియే యేమహాత్ములు పేర్కొనంబడిరో వారిలో నొక్కఁడవగు. నీవు నాపూర్వపుణ్యఫలోదయమువలనదర్శనమిచ్చితివి. మీశిష్యులు మూర్తీభవించిన వేదములు, గ్రీష్మర్తుమధ్యాహ్నభాస్కరసమతేజస్కులు. గోకులమును మత్కులమును బాదరేణువులఁ బవిత్రముగాఁ జేయుచున్నవారు. మీరందఱుశిశువున కాశీషముల ననుగ్రహింపుఁడు. విప్రాశీర్వాదము సంపూర్ణశుభప్రదము. ఇది నిశ్చయము. అని పలికి యానందపత్ని మునిమ్రోల నూరకుండెను. నందుని బిలుచుకొని రమ్మా యని సేవకు నంపెను.

యశోద యిట్లు ప్రశ్నింప మునిపుంగవుఁడు నవ్వెను. దశదిక్కులు వెలుంగ శిష్యులును నవ్విరి. హితముగ నుండి, సత్యమై, నీతిభూషితమై, అతిశయపుణ్యప్రదమై, పరమమంగళాకరమగు వాక్యము నాముని సంతోషమున నిట్లు పలికెను. అమ్మా! నీవచన మమృతోపమానము. లోకసమ్మతము. కులోచితము నగు. ఏకులమున నెవరు జన్మింతురో వారు తదుచిత సంభాషణముల సల్పుదురు. గోపపద్మములకు నన్నింటికి గిరిభానుఁడు భాస్కరతుల్యుఁడు. ఆగిరిభానునకు పద్మాసమానురాలగు పద్మావతి పత్ని. సాధ్వీమణి యనుప్రఖ్యాతిం గాంచెను. ఆమె కన్యక యశోద యను నీవే. యశోవృద్ధిహేతుభూతురాలవు. వల్లవకులతల్లజుఁడగు నందుఁడు నీకు వల్లభుఁ డయ్యెను. నందుఁ డెవ్వఁడో, నీ వెవ్వతెవో, ఈబాలుఁ డేమార్గమున వచ్చెనో నే నెఱుంగుదు. నిర్జనస్థలమున నందసన్నిధిని దెల్పెదను.

అమ్మా! చిరకాలమునుండి యదువంశజాతులకుఁ బురోహితుఁడ నగు గర్గుఁడను నేనే. వసుదేవునిచే అనన్యసాధ్య కార్యమునఁ బంపఁబడితిని. అనుచుండు నంత నందుఁడు సేవకునివలన వార్త నెఱింగి వడివడి సరుదెంచెను. మానింగాంచి నంత నందుఁడు భక్తిభరాక్రాంతహృదయమున సాష్టాంగదండప్రణామము లాచరించి వేఱువేఱ శిష్యులకు వందనము సలిపి వారి యాశిషములఁ బడసెను. అంత నమ్ముని లేచి యశోదను నందుని బిలుచుకొని యభ్యంతరమందిరమునకుఁ జనియెను. యశోద

యు నందను నెత్తుకొని యానందమున నందు వెంట నరిగెను. ఒరులు లేని యచ్చోటం గూరుచుండి గర్గుం డిట్లు పలికెను.

నందా! నీకుం గడుసుఖమును గల్గించు వచనమును బలికెద. అవహితుండవు గమ్ము. నేను వసుదేవుండు పంపంగా నిట వచ్చితిని. ఆవార్త నాలింపుము. వసుదేవుండు నీబాలుని గొనివచ్చి నీయింట యశోద ప్రసవించిన శయ్యపై నునిచెను. ఈబాలుండు వసుదేవుని కుమారుండు. ఇది సత్యము. నీకుమార్తెను గంసునిభయమున మథురకుం గొనిపోయెను. కావున నీబాలున కన్నప్రాశనమును, దానికి ముందు నామకరణమహోత్సవమును జరపుటకు నన్ను రహస్యముగా వసుదేవుండు పిలుపించి యీవార్త నీకుం జెప్పుమని పంపెను. కావున వేఱొండు రీతి నాలోచింపక తత్ప్రయత్నము చేయుము.

ఈ నీకుమారుండు పూర్ణబ్రహ్మస్వరూపుండు. మాయచే భూతలమునం బుట్టి భూభారమును హరింపం దలంచిన పురాణపురుషుండు. బ్రహ్మాదిసంసేవితపాదారవిందుండు. గోలోకనాథుండు. శ్రీకృష్ణమూర్తి. రాధికాప్రాణనాథుండు. వైకుంఠమునం గమలానాథుండగు శ్రీమన్నారాయణమూర్తి యీతండే. శ్వేతద్వీపనివాసియగు శ్రీవిష్ణు వీతండే. అవ్యయుం డనంబడువాం డీబాలుండే. కపిలముని, నరనారాయణులను నాదిమునులు, నింకను ననేకమునులు ఈమహాత్ము నంశములే. సర్వతేజోరాశి యీశిశువే. మూర్తినిధరించిన తేజోరాశి యని భావింపుము.

ఆరూపమును వసుదేవునకుం గనంబఱచి శిశురూపమును గై
కొనియెను. కారాగారమున నున్న యాసూతికాగృహము
నుండి నియింటి కేతెంచెను. ఈకుమారుఁ డయోనిసంభూతుఁ
డు. మహీతలమునఁ గార్యార్థ మవతరించెను. దేవకీగర్భమును
దనమాయచే వాయుపూర్ణముగ నొనరించి ప్రసవము తఱిఁ
దాభూమింబడినట్లు నటించి వసుదేవుఁడు తన యాదిమూర్తిని
గనునట్లు చేసి యిచ్చటి కేతెంచెను. వల్లవకులతల్లజ·! ప్రతి
యుగమున నామభేదము వర్ణభేదము గలుగ నీపురాణపురు
షుఁ డవతరించును. శుక్లపీతరక్తవర్ణముల నవతరించి యిపుడు
కృష్ణత్వమునందెను. కృతయుగము సత్యయుగ మనంబడు.
అధికతేజోవిరాజితుఁడై యపుడు శుక్లవర్ణమున నవతరించె
ను. త్రేతాయుగమున రక్తవర్ణుఁడయ్యెను. ద్వాపరమునఁ బీత
వర్ణుఁడయ్యెను. ఈద్వాపరకలియుగ సంధికాలమునఁ గృష్ణవర్ణుఁ
డయ్యెను. పరిపూర్ణతమబ్రహ్మరూప మిదియే, దాననే కృష్ణుఁ
డనఁ బరఁగు.

## కృష్ణశబ్దనిర్వచనము.

* కవర్ణము బ్రహ్మవాచకము. ఋకార మనంతవాచ
కము. షకారము శివవాచకము. నకారము ధర్మవాచకము.

---

* 'బ్రహ్మణో వాచకః కోఽయ మృకారోఽనంతవాచకః, శివస్య
వాచకష్షశ్చ నకారో ధర్మవాచకః. అకారో విష్ణు వచన శ్శ్వేతద్వీప నివా
సనః, నరనారాయణార్థస్య విసర్గో వాచక స్స్మృతః.' అని మూ.

అకారము విష్ణువాచకము. విసర్గము నరనారాయణార్థవాచకము. ఇవి కృష్ణశబ్దార్థము. ఈమూర్తి సర్వతేజోరాశి. సర్వమూర్తి స్వరూపుఁడు. సర్వాధారుఁడు. సర్వబీజస్వరూపుఁడు. కృష్ణుఁ డనం బరఁగు. కృషి యనునది కర్మనిర్మూలార్థవాచకము. నకారము దాస్యవాచకము. అకారము దాతృవాచకము. కాఁబట్టి కృష్ణుఁ డను నది యేర్పడియె. కృషియనునది నిశ్చేష్టవాచకము. నకారము భక్తివాచకము. అకారము ప్రాప్తివాచకము. కాన కృష్ణనామము చెల్లెను. కృషి యనునది నిర్వాణవాచకము. నకారము మోక్షవాచకము. అకారము దాతృవాచకము. కాన కృష్ణశబ్దము గల్గెను. ఇది శ్రీకృష్ణశబ్దనిరుక్తి.

నందా! భగవన్నామములు కోటిసంఖ్యలు స్మరించిన నేఫలము గలుగునో ఆఫలము కృష్ణా యని స్మరించినంతన కలుగును. స్మరించినఁ బఠించిన వినిన నేభంగిఁ బుణ్యము లభించునో, ఏనామస్మరణమునఁ గోటిజన్మకృతపాపములు నశించునో ఆఫల మీకృష్ణనామస్మరణమునఁ గలుగు నని నమ్ముము. విష్ణుసర్వనామసారభూత మిది. పరాత్పరము. కృష్ణా యనుసుందరనామము మంగళదాయకము. భక్తిని గలుగఁజేయు. కకారోచ్చారణమాత్రమున మృత్యుజన్మముల హరించు. కైవల్యమును భక్తుఁడు పొందును. ఋకారోచ్చరణమాత్రమున నసదృశదాస్యము లభించును. షకారము నుచ్చరించి నంత యీాప్సితభక్తిపొందలును. నకారమును బలికినంత సహవాసము తత్సమ

కాలము గల్గును. విసర్గోచ్చారణమునఁ దత్సారూప్యము లభించును. సంశయము లేదు.

## కృష్ణనామోచ్చారణఫలము.

కకార ముచ్చరించినంతనే యమకింకరులు పరితపింతురు. ఋకార ముచ్చరించినంతట నందు నిలువఁజాలకుందురు. షకార ముచ్చరించినంతనే పాతకములు నశించు. నకారోచ్చారణమున రోగము లంతమొందు. అకారము నుచ్చరింపఁగనే వృత్త్యువు తొలంగు. నిశ్చయముగా నందా నమ్ముము పూర్వోక్త యమకింకరాదులు పలాయితు లగుదురు. వారికి నిలువఁజోటు దొరకదు. స్మరించిన, వచించిన, వినిన, విన బ్రయత్నించిన శ్రీకృష్ణనామము ఫలవంత మని నమ్ముము. శ్రీకృష్ణనామ ముచ్చరించిన భక్తుని యంత్యకాలమున శ్రీకృష్ణకింకరులు రథమును గొని వచ్చి తోడ్కొనిపోదురు. భూమియం దెన్నిపరాగకణములున్న వో పండితులు లెక్కింపవచ్చు. శ్రీకృష్ణనామప్రభావ మింత యని లెక్కింపఁ బండితులకు శక్యమే కాదు.

ఈదివ్యనామమహిమము శంకరునిముఖమునుండి వినఁబడినది. నాగురు వందులో గొంతమాత్రము తెలిసి కొనునుఁ. బ్రహ్మాయు, ననంతుఁడు, ధర్ముఁడు, దేవర్షి, మనుమానవులు, వేదములు, సత్పురుషులు. శ్రీకృష్ణనామమహిమమునఁ బదాఱవపాలు తెలిసికొనఁ జాల రనుట నిక్కము. అని యిట్లు గర్గముని కుమారుని నామమహిమమును దెలుప నాలకించెను. గురుముఖము

నుండి వినిన దానిని యథామతి గ్రహింపఁ జాలెను. *గర్గముని నందా! శ్రీకృష్ణపీతాంబరకంసధ్వంసివిష్టరశ్రవో దేవకీనందన శ్రీశయశోదానందన హరి సనాతనాచ్యుతానంతసర్వేశ సర్వరూపధృక్సర్వాధార సర్వగతి, సర్వకారణకారణ, రాధాబంధు, రాధికాత్మ, రాధికాజీవన, రాధాప్రాణ, రాధికేశ, రాధికారమణ, రాధికాసహచారి, రాధామానసపూరణ, రాధాధన, రాధికాంగ, రాధికాసక్తమానస, రాధికాచిత్తచోర, రాధాప్రాణాధిక, ప్రభు, పరిపూర్ణతమ, బ్రహ్మ, గోవింద, గరుడధ్వజ నామములు కీర్తనీయములు. నాముఖమునుండి వెడలిన యీనామరత్నముల మదిఁబనెలపఱచుకొనుము. ఇవిజన్మమృత్యుహరములు. నందా! వీని జపింపఁగాఁ గాపాడుచుండుము. వసుదేవుని చిన్నికుమారునినామములు కీర్తింపఁబడినవి. ఇంక జ్యేష్ఠపుత్రుఁడగు బలరాముని నామములురహస్యములుగనుంచఁబడినవి. వానిం దెల్పెదనాలకింపుము.

---

* శ్రీకృష్ణనామరత్నములు.

కృష్ణః పీతాంబరః కంసధ్వంసీ చ విష్టరశ్రవాః, దేవకీ నందన శ్రీశో యశోదా నందనో హరిః. ౧. సనాతనో உచ్యుతో உనంత స్సర్వేశ స్సర్వరూపధృక్, సర్వాధారః సర్వగతి స్సర్వ కారణ కారణమ్. ౨. రాధా బంధూ రాధికాత్మా రాధికా జీవన స్స్వయం, రాధా ప్రాణో రాధికేశో రాధికా రమణస్స్వయం. ౩. రాధకా సహచారీచ రాధా మానస పూరణః, రాధా ధనో రాధికాంగో రాధికా సక్తమానసః. ౪. రాధికా చిత్తచోరశ్చ రాధా ప్రాణాధికః ప్రభుః, పరిపూర్ణతమాం బ్రహ్మ గోవిందో గరుడధ్వజః. ౫. నామా న్యేతాని కృష్ణస్య శ్రుతాని మన్ముఖాద్ధృది. శ్రీకృష్ణజన్మఖండము.

దేవకీగర్భమును రోహిణీదేవియందుఁ జేర్పఁబడినందున సంక
ర్షణుఁ డనఁబరఁగు. వేదములయం దీమహాత్ముని విభవమున
కంతము చెప్పఁబడనందున ననంతుఁ డనఁబరఁగు. బలాతిశయ
మువలన బలదేవనామము చెల్లు. హలము నాయుధముగా
ధరించినందున హలి యన నొప్పు. శితివాసుఁ డనియు, నీల
వస్త్రుఁ డనియు నాతనికిఁ బేరులుగలవు. ముసలాయుధధారణ
మున ముసలి యనఁబరఁగు. రేవతీకాంతతో విరహించును గాన
రేవతీరమణుఁ డనంబడు. రోహిణీగర్భవసతి గలిగిన కతన
రౌహిణేయుఁ డనం బ్రఖ్యాతివహించు. ఈనామములు జ్యేష్ఠ
పుత్త్రుఁడగు బలదేవు నామము లని యెఱుంగుము.

నందా! ఈరహస్యమును నీకుం దెల్పితిని. ఈనామములు
సార్థకములగుట ముందు నీకే తెల్లమగు. నే నిఁక నింటికిం బో
యెద. నీయింట సుఖముగనుండుము. అని గర్గముని చెప్పఁగా
నందుఁ డాలించి నిశ్చేష్టుఁడయ్యెను. యశోదయు నేమియుఁ
దోఁపమి నూరక చిత్త్రప్రతిమవలె నుండెను. ఈవిషయమం
తయు సాగఁగా బాలకుఁడు నవ్వెను. నందుఁ డంతట నించుక
లోకజ్ఞానము రాఁగా గర్గమునికి నమస్కరించి వినయపూర్వ
కముగా నిట్లుపలికెను. అపుడు పుటాంజలియుతుఁడై భక్తి
నమ్రాత్మకంధరుఁడై నందుఁ డెంతో జ్ఞానిగఁ గనఁబడియెను.
మునీంద్రా! మీ రింటికిఁ బోయిన మీ రానతిచ్చిన కర్మముల
నిఁక నే మహాత్ముఁ డాచరించును? శుభదృష్టిఁ జూచి యీబా

లకునకు నామకరణాన్నప్రాశనములం జేయుము. స్వామీ! మఱొక్క శంక పొడమెడు. ఈబాలకుని నామములయందు రాధాప్రాణాధికనామమువలనకుం బదినామములు రాధాశబ్దముతోఁగూడినవి పేర్కొనంబడియెఁ గదా. ఈనామములు వినినప్పటినుండి యొక్కమాట నడుగఁ దలంపు గలుగుచున్నయది. ఆరాధిక యెవ్వతుక? ఎవ్వని కూఁతురు? తప్పక నాకుం దెలుపుమా.

నందుఁ డిట్లు శంకాకులితస్వాంతుఁడై ప్రశ్నింపఁగా విని గర్గమునీంద్రుఁడు పక్కున నవ్వెను. నందా! అతిరహస్యము యి యత్యుత్తమమగు తత్త్వమును వచియించెద. గోకులపతీ! పురాతనేతిహాసమొక్కండు గలదు. దానిం దెల్పెద. అవహితుఁడవు గమ్ము. మున్ను గోకులవృత్తాంతము నీశ్వరుఁడు తెల్పఁగా వింటిని. ఈశ్వరుఁడు నాకు గురువు. శ్రీదాముఁడను గోపునకు మున్ను గోలోకమున రాధతోఁ గలహము గలిగెను. శ్రీదాముని శాపమున గోకులమున గోపికయై రాధ జన్మించెను. ఆమె యిపుడు వృషభానుపుత్త్రికయై యున్నది. కలావతి యామెకుఁ దల్లి. ఆరాధాదేవి శ్రీకృష్ణార్ధాంగవిభాసుర. గోవిందునకుఁ దగిన పత్ని. ఆమె గోలోకవాసిని. ఇపు డారాధ కృష్ణానుమతిచే అయోనిసంభూతయై మూలప్రకృతి యయ్యు, నీశ్వరియయ్యుఁ దన కిపుడు తల్లియగు కలావతి గర్భమును వాయుపూర్ణముగ నొనరించి మాయచే గర్భమనిపించి వాయువు ప

సూతిసమయమున వెలుపడఁగా శిశురూపమును దాల్చి యావిర్భవించెను. ఆమెయే మహామాయ. శ్రీకృష్ణోపదేశమున భూతలమున వెలయుచున్న యది. ఆరాధాంబ యిపుడు శుక్లపక్షచంద్రకళవలె వ్రజమున వృద్ధినొందుచున్న యది. శ్రీకృష్ణుని తేజస్సునం దర్ధము దాను గ్రహించి మూర్తిమతియై యాసాధ్వి వెలయుచున్న యది. శ్రీకృష్ణదివ్యమూర్తియే రెండుగానయ్యె నని వేదప్రసిద్ధము. ఈశిశువు స్త్రీ. ఆమె పురుషుఁడు. ఆమెయే స్త్రీ. ఈ శిశువే పురుషుఁడు. ఎట్టులైనను ఒక్కటియే. ఈ రెండురూపము లొక్క తేజస్సునఁ బొడమినవే. ఈ రెండురూపములు తేజస్సునఁ దుల్యములు. రూపమునను గుణమునను సమానములు. పరాక్రమమునను, జ్ఞానమునను, సంపద్విశేషమునను, వృద్ధిని, బురోగమనమునను, ఈ రెండు రూపములు సమానములు. రాధిక వయస్సునఁ బెద్దది. ఆమె నీమహాత్ముఁడు స్మరించుచుండును. ఈభర్త నామెయు సదా స్మరించుచుండును. ఆమె యీయనప్రాణములచే నిర్మింపఁబడినది. ఈయన యామెప్రాణములచే నిర్మింపఁబడియె. రాధాంబిక ననుసరించియే యీయన గోకులమునకు వచ్చెను. పూర్వనియమము ననుసరించి గోకులమున నిందు నామెను స్వీకరింపఁగలఁడు. కంసభీతి యనువ్యాజమున నీగోకులమును హరి చేరెను. * ప్రతిజ్ఞాపాలనమున కేవచ్చెను. భయ మీపరమేశున

* 'ప్రతిజ్ఞాపాల నారాయ భయేశస్య భయం కుతః.' అని మూ.

కుభయేశ్వరున కెక్కుడిది? రాధాశబ్దవ్యుత్పత్తి సామవేదమున నిరూపింపఁబడియున్నయది. పూర్వము నారాయణమూర్తి నాభిపంకజమున నున్న బ్రహ్మ వ్యుత్పత్తిని దెలిపెను. ఆబ్రహ్మయు దాని నీశ్వరున కెఱింగించెను. చాలకాలము క్రిందటఁ గైలాసశిఖరమున నేను శివుదర్శింప వెళ్లియుండ నాపరమశివుఁడు నాకుం దెలియఁజేసెను. దేవతలకు నిది యెఱుంగ దుర్లభము. నందా! వచింతును.

## రాధామహిమము.

సురాసురులకును, మహామునులకును గోర్కుల నొసంగుచు, ముక్తిదయై పరాంబయై రాధికాదేవియులరు. రేఫము (ర. అనునది) కోటిజన్మపాపమును, శుభాశుభకర్మభోగమును, ఆకారము గర్భవాసదుఃఖమును, మృత్యువును, రోగములను హరించును. ధకార మాయువు నొసంగి తద్విఘాతము నొనర్చు కర్మమును హరించును. ఆకారము భవబంధముల వదలించును. ఈదివ్యనామము శ్రవణాస్మరణోక్తుల భవపాశములునశించును. రేఫము నిశ్చలభక్తిని గల్గించు. ఇంతియగాక శ్రీకృష్ణపదాంబుజదాస్యమును బ్రసాదించును. సర్వేప్సితముల ననుగ్రహించి సదానందమును గల్గించును. సర్వసిద్ధులఁ గల్గించును. ఈశ్వరుఁ బ్రసన్నుంజేయును. ధకారము భగవత్సహవాసము ననంతకాలము గలుగఁజేయును. సార్ష్టి సారూప్యము గల్గును. శ్రీ హరితత్త్వజ్ఞానము గల్గును. ఆకారము తేజోరాశినిచ్చి దానశక్తిని

బుట్టించును. యోగశక్తిని, యోగాసక్తమతిని, సర్వకాలహరి స్మృతిని నిచ్చును. శ్రుత్యుక్తి స్మరణమువలనను, యోగమువలనను మోహజాలము కల్మషములు నశించును. రోగశోకములు యమమృత్యువులు తన్నామస్మరణమున వడవడ వడంకు ననుట సత్యము.

రాధామాధవుల నామవ్యాఖ్యానము నించుక వినఁబడినచో నెన్నియో ఫలములు గలుగును. కాని యవి యివి యని వచింప నాకలవిగాదు. ఆరాధకు నీకుమారుఁడగు మాధవునకు బృందావనమందు వివాహము కాఁగలదు. రాధావివాహకాలమునఁ బురోహితుఁడు జగత్కర్తయగు బ్రహ్మయగు. అగ్ని సాక్షిమాత్రునిగా నుండును. ఆపరిణయ మపూర్వముగ సాగఁగలదు. ముందీశిశువు కుబేరపుత్రులకు శాపమోక్షమును బ్రసాదింపఁగలఁడు. గవ్యము నపహరించి భక్షించును. ధేనుకునిం జంపును. కాననమునఁ దాలభోజనము సాగించును. బకకేశి ప్రలంబులను విలాసమాత్రమున హింసించును. ద్విజపత్నులకు మిష్టాన్నభుక్తిపానములచే మోక్షణమును బ్రసాదించును. శక్ర యాగమును భంజించును. ఇంద్రుని బారినుండి గోకులమును రక్షించును. గోపికావస్త్రముల హరించును. వ్రతసంపాదన మొనరించును. ఆగోపికలకు మరల వస్త్రముల నొసంగును. అంతియగాక వారు కోరినవరముల నిచ్చును. వారిచేతస్సుల హరించి వారిని వశ్యులఁగాఁ జేసికొనును. మహారమ్యమగు రాసోత్సవ

మును సర్వజనహర్షవర్ధనముగఁ జేయును. వసంతర్తువున రాకా తిథిని జంద్రోదయకాలమున రాసమండలమునందు గోపికలతో నవ్యవిహారమును జేసి వారిమనోరథములఁ దీర్చును. వారితోఁ గుతూహలమున జలక్రీడల నొనరించును. ఈరాధామాధవు లకు శ్రీదాముని శాపమువలన విచ్ఛేదము గల్గును. గోపాలకు లతోడను, గోపికలతోడను వియోగము శతవర్షములు గలు గును. శ్రీహరి మధురానగరమునకుంబోవ గోపికలకు శోకము వృద్ధియగు. మరలవచ్చి వారికి జ్ఞానమునుపదేశించును. స్యంద నాక్రూరులకు రక్షనొనర్చును. రథమునెక్కి మధురానగరము నకుం జనును. పితృభ్రాతవ్రజసంతతితో యమున నుల్లంఘించి అక్రూరునకు జ్ఞానదానముచేసి స్వరూపమును గనఁబఱచును. మ ధురానగరమును సాయంకాలమున నెల్లెడలఁ దిరిగి దర్శించును. మాలాకారతంతువాయకుబ్జలకు బంధమోక్షము నొనరించును. శంకర ధనుర్భంగము చేయును. యాగస్థానమును దర్శించును. గజమల్లులను రాజునెదుటగాంచి వారినిహింసించును. కంసుని వధించును. కంసునితలిదండ్రుల చెఱవదలించును. మీకెల్ల హిత ముపదేశించును. ఉగ్రసేను నభిషేకించును. కంసునిచేఁ జెఱఁ బెట్టఁబడిన రాజస్త్రీలకు హిత ముపదేశించి శోకము నపనయిం చును. అన్నయు దాను నుపనీతు లగుదురు. గురుముఖమునుండి విద్యనభ్యసించును. గురువునకుఁబుత్రదానముచేయును. గోకుల మునకు మరల వచ్చును. యవనసైన్యములఁ దఱుమును. యవ

నుని మోసగించును. ద్వారకను నిర్మించును. ముచుకుందునకు మోక్షమునిచ్చును. ద్వారకానగరమునకుఁ బ్రయాణము చేయును. యాదవులతో నందుఁ బ్రవేశించును. స్త్రీసంఘములంగూడి యిచ్ఛావిహారములు చేయును. వారికి సౌభాగ్యవృద్ధిని బ్రసాదించును. మణివిషయమునఁ గలిగిన కళంకమును బరిహరించును. పాండవులకు సహాయముచేయును. భూభారమును హరించును. ధర్మజునిచే రాజసూయమును జేయించును. దేవలోకమునుండి పారిజాతమను గొని తెచ్చును. ఇంద్రునహంకారము నడఁచును. సత్యభామావ్రతమును బూరించును. బాణాసురబాహువుల భేదించును. శివసైన్యముల మర్దించును. బాణాసురపుత్రికను గొని తెచ్చును. అనిరుద్ధుని గారాగారమునుండి విడిపించును. వారాణసీపురిని దహించును. విప్రదారిద్ర్యభంజనము చేయును. విప్రునకుఁ బుత్రదానము చేయును. దుష్టుల మర్దించును. తీర్థయాత్రాప్రసంగమున మీతోఁగూడి తిరుగును. రాధంగూడి మరల గోకులమును బ్రవేశించును. నారాయణాంశమును ద్వారకయందునిచి రాధంగూడి గోలోకమునకు వేంచేయును. ఈశిశువు లోకాధిపతి. నిన్నుంగూడి వైకుంఠమునకు నారాయణమూర్తి యరుగును. ఇట్లు శ్రుతినిర్ణయించినది. ఇఁక నిపుడే నెందుల కిటకువచ్చితినో ఆకార్యక్రమము వినుము.

మాఘశుక్లచతుర్దశీ తిథియందు గురువారమున రేవతీనక్షత్రమున శుభయోగమున వణిక్కరణంబునఁ దారాచం

ద్రబలాన్వితమై చంద్రసంయుతంబగు మీనలగ్నమునందు లగ్నాధిపతియగు బృహస్పతి పూర్ణదృష్టిని లగ్నమును జూచుచుండునపుడు సకలలోకమంగళప్రదమగు కాలమునందుఁ బండితులంగూడి యాలోచించి ముదన్వితుఁడవై శుభకృత్యముల నిర్వర్తింపుము. అని పలికి రహస్యగృహము నుండి వెడలి వచ్చి గోకులమున శిష్యులంగూడి వసించెను.

నందయశోదలాశుభవార్తల నాలోచించి సంతోషాంబుధి నోలలాడుచుఁ దత్ప్రయత్నమును జేయ మొదలిడిరి. అపుడు కులగురువగు గర్గమునీంద్రు నిజ్యాచు కౌతూహలమున గోకులమునఁ గలగోపాలకులు గోపికలు బాలికాబాలకు లరుదెంచిరి. భానుసహస్రతుల్యతేజుఁడైన యమ్మునిం గాంచిరి. శిష్యులంగూడి స్వతపోబలంబునఁ జెలఁగు నమ్మునియు గూఢయోగంబు నుపదేశించుచు సిద్ధతపుఁడై స్మితపూర్వకముగ సంభాషించుచు, నందభవనపరిచ్ఛదములం గాంచుచు నబ్బురపడుచు, స్వర్ణమయపీఠమునఁ గూరుచుండి యోగముద్రాధరుండై జ్ఞానచక్షుస్సుచేఁ ద్రికాలవార్తలం దెలిసికొనుచు, హృదయంగతుఁడైన పరమేశ్వరుం దిలకించుచు, మంత్రబలప్రభావముల నలరారుచు, యశోదాభుజాంతరమున విహరించు బాలుని స్మితవక్త్రుని, శంకరదత్తధ్యానమున నేరూపము నిరూపింపఁబడినదో యారూప మిదియే యని తదేకదృష్టిఁగాంచుచు, నున్న కులగురువగు గర్గమునివర్యుం గాంచిరి.

గర్గమునియు బాలక్రీడలం దేలు గోలోకనాథునిం జూచి పరమప్రీతుఁడై పూర్ణభూతమనోరథుఁడై సాశ్రునేత్రుఁడై పులకితాంగుఁడై భక్తిసాగరమున మునుంగుచు, మనసున నాగోలోకపతికి నమస్కరించుచుఁ బూజించుచు శిరము వంచి యేదోయుపచే నమస్కరించుచుండెను. అట్టి మునిచంద్రుంగాంచి వచ్చినవారెల్ల శిరములు వంచి నమస్కరించిరి. ఆమునియు వారి నాశీర్వదించెను. వారు కొంచెముసేపుండి తదాజ్ఞనొంది తమతమగృహముల కరిగిరి.

నందుఁ డంత నిర్భరానందప్రేరితుఁడై బంధువులకెల్ల మంగళపత్రికల నంపెను. శుభసమయమునకు ముందే రాఁ ద గునని దూరసమీపస్థులకుం బంచెను. ఆయుత్సవమునకై దధికుల్యయు, దుగ్ధకుల్యయు, ఘృతకుల్యయు, గుడకుల్యయు, తైలకుల్యయు, మధుకుల్యయు, నవనీతకుల్యయు, తక్రకుల్యయు, శర్కరోదకకుల్యయు నిండింపఁబడియె. శాలితండులములు, కొండలవలె రాసులుగఁ బోసిరి. అడుకులు పర్వతములవలెఁ గనుపట్టెను. లవణములోనగు వస్తువులు సమృద్ధిగా సేకరింపఁబడియె. లడ్డుకాది మధురపదార్థములు యథేచ్ఛముగా నమరింపఁబడియె. పరిపక్వఫలములు కోరినట్లు సంపాదింపఁ బడియెను. యవగోధూమచూర్ణములు సమకూర్పఁబడియె. కుడుములు లోనగుపిండివంటలు చేయఁబడియె. స్వస్తికకపర్దక ప్రముఖపదార్థములు సిద్ధపఱుపఁబడియె. కర్పూరాదిసద్వస్తుతతాంబూల

ములు మందిరముల నిండ నునుపఁబడియె. ఆ మందిరములకు ద్వారములు మూయఁబడక యెపు డెవరి కేపదార్థము వలసిన నడుగుటకు ననువుగా నునుపఁబడియె. చందనాగరుకస్తూరీకుంకుమ సమన్వితముగా నానామూల్యపదార్థములు, రత్నములు, బంగరు నాణెములు, ముక్తాఫలములు, ప్రవాళములు, విచిత్ర వస్త్రములు, భూషణములు సమకూర్పఁబడియెను. ఇవన్నియుఁ బుత్త్రుని యన్నప్రాశనము కొఱకనుట వ్యక్తమయ్యెను.

అంత సుందరముగ మందిర మలంకరింపఁబడియె. బహువిధచిత్రము లమర్పఁబడియె. చందనద్రవముల నలుకఁబడి కదళీస్తంభరసాలపల్లవములు కట్టఁబడియెను. సూక్ష్మవస్త్రమున నాయిల్లు కైసేయఁబడియెను. మంగళకుంభములు పల్లవఫలాలంకృతములై కులాచారము ననుసరించి యందుంచఁబడియె. ఇతరాలంకారముల నాకుంభములు భూషితములయ్యెను. ఆ గృహమునిండ మూల్యములు నమూల్యవస్త్రములు నుంచఁబడియె. గోవులు మధుపర్కపదార్థములు, సురుచిరాసనములు కనఁబడుచుండెను. నానావిధనైవేద్యములు కనుపట్టుచుండెను. దుందుభినాదములు, పటహస్వనములు, మృదంగమురజానకనిస్వనములు దిక్కులఁ బిక్కటిల్లఁజేసెను. ఇంకను వంశీనాదముఖశుభతమవాద్యనినాదములు చెలరేఁగెను. విద్యాధరీనృత్యములు, భృంగిమాభ్రమణము, గంధర్వనాయకగానములు

బోరుకొలుపఁ బడుచుండెను. స్వర్ణపీఠము లలంకరింపఁ బడి యుండెను.

అంత నందునింగాంచి పురోహితుం డిట్లు పల్కెను. రాజా! వల్లవులెల్ల బంధువులం గూడివచ్చిరి. అశ్వములపై నెక్కి కొందఱు, గజారూఢులై మఱికొందఱు, రథారూఢులై యింకను గొందఱు వచ్చిరి. రాజకుమారులు యథోచితభూషణ భూషితులై వచ్చిరి. గిరిభానుఁడు భార్యంగూడి కింకరసంయుతుఁడై వచ్చెను. అనేకరథములు, గజములు, తురంగములు, సిబికలు క్రిక్కిరిసియున్నవి. ఋషీంద్రులు, మునీంద్రులు, పండితప్రవరులు, వందిమాగధులు, బిక్షుకులు వచ్చిరి. ఇట్లు వచ్చిన గోపికాగోపకాదుల లెక్కింప నలవిగా కున్నది. ప్రాంగణమున నిలిచి చూడు మని తెలిపెను.

నందుఁ డాపలుకులు విని వెడలి ముంగిటనిలువంబడి తలయెత్తి చూచెను. వచ్చినవారినెల్ల యథోచితమర్యాదల నలరఁజేసెను. ఋషిప్రముఖులంగాంచి నమస్కరించి పాద్యార్ఘ్యాది పూజాద్రవ్యముల వారి నలరించెను. అపు డానందగోకులము జననిబిడమై యుండెను. ఎవఁడుగాని యెవనిశబ్దము వినఁజాలకుండెను. కుబేరుఁ డంత శ్రీకృష్ణపరమేశ్వరప్రీతికై మహారాత్రయము సువర్ణవృష్టిని గురిపించెను. దానగోకులము ధననిబిడమయ్యెను. బంధువులకెల్ల మహానందమునఁ బొదలిరి. నందసంపదను జూచి యానందకందళితహృదయారవిందులైరి.

## శ్రీకృష్ణమూర్తి కన్నప్రాశనము చేయించుట.

నందుఁ డంతట కృత్యములం దీర్చి పరిశుద్ధమతియై ధౌత వస్త్రములం దాల్చి చందనాదుల నలంది పాదప్రక్షాళము చేసి కొని పీఠమున గూరుచుండెను. గర్గమునివలన నితరమునుల వలన నాజ్ఞఁబొంది కృత్యమునకై సిద్ధుఁడై యుండెను. తొలు దొలుత విష్ణుమూర్తిని ధ్యానించి యాచమనముచేసి వేదోక్త ముగా నన్నప్రాశన కర్మము నొనరించెను. శుభముహూర్తము న శ్రీకృష్ణమూర్తి నందమందిరమున భుజించెను. పరమేశ్వరుఁ డానందుఁ డిడు పాయసము నించుక గుడిచి మహానంద మందె ను. గర్గవాక్యానుసారముగా నందుఁడు ప్రమదాన్వితుఁడై శుభముహూర్తమునందు కృష్ణనామము నునిచెను. జగత్పతికి నఘృతాన్నమును బెట్టెను. పరమేశ్వరుఁ డారగించెను. ఆము హూర్తమున శుభవాద్యములు వాయించిరి. నానావిధధనము లు, భక్ష్యద్రవ్యములు, వస్త్రములు బ్రాహ్మణుల కిచ్చి వారిఁ దృప్తిపఱచెను. వందిమాగధులకు బిక్షుకులకు బంగరు నాణె ములిచ్చి యలరించెను. ధనభరాక్రాంతులై వారు పయనము చేయ శ్రమపడసాగిరి. బ్రాహ్మణులు బంధువర్గములు విశేషించి యాచకులు మిష్టాన్నభుక్తులఁ బరిపూర్ణులైరి. వచ్చినవారికిఁ గోరినవస్తువుల నొసంగుఁడు. ఒసంగుఁడు. ఆగంతుకులారా! తనివిదీఱ భుజింపుఁడు. భుజింపుఁడు. అనుశబ్దములు చెలరేఁగు చునే యుండెను.

కులగురువగు గర్గమహర్షికి బంగరుపాత్రములు విలువ గల రత్నములు వస్త్రములు యథేష్టముగా నిచ్చి నందుఁడు కృతకృత్యుఁ డయ్యెను. శిష్యులకును గోదానస్వర్ణపాత్రాదులనిచ్చి సంతృప్తిపఱచి "ధన్యోఽస్మి"యను కొనియెను. తక్కుంగల భూసురులకుఁ గోరినట్లు వస్త్రాదుల నొసంగెను. నారదమునీ! ఇట్లు గర్గమహర్షి సత్కృతుఁడై శ్రీహరి నెత్తుకొని పరమానందమున "ధన్యోఽస్మి ధన్యోఽస్మి" యను కొనెను. పరమభక్తిచే వేదవినుతులవినుతించెను. నమస్కరించెను. సాశ్రునేత్రుఁడై, పులకాంచితతనుఁడై, భక్తినమ్రాత్మకంధరుఁడై, పుటాంజలియుతుఁడై, శ్రీకృష్ణపాదాంబుజద్వంద్వమునందే దృష్టినిలిపి ఇట్లు నుతించెను.

* లోకనాయకా! శ్రీకృష్ణా! భక్తులభయములంబోద్రోలు నోస్వామీ! నాకుం బ్రసన్నుండవగుము. నీపాదాంబుజదాస్యము నొసంగుము. నీతండ్రి నందుఁడు నాకు ధనమిచ్చెను. దాన నాకేమి ప్రయోజనముగలదు. భక్తాభయప్రదుఁడవగు నోశ్రీకృష్ణా! నిశ్చలభక్తి ననుగ్రహింపుము. అణిమాదియోగసిద్ధుల

* గర్గకృత శ్రీకృష్ణస్తుతిః.

హేకృష్ణ జగతాం నాథ భక్తానాం భయభంజన, ప్రసన్నోభవమామీశ దేహి దాస్యం పదాంబుజే. ౧. త్వత్పిత్రా మే ధనం దత్తం తేనమే కిం ప్రయోజనమ్, దేహి మే నిశ్చలాం భక్తిం భక్తానా మభయప్రద. ౨. అణిమాదికాది సిద్ధేషు యోగేషు ముక్తిషుప్రభో, జ్ఞానతత్త్వే ఽమరత్వే వా కించి న్నాస్తి స్పృహా మమ. ౩. ఇంద్రత్వేవా మనుత్వేవా స్వర్గలోక ఫలే చిరం, నాస్తిమే మనసో వాంఛా త్వత్పాదసేవనంవినా. ౪. సాలోక్యం

యందు, యోగములయందు, ముక్తియందు, జ్ఞానతత్త్వమందు, దేవత్వమునందు నాకించుకంతయుఁ గోరిక లేదు. ఇంద్రత్వమందుఁ

---

సార్ష్టి సారూప్య సామీప్యైకత్వమీప్సితమ్, నాహం గృహ్ణామి తే బ్రహ్మన్ త్వత్పాద సేవనం వినా. ౫. గోలోకవాపి పాతాళే వాసే నాస్తి మనోరథః, కింతు తే చరణాంభోజే సంతతం స్మృతిరస్తు మే. ౬. త్వన్మంత్రం శంకరాత్ప్రాప్య కతిజన్మ ఫలోదయాత్, సర్వజ్ఞో ఽహం సర్వదర్శీ సర్వత్ర గతిరస్తు మే. ౭. కృపాం కురు కృపాసింధో దీనబంధో పదాంబుజే, రక్షమా మభయం దత్వా మృత్యుర్మే కిం కరిష్యతి. ౮. సర్వేషా మీశ్వరశ్శర్వ స్త్వత్పాదాంభోజసేవయా, మృత్యుంజయో ఽంతకాలశ్చ బభూవ యోగినాం గురుః. ౯. బ్రహ్మా విధాతా జగతాం త్వత్పాదాంభోజ సేవయా, యస్యైక దివసే బ్రహ్మన్ పతంతీంద్రా శ్చతుర్దశ. ౧౦. త్వత్పాద సేవయా ధర్మ స్సాక్షీచ సర్వకర్మణా, పాతా చ ఫలదాతా చ జిత్వాకాలం సుదుర్జయం. ౧౧. సహస్ర వదన శ్శేషో య త్వాదాంబుజసేవయా, ధత్తే సిద్ధార్థ విశ్వం శివః కంఠే విషం యథా. ౧౨. సర్వ సంపద్విధాత్రీ యా దేవీనాంచ పరాత్పరా, కరోతి సతతం లక్ష్మీః కేశై స్త్వత్పాదమార్జనమ్. ౧౩. ప్రకృతి ర్బీజరూపాసా సర్వేషాం శక్తిరూపిణీ, స్మారం స్మారం త్వత్పదాబ్జం బభూవత్వత్పరావరా. ౧౪. పార్వతీ సర్వరూపాసా సర్వేషాం బుద్ధిరూపిణీ, త్వత్పాదసేవయా కాంతం లలాభ శివమీశ్వరం. ౧౫. విద్యాధిష్ఠాతృదేవీ యాజ్ఞాం మాతా సరస్వతీ, పూజ్యా బభూవ సర్వేషాం సంపూజ్యత్వత్పదాంబుజం. ౧౬. సావిత్రీ వేదజననీ పునాతి భువనత్రయం, బ్రహ్మణో బ్రాహ్మణానాం చ గతి స్త్వత్పాదసేవయా. ౧౭. క్షమా జగద్విభర్తుంచ రత్నగర్భా వసుంధరా, ప్రసూతి స్సర్వసస్యానాం త్వత్పాదపద్మసేవయా. ౧౮. రాధా మమాంశ సంభూతా తవతుల్యాచ తేజసా, స్థిత్వావక్షసి తే పాదం సేవతే ఽన్యస్య కా కథా. ౧౯. యథాశర్వాదయో దేవా దేవ్యః

గాని, మనుత్వమందుఁగాని, చిరకాలమనుభవింపఁదగు స్వర్గలోకఫలమందుఁగాని, నాకు మనోవాంఛ లేదు. నీపాదసేవావాంఛతప్ప నితరవాంఛలు లేవు. సాలోక్యముగాని, సార్ష్టి సారూప్యముగాని, సామీప్యనివాసత్వముగాని నేఁగోరను. నీపాదద్వయ సేవనే కోరెదను. గోలోకమందుఁగాని, పాతాళమునఁగాని, నివసించు కోరిక లేదు. నీచరణాంభోజమందు సంతతస్మృతి గలుగ ననుగ్రహింపుము. నీమంత్రమును శంకరునుండి పొంది పూర్వపుణ్యవిశేషము వలన జపించుచున్నవాఁడను. కావున సర్వవేత్తనై సర్వదర్శినై సర్వత్రగతిగలవాఁడనై యుండనను గ్రహింపుము. కరుణాసముద్రుఁడా! నాపైఁగరుణింపుము. ఓదీనబంధూ! నీపదాంబుజస్మృతి ననుగ్రహింపుము. నన్నుఁగాపాడుము. అభయదానము చేయుము. నీకృపకుఁ బాత్రుఁడనైతిఁ గాన నన్ను మృత్యువేమియుఁ జేయఁ జాలదు. నీపదాంభోజసంసేవచేత సర్వేశ్వరుఁడు కావచ్చును. మృత్యుంజయుఁడు కావచ్చును. అంతకాంతకుఁడు కావచ్చును. యోగి గురువు కావచ్చును. శంకరుఁ డిట్టివాఁడగుట నీమహిమముననే కదా. బ్రహ్మయు నీపాదకమలసేవచేత సృష్టికర్తయయ్యెను. ఏ బ్రహ్మలోకమున నొకపగటియందుఁ

పద్మాదయో యథా, సనాథంకురుమా మీశ ఈశ్వరస్య సమాకృపా. ౨౦. నయాస్యామి గృహం నాథ నగృహ్ణామి ధనం తవ, కృత్వా మాం రక్షపాదాబ్జ సేవాయాం సేవకం రతమ్. ౨౧.

ఇతి గర్గకృత శ్రీకృష్ణస్తుతిః సమాప్తాః.

బదునలుగురు ఇంద్రులు లయింతురో అంతటి యాయుత్తను పది. విని బ్రహ్మకుఁ గటాక్షించితివి. ధర్ముఁడు నీపాదసేవచే సర్వకర్మ సాక్షి యయ్యెను. రక్షించుటకు, మృత్యువును జయించుటకుఁ దగిన శక్తి ధర్మునకుఁ బ్రసాదించితివి. అనంతుఁడు సహస్రవదనుఁడై యేనీపాదసేవచే సిద్ధార్థునివలె శివుఁడు కంఠమున విషమును దాల్చినట్లు దర్శించుచున్నవాఁడు. సర్వసంపత్తుల నొసఁగుచుఁ బరాత్పరాహ్వయమున నలరు లక్ష్మీదేవి తన శిరోజములచే నీపాదమార్జనముచేయుచున్నదికదా. ప్రకృతి యనఁబరఁగి, సర్వజగన్నిర్మాణమున కాదిభూతురాలై శక్తి రూపిణియైయలరు శివకామసుందరి నీపాదపద్మముల స్మరించి స్మరించి యతులైశ్వర్యము నందెను. ఇంతియగాక యా పార్వతి సర్వబుద్ధిరూపిణియు నయ్యెను. నీపాదసేవచే సర్వేశ్వరుఁడగు శంకరుని నాథునిగఁ బడసెను. విద్యల కాదిభూతయై జ్ఞానమాత యనఁ బ్రఖ్యాతి గాంచిన సరస్వతి నీ చరణముల సేవించి సర్వపూజ్య యయ్యెను. సావిత్రి యను పేర నామెయే సర్వజగత్తులఁ బరిశుద్ధములుగాఁ జేయుచున్నది. అంతియగాక బ్రహ్మకు బ్రాహ్మణులకు గతియయ్యెను. క్షమ యనంబరఁగు భూదేవి రత్నగర్భయై సర్వసస్యములం బుట్టించుచు నీయడుగుఁ దమ్ములసేవించిన కతన లోకము ను భరింపఁజాలియున్నది. మదంశసంభూతురాలగు రాధాదేవి తేజస్సున నీకు సమానురాలయి నీహృదయపీఠమునఁ గూడు

చుండి సేవించుచున్నది. ఇతరులమాట యిఁకఁ జెప్పనేల? శర్వాదిదేవతలు, పద్మాదిదేవికలు, ఎట్లు సాటిలేరని మహిమమున నలరారుట నీపాదసేవచేతనేకదా. శ్రీకృష్ణా! నీవే దిక్కుగా నమ్మినవానిగా నన్నుం జేయుము. ఈశ్వరునిపై నునిచిన ప్రేమము నాపై నుంపుము. నాథా! నేనిఁక నాగృహము నకుఁ బోనొల్లను. ధనము గ్రహింపనొల్లను. నీపాదంబుజసేవయందు సంతతరతమానసము గల సేవకునిగా నను గ్రహింపుము.

అని ఇట్లు వినుతించి కన్నులనుండి బాష్పములు ధారలుగా బ్రవహించుచుండ శ్రీహరిచరణములపై వ్రాలెను. మిగుల నార్తుఁడై రోదనముచేసెను. భక్తిచేఁ బులకాంచితవిగ్రహుఁ డయ్యెను. ఇట్లు గర్గముని వినుతించి దుఃఖించి తనకోరికను విన్నవింపఁగా భక్తవత్సలుఁ డగుపరమేశ్వరుఁడు ఫక్కున నవ్వెను. స్వయముగా నతనితో "నాయందు నీకు భక్తికలుగుఁగాక" అని పలికెను.

నారదమునీ! గర్గకృతమగు నీస్తోత్రమును సంధ్యాత్రయమునందు ఎవఁడు పఠించునో వాఁడు హరియందు దృఢభక్తియచుర శ్రీకృష్ణదాస్యమును స్మృతిని బొందఁగలఁడు. జన్మమృత్యుజరారోగశోక మోహాదిసంకటములనుండి విముక్తిని గాంచి శ్రీకృష్ణదాససేవతత్పరుండై శ్రీకృష్ణలోకమున నామహాత్మునిం గూడియుండి పరమానందసుఖము ననుభవించును. ఎపుడుగాని హరితో వియోగ మతనికి సంభవింపదు. అని పలికి

నారదునితో మరల నారాయణుం డిట్లనియె. గర్గముని శ్రీకృష్ణపరబ్రహ్మము నిట్టులు తానే యెత్తుకొని నుతించి మరల నందున కా బాలకు నొసంగెను. అవ్వేల నందునింగాంచి మహాత్మా! నే నింక నింటికిం బోయెద. అనుజ్ఞ నిమ్ము. ఓహో! యీ సంసార మతి విచిత్రము. మోహజాలవేష్టితము. సమ్మేళనవిరహము లనునీరెండును మనుజులకు సముద్రపు నురుగువలెం గలుగుచుండును. గర్గవచనమును విని నందుఁడు రోదనము చేసెను. లోకమున సాధుజనులు సత్సంగతి తొలఁగుట మరణమున కంటెఁ గష్టతమముగ నుండును గదా!

అంతట గర్గముని శిష్యసంఘములంగూడి తన నివాసమునకుఁ బోవుచుండఁగాఁ దద్వియోగమును సహింపఁజాలక నందాదిగోపకులు యశోదాదిగోపికలు బిట్టు రోదనముచేసిరి. అమ్మునికి నమస్కరించి పరమప్రీతియుక్తులై వినయము గనఁబఱచిరి. మునివర్యుఁడగు నాగర్గుఁడు వారి నాశీర్వదించి మధురానగరమునకుం బోయెను. తక్కంగల ఋషులు మునులు బంధువులు రాకొమరులు సర్వసత్కారములనంది తమతమగృహములకుం బోయిరి. స్తుతిపాఠకులెల్ల యథార్థధనముల నంది పరమహృష్టులై నందునిం బొగడుచుఁ జనిరి. మఱికొందఱు స్వనివాసమునకన్న గోకులమే వాసార్హమని యందే యుండిరి. యాచకులు పోనొల్లరైరి. అందుఁ గొందఱు ధనభారమును

మోయఁజాలక యెట్లో పోవ నుంకించిరి. మఱికొందఱు కార్య వ్యాజముల నందే ప్రొద్దుపుచ్చుచుండిరి. కొందఱు ఉత్సవార్థసం పాదితపదార్థము లుండినంత దనుక నుండి పోదు మని చెప్పుచు నుండిరి. కొందఱు గోపాలకృష్ణుని యెదుట నాడుచుఁ బాడుచు వినోదములను జూపుచు నానెపమునఁ బ్రయాణమను మాట మఱచి పోయి హాయిగా భుజించుచు నివసించిరి. కొంద ఱంద ఱకుఁ గథలు చెప్పుచుఁ గాలము గడుపుచుండిరి. అందుఁగొందఱు మరుత్త, శ్వేత, నగర, మాంధాతృరాజులయు, నుత్తానపాదన హుషనలప్రభృతి మహీపతులయుఁ గథలఁ జెప్పుచు నందఱ సంతోషపఱచుచు నుండిరి. కొందఱు శ్రీరాముని యశ్వమేధ మును, రంతిదేవుని సత్కార్యములను, బెద్దలవలనఁ దమరు విని యున్న నితరరాజుల సత్కృత్యములను వచింపుచు నుండిరి. మఱికొంద ఱిట్టి పుణ్యగాథల వినుటకంటె సంసార మేమి గొప్ప యా యని పలుకుచు నందే యుండి మృష్టాన్నపానములఁ దృప్తి నందుచుండిరి. ఇంకను గొందఱు ప్రయాణముచేయు చునే కాలము దొర్లియుచుఁ బోకుండిరి. కొందఱు నిద్దురమబ్బు తొలఁగినఁ బోవుదు మని హాయిగా నిదురించుచు నుండిరి. ఇట్లిందరు సంతోషమునఁ గాలము గడుపుచుండి యెట్లోవారే పోయిరి.

నందుఁడు యశోదయు హృష్టచిత్తముల బాలునాడిం చుచుఁ దమదివ్యమందిరమునఁ గుబేరైశ్వర్యమును లెక్కింపక

యుండిరి. ఈరీతిగా శ్రీబలదేవకృష్ణులు శుక్లపక్షనిశాకరులవ లెవృద్ధినొందుచు, శుక్లచందనచర్చలఁ దనివినొందుచు, గోవుల తోఁకలఁబట్టుకొనియు, గోడల నాధారముగాఁ జేసికొనియు లేవసాగిరి. శబ్దమునం దర్థముగాని, అం దర్థముగాని పలుకసాగిరి. తల్లిదండ్రుల కానందమును బెంచుచు మెల్లగ ముంగిడి భూమిఁ జేరసాగిరి. శ్రీకృష్ణుఁడు ఒక్కటి రెండడుగులు పెట్టుచు, నంతలోఁ గ్రిందబడుచు, లేచుచు, మరల నడువఁ బ్రయత్నించుచు, దోగాడుచు, మెల్లమెల్లన నిల్లుదాఁట శక్తుఁ డయ్యెను. ఇట్లుండఁగా నా బాలకులకు వయస్సున నొక సంవత్సరము మీరినది. అవ్వల దినదినమానందమును బెంచుచు నాటలాడుకొనుచు గోకులమున నడుచుచుఁ బరుగిడ నలవాటుపడిరి. మాటలను స్పష్టముగా నుచ్చరింపసాగిరి. మాంగా బాలకవిగ్రహులగు రామకృష్ణు లిట్లు ముచ్చటలు కూర్చు నాటల వినోదింప గోకులమంతయు సంతసిల్లుచుండెను.

అట గర్గముని మథురాపురికిఁ బోవఁజాలక శ్రీ కృష్ణవియోగమున బాధితుఁ డగుచు నెట్లో పోయి వసుదేవు నిల్లు ప్రవేశించెను. మునిరాక నెఱింగి వసుదేవుఁ డెదురుసని సాష్టాంగ నమస్కారము లొనరించి కృతకృత్యునిగా భావించెను. పదంపడి బాలకు లిద్దరకుశలము లడిగెను. మునియు, నాతనయుల కుశలములు సవిస్తరముగాఁ దెలిపెను. అందుజరిగిన మహోత్సవముల నానుపూర్వికముగా నివేదించెను. ఆమాటలు

విన్నంతన వసుదేవుఁడు ఆనందాశ్రుజలపూరమున మునిఁగి యొడలెఱుంగక పోయెను. దేవకీదేవియుఁ బరమప్రీతిచేఁ దనయుల కుశలములఁ బలుమారు లడుగసాగెను. మునివచించుకొలఁదిని సంతోషమునఁ బరవశురా లయ్యెను. సంతోషమున మేను మరచి బిట్టురోదనముచేసెను. గర్గమునియు వారికి హితముపదేశించి యాశీర్వదించి తనయాశ్రమమునకుం బోయెను. దేవకీవసుదేవులు కుబేరభవనముంబోని తమసౌధమున నుండిరి.

అని పలికి నారదమునితో శ్రీనారాయణమూర్తి యిట్లు చెప్పెను. నారదా! నీచరితము నించుక వినుము. ఏకల్పమున నీవుపబర్హణుఁ డనుపేర నేఁబదిమంది కామినులకు నాథుఁడవై గంధర్వపుంగవుఁడవై యుంటివో ఆచరిత్రము నాలకింపుము. నీవాకాంతలకుఁ బ్రాణాధికుఁడవై యుంటివి. శృంగారనిపుణుఁ డగు ప్రాయపుఁబురుషుండవు. అట్టి తఱి బ్రహ్మశాపమునద్విజుని దాసీపుత్రుఁడవైతివి. అత్తఱి విష్ణుభక్తుని యుచ్ఛిష్టభోజనమున నిపుడు బ్రహ్మపుత్రుఁడవై పుట్టితివి. సర్వదర్శివి. సర్వజ్ఞుఁడవు. హరిభక్తుఁడవు నైతివి. ఇట్టి నీకు శ్రీకృష్ణచరితమును, నామకరణాన్నప్రాశనమహోత్సవములను వచించితిని. ఈకథ జన్మమృత్యుజరాబాధలనడంచును, ఇంకేమి చెప్పవలయును? వచింపుము.

శ్రద్ధాళువులగు నోపాఠకులారా! ఈగాథను బఠించు భక్తియే ప్రధానముగ నుండవలయును. ఇదియే కథాసారమనఁదగినది. ఇందు శ్రీకృష్ణనామమహిమము పేర్కొనఁబడి

నది. భక్తియుండినఁగాని దానియందు విశ్వాసము కుదురదు. నాస్తికులకు, ఆస్తికాభాసులకు విశ్వాసపుట్టఁజెప్పుట కష్టము. సత్కార్యముల నాచరించియుండినఁగాని భగవన్నామమునందు భక్తికుదురదు. ఫలముగలదని భగవన్నామము స్మర్తవ్యమని యొప్పించుట మిగులఁ గష్టతరకృత్యము. అట్టి కథ యిది యాట గాఢవిశ్వాసము గలిగి దీని బఠింపుఁడు. వివిధవిషయము లిందుఁగలవు. అవి యెల్ల భక్తిప్రపూరితములు. సంసారసాగరతరణమునకు సాయపడునవియే.

ఇందొక్క విషయము ముఖ్యముగా గ్రహింపఁదగినది. ఎవ్వరెవ్వరు భగవన్నామమును ఏయేఫలములను గోరి యుచ్చరింతురో తదనుగుణఫలముల నాదివ్యనామ మిచ్చును. "ఫలంభాగ్యానుసారకమ్" అన్నసూక్తి యిపుడు పుట్టినది కాదు. భాగ్యమనఁగా నదృష్టము. అదృష్ట మనఁగాఁ గర్మము. కనఁబడక ఫలమును గల్గించునది. భగవన్నామము పాపలతాలవిత్రము. కావున ననేకవిధదురితములం దెగవేయుచు వరుసఁగా సత్కార్యానుష్ఠానమునకు బుద్ధిని మరలించి కొంతకాలమునకు ఫలము గోరక కర్మముల నొనరించునట్టి ప్రజ్ఞను బ్రసాదించి భగవద్దృఢభక్తిని గల్పించి కడతేర్చును. కాఁబట్టి రెండుమూఁడుసారు లుచ్చరించినంతనే ఫలము గలుగ లేదే యని శంకింపరాదు. మన మాచరించిన దుష్కృతములు మనకుం గనంబడవు గాని పర్వతపంక్తివలె మన వెనుకనుండును.

వానిని భేదించుట కెట్టి యాయుధము కావలెనో యెంత ప్రయత్నము చేయవలెనో యాలోచింపుఁడు. ఐహికఫలము లత్యల్పములు కావున నవి గోరి భగవంతు నుపాసింపరాదు. చంద్రాయుధము దొరకినపుడు గడ్డముఁగాలుగుకొన్నట్టులు భగవన్నామదివ్యాయుధము దొరకిన తఱిఁ బాపకాసుల నాశనము చేయవలయు. ఆనామస్మరణమే మన ప్రయత్నము లేకయుండ నాపని చేయుచుండును. మన బుద్ధిచాంచల్య మేనాఁడు తొలఁగునో ఆనాఁడు భగవన్నామస్మరణఫలము గలిగె నని మన మూహించుకొనవచ్చును. నిష్కామకర్మాచరణమునందుఁ బట్టుదల గల్గినతఱి మనతపస్సు ఫలవంత మగుచున్న దని నమ్మవచ్చును. అట్టి భగవన్నామము మహిమ మధికమని సంశయించుటయే యొకలోపము. ఇఁక దాని దూలనాడుట సుకృతలేశాభావనిదర్శనము. కాఁబట్టి శ్రీకృష్ణనామమహిమ మపార మని నమ్మవలయును. భక్తులను సదా రక్షించుటకు భగవంతుఁడు వేచియుండును. అట్టి పరమేశ్వరుని నన్నుఁ గావుమా? నాకీఫలమును బ్రసాదింపుమా? యని వేఱుగాఁ గోరుట చిత్తచాంచల్యమే.

శ్లో. అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

అని భగవదుక్తి కలదు కదా. అనఁగా దృఢభక్తి కలిగి యొక్కనన్నే యుపాసింపుఁడని దీనిసారము. ఒక్కొక్క కోక కొకొక్కొక్క దేవత నుపాసించుచుండిన నేదేవతయు నిక్కఁడు

దృఢమతి కాఁడని ఫలము నీయకుండును. సర్వదేవతా రూపునిగ నొక్కనినే యభీష్ట దైవము నుపాసించిన ఫలము గలదు. ఒక్కకార్యమున కొక దేవతయే యనువాని మదియం దాదేవత యితరఫలముల నీఁజాల దనుభావ ముండును. అతఁడు భక్తుఁడుకాఁడు. భగవంతుని యుద్దేశముకూడ నదికాదు. ఏకాగ్రహృదయమున భగవంతుని స్మరించవలయు ననియే భగవద్భక్తి. ఆభావము దృఢముగ నుండనిచో నేదేవతయు ఫలము నీఁజాలదు.

ఇంగుల కొక్క చిట్టికథను వ్రాసెద. ఇది యేపురాణములోనిదని మాత్రము ప్రశ్నింపరాదు. నేఁ గల్పించినది మాత్రము కాదు. పెద్దలవలన వింటిని. నామది కది సరిపడియున్నయది. ఎట్లనఁగా, మున్నొక దేశమునఁ బ్రభువు పండితాధ్భుతిగలిగి దాన జితకర్ణుఁడై యుండెనట. ఏవిద్య నభ్యసించితి వని ప్రశ్నించి పరీక్షించి యుచితరీతి ధనమిచ్చుచుఁ బండితులఁ బోషించుచుండు వాఁడట. పరుషభాషణము లాతని నోట వెడలుట యేనాఁడు నెవ్వరును వినియుండలేదఁట. అట్టితఱి నొకఁడు భాగవతమును జక్కఁగాఁ జదువుకొని తదర్థమును గ్రహించియుండుఁ బండితుఁ డనిపించుకొని ఆరాజు దగ్గరకుఁ బోయెనఁట. ఈపండితుని జూడఁగనే మర్యాదచేసి కూరుచుండ నియోగించి కుశలప్రశ్నపూర్వకముగా మాటలాడి యేవిద్య నభ్యసించితిరని ప్రశ్నించెనఁట. ఆతఁడు భాగవతమును బఠించితినని

యు ధనార్థినై వచ్చితిననియుఁ దెలిపెనఁట. రాజాగ్రహించి నీకు భాగవతము తెలియదు. బుద్ధిలేదు. పో పొమ్మని తూలనాడెనఁట. అతఁ డిదియేమి నాగ్రహచారమా? యని లేచిపోయి మహీపతి ధర్మాత్ముఁడు. సర్వజ్ఞుఁడు. నాయం దేదియో లోపమున్నదని తలంచి యింటికిఁబోయి మరల భాగవతము వల్లించి యాఱునెల లుండి రాజదర్శనమునకు మరలఁ బోయెనఁట. రాజు మున్నాతనిఁ జూడనట్లు నటించి యే విద్యవచ్చునని ప్రశ్నించెనఁట. యథాపూర్వముగా నతఁడు భాగవతము చదివితిననియు, దాని యర్థము చక్కఁగాఁజెప్పఁగలననియు, ధనార్థినై వచ్చితిననియు మనవి చేసెనఁట. భీకరాత్ముఁడై అయ్యా! నీకు బుద్ధిచాలదు లేచిపొమ్మని తిరస్కరించె నఁట. సభలోనున్న వారందఱు రాజిట్లు మాటలాడుట మున్నెన్నఁడు విన్నవారుకారు. కాన నచ్చెరువుపడిరట. ఈ యాచకుఁడు ఇంక నట నున్న యర్థచంద్ర ప్రహారములు బహుమానముగా నీఁబడు నని వెడలిపోయి యిల్లుచేరి రాజుపై నాగ్రహింపక మరల భాగవతమును వల్లించి యిఁక నాకు భాగవతమున నేశంఖలు లేవని మరలఁబోయి రాజును జూచెనఁట. ఆభూపతియుఁ గ్రొత్తవానితో మాటలాడునట్లు స్మితపూర్వముగమాటలాడి విద్యను ప్రశ్నించెనఁట. యథాపూర్వముగా నతఁడు పలికెనట. రాజు కోపాటోపమున నసత్యమాడు నీయాచకుని వెలుపలికిఁ ద్రోయుఁడని భటుల కాజ్ఞాపించెనఁట. భటులు నడుములు కట్టుకొని వచ్చులోపల

నీతఁడేపోయి యింటికిఁబోయిన నవమానమని యడవికిఁబోయి యొక చెట్టుక్రిందఁ గూరుచుండి రాజు ధర్మాత్ముఁడయ్యు నిట్లనుట నాగ్రహాచారమే కాని వేఱుకాదని తన కర్మమును దూఱుచు భాగవతము విప్పి పారాయణము చేయఁబూనఁగా నందు—

"యద్ధా గుహాః కిమ జితోవతినోపపన్నాన్,
కస్మా ద్భజంతి కవయో ధనదుర్మదాంధాన్."

౨ స్కం. ౨ అ. ౫ శ్లో.

కనఁబడియె నఁట. స్మరణ మభినయించి తదర్థమును గ్రహించి బుద్ధిలేదని రాజు చెప్పుట న్యాయమే యని యూహించి మరల రాజుదగ్గరకుంబోయి యుచితరీతి నతఁడు గౌరవింపఁ గూరుచుండక రాజేంద్రా! నాకు బుద్ధిలేదు. భాగవతము నాకుఁ దెలియదనిమాట సత్యమని యిపుడు తెలిసికొంటి నని యారాజ సభకు నమస్కరించె నఁట.

అంతట రాజులేచి యాతనిం గౌఁగిటఁజేర్చి యార్యా! "యోఽర్థవి త్సకలం భద్ర మశ్నుతే" అన్నసూక్తి నెఱుంగుదువు కదా. భాగవతము చదువుటయేమి? నన్నుధనార్థివై యాశ్రయించుటయేమి? నవ్వారా! నిన్ను, నన్ను, నన్నుం బుట్టించిన బ్రహ్మను, సకల బ్రహ్మాండములఁ బోషించువాఁడు భగవంతుఁడు కదా. అట్టి విషయమును దెలుపునదికదా భాగవతము. దానిం జదివితి నని చెప్పుట పొరపాటుకదా. అని తన పరుపో

క్తులకు మన్నింపఁ బ్రార్థించి మోక్షవిద్యను తుచ్ఛధనమునకై విక్రయించి నట్లగును గాన నట్లు చెప్పకుమని హిత ముపదేశించి యనంత ద్రవ్యము నిచ్చి యతని హృష్టమతింజేసి పంపెనఁట. ఈకథాసార మేమి? భగవంతుఁడు తన్నే నమ్మినవారిని రక్షింపఁ గంకణము కట్టుకొనియుండ నింకొక యసమర్థమనుజుని బ్రార్థించుట పామరమని కదా. ఇంతట నీకథావిషయమును మాని లోపలిశ్లోకమును ఇంచుక విమర్శించెదను.

'కస్మా ద్భజంతి కవయో ధన దుర్మదాంధాన్' అని మూ.

జ్ఞానులు ఏలాకో ధనదుర్మదమునఁ గన్నులు గానని మూర్ఖుల సేవించుచున్నారు. అని శుకు లుపదేశించిరి. దీనికి వ్యాఖ్య. "విద్వాంసో యతయోపి ధనదుర్మదాంధాన్, ధనేన యోఽయం దుర్మదః. శ్లో. 'ఈశ్వరోఽహ మహంభోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ, ఆఢ్యోఽభి జనవానస్మి కోఽన్యోఽస్తి సదృశోమయే' త్యాది ప్రలాపహేతు దుర్మదః. మదిరాది మత్తస్యేవ మదః, తేనాంధాన్, ఉత్తమాధమమధ్యమపురుషతారతమ్యావివేకవిధురతయా అంధప్రాయాన్. ధనికాన్ కస్మాద్ధేతో ర్భజంతి. అశనాచ్ఛాదన గృహాది నిమిత్తం హితద్భజనం తస్యశ్లోక ద్వయోక్తప్రకారేణ రాజసేవాద్యాయాస మంతరేణైవ సిద్ధత్వాత్ న తదర్థ మపి తే భజనీయాః. యేతాన్ భజంతే న తే విద్వాంసః. అపితుం కేవలం పామరా ఏవేతి భావః,"

అని.

ఇందు మూలము సూత్రప్రాయముగ నున్నది. ఇంత యర్థ మిందుఁగలదని వ్యాఖ్యాతలు తెలిపిరి. ఈ యర్థము నంతయు గ్రహించియే కాఁబోలు శ్రీమహాకవి పోతన తనయాంధ్రీకరణమునందు పైశ్లోక చతుర్థపాదమునకు

క. రక్షకులు లేని వారల
రక్షించెద ననుచుఁ జక్రి రాజైయుండన్
రక్షింపు మనుచు నొకనర్థు
నక్షము ప్రార్థింపనేల యాత్మజ్ఞులకున్.

అని పద్యమును వ్రాసెను. వ్యాఖ్యాతలభావము మూలకర్త్రది కాకపోవచ్చునను వారికుభావమును బోతనగారు తిరస్కరించిరి. పోతన యేల? బుద్ధిమంతులెల్లరు తిరస్కరింపక మానరు. వ్యాఖ్యాతలభావమే పరిగ్రహింపకున్న నీగ్రంథముల కిట్టి ప్రఖ్యాతి యే వచ్చియుండదు. భాష్యములే లేకయున్న వ్యాససూత్రములకు నామమే లేకపోవును. కాఁబట్టి మూలార్థము వ్యాఖ్యానాదులవలనఁ జక్కఁగా నెఱింగి దానిసారమునైనను బద్యమునఁ జేర్చి మూలార్థ మిది యని లోకులకు విస్పష్టముగాఁ దెలుపుట కవికృత్యము. అట్టి సత్కృత్యమును శ్రీపోతనమహాకవి నిర్వహించెను. వారి నుదాహరణముగాఁ గైకొనుట ముఖ్యము.

శ్లో. విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని,
శునిచైవశ్వపాకేచ పండితా స్సమదర్శినః.

ఈశ్లోకమునకుఁ గవిబ్రహ్మ యగు తిక్కనసోమయాజి:—

చ. వినయము విద్యయుం గలుగు విప్రునియందును గోవునందు
నో, ప్పునఁ దగుహస్తియందు నొకపోకకుఁ బోవని కుక్క
యందు ధ్వాని నడఁచి తెచ్చివండి తిను నీచపుమాలనియం
దుఁ దుల్య దర్శనులు తదంతరాత్ముని నిరంజనునిం గనునట్టి
పండితుల్.

అని తెనుఁగునఁ బద్యమును వ్రాసెను. ఇందు నాల్గవపాదము మూలమును జూచిన నెక్కువగఁ జేర్పఁబడినట్లు తోఁచును. కాని యాయర్థమే మూలాభిప్రాయమును బోషించును. ఎంతో సంగ్రహముగ వ్రాయు నలవాటుగల సోమయాజు ముఖ్యార్థమును విపులము చేసి తెల్పిరిగదా. అట్లే రహస్యమును వెల్లడించుటయే తెనిఁగించుట. యనఁగా, రహస్యములను రహస్యములుగానే యుంచవలయు నన్నచోఁ దెనుగించు టేల? డుము వ్రులు చేర్చుట తెనుఁగుగాదు.

"తపస్స్వాధ్యాయనిరతం" అను శ్లోకమునకు "తపస్స్వాధ్యాయనిరతుండును, తపస్వివాగ్విదాంవరుండును, నారదంపరిప్రచ్ఛుండును, వాల్మీకిర్మునిపుంగవుండును" అని వ్రాసిన నెట్లుండునో చెప్ప నక్కఱలేదు. కాఁబట్టి మూలభావమును జక్కఁగా లోకులకు శ్రీపోతనమహాకవి తెలియంజేసి కృతార్థుఁ డయ్యెను. ఆమహాత్ముని పద్యరత్నములను స్మరించినపుడు తనువు పులకరింపక మానదు.

ఇట్లు భగవన్నామనిర్వచనము చేయఁబడినది. గర్గముని శంకరశిష్యుఁడు. వసిష్ఠమహర్షి రఘుకులపురోహితుఁడైనట్లే గర్గ ముని నీచకృత్యమైనను బాపజనకమైనను శాస్త్రనిందితమైనను పౌ రోహిత్యమున కంగీకరించెను. ఏల? ద్రవ్యాశ చేతనా? కాదు. ఈ వంశమున శ్రీపరాత్పరుఁ డవతరించును, బాల్యమునుండి యాప రమపురుషుని జూచుచు ననేకవిధములఁ దన్నామస్మరణము చేయు చు నీజన్మమును ఫలవంతముగాఁ జేయవలయుననియే కాని వేఱు కారణముకాదు. కాఁబట్టియే యాశిశువును గాంచినంతనే లోకా చారము ననుసరించి యాశిషముల నిచ్చినను మనస్సున భగ వంతునకు నమస్కరించి యెత్తుకొని ముద్దాడి వినుతించెను. ఔ రా! ఏమామహర్షి పుణ్యవిశేషము? బాలకృష్ణమూర్తిని స్పృ శించి ముద్దుగొనుపుణ్య మెంతటివారల కబ్బును? అట్టిపుణ్యము నకు నోచిన గర్గముని కృతకృత్యుఁ డయ్యెను. సాంద్రానందము న భగవంతు నెత్తుకొని వినుతించెను. ఏవాంఛలుగోరక నీపాద సేవఁ గటాక్షింపుమా. అదియే పరమపురుషార్థమని వాంఛిం చెను. ఇంద్రత్వముకూడ వలదనెను. ఏల? అదితుచ్ఛతమమై నది. ఈపాదసేవాభాగ్యమో మహానందప్రదము. ముక్తి నొ సంగుట కదియే సమర్థము. కావుననే యామహర్షి దానిం గో రెను. భగవంతుఁ డొరులకు వినఁబడకుండ నట్లే యగుఁగాక యని పలికి యథాపూర్వకముగా నాడుకొనసాగెను. నందాదు లించుక సేపు మునివచనముల జ్ఞానముగలిగి పరాత్పరునిగా భా

వించిరిగాని తన్మాయామోహితులై మరలఁ బుత్రునిగా భావించిరి. ఇదియే భగవచ్చమత్కృతి. ఈచమత్కార మొరులం దుఁ జూపట్టదు. ఇట్లు భగవంతుని సంస్తుతించి గర్గమహర్షి కృతార్థుఁడనైతి నని తలంచి తన యిల్లుచేరి సదా శ్రీకృష్ణపాదారవిందధ్యానాంబుధి మునిఁగి తేలుచుండెను. ఇంతట నీవిషయము ను వదలి శ్రీబాలకృష్ణలీలలఁ బఠింతము.

## శ్రీకృష్ణుఁడు నోరు తెఱచి సర్వలోకములను యశోదకుఁ గనఁబఱచుట.

* గర్గముని చంద్రుఁడు తననందనునిమహిమమును దెలిపి కృతకృత్యుఁడై మధురానగరమునకుఁ బయనమైన పిమ్మట నందుఁడు మున్ను వసుదేవుఁడు తనతోఁ దెల్పిన కృష్ణవిషయమును గౌరవించుచుఁ దనభాగ్యమునకు సంతసించు చుండెను. బాలకృష్ణుఁడు భ్రాతయగు బలదేవుంగూడి యాడుకొనుచుండెను. క్రమక్రమమున వారిరువురు నడువసాగిరి. తప్పుటడుగులు వేయుచు నడుచుచుఁ బడుచు మరల లేచుచు నిట్లు బాలక్రీడలఁ జూచువారల కన్నులకు ముద్దుగా నుండిరి. వారిని జూచుచుండువారలకుఁ బ్రొద్దుపోవుట తెలియకుండెను. తద్దర్శనమున వారనుభవించు నానందము చిరకాల తపస్సు చేసి సిద్ధిగాంచిన

---

* ఈకథ శ్రీభాగవతము ౧౦-వ స్కం. ౭-వ యధ్యాయైకదేశమునుండి గ్రహింపఁబడినది.

మహామునులకుఁ గూడ లేకుండెను. ఇఁకఁ దలిదండ్రుల యానం దమునకు మేరయే లేకుండెను.

ఒక్కనాఁడు యశోద బాలకృష్ణునకుఁ బాలీయఁగోరి యాడుకొనుచున్న భగవంతు నెత్తుకొని ముద్దాడి గర్గముని పలుకులు మఱచి కుమారునిగనే భావించి పాలిచ్చుచుండెను. శ్రీకృష్ణమూర్తియు నించుకసేపు క్షీరపానముచేసి సుస్మితముతోఁ ప నావులించెను. ఆజృంభణమున నాయశోద శ్రీకృష్ణునివదనమున సముద్రములు, దిశలు, ధరణి, నవద్వీపములు, సకలపర్వతములు, నదీసహస్రములు, వాయువు, సూర్యుఁడు, శశాంకుఁడు, హుతవహుఁడు, ఆకాశము, నక్షత్రములు, గ్రహములు, సకలబ్రహ్మాండములు, చరాచరరూపప్రాణిసంతతియు స్పష్టముగాఁ గానఁబడియెను. వానిం గాంచినంతనే యామె దేహము కంపింపసాగెను. అంత నామృగశాబలోచనయు విస్మితయై కన్నులుమూసికొని యాశ్చర్యపడుచు, నేమి నిర్ణయించుటకుఁ దోఁపకయూరకుండెను. నిమేషమాత్రమున నామెకు యథాపూర్వముగఁ బుత్రభ్రాంతి మది నలముకొనియెను. ఆచిత్రమునుగాంచుతఱి గర్గమునిపల్కులు స్మృతికిరాఁగాఁ బరమపురుషుఁడీత డని భావించెనుగాని యంతలో భగవన్మాయ యామెకు విస్మృతిని గల్గించెను.

కథాసారము.

ఆవులించినంతనే సకలబ్రహ్మాండములగపడియెను. నోరు మూసికొనినంతనే యేమియుఁ గనఁబడకపోయెను. అనఁగా

యశోదా! ఈ బ్రహ్మాండములన్నియు క్షణభంగురములు. మది చ్ఛాధీనములు. నారూపమే సకలబ్రహ్మాండరూపముగఁ గనఁబడును. మద్భిన్నమగు పదార్థ మేదియులేదు. ఇది నీవు ప్రత్యక్షముగఁ జూడుమా యని భగవంతుఁడు తెలియఁజేసెను. కాని యాజ్ఞాన మామెకు స్థిరముగ మదినాటిన లోకయాత్ర జరప సమర్థురాలు కా దని తలంచి మాయచే నాచ్ఛాదించెను.

మహానుభావులారా! భగవంతుఁ డావులించినంతలోఁ గనఁబడు బ్రహ్మాండములు స్థిరము లనుకొనుట యెంత వెఱ్ఱితనమో తలంపుఁడు. భగవంతునకు క్షణకాలముగఁ దోఁచినది మన కనేకకల్పములుగాఁ దోఁచు. ఈలోకమును నమ్మి మోసపోవుటయు, నెన్నియో దుష్కార్యము లత్యల్పస్వసుఖమునకయి చేయుటయు నెంతటిబుద్ధిలేకయో యూహింపుఁడు. "జాతస్య మరణం ధ్రువ" మ్మని నోట నుచ్చరించుచుఁ దదర్థము ననుభవమునకుఁ దెచ్చుకొనఁ బ్రయత్నింప కుండుట యెంత వెఱ్ఱితనమో పరికింపుఁడు.

ఈవిషయమునఁ గొందఱు ఇదియంతయు నసంగతమందురు. కాని భగవచ్ఛక్తి యెట్టిదో యోఁజింపరు. ఒకస్వల్పపదార్థము కొండలను బిండిచేయును. అది మనుష్యకల్పితము. ఇఁక దైవకల్పిత పదార్థములశక్తి మన మేలాగు కనుఁగొనఁజాలుదుము. అట్టి యసద్వాదములకు శ్రోత్రములు ఆసక్తములు కానీయక భగవచ్ఛక్తియ మేయమనియు, దాని నిదమిత్థమని తీర్మానిం

పంబూనుట "ఘటానాం నిర్మాతు స్త్రిభువనవిధాతుశ్చ కలహః" అన్నట్టి దగుననియు నమ్మి భగవంతుని ధ్యానించుట మనకర్తవ్యము. అదియే మనకు సాయపడునది. పుత్త్రమిత్త్రకళత్త్రాదులు సాయపడువారు కారు.

ఇట్లు భగవంతుఁ డపుడపుడు యశోద కజ్ఞానమును దొలఁగించుచు, మరలఁ బుత్త్రజ్ఞానము తనయం దామెకుఁ గల్గించుచుఁ, దన యపారశక్తి నించుకంత కనఁబఱుచుచు నాడుకొనుచున్నట్లు నటించుచుఁ దనను దెలిసికొనఁజాలకున్నారు గదా యని చిఱునవ్వున వారిఁబరిహాసించుచుండెను. మాయాసంచ్ఛన్నాత్మమహిముఁడై సాధారణశిశువువలె బాలచేష్టలఁ జేయుచుఁ గాలమును గడపుచుండెను. బలదేవుఁడు కృష్ణానుసరణము చేయుటయేగాని స్వతంత్రించి యద్భుతకృత్యముల నాచరించుట లేదు.

## బాలచేష్టలు.

ఇట్లు వరుసఁగా గోకులమున నాబలరామశ్రీకృష్ణులు పెరుగుచు సమానవయస్కులగు గోపాలబాలకులతో నాడుకొనుచు నుండిరి. అందుఁ గృష్ణుఁడు బాలచేష్టలయం దందఱ మించి యుండెను. అందు ముఖ్యముగాఁ బాలు పెరుగు వెన్న మీఁగడ మొదలగు వస్తువుల నెక్కుడుగ భక్షించుట శ్రీకృష్ణునకు వాడుక. తల్లి యింట లేనితఱిఁ గార్యాంతరముల నుండు నపుడు దొంగలించుట, అది గన నేనెఱుంగ ననుట యీరెండు

పనులలో శ్రీకృష్ణునకే యగ్రతాంబూల మీయఁదగియుండె ను. ఈయనసావాసముచేత నితరబాలకులకు నించుక యీవిద్య యలవాటుగాఁ జొచ్చెను. తమతమగృహముల నీకృత్యము చేయుట యటుండ నిరుగుపొరుగిండ్లలోఁ దూఱి యపహరించు టకు శ్రీకృష్ణున కలవాటు పడెను. గునగునఁ బరువెత్తుచుఁ దోడిబాలురతో నాడుచున్నపుడు చూడఁజూడ వేడుకను గూర్చుచుండెఁ గాని వెన్న దొంగిలునపుడు కనుఁగొనువారి కా గ్రహమును గలిగింపఁ జాలియుండెను.

గోపికలు కొంతకాల మోర్చుకొనిరి. మఱికొంతకాల ము రాజపుత్త్రుఁడని యూరకుండిరి. మఱికొంతకాల మయ్యో యశోదకు లేకలేక కలిగినపిల్లవాఁడని శాంతము చూపుచుం డిరి. పట్టరాని యాగ్రహము గలిగినతఱి ఏమయ్యా బాల కృష్ణా! యిది మర్యాద యేనా యని హెచ్చరించుచుండిరి. కొం తకాలము నీవిట్టిపనులు చేసిన నిఁక నోర్వఁజాలమని పరుషభా షణములఁ బలుకుచుండిరి. మఱికొన్నిదినములు యథాపూర్వ రీతిగనే దొంగిలుటం గనుంగొని బెదరించుచుండిరి. ఈకృత్య ము శ్రీకృష్ణునకు దినదినాభివృద్ధి నొందసాగెను. తఱుముకొని వచ్చిన నిముసమాత్రమునఁ బరువెత్తి వారికిం జిక్కక యిల్లు చేరు నేర్పు మిక్కిలిగా నుండెను. రాజకుమారుఁడని యెంత కాలము వారోర్తురు? ఇఁక యశోదతోఁ జెప్పుకొనక తప్ప దని వారిలోఁ గొందఱు వనితలు తీర్మానించుకొనిరి.

గోపిక లిట్లు భయపెట్టుకొలఁది శ్రీకృష్ణబాల్యచేష్ట లించుక ముదిరెను. వెగటుగను దోఁచు నట్టి వయ్యెను. మఱియు దుర్భరము లయ్యెను. ఆఁడువారలకు సహజముగ నోరుఁ తక్కువ. అందులకుఁ దోడు వెన్నపోవుట, కుండలు పగులుట, పట్టుకొనఁబోయినఁ జిక్కకపోవుట, ఒక్కవేళ దొరకిన మూఁతికి వెన్నపూసి పరుగెత్తుట, దాన నింటిపెద్దలు చూచిన నీవే యీపని చేసితి వని చీవాట్లుపెట్టుట గోపికలకు మఱింత బాధాకరము లయ్యెను. వస్తువులు పోవుట కన్నఁ గొన్నియసహ్యపు జేష్టలు ఓర్వరాని వయ్యెను. కావున నిఁకఁ దాళఁజాల మని యొకనాఁడు యశోదకడకుం బోయి తల్లీ! మనకృష్ణమూర్తి చర్యలు దుర్భరములుగా నున్నవని తెలుపఁబూని.—

శ్లో. వత్సాన్ ముంచన్ క్వచిదసమయే క్రోశసంజాతహాసః
స్తేయం స్వాద్వత్త్యథదధిపయః కల్పితైః స్తేయయోగైః,
మర్కాన్ భోక్ష్యన్ విభజతి స చేన్నాత్తి భాండం భినత్తి
ద్రవ్యాలాభే సగృహకుపితో యాత్యుపక్రోశ్యలోకాన్

క. బాలురకుఁ బాలు లే వని
బాలెంతలు మొఱలుపెట్టఁ బకపక నగి యీ
బాలుం డాలము సేయుచు
నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ.

క. పడంతీ నీబిడ్డఁడు మా
కడవలలో నున్న మంచి కాగినపాలా
పడుచులకుఁ బోసి చిక్కిన
కడవలఁ బో నడిచె నాజ్ఞ కలదో లేదో.

క. మీా పాపఁడు మాగృహముల
నాపోవఁగఁ బాలు ద్రావ నగపడకున్నం
గోపించి పిన్నపడుచుల
వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ.

మ.త్త. పుట్టి పుట్టఁడు నేఁడు దొంగిలఁ బోయి మాయిలు సొచ్చి
తా, నుట్టి యందక ఱోళ్లుఁ బీఁటలు నొక్కపై విడి మె
క్కి చే, వెట్టఁ జాలక కుండ క్రిం దొక పెద్దతూఁటొనరిం
చి మీా,పట్టి నీరఁగడపాలుఁ జేరలఁ బట్టి త్రావెఁ దలోదరీ.

అని బహువిధముల శ్రీకృష్ణుని తులిపితనమును గూర్చి విన్నవిం చిరి. మఱియుఁ గొందఱు యశోదా! మనకృష్ణుఁడు చూడఁ బోయినఁ బిల్లవాఁడు. చేయుఁబూను చేష్టలు పెద్దవారిచర్యల మించినవి. అమ్మా వినుము కుటుంబకలహము లిందు మూల మునఁ గలుగుచున్నయవి.

క. ఆడంజని వీరల పెరుఁ
గోలక నినుతుఁడు త్రావి యొకయించుక తాఁ
గోడలిమూతిం జరిమినఁ
గోడలు మ్రుచ్చనుచు నత్త కొట్టె లతాంగీ.

ఇంతియ గాదు. ఇరుగుపొరుగువారితో నిరంతరకలహ ములు పొసఁగుచున్నయవి. యశోదా ! చాడీలుగా భావింప కుము. నిన్ననే

క. వారిల్లు సొచ్చి కడవలఁ
దోరంబగు నెయ్యిద్రావి తుది నాకడవల్
వీరింట నీసుతుం డిడ
వారికి వీరికిని దొడ్డ వాదయ్యె సతీ.

పోనీ ! ఇట్టిపనులు తెలియక చేసినాఁ డనియే భావింత ము. కాని మఱొక్క మాట యాలకింపుము.

క. వేలుపు లఁటె నాకంటెను
వేలుపు మఱియెవ్వఁ డనుచు వికవిక నగి మా
వేలుపులగోడపై నో
హేలావతి నీతనూజుఁ డెంగిలిచేసెన్.

యశోదా ! ఇది పిల్లవాఁడు చేయుపనియే యనుకొన వచ్చునా? ఇట్టివింకెన్నియో కలవు. బాలచేష్ట లని సొమ్ముపో యిన నూరకున్నను పెద్దవారినైన విసిగించు కార్యములు మఱి కొన్నింటిఁ జేయుచున్నవాఁడు. చెప్పఁబోయిన సిగ్గుచున్నది. వినుము.

క. ఇమ్ముగువ తన్ను వాఁకిటఁ
గ్రుమ్మరుచోఁ జీరి నిలిపికొని పే రడుగన్

గెమ్మోవిఁ గఱచి వడిఁ జనె
నమ్మా! యీముద్దుఁగుఱ్ఱఁ డల్పుఁడె చెపుమా.

ఇట్టి పనులు చూచినపుడు విన్నపుడు మనసునఁ గోప
ము పుట్టకపోవునా, తల్లీ! నీవే చెప్పుము. ఇట్టిపనులు పిల్ల
వారు చేయునట్టివియేనా. దీనిని మించినది మఱొక్కటి వినుము.

క. కొడుకులు లేరని యొకసతి
కడు వగవఁగఁ దన్నుఁ బతినిగాఁ గైకొనినం
గొడుకులు గలిగెద రని పైఁ
బడినాఁ డిది వినుము శిశువుపనులే తల్లీ!

క. వ్రాలఁగ వచ్చిన నీసతి
చూలాలందలఁగు మనుడుఁ జూ లగుటకు నే
మూలంబు చెప్పు మనె నీ
బాలుఁడు చెప్పుదు రె సతులు పర్వేందుముఖీ!

క. మగువా నీకొమరుఁడు మా
మగవా రటుపోవఁ జూచి మంతనమునకుం
దగఁ జీరి పొందు నడిగెను
జగముల మున్నిట్టి శిశువు చదువంబడెనే.

ఆ. నమ్మి నిదురపోవ నాపట్టిచుంచుమా
లేఁగతోఁక తోఁడ లీలగట్టి
వీథులందుఁ దోలె వెలఁది నీకొమరుండు
రాచబిడ్డఁడైన నవ్వమేలె.

యశోదా! ఇంకొక్కమాట నాలకింపుము.

క. నాపట్టి పొట్ట నిండఁగ
బైపడ నీపట్టి వెన్న బానెం డిడి నాఁ
డూపిరి వెడలదు వానిం
జూపెద నేనైన నీవ నుమ్ము లతాంగీ.

ఇట్టి కృత్యంబుల నీకుమారుఁ డొనరింప నీకుఁ జెప్పక చాలకాల మూరకుంటిమి. విధిలేక యిపుడు విన్నవించితిమి. ఇవి చాడీలు గావు! సత్యముగా విన్నవించితిమి. ఇంచుక బెదరింపుమా యని యాగోపిక లోపికలు లేక యశోదతో మనవిచేసిరి.

మహాభక్తులారా! శ్రీభాగవతమున నీపైపద్యములకు సరియైన శ్లోకములు లేకున్నను ఇందలియర్థము నించుక తెలుపునవి కలవు. వానినెల్ల నుదాహరణములుగాఁ జూపఁ బూనుకొనక తేటతెల్లముగా నర్థమగు శ్రీపోతనకవివరు పద్దెముల వ్రాసితిని. ఇందు శ్రీకృష్ణుని దుడుకుతనములు వర్ణింపఁబడినవి. శ్రీకృష్ణమూర్తి యిట్టి పనులు చేయుట కేవలము బాలత్వముచేతనా? లేక యొకానొక యుద్దేశముననా యని యించుక యూహింపవలయు. ఈగోపిక లందఱు శ్రీకృష్ణునిఁ జూచుఁగోర్కెలతోఁ బుట్టినయచ్చరమిన్న లని తలంపుఁడు. నరనారాయణులచరిత్రమునం దీవిషయమును జదివితిరిగదా. దానిని మరువకుఁడు. కొందఱు గోలోకమున నుండు శ్రీకృష్ణకాంతలు.

గోపికలు రాసమండలమున విహరించు భక్తులు. ఈమాటలు మఱువక మదిఁ బదిలపఱుపుఁడు.

భగవంతుఁడు బాలుఁడు కాఁబట్టి యుపదేశరూపమున భక్తులకుఁ దెలుపఁబూనలేదు. తనచర్యలయందలి యర్థము నెఱుఁగువారల కివి యుపదేశము లగు నని భావించెను. రామావతార మట్టిదియే కదా. ఇందొక్కొక్కపద్యమునకును విశేషార్థములు గలవనియు నవియే గ్రహింపఁదగిన వనియు నమ్ముఁడు. ప్రాతీతికార్థము స్పష్టముగనే కనఁబడుచున్నది. దానింగూర్చి వ్రాయనక్కఱలేదు. ప్రతిపద్యమును పురల వ్రాయక మొదటిది తరువాతిది అని వ్రాయఁబూనితి.

౧. బాలెంతలు చిన్నికృష్ణా! బాలురకుం ద్రావఁ బాలు లేవు. అని కుయ్యో మొఱ్ఱో యనుచుండఁగా పకపకనవ్వి శ్రీకృష్ణపరబ్రహ్మము వానిలెక్కసేయక దూడల విడిచి మీతల్లులపాలుఁ ద్రాగుఁ డనియె ననికదా యొకతప్పు కృష్ణునియం దారోపించిరి. పైయర్థము ప్రాతీతికార్థము. విశేషార్థము. శ్రీకృష్ణునభిప్రాయమేమైయుండునా యనునదియే. అదియే విచారింపఁదగినది.

జీవుఁడు తనకర్మవశమునఁ దనయన్నమును ముందుగాఁ గర్మానుసారము పుట్టించుకొనియే తాఁ బుట్టును. నే రక్షకురాలను. నే రక్షకుఁడను. అను పలుకు తల్లిదండ్రులు రక్షకులు కానేరరు. తల్లిపాలు త్రాగుటకు మీపిల్లల కెట్లు స్వత్వము గలదో

ఆవులదూడలకుఁ గలదు. మీపిల్లలకై వాని నరికట్టుట పాడిగా దు. ఈమాత్రపు జ్ఞానము లేకున్నచో మనుష్యత్వమునేఁ బ్రసాదించినది సార్థకము కాదు. నిజకర్మానురూపముగా జీవుల కాహారముసిద్ధమైనది. ఎల్లరకు నాహారము ప్రసాదించుటకు నేను సిద్ధుడనైయుండఁగా నీయధికారము మీకేల? యని పరమేశ్వరుని తాత్పర్యము. దీనిచే స్వసుఖముకొఱ కితరప్రాణులఁ గష్టపెట్టుట న్యాయముగాదనునిదియే నేర్చుకొనఁదగినది.

౨. యశోదా! మాకడవలలో నున్న చిక్కనిపాలను ఏడ్చుచున్న శిశువులకుం బోసి తక్కినపాలు గ్రిందఁబోవునట్లు భాండములఁ బగులఁగొట్టె ననునది యొకయపరాధ మారోపింపఁబడినదికదా. విశేషార్థమేమనఁగా— ఇంటిలో క్షీరముల దాచిఁపెట్టికొని యింకను దూడల నరికట్టుట న్యాయముగాదు. పేరాశ యుపాయకరము. అది మీరు వదలుకొనవలసినది. వదలకున్న మీకు సుఖము గలుగదు. నాయనుగ్రహమునకుఁ బాత్రులుకారు. రేపటికి అనునది బుద్ధితక్కువ. రేపు అనుటకు యోగ్యత నీ కున్నదియా. అంతవఱకు జీవించుటకు నీకు శక్తి కలదా. ఇట్టి బుద్ధి మాను మని శ్రీకృష్ణునిభావము.

3. తల్లీ! మీకృష్ణుఁడు మాయిండ్లలోఁ ద్రాగుటకు పాలగపడకపోఁగా నాగ్రహించి బాలకుల నేడ్చువారిని దారిలో నున్నవారిని గాలితోఁ బోఁద్రోయుచుఁవచ్చెను. ఇట్టియన్యాయము గలదా యనునది యొకయపరాధముకదా. విశేషము— నేను

వచ్చి పాలుత్రాగుదు నని వానిని దాఁచితిరి. నాకుం గనఁబడకుండ మీరు దాఁచఁగలరా. సర్వమును జూచువాఁడను నేను. నాకుఁ గానరాకుండ దాఁచఁగలమనుగర్వమును బూనితిరి. ఈ శిశువులు నాపాద సేవకులు. మీపిల్ల లనుకొనుట తప్పు. నాపాద సేవకే జన్మించిరి. వీరికి నాపాదస్పర్శమే ముక్తి నిచ్చునది. ఇంకనైన నిట్టి యవివేకపుటాలోచనములఁ జేయకుఁ డని శ్రీహరి భావము.

ర. దేవీ! మీకొడుకుపుట్టి మూఁడుశుక్రవారము లైనదో లేదో, ఇంతలోనే దొంగతనము పూని మాయింటిలోఁ దూఱి యుట్టియందనికతన నెత్తు వేసికొని చేయి పెట్టఁజాలక యడుగున రంధ్రముచేసి పాలుమీఁగడలఁ ద్రాగెననుట యొక మహాపరాధము. అని తెల్పిరి. రహస్యము. నాపుట్టుకను మీరు గుఱితింపఁజాలరు. సర్వపదార్థములు నావి. మావి యనుకొను నధికారము మీకు లేనేలేదు. నాకందకుండ దాఁచిపెట్టు నుద్దేశము మీకుఁ బుట్టఁదగదు. నాకుఁ దెలియనియుపాయములు గలవా? మీయింటనుండు వస్తువులతోడనే యీకార్యమును సాధించెద. మీపదార్థములే మీకుఁ గీడును గల్గించును. మీ రే పనికిఁ దలపెట్టితిరో దానికి భంగమును గల్గించునవేవని తెలియఁజాలరైతిని. ఇంతటిబుద్ధిహీనులరగు మీ రేపురుషార్థమును సాధింపఁగలరు? సాధకబాధకములఁ బరిశీలింపుఁడు. ప్రతిపదార్థము సాధకము. బాధకము నగు. అన్నియుపాయముల నెఱుంగుదు.

నని యింకనైన నమ్ముఁడు. నాకు నందకుండఁ జేయఁ గలమను దుర్బుద్ధిని మానుఁడని భగవంతుని భావము.

౫. అమ్మా! యశోదా! మీపిల్లవాఁడు వీరియింటిలోఁ ప్రవేశించి పెరుఁగుఁ జుర్రి యంతతోఁబోవక కొంచెము కోడలిమూతికిఁ బూసెను. ఈపెరుఁగంతయు నిదియే త్రాగె నని యత్త కోడలిం బ్రహరించెను. చూచితివా యివి బాలునికృత్యములా? అనునది యొకయపరాధ మని మారోపితముకదా. విశేషము:-మనుజులకుఁబదార్థములపైఁ బ్రీతియే గాని పుత్త్రులపైనను బ్రీతి లేదు. బిడ్డలపైఁ బశువులకు, భార్యలపైఁ బత్తులకును, ధనముపై మనుష్యులకును బ్రీతి యెక్కుడు. ఈషణత్రయమది ప్రఖ్యాతి నొందినది. ఇంటియధికారమును వహింపఁబోవు కోడలు పెరుఁగు త్రాగుట కధికారములేదా. చూడుఁడు. పదార్థవాంఛ యెట్టిదో. అధికారమున్నపు డోర్పుండదు. అది లేనపు డదియుండి లాభమేమి? మీయింటిలో నుండువారల నైకమత్య మెట్టిదో పరిశీలింపుఁ డని శ్రీరాధికానాథుని తాత్పర్యము.

౬. జననీ! యశోదా! మీకుమారునిచేష్టలంగంటివా. అల్లవారిల్లు చొచ్చి కడవలలో నున్న నెయ్యి త్రాగి, యారిత్తకుండల వీరింటిలోనుంచెను. వీరే దొంగిలించి రని వీరితో వారు కలహించిరి. ఇట్టిదుడుకుఁదనములు చిన్నపిల్లలు చేయుటగంటిమా. అని యొకయకార్య మారోపింపఁబడియెఁ గదా. దీని

వాస్తవార్థము. మనుష్యులు ధనాశచే యుక్తాయుక్తవిచారము సేయరు. స్వల్పవస్తువుమూలమున నెంతటివారినైన దూషింతురు. వీరు బుద్ధిమంతులా? కారా? ఈవఱకు దొంగలా? కారా? అని యాలోచించువాఁడుక మనుజులలో లేదు. ఇంతటిస్వల్పబుద్ధి మీకున్నది. దీనినైన జయింపకున్న మీగతి యేమగును? ఈ బుద్ధి మీకుశలమునకు భంగము. ఇప్పుడైన దీనిని వదలుఁడు. దురభ్యాసముల వదలకున్న నాసంసర్గ మున్నను లాభములేదు. అని శ్రీనాథుని యభిప్రాయము.

౭. రాజ్ఞీ! యశోదా! నీకుమారుఁడు మాయింటికి వచ్చి యెంగిలిచేతులతో నిలువఁగా వత్సా! నీచేతులు పరిశుద్ధములుగా లేవు. ఇది దేవునియిల్లు. దూరముగా నిలువఁబడుమా. యని మంచిమాటలాడితిమి. అంతట నీకొడుకు పకపకనవ్వుచు దేవతలఁట నాకంటె దేవతలు గలరా. ఎవఁడా నీదేవుఁడు? అనిపలుకుచు నెంగిలి పూసెనమ్మా. దేవునిల్లు మైలపడినది తల్లీ! ఏమిచేయుదుము. అని యొకతప్పు మోపంబడియె. అంతర్గతార్థమేమనఁగా— బ్రహ్మతేజస్సుండి యుండ నట్లుండునవి పాషాణములు. వానితోఁ గట్టినది గోడ. ఆగోడకు దేవతాప్రతిమలు గట్టఁబడినవి. వీనికిని బ్రాణము లేదు. ఇవియన్నియుఁ గల్పితప్రతిమలు. మనుష్యబుద్ధిచే అవకతవక యన్నట్లు కల్పింపఁ బడినవి. ఇవి దేవతలగునా? దేవతాతేజస్సు వీనియందుఁ గలదా. లోకమున నాకంటె దేవత యొకఁడు కలఁడా? సర్వాంతర్యామినై, సర్వజ్ఞుఁడ

నై, సర్వకర్తనై నేనుండఁగా నాయెదుర మఱొక జడపదార్థమును దేవత యనుటకన్న వెఱ్ఱితనము కలదా? పోనిండు. ఇంతకు మించిన యవివేకము మఱొకటి కలదు. అపరిశుద్ధులనుబరిశుద్ధులనుగాఁ జేయువాఁడు కదా దేవుఁడు. ఎంగిలి యాయనను అపరిశుద్ధునిగాఁ జేయునా? అట్లైనచో నతఁ డేటి దేవుఁడు? మీ రెంతటి పామరులు? ఎంతటి జ్ఞానశూన్యులు? ఈవిగ్రహము నేల పూజించెదరు? నన్నుం బూజింపుఁడు. భవబంధములు అజ్ఞానము నశించి సుజ్ఞానము వెలయును. ఇంక నేల మోసపోయెదరు? ఈవిగ్రహములు మిమ్ముద్ధరింపఁజాలవు. వీని నేల పూజింతురు? వృథాకాలహరణము. నిరర్థకము. అని భగవదాశయము.

పాఠకులారా! విగ్రహపూజ యథోక్తఫలప్రదము కాదనియు నది కేవలము పామరులకుఁగాఁ గల్పింపఁబడినది. కానియించుకయైన లోకజ్ఞానముగలవారి కది నిరర్థకమనియు శ్రీమచ్ఛంకరభగవత్పాదు లుపదేశించియున్నవారు. ఆశ్లోకమిదియే?

శ్లో. సందర్శ్యాథ శిలాం శిలామయగృహే సాక్షాదయం శ్రీహరి
ర్భక్తేభ్యో వివిధాన్ ప్రయచ్ఛతి వరాన్ సంసేవ్యమానస్త్వితి,
ఉక్త్వాం దేవలకస్య వాచ మధికం విశ్వస్య సంసేవతే
త్వర్థం తత్త్వమసీతి వేదగదితం నో విశ్వసత్యల్పధీః.

శ్రీమహాభారతమునందు:—

> నహ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
> తే పునం త్యురుకాలేన దర్శనాదేవ సాధవః.

అని చెప్పఁబడినది. కాఁబట్టి పైయర్థము సుసంగతమే? ఇంతియుగాక మానసికపూజ శ్రేష్ఠఫలము నిచ్చు ననీ, బాహ్యార్చనము ఫలప్రదము కా దని పెద్ద లందురు. దీనిచే బాహ్యార్చనము నిష్ఫలమని కాదు. మానసికపూజాదత్తఫలతుల్యఫలము నీయఁజాల దని భావము.

> అంత రర్చన సుప్రీతా బహి రర్చన లోలుపా.

అని సూక్తి కనఁబడుచునే యున్నదికదా. జపముగూడ మానసికమైనచో ననంతఫలమని స్మృతిబోధించుచున్నయది. కావున విగ్రహార్చనము అంతగా ఫలమునీఁజాలదు. మహాభారతమున ద్రోణపర్వమున ద్రోణమరణానంతరమశ్వత్థామసంరంభించి యుద్ధమొనరించి దివ్యాస్త్రములఁ బ్రయోగించి తానూహించినంత ఫలము కలుగకపోఁగా ధనుర్దండమును బాఱవైచి యుద్ధరంగమునుండి తొలఁగిపోఁబోవఁ బరాశరసూనుఁడు సకలపురాణకర్త వ్యాసమునివరుఁడు ప్రత్యక్షమై యశ్వత్థామతోఁ దొలిజన్మమున నర్జునుఁడు నీవును శివపూజ చక్కఁగాఁ జేసితిరి. ఐనను, నీవు నీశ్వరప్రతిమను చేయించి దానిం బూజించితివి. అర్జునుఁడు శివలింగమును బూజించెను. విగ్రహపూజ కన్న

నది శ్రేష్ఠతమమైనది. తత్ఫల మనుభవింపక తప్పదు. కావున నీపూజకుఁ దగినఫలము నీకుం గల్గినది. కాఁబట్టి నీయస్త్రమహిమము ఫలవంతము కాలేదే యని చింతించిన లాభ మేమని హిత ముపదేశించెను గదా.

శ్లో. శుభ్రమార్ద్వం హరం కృత్వా మహాపురుషవిగ్రహమ్,
ఈజివాంస్త్వం జప్యైర్హోమై రుపహారైశ్చ మానద.
స తథా పూజ్యమానస్తే పూర్వదేహేఽప్యతూతుషత్,
పుష్కలాంశ్చ వరాన్ప్రాదా త్తవ విద్వన్ హృదిస్థితాన్.
జన్మకర్మతపోయోగా స్తయోస్తవ చ పుష్కలాః,
తాభ్యాంలింగేఽర్చితో దేవ స్త్వయార్చాయాంయుగేయుగే.
స ఏష రుద్రభక్తశ్చ కేశవో రుద్రసంభవః.
సర్వరూపం భవం జ్ఞాత్వా లింగమర్చయతి ప్రభుః.
ఆత్మయోగాశ్చ తస్మిన్ వై శాస్త్రయోగాశ్చ శాశ్వతాః,
ఏనమేవాయజన్ దేవా స్సిద్ధాశ్చ పరమర్షయః.
ప్రార్థయంతి పరం లోకే స్థాణు మేకం స సర్వకృత్,
కృష్ణ ఏవ హి యష్టవ్యో యజ్ఞైశ్చైవ సనాతనః.
సర్వభూతమయం జ్ఞాత్వా లింగమర్చయతి ప్రభుః,
తస్మిన్నభ్యధికాం ప్రీతిం కరోతి వృషభధ్వజః.

ద్రోణ. ౧౦౩ అ. ౧౦౦ శ్లో.

దీనిభావమేమి? విగ్రహపూజ ప్రథమసోపానము. అది తొలుదొలుతఁ జేయఁదగినది. సర్వకాలమునుస్థేయము

కాదు. క్రమమున భగవద్రూపము మనోగోచరమైనతటి దానిని వదలి మానసగమ్యమగు భగవద్రూపమును హృదయకమలాంతరపీఠస్థముగాఁ జేసి సకలార్చనలు భావనారూపమునఁ జేయఁ దగు. అదియే సంపూర్ణఫలము నొసఁగఁజాలు. ఇదియే యోగమనంబడు. మనశ్శక్తి గొప్పదికదా. దీనిసారమేమి? మనోవీథి భగవద్రూపము పొడకట్టినయెడల మనస్సు చంచలత్వము మాని స్థిరతం గాంచును. యోగమన నిదియే గదా. కాఁబట్టి మానసికార్చనము సర్వపూజాశ్రేష్ఠమని శాస్త్రములు గొనియాడుచుండును. ఇంకొక్కవిషయమును బరిశీలింపుఁడు. మహాభారతశ్లోకములం జూచితిరి. "స ఏష రుద్రభక్తశ్చ కేశవో రుద్రసంభవః." అనుదానిం బఠింపుఁడు. శ్రీకృష్ణమూర్తి రుద్రసంభవుఁ డని కన్పట్టెను. "కృష్ణ ఏవ హి యష్టవ్యో యజ్ఞైశ్చైవ సనాతనః" అనియుఁ బొడకట్టెను. ఈ రెండును శివకేశవుల కభేదమను జ్ఞానమును గల్గించును. మహాభారతము వేదతుల్యమని యొప్పుకొందుము కదా. ఒప్పనిచో భగవద్గీతల కధోగతియే సంభవించునే. అట్టి మహాభారతమును జదివియైన శివునికంటె విష్ణు వధికుఁడు. విష్ణువుకంటె శివుఁడు సర్వోత్కృష్టుఁడు అనుభేదబుద్ధిని వదలి యీయిరువురుపాస్యులు. ఎవరి నుపాసించినను స్మరించినను ఫల మొక్కటియే గాని హెచ్చుతక్కువలు లేవని నమ్మవలయును. దేవతాదూషణము సర్వదా శ్రేయస్కరము కాదు. అది యజ్ఞానజనితము. దానిని

మొదలంట నశింపఁజేయందగును. అది నశించినఁగాని పరిశుద్ధ జ్ఞాన మలవడదు. అది లభించినఁగాని భగవత్ప్రసాదపాత్రుఁడు కాఁజాలఁడు. అటులైనఁగాని కడతేఱు మార్గము దొరకదు. కావుననే ప్రమాణముల నెనుకినను సర్వదేవతాసమత్వమే ప్రధాన మని బోధించుచుండును. ఇంక నీవిషయమును బెంచి వ్రాయఁబూనక ప్రకృతకార్యమునకుం గడంగెద.

ర. నందపత్నీ! ఇదిగో ఇట నిలుచున్న కాంతం జూడుము. ఈమె నీకుమారుని వాకిటంజూచి యెటకో పోవుచుండఁగా నిలిపి కుమారా! నీపేరేమి? అని ప్రీతితో నడిగెను. తల్లీ! ఇం దేమి తప్పున్నది? అందులకు బదు లేమియుఁ జెప్పక పెద వివి గఱచిపోయెను. ఈచర్యవలన నీబుద్ధిమంతుఁడు బాలుఁడా? ఇంచుక యోజింపుము. అని ఇదొకచేఁయరాని కార్యముగఁ జెప్పఁబడినది. శ్రీకృష్ణుని భావ మిం దేమనఁగా—

గోపికా! నాపేరడుగుచున్నదానవా? ఇంతలోనే నన్ను మఱచితివా గోలోకమున నాతో విహరించినదానవు కావా? భూలోకమున నే నవతరింపఁబూను టెఱింగి, నావిరహము నోర్వక మీరెల్ల నాకంటె ముందే యవతరించితిరి గదా. అట్టి నీవు నాపే రడుగుట యెంత తెలివితక్కువ. ఇపుడైన నే నెవరో తెలిసికొనుము. అని తనభర్తృత్వము నీకార్యరూపమున నెఱిఁగించుట మే లని భగవంతునిభావము.

౯. తల్లీ. మఱొక్క-పనవి చిత్తగింపుము. చెప్పుట కే సిగ్గుగానున్నది. విధిలేక విన్నవించెద. మాయింటి కవ్వలనున్న యింటివారికోడలు సంతానము లేకపోయెనే యని విచారించుచుండ నీకొడుకు విని కాంతా! నన్నుఁ బతిగా వరింపుము. చూడుము. ఎందఱు కొడుకులు గలుగుదురో అని యంతతో నిలువక దానిపైఁ బడియెనఁట. ఇట్టిపనులు పిల్లలు చేయునవియేనా? ఎవ్వరైన నెపుడైనఁ జేసినట్లు వింటిమా? చూచితిమా? అనియె. ఇది యొక్క మహాపరాధముగాఁ దెల్పఁబడినదికదా. ఇందలి సారభూతాంతరర్థమేమనఁగా:—

ఓసీ ముద్దరాలా! ఎంతటియవివేకమునకు లోనైతివి. సంతానము లేదని కూడఁ జింతింపవలయునా. ఈయూహారీతిఁ గలిగిన కొడుకులు నిన్నుద్ధరింపఁగలరా? స్థిరసంతానము లున్నవి కదా. వానికై ప్రయత్నింపుము. కాకున్న భగవంతుఁడే నాప్రాణవిభుఁడు అని నిశ్చయించుకొనుము. ఎందఱు కొడుకు లున్నట్లు స్పష్టమగునో. మనుష్యలోకజన్మము గలిగినంతనే యిట్టియిచ్ఛావాంఛలకు లోనగుదువా? త్వరలో మరలి గోలోకమును జేరఁ గలవు. నేనే నీకుఁ బ్రాణేశుఁడను. ఈనాలుగుదినములలో నేలయిట చింతలపాలగుచున్నదాన వని శ్రీపరమేశ్వరునియాశయము.

౧౦. పున్నమనెలకు నీడగు మోముగల యోయశోదా నీతనయుఁడు పైఁబడరాఁగా నీయింతి చూలాలను. దగ్గర రాకు

ము. తొలఁగిపొమ్ము అనె నఁట. అంతట దూరముగాఁ దొలఁగి పోవకుండుటయేగాక చూలగుటకు మూలమెద్ది చెప్పుమా అని యడిగెనఁట. తల్లి! సతులు మగవారితోఁ జెప్పఁగలరా? నీవే యూహింపుము. అని యొకతప్పు మోపఁబడియె. విశేష మేమ నఁగా—సృష్టిక్రమమున జీవుఁడు స్వకర్మానురూపసుఖదుఃఖము లననుభవించుచుఁ గాలమును గడపి సృష్టిద్వారా భూతలమును బ్రవేశించి సస్యరూపమును దాల్చి స్త్రీయందుఁ దాఁ బొందఁ దగు పుట్టుకకు ననుగుణంబుగాఁ బ్రవేశించును. శుక్లరూపము భగవంతునిది. శోణితరూపము ప్రకృతిది. స్త్రీ ప్రకృతిస్వరూపము. పురుషుఁడు భగవత్స్వరూపుఁడు. ప్రకృతిపురుషసంసర్గమున సృష్టి ప్రబలును. వనితఁ గవయుతఱిఁ బురుషుఁడు

శ్లో. 'ఇయ మంబా జగద్ధాత్రి పురుషో ఽహం సదాశివః,
పంచపంచాత్మతత్త్వార్థం మైథునం క్రియతేతరామ్,
ఏత న్మంత్రానుభావస్య న్మథనా క్రియతే యది,
తా వుబౌ పుణ్యకర్మాణౌ న దోషో విద్యతే తయోః.'

అను మునివాక్యము ననుసరించి భావించిన సత్ప్రజ యుదయించును. కాంతామణీ! నీకీ తత్త్వము తెలియునా? నాకు మఱుఁగు పఱుపఁ బూనితివా? నీ కింతమాత్రము తెలియకున్న నెట్లు విముక్తురాల వగుదువు. ఇదేమో రహస్య మని నీభావమా? సృష్టిక్రమ మెఱింగి నిరంతరము ధ్యానించుచున్న సంసారనివృత్తియగు

ను గాని దాని రహస్యముగా నుంచుకొని స్మరింపకున్న సంసా రబంధవిముక్తి కానేర దని భగవంతునిభావము.

౧౧. అమ్మా! 'సుకుమారుఁ డీకృష్ణుఁడు మాయింటివారు వీథిలోనికిం బోవునంతదాఁక నూరకుండి, అవ్వల నన్నుం జేరి నాతో రహస్యముగా మాటలాడరమ్ము. నన్నుం బొందుము. అని యడిగెను. ఇట్టి శిశువున్నయ ట్లే గ్రంథమునం దైనం జదివితిమా నీవే ఆలోచింపుము. నావయస్సేమి? తనవయస్సేమి? నన్నా యి ట్లడుగుట. పిల్లవానిమాటలేనా యివి అని విన్నవించెను. ఇది యొక మహోపలాధ మని గోపికభావము. సారాంశ మేమనఁ గా—ఓకాంతామణీ!

శ్రు. "ఆత్మావా రే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మంతవ్యో నిధి ధ్యాసితవ్యః" అను శ్రుతిప్రకారము నన్ను మననముచేయుము. ఆవల జ్ఞానముపూర్ణముకాగా నన్నుఁబొందుము. నీ కిది వలసినలా భము. నన్నుఁబొందకున్న జన్మమే నిరర్థకము. ఆమననము రహ స్యముగాఁ గూరుచుండి చేయఁదగు. అనఁగా నీసంసారతాపత్ర యమున మునిఁగి తేలుచు నిదియే మహానంద మని తలంప కుము. ఇది తుచ్ఛము. ఏకాంతసేవకుఁ బ్రయత్నింపుము. నా రూపమును మననముచేయుము. ఆమననమున నీకుఁ బట్టుదల గలిగెనా నన్నుఁ బొందఁగలవు. వేఱొండుపాయము లేదని నమ్ముము. ఈవిషయ మితరు లుండఁగా నీకుం జెప్పం దగ దని యిపు డుపదేశించుచున్నవాఁడ. వేగంబ నీవు నాలోకమునకు

ననుంగూడి శాసలయు. జాగ్రత్తపడుము అని శ్రీహరిభావము.

౧౨. యశోదాదేవి! నాకొడుకు చిన్నవాఁడు. పిల్లజుట్టు వానికింగలదు. వాఁడు మఱచినిద్రపోవుచుండెను. ఆమంచము నకుదగ్గర లేఁగను గట్టియుంచితిమి. నీ కుమారుఁ డెపుడో వచ్చి దానితోఁక కీపిల్లజుట్టుకు ముడివైచి తలుగువిప్పి లేఁగను దోలె ను. నాకొడుకు గతియేమో యోజింపుము. ప్రభుపుత్రుఁడైన నిట్టికార్యములు చేసి పీడించుట మేలా? అని తెల్పెను. ఇదియు నొక తప్పుగానే తెలుపఁబడియె. రహస్య మేమనఁగా — బాల కా! యీసంసారము పాశమువంటిది. దానికి లోఁబడితివా, ప్రా ణాపాయమును గల్పించును. హాయిచెంది నిద్రించెద వెట్లు? నిన్నుఁ బునరావృత్తిగహితనరకకూపమునఁ బడఁద్రోయఁగల పదార్థముల నడుమఁ బరుండి చింతబాసియున్నవాఁడవే. ఎంత బుద్ధిహీనుఁడవు? నీవానందముగాఁ బోషించు వస్తువులలాభము గనుము. సంసారము సుఖ మనుకొనుట యిట్టిదే. సుఖముగాఁ గనఁబడి తీరనిదుఃఖమును గల్గించును. దీని వదలించుకొనుము. మేలుకొనుము (అనఁగా జాగరూకుఁడవై జ్ఞానము నార్జింపుము) నాలుగుప్రక్కలఁ గలయంజూడుము. నిన్నుద్ధరించు పదార్థ మొక్కఁడైనఁ గలదా? అది నీయందే యదృశ్యముగ నున్నది. అదేది? మనస్సే? త్వరపడుము. జలబుద్బుదమువంటి యీసంసారమును నమ్మి నిదురించుచున్నవాఁడవా? త్వరపడు ము. పెద్దల సహవాసమునకై ప్రయత్నింపుము. పగటిపూటఁ

గూడ నిదురించుచుపోయి నీకు దేనఁ గలిగినది? అని పరమాత్ము నితాత్పర్యము.

౧౩. దేవీ! ఇంకొక్కవిన్నపము గలదు. నేనేదో పనిచేయుచునుంటిని. నీకొడుకు మాయింటికివచ్చెను. నాకొడుకు నీకొడుకుతోనాడుకొనసాగెను. ఇంతలోఁగృష్ణుఁడు మావానిం బిలుచుకొని యింటిలోపలికిఁబోయి కుండనిండ రేపుకరఁగఁబెట్టవలయునని దాఁచియున్న బానెడు వెన్నను నాకిఁక వలదు వలదనుచున్నను ముక్కుపట్టుకొని నోటిలోఁగుక్కి తినిపించెనఁట. వానికిపు డూపిరి విడువనైన శక్తిలేదు. నీ కిపుడే యెత్తుకొనివచ్చి చూపెద. మావాని కేమైన నపాయము గలిగెనేని నీవ హేతువవు. అని క్రోధముతోఁ బలికెను. ఇదియు నొకయపరాధమనియే తెలుపఁబడినది. శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మతాత్పర్యమేమనఁగా—

వత్సా! లోకమునఁ గొన్నిపదార్థములు మేలైనవని కొన్ని కావని యెంచుట గలదు. ఆమేలైన విట్టివేకదా. ఇదె నవనీతము. ఇది చాల బలమునిచ్చును. ఆరోగ్యమిచ్చునని భాగ్యవంతులు భక్షింతురు. బీద లది లేకపోయెనే యని దుఃఖింతురు. అమూల్యపదార్థమని లోకమున భావింపఁబడు దీని భక్షింపుము. దీనఁగలుగు మే లేమో కనఁబడును. ఇంచుక యధికముగనే భక్షింపుము. నీకుఁ బ్రాణసంకటమును గలిగించును. బాలకా! దీనిమేలు తెలిసికొనుము. మేలైనవని విఖ్యా

తిగాంచిన పదార్థము లిట్టివే సుమీ. ఇంచుక యధికమైనఁ బ్రాణమును దీయును. పదార్థములు విధివిహితములై భక్ష్యములైనవి యారోగ్యప్రదములు. అమూల్యపదార్థము లనఁబడునవి ఆరోగ్యప్రదములు కావు. ఈవిషయ మెఱుంగుము. విశేషద్రవ్య సాధ్యపదార్థములు దుష్టములు. రోగప్రదములు. ఆయువును క్షీణింపఁజేయునవి. చూచితివా. ఇపుడు నీవనుభవించు నీమృష్ట పదార్థ మిట్టి కష్టమును గల్గింప నున్నదో. నేను దినిపించినందున నీకపాయము లేదు. ఇంచుక శ్రమఁబడినను బాధ లేదు. ఇంతియగాక మితాహారము ఆయుఃప్రదము. ఆరోగ్యప్రదము నగు. అమితమగుచోఁ బ్రాణాపాయమును గల్గించును. కావున మృష్ట పదార్థము లని యాశపడితివా నశింతువు. అట్టియాశకు నీమనసుఁ దావీయకుము. అని భగవంతుని యాశయము.

పాఠకవర్యులారా! శ్రీభగవంతుఁ డీవిషయమునే గీతల యందుఁ దెలిపెను.

శ్లో. నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంతమనశ్నతః,
నచాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున.
యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మణః,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా.
యదావి నియతం చిత్తమాత్మన్యేవాఽవతిష్ఠతే,
నిఃస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా.

కాఁబట్టి యధికభోజనము అధికనిద్ర పనికి రావనుట సిద్ధాంతము. ఈవిషయమే బాలకృష్ణమూర్తి క్రియారూపమున నెఱిఁగించెను.

ఇట్లు యశోదతో గోపికలు పలుభంగుల శ్రీకృష్ణుని యద్భుతచర్యలఁ గనుఁగొనఁజాలక యవి తప్పునుగా భావించి విన్నవించిరి. కొందఱు గోపికలు సంసారయాత్ర యీయూరనిఁక సాగదనియుఁ దెలిపిరి. దుడుకుఁదనపుఁజేష్టలు భరింపరాకున్న వమ్మా యని కొందఱు మొఱపెట్టిరి. ఈఘట్టమున శ్రీభాగవతమునందుఁ గొలఁదిశ్లోకములే కనఁబడు. శ్రీపోతనకవివర్యునిపద్యరత్నములు వ్రాయఁబూని కొలఁదిపంక్తులు భాగవతమునుండే వ్రాసితిని గదా. ఈపద్యము లన్నింటికి నిఁక రెండు శ్లోకములే యందుఁ గలవు. వీనియర్థమును బెంచి బాలకృష్ణలీలలు మహాకవి తెనుఁగున వ్రాసెను. వాని కాధారములుగ శ్రీభాగవతమునందు

శ్లో. హస్తాగ్రాహ్యే రచయతి విధిం పీఠకోలూఖలాద్యై
శ్ఛిద్రం హ్యంతర్నిహితవయునశ్శిక్యభాండేషు తద్విత్,
ధ్వాంతాగారే ధృతమణిగణం స్వాంగమర్థప్రదీపం
గోప్యో యర్హి గృహకృత్యేషు సువ్యగ్రచిత్తాః.
ఏవం ధార్ష్ట్యాన్యుశతి కురుతే మేహనాదీని వాస్తౌ
స్తేయోపాయై ర్విరచితకృతి స్సుప్రతీకో యథాస్తే,

ఇత్థం స్త్రీభిస్సభయనయన శ్రీముఖాలోకినీభి
ర్వ్యాఖ్యాతార్థా ప్రహసితముఖీ నహ్యుపాలబ్ధుమైచ్ఛత్.
౧౦ అ. ౩౧ శ్లో.

అని కనుపట్టెడు. పైపద్యములు చూచితిరిగదా సంస్కృతమున బీజరూపముగ నున్నయర్థమును గ్రహించి చక్కని లోకాచారములతోఁ బోల్చి మహాకవి యెట్లు పద్యముల వ్రాసెనో? ఎంతటి చక్కనియర్థము నింపెనో? ఔరా! ఎంతటిలోకజ్ఞానము! ఎంతటి రచనానైపుణము! ఎంతటి పాండిత్యము! ఎంతటి భగవద్భక్తి! ఆమహాత్మునికే చెల్లుఁగాని యితరులకుఁ జెల్లునా?

ఇట్లు గోపికలు విన్నవింప యశోదాదేవి కొడుకుచేష్టల నేమియుఁ దప్పులు భావింపఁజాలక, వారినేమియు దూరఁజాలక, యమ్మలారా! యని యేవో నాలుగు మంచిమాటలు చెప్పి వారికోపము నడఁచి పంపెను. శ్రీకృష్ణుఁడు ప్రతిదినము వృద్ధి నొందుచు శ్రీబలదేవుంగూడి పెక్కుమంది గోపబాలురం జేర్చుకొని యాడుచు వ్రజమున నెల్లరకు సంతోషమును గల్గించుచు నొక్కొక్కప్పుడించుక కష్టమును విచిత్రక్రియలచేఁ గల్గించుచుండెను. శ్రీభగవంతుఁడు తనసర్వవ్యాపిత్వమును, సర్వనియంతృత్వమును వెల్లడించుచేష్టల నెన్నివిధములఁ జేసి చూపినను మాయామోహితులుగాన నందలివారెవ్వరుఁ దెలిసికొనఁజాలక, తమ రందఱు గోలోకమునుండి వచ్చినవార మను విష

యము నించుకయుఁ దెలిసికొనుశక్తిలేక యశోదకడ కేగి పిల్లవాని దండింపుమని న్యాయనిష్ఠురోక్తులం బల్కుచు మరల శ్రీహరి తమయిండ్లకు రాఁగా నమ్మహనీయరూపమును గాంచి నంతనే పట్టరాని ప్రీతి నెత్తుకొని ముద్దాడుచు మరల నాడించుచుఁ గాలము పుచ్చుచుండిరి.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

శ్రీకృష్ణావతారతత్త్వమునం దవతారనిర్ణయ మను
ద్వితీయప్రకరణము సంపూర్ణము.

---

శ్లో. శిశిరీకురుతే కదానుసః శ్శిఖిపింఛాభరణ శ్శిశుర్దృశోః,
యుగళం విగళన్మధుద్రవస్మితముద్రామృదునా ముఖేందునా.
పింఛావతంసరచనోచితకేశపాశే
పీనస్తనీనయనపంకజపూజనీయే,
చంద్రారవిందవిజయోద్యతవక్త్రబింబే
చాపల్య మేతి నయనం తవ శైశవే నః.

శ్రీకృష్ణకర్ణామృతము.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః.
ఓం తత్సత్. శ్రీకృష్ణార్పణమస్తు.
శ్రీ. శ్రీ. శ్రీ.



---

చెన్నపురి: 'శ్రీరామ' ప్రెస్సున ముద్రితము.—1926.

# ఆంధ్రగ్రంథములు.



| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అచ్చతెనుఁగు రామాయణము, శుద్ధప్రతి | 1 | 4 |
| డిటో కాలికో బైండు | 1 | 10 |
| అధ్యాత్మరామాయణము | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్య ప్రణీతము | 0 | 8 |
| డిటో, కాలికో బైండు | 0 | 14 |
| అప్పకవీయము, విమర్శతో నున్నది | 2 | 8 |
| ,, విమర్శనము మాత్రము | 0 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతములోనిది) | 0 | 4 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలు కాకితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము | 3 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | 0 | 2 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజ ప్రణీతము, చక్కని కూర్పు | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | 1 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతృచరిత్ర | 1 | 8 |
| డిటో, మేలుప్రతి, కాలికో బైండు | 1 | 14 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు | 2 | 4 |
| కాశీఖండము, చక్కని క్రొత్తకూర్పు | 1 | 8 |
| డిటో కాలికో బైండు | 1 | 12 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ.. |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | ... | 0 | 4 |
| డిటో, గట్టు ప్రభుసుకృతము | ... | 0 | 6 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్య ప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది | ... | 6 | 0 |
| డిటో అత్యుత్తమ ప్రతి, రెండుసంపుటములు | ... | 8 | 0 |
| శ్రీమదాంధ్ర భారతము, పద్యకావ్యము:— అనేకవ్రాత ప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణ పరిశ్రమముతోఁ బరిష్కరింపఁబడినది. మేలు కాగితములపై స్ఫుటముగ అచ్చొత్తించి మంచికాలికో బైండు జేయఁబడియున్నది. | | | |
| 7 సంపుటముల ప్రతి | 1-కి రూ | 15 | 12 |
| 3 సంపుటముల ప్రతి | ... | 15 | 0 |
| ఆది, సభాపర్వములుంగల సంపుటము | ... | 2 | 4 |
| ఆరణ్యపర్వము ,, | ... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు ,, | ... | 2 | 4 |
| శాంతిపర్వము ,, | ... | 2 | 4 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుంగల సంపుటము | ... | 2 | 4 |
| ఆదిపంచకము, ఒకటే సంపుటము | ... | 6 | 8 |
| యుద్ధపంచకము ,, | ... | 4 | 4 |
| శాంతిసప్తకము ,, | ... | 4 | 4 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రి | | 0 | 8 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు | ... | 0 | 12 |
| ,, కాలికోబైండు | ... | 1 | 2 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామ శేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 10 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనము మిక్కిలి సొంపు, పీఠిక అతివిపులము | 7 | 8 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 2 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు ... | 1 | 6 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 4 |
| తెనుఁగుసమస్యలు ... | 0 | 2 |
| దశావతారచరిత్ర, క్రొత్తప్రతి ... | 2 | 8 |
| దసరాపద్యములు ... | 0 | 2 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 10 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు ... | 1 | 0 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి ... | 0 | 12 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము ... | 0 | 6 |
| నిరుద్ధభారతము, మంగిపూడి వెంకటశర్మగారిది ... | 0 | 8 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము ... | 0 | 4 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము ... | 0 | 4 |
| డిటో కాలికోబైండు ... | 0 | 8 |